# ఆంధ్ర క్రియాస్వరూప మణిదీపిక






ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

తిలక్ రోడ్ : : హైదరాబాదు.

# తొలిపలుకు



ఎకాడెమీ సమావేశములలో నొకసారి శ్రీ బెజవాడ గోపాల రెడ్డిగారు కొన్ని యాంధ్రక్రియలను జూపి "తెలుఁగులో నిట్టి క్రియ లెన్నో కలవు, వాడుకలో నెన్నియో కలవు, వాడుకలోనున్న మెన్నో క్రియలు నిఘంటువులలోఁ గనిపించవు, ఈ క్రియలన్నింటిని గలిపి యొక నిఘంటువుగా సమకూర్చినచో బాగుగానుండు" నన్నారు. ఆంధ్ర భాషాక్రియలయందుఁ గొంత మమకారము నాకును గలదు. ఆ యభిమానమును వెల్లడించితిని. ఈపనిచేయుటకు ఎకాడెమీ యా సమావేశములోననే నిర్ణయించినది. ఒకనిఘంటు వనినతోడనే యెంతో శ్రమపడవలసియుండును. ఎంతమందిచేతనో పనిఁగొనవలయును. వాడుకలోనున్న క్రియలను మాత్రమే స్వీకరించి నిఘంటువులలోనివి వదల రాదు. నిఘంటువులలో భిన్నరూపములు కన్పించును. అచ్చులతో మొదలిడిన కొన్ని క్రియలు ప్రాణ్యనిఘంటువులో హల్లుతో మొదలిడి యున్నవి. ఏది స్వీకార్యము, ఏదికాదు? కొన్ని యర్థభేదములు కలవు. ఈ యాంధ్రభాషయందలి ధాతువైచిత్రి యనంతము. 'గీతగోవిందము పాడుచున్నాడు.' ఇదియొక క్రియ. ధాతుస్వరూపముకాదు. నానుడిలో నిట్టివి వందలుకలవు. ఇట్టివికాక దేశీయములైన ధాతువులయుఁ గ్రియ లయు రూపములు పెక్కులు కలవు. గాలించుట — వెదకుట యని యర్థము. తెలంగాణములో గోలించుట యన్నధాతువు కలదు. సెన గలు మొదలైనవానిని వేయించుట యని దీని కర్థము. తెలుఁగులోఁ గొన్ని ధాతువులకు 'కొను, వేయు, పెట్టు, పడు,' మొదలైనవి చేర్చి నచో నొక్కొక్క ధాతువునకుఁ బదిరూపములు గలుగుచున్నవి. పలు చోట్ల నర్థభేదములు గలుగుచున్నవి. వాడుకలోఁ గలుగు నర్థచ్ఛాయలలోని సూక్ష్మభేదము పరమసుకుమారముగా నుండుచున్నది. ఒకటే ధాతువున కొక ప్రాంతమునం దొక యర్థము, మఱియొక ప్రాంతమునం దొక యర్థముగా నున్నది.

ఇన్ని కారణములచేతఁ దొలుత నిఘంటువులలోని ధాతువుల నన్నిటి నొకచోట సేకరించి భిన్న భిన్న ప్రాంతములవారితో సమావేశమై వారు చెప్పినక్రియలను దీనిలోనికిఁ బొదివికొని, మఱల మఱల సమావేశమగుచు, మఱల మఱలఁ గ్రొత్తక్రొత్త క్రియలను దెలిసికొనుటయుఁ జేర్చికొనుటయుఁ జేయవలసి వచ్చెను. ఎంతచేసియుఁ బని కొఱవడియే యుండెను.

అప్పుడు ఎకాడెమీయొక్క కార్యనిర్వాహక వర్గము వేఱే యొక కమిటీ నేర్పాటుచేసిరి. ఒక్కొక్క జిల్లానుండి యొక్కొక్క పండితుని నియామకముచేసి వారినుండి యా ప్రాంతముల యందలి వాడుకలోని క్రియలను ధాతువులను దెలిసికొని యీ నిఘంటువు నందుఁ జేర్చవలయునని నిశ్చయించిరి.

ఈ సమావేశములో నెల్లూరిజిల్లానుండి వచ్చిన శ్రీ మరుపూరి కోదండరామ రెడ్డిగారును, తెలంగాణములో వాడుకలోనున్న క్రియలను జెప్పుటకు నియమింపఁబడిన, హైద్రాబాదు స్త్రీల కళాశాలలో నుపన్యాసకురాలుగానున్న శ్రీమతి యశోదారెడ్డి ఎం. ఏ. గారును సమకూర్చి యిచ్చిన ధాతువులయుఁ గ్రియాస్వరూపములయు సంఖ్య యెంతో కలదు. ఈ నిఘంటువునకు వారుచేసిన సాహాయ్యము మిక్కిలి గొప్పది. కోదండ రామరెడ్డిగారికి నెల్లూరుజిల్లాలోని ధాతువులతోఁ గల పరిచయము, యశోదారెడ్డిగారికి తెలంగాణపు ధాతువులతోనున్న పరిచయమునకు దీటైనది. ఏ ప్రాంతమందైనను నా ప్రాంతమునందలి ధాతువులతో నంత పరిచయమున్న భాషాభిమానులుగాని పండితులు గాని యుండుట కష్టము. తనుభాషయన్నచో నెంతో యనురాగము గల వ్యక్తులకు గాని యీ కార్యమందు మనస్సింత చొఱఁబడి యుండదు.

నిఘంటు వనినంతనే యీనాడు శ్రీ నిడదవోలు వేంకటరావు గారి సాయములేకుండ నెవ్వరును నిర్వర్తించలేని పని. ఆయన సాహా

య్యము తప్పని సరియైనది. శ్రీ వేంకటరావు గారితో మాటాడుచుఁ బూర్వకావ్యములలోని యే క్రియను గూర్చియన్నను, వెంటనే వా రా క్రియ ప్రయోగింపఁబడియున్న పద్యమును జదివి, యా గ్రంథము పేరు చెప్పి, యా యాశ్వాసములో నున్నదని, యాపద్యసంఖ్య చెప్పుదురు. ఈ విద్యలో వారు నిష్ణాతులు. వాడుకలోనున్న క్రియలను వదలిపెట్టి గ్రాంథికమైన యే ధాతు వైననుసరే, యే మాఱుమూల క్రియయైనను సరే, శ్రీ వేంకటరావుగారు పద్యము చదివి యిచ్చట నున్నదని చూపించలేని దుండదు.

చివరికీ నిఘంటువునకు సంపూర్ణ రూప మిచ్చినది వారు; ప్రెస్సు కాపీ తయారుచేసినది వారు.

అయినను నిట్టిపనిలో నెప్పటికప్పటికిఁ గొఱతలు కనిపించుచునే యుండును. వానిని సర్దుకొనవలసి వచ్చుచునే యుండును. ఇది పండితులు చేయవలసిన పనిగాని సామాన్యులు చేయలేరు. ఎప్పటి కప్పటికి ధనమును వెచ్చింపవలసి వచ్చెను.

ఇదియంతయు నొకయెత్తు. అచ్చువేయుట యొకయెత్తు. తప్పులు లేకుండ నిట్టి గ్రంథ మచ్చొత్తించవలయు నన్నచో మువ్వురు నలువురు పండితుల నిత్యసాహాయ్యము కావలసివచ్చెను. వ్రాతప్రతి వ్రాసిన వాని తాత్పర్య మెఱుంగక యచ్చువేయించినచో లాభములేదు. ఎప్పటికప్పుడు పరిశీలన చేయవలయును. ఇది యింత కష్టమైన పని.

ఇంత చేసినతరువాతఁగూడఁ బూర్తిగాఁ జేయఁబడినదన్న తృప్తిలేదు. శ్రీ కోదండరామరెడ్డి, శ్రీమతి యశోదారెడ్డిగార్లవంటి వారు ప్రతి జిల్లానుండియు నొకొక్కరు దొరకినచో నప్పటికిఁ గొంత తృప్తి కలుగును.

ఇట్టి నిఘంటువు పూర్వము తెలుఁగులో లేదు. దీని స్వరూపము క్రొత్తది. రెండువిధముల నిది క్రొత్తది. ఒకటి క్రియానిఘంటు వగుట చేతఁ గ్రొత్తది-రెండవది వాడుకలోనున్న యనేకక్రియాస్వరూపముల నెత్తికొనుటచేతఁ గ్రొత్తది.

అచ్చముగా నిందులో ధాతువులు లేవు. 'పరకాయించిచూచుట': ఇది ధాతువనుటకు వీలు లేదు. ఇది యొక క్రియాస్వరూపము. అందుచే దీనికి ధాతునిఘంటు వని పేరు పెట్టక 'ఆంధ్రక్రియాస్వరూప మణిదీపిక' యన్న పేరు పెట్టబడినది.

ఇట్టి పేరును సూచించినది (శ్రీ) అబ్బూరి రామకృష్ణారావుగారు.

కష్టపడి యీపని చేసితిమి. ఆంధ్ర క్రియాస్వరూపమతులకు నీ గ్రంథము సంతోషము కలిగించునని యాశ. ఎంతచేసినను మెచ్చనివా రుండవచ్చును. కాని యిట్టి కార్యమువలన లాభము పొందెడి యాంధ్రుల సంఖ్యయే యధికముగా నుండునని మా విశ్వాసము. సహృదయు లుచితములైన మార్పులను సూచించినచో మఱియొక ముద్రణమునందు వానిని దప్పకుండఁ జేర్పవలయుట యీ గ్రంథమునకే యవసరము.

ఇదియొక మహాకార్య మనుకొనవచ్చును. ఇది (శ్రీ) గోపాల రెడ్డి యుపజ్ఞకము.

సంపాదకుడు,

విశ్వనాథ సత్యనారాయణ.

# ఆంధ్రక్రియాస్వరూపమణిదీపిక.



అఆలు వచ్చు: దే. స. క్రి. అక్షరాభ్యాసమున అచ్చులు వచ్చు.
(వ్యవ) నాకు అచ్చులు వచ్చినవి, కాఖాలు చెప్పు కొనుచున్నాను.

అంకన (లు) సేయు: ఉభ. స. క్రి. స్తోత్రముచేయు.

అంకనములు వ్రాయు: ఉభ. స. క్రి. నామావళులు వ్రాయు,
శివునంకనములు వ్రాసిన పుస్తకంబు. పండి. దీక్షా.

అంకము సే (చే)యు: ఉభ. స. క్రి. తప్పులెంచు; ఆక్షేపించు.
ఉ.........సభాస్థలిఁ బ్రౌఢులట్లు నిశ్శంకఁ
జరించుచుణ్ సుకవిసంఘము పల్కుల మెచ్చ కూరకే
యంకము సేయవచ్చు. మైరా. 1ఆ

అంకారించు: దే. అ.క్రి. ఓడ తెరచాపనెత్తి త్రాటితో కట్టియుంచు.

అంకించు: ఉభ. దే. అ క్రి.

1. ప్రకాశించు, ఉల్లసిల్లు.
2. ఒప్పు వసు. 4ఆ
3. ఊహించు పండి. దీక్షా
4. భావనసేయు, భావించు భాగ. 7 స్కం

స. క్రి.

1. పట్టుకొను, తాల్చు అచ్చ. రా. అర. కృ. శకుం 3 ఆ.
2. ఆడించు
3. జళిపించు భార. ద్రోణ. 3 ఆ
4. త్రిప్పు నిర్వ. 8 ఆ
5. వశపఱచుకొను; స్వాధీనము చేసికొను.

అంకించు: సం. స. క్రి.

1. స్తుతించు. పండి. పర్వ. భాగ. 8 స్కం
2. పఠించు. పండి. దీక్షా.
3. పేరుపెట్టు.
4. గుర్తుపట్టు.

అంకితమగు: సం. అ. క్రి. సమర్పితమగు

అంకితము గొను (కొను): ఉభ. స. క్రి. కృతినిగొను

అంకితము సేయు (చేయు): ఉభ. స. క్రి. కృతి సమర్పణ చేయు

అంకితమొనర్చు: సం. అ. క్రి. అంకితము సేయు

అంకిలి నొక్కు: దే. అ. క్రి. దవడలు నొక్కు

అంకిలిపడు: దే. అ. క్రి.

1. అడ్డుపడు. భోజ. 6 ఆ
2. తక్కువయగు, పండి. మహిమ.

అంకిలిపెట్టు: దే. స. క్రి.

1. అడ్డగించు.
2. నిరోధించు.

అంకిలి సెప్పు: దే. స. క్రి అభ్యంతరము చెప్పు. అభ్యంతరపెట్టు

అంకిలి సేయు: దే. స. క్రి. అంకిలి పొందు. ఆటంకపెట్టు

అంకలెఱుగు: దే. అ. క్రి. కీలు తెలిసికొను; మర్మము నెఱుగు

అంకు: దే. అ. క్రి. విజ. వి. 1 ఆ

1. లభించు; అందు. వాడు చేతి కంకిన దంతయు పట్టుకొనిపోయెను.

2. దొరకు. వాడు అంకకుండగ పాఱిపోయెను.

అంకు (కూ) రించు: సం. అ. క్రి. మొలచు; మొలకెత్తు

అంకురిల్లు: సం: అ. క్రి. అంకూరించు.

అంకెకు దార్చు: దే. అ. క్రి. వశముచేయు

అంకెకు వచ్చు: దే. స. క్రి.
1. వశమగు
2. గణనకువచ్చు
3. లెక్కకువచ్చు

అంకెగొను: ద్వ. స. క్రి. (అంకె+కొను)
1. వశము చేసికొను
2. ఆక్రమించు; క్రమ్ము రావి. 3 ఆ

అంకెవేయు: ద్వ. స. క్రి. ఎద్దు కాడికి తొలఁగు

అంకెవేసికొను: ద్వ. స. క్రి. ఎద్దు కాడికి లంకె వేసికొను.

అంగగొను: ద్వ. స. క్రి. 1 ముందుకు బోవు, బస. 1 ఆ
2. ముందుకు నడచు.

అంగడి కెక్కు: దే. అ క్రి.
1. వీధికెక్కు
2. పదిమందికి తెలియు. కవిక. 5 ఆ
3. వ్యభిచారిణి యగు

అంగడిఁ బెట్టు: దే. స. క్రి. 1. వీధిఁ బెట్టు
2. బయలుపఱచు. కువల. 3 ఆ
3. పిల్లలు మారారాముచేయు.

అంగద పడు: దే. అ క్రి. 1. దుఃఖించు
2. ఆఁకలి పొందు

అంగలార్చు: దే. అ. క్రి. (అంగలాచు)
1. ఆపద వలన దుఃఖించు. కాశీ. 7 ఆ
2. భీతిచే నలచు. ఆము. 3 ఆ

అంగలారుచు: అంగలార్చు

అంగలించు: దే. స. క్రి భేదించు.

అంగలు గొను: దే. స. క్రి. వేగముగా పోవుటకై కాళ్ళుచాచివేయు

అంగలు వేయు: దే. స. క్రి. కాళ్లు చాచివేయు

అంగవించు: దే. అ. క్రి. ఉత్సహించు నైష. 7 ఆ
"నే........ నింగినేలయుఁ దాటింప నంగవించు
పగిది."
స. క్రి. అతిక్రమించు. నైష. 5 ఆ
అంగితమగు: దే. అ. క్రి. చిహ్నితమగు
అంగీకమగు: సం. అ. క్రి. అంగీకారమగు రుక్మాం. 1 ఆ
అంగీకరించు: సం. స. క్రి. సమ్మతించు; ఒప్పుకొను.
అంగుళి స్ఫోటనముచేయు: సం. స. క్రి. చిటికలువేయు. హర. 1 ఆ
అంచనవేయు: అంచనావేయు, ఊహించు భల్లా 2 ఆ, శ. ర
అంచనకట్టు: దే. అ. క్రి. అంచించు; పరిమాణము నిర్ణయించు.
అంచించు: దే. అ. క్రి. ఫలపరిమితిని ఉజ్జాయింపుగాఁజెప్పు.
అంచిపుచ్చు: దే. అ. క్రి. అనుమతించి పంపు.
అంచు: యు. దే. స. క్రి. అరుగు ధా. ప్రే. అరుగఁ జేయు
పుచ్చు, పంపు, భార. అశ్వ. 1. ఆ. దశ. 6 ఆ.
అంచుపొంచులేకుండు. దే. అ. క్రి. పొలకువయే (జాడ) లేకుండు
అంచుముట్టు: దే. అ. క్రి. తుదముట్టు.
అంచులుమోయు: దే. అ. క్రి. వెలితిలేకుండ చేయు
అంజఁగొను: దే. అ. క్రి. అడుగువేయు
అంజనముచూడు: దే. స. క్రి మందుపెట్టు.
అంజనముపెట్టు: దే. స. క్రి. మోసగించు
అంజనమువేయు: దే. స క్రి. ధనాదులు లభించుటకు, నిధులను తెలిసి
కొనుటకు కూర్చుండి కంటికి కాటుక మంత్రించి పెట్టి
చూచు.

అంజలించు: }
అంజలిచేయు: } సం. అ. క్రి. దోయిలించు, దోసిలిపట్టు.
అంజలియెత్తు: } అంజలి చేయు
అంజాయించు: దే.అ. క్రి. సందేహించు

అంజు: దే. అ. క్రి. భయపడు ఉ. హరి .1.ఆ

అంటఁగట్టు: దే. స. క్రి, 1. అంటునట్లు కట్టు. 2. ఆరోపించు, సంబంధింపఁజేయు, బలవంతమునఁగాని మోసమునఁ గాని చేర్చు—, నలుగురు ఆ పిల్లను వాని కంటఁగట్టిరి.— ఆ ఖర్చంతయు వాని కంటఁగట్టిరి.

అంటగు: దే. అ. క్రి. 1. అపవిత్రమగు, మైలయగు, అశుచియగు-ఇల్లు అంతయు అంటయినది. 2. బహిష్ఠయగు, ఋతుమతి యగు,

అంటఁగొట్టు: దే. స. క్రి, మేకులు మొ. పైకి లేవకుండఁగొట్టు.

అంటఁగ్రాగు: దే.అ. క్రి. ఆశ్రయించుకొని తిరుగు, అధిక కామముతో ప్రవర్తించు.

అంటఁజఱచు: దే. అ. క్రి. అదురంటఁ గొట్టు

అంటఁదాకు: దే. స. క్రి. అంటుకొను కు. సం. 12–127

అంటఁ దఱుము: దే. స. క్రి. వెన్నంటితఱుము.

అంటపొడుచు: దే. స. క్రి. గట్టిగా కుట్టు. ఉదా. తేలు అంటపొడిచెను.

అంటఁబట్టు: దే. స. క్రి. కలియఁబట్టు, నొక్కిపట్టు.

అంటలు గట్టు: దే. అ. క్రి. గుంపులుకట్టు, జడలు కట్టు.

అంటసిల్లు:
అంటసిలు:
అంటసిలఁబడు: } దే. అ. క్రి. తాఁకు, తగులు, నేలఁగూలు. భార. ద్రోణ. 5. ఆ. ఉ. హరి 4. ఆ.

అంటించు: దే. స. క్రి. 1. సంబంధము కలుగజేయు. 2. నాటు. ఉదా: అరటి పిలక లంటించెను. 3. (తేలు) కుట్టు,

అంటించు: దే. స. క్రి. (అంటు ప్రే.) అంటునట్లుఁ జేయు, అంటఁజేయు. పుస్తకములకుఁ గాగితములు అంటించినాఁడు. వాఁడు భార్యకు రోగములుఅంటించినాడు. (తగిలించు) వాడు కొంపనంటించినాడు. (తగులఁబెట్టు) ప్రొయ్యిలో

నిప్పు అంటించినది. (తగుల్కొల్పు, వేయు), (కొట్టు) – వానిని నాల్గు అంటించెను. (నలుమూలల వ్యాపింపఁ జేయు) – వా డూరంతయు అంటించినాడు.

అంటికొను: దే. అ. క్రి. లగ్నమగు. (బట్టకొంగు ముళ్ళకు అంటు కొన్నది.) స. క్రి. తగులుకొను, కామించు, వాఁడు దానిని అంటుకొన్నాడు.

అంటిపెట్టుకొని తిరుగు: దే. అ. క్రి. విడువకుండ కలసి సంచరించు

అంటిపెట్టుకొనియుండు: దే. అ. క్రి. విడువకుండ కలసి యుండు.

అంటిముట్టనట్లుండు: దే. అ. క్రి. వేని యందు జోక్యము కలుగజేసి కొనకయుండు.

అంటు: దే. స. క్రి. 1. తాఁకు; స్పృశించు, ముట్టుకొను 2. రతియందుఁగలయు, తగులుకొను. స్వారం. 2 ఆ. 3. (నూనె) రాచు, కళా 7 ఆ.

అ. క్రి. 1. సక్తమగు, లగ్నమగు, అంటుకొను, ముఖమున బొట్టు అంటలేదు. అక్షరములు బాగుగ అంటలేదు. బట్టకు రంగు అంటినది.

2. అలవడు. అబ్బు, వానికి విద్య అంటలేదు. ఎంత దొరికినను ఐశ్వర్యమంటదు. 3. మొలుచు. నారు బాగుగా అంటలేదు.

అంటుకైకొను: దే. అ. క్రి. రజస్వలయగు.

అంటుకొనిపోవు: దే. అ. క్రి. మిక్కిలి అంటుకొను: వ్రేళ్ళు విడకుండగనే ఒకదాని నొకటి యంటుకొని పోయినవి. మాడిపోవు– కాళ్ళంటుకొని పోయినవి.

స. క్రి. 1. అపహరించుకొను

2. తగుల్కొను, వాఁడు దానిని అంటుకొని పోయినాడు.

అంటుకొను: దే. అ. క్రి. అంటురోగాలు మొ॥ తగులు, నిప్పు దరి కొను, మందు– కొంపలంటుకొన్నవి. లోపలకుఅణగి

పోవు- దాడలు అంటుకొన్నవి. ప్రే. అంటుకొలుపు

అంటుఁద్రొక్కు: దే. స. క్రి. చెట్లకొమ్మలను వేరు వచ్చునట్లు మట్టిలో పెట్టు.

అంటుపడు:
అంటువడు: } ద్వ.అ.క్రి.అశుచియగు, ఋతుమతియగు, సంబంధపడు.

అంటువేయు: దే. స. క్రి. ఒకజాతి చెట్టుకొమ్మతో సామాన్యమైన మొక్కను కట్టి ఆ జాతి మొక్కగాఁజేయు.

అంటుసేయు: దే. స. క్రి. పొల్లుడుచు. ద్వి. పరమ. 151 పొ.

అంటులువాయు: దే. అ. క్రి. చిక్కువీడు.

అంట్లొత్తు: దే.స.క్రి. అంట్లు కట్టు.

అంట్లుకడుగు: దే.అ.క్రి. వంటపాత్రలు శుభ్రము చేయు.

అంట్లుతీయు:
అంట్లుతుడుచు: } దే. అ. క్రి.భోజనముల తర్వాత ఎంగిలితీసి శుద్ధిపెట్టు

అండగొట్టు: దే. అ.క్రి.(అండ + కొట్టు). వెనుదీయు,వెనుకాడు.పర.1.ఆ ఆలస్యముచేయు, శ.ర.

అండగొను: దే. అ. క్రి. వెనుఁబడు, వెనుఁదీయు, మార్కం. 1. ఆ. స.క్రి. ఆశ్రయముగొను, ఆశ్రయించు. భార. ఉద్యో. ఆలస్యముచేయు [4 ఆ. 208.

అండగొలుపు : దే. స. క్రి. ఆధారముగాఁజేసికొను.

అండచూచుకొను: దే. స. క్రి. ఇతరుల బలమును ఆధారముజేసికొను

అండఁజేయు : దే. స. క్రి. ఆశ్రయమిచ్చు

అండజేరు: దే. స. క్రి. అండజేసికొను, ఆశ్రయించు

అండుపడు :
అండుచేయు: } దే. అ. క్రి. తెలం : 1. ఆకలితీరుటకు ఆహారమేదియైన స్వీకరించు. 2. భోజనముచేయు.

అండెముగట్టు : దే. స. క్రి. తెలం: చింతపండు, మిరపకాయలు మొ॥ వానిని చాపలో పెట్టి చుట్టు

అంతరించు : సం. అ. క్రి. 1. అదృశ్యమగు
2. మరణించు, జై. 8 ఆ.
3. చెడు. నష్టమగు భార. ఆది. 3. ఆ.
స. క్రి. నడచు, అతిక్రమించు జై. 5 ఆ.
అంతర్ధానము సేయు: సం. అ. క్రి. (అంతర్ధానము పొందు)
అదృశ్యమగు, భార. ఉద్యో. 3. ఆ
అంతర్నిఖాతమగు: సం. అ. క్రి. మనస్సులో నాటు, రాధా. 287
అంతర్భవించు: సం. అ. క్రి. లోపలనుండు, లోనచొచ్చు, ఇముడు.
అంతవిధింజేయు: సం. స. క్రి. లయింపఁజేయు
అంతమునొందించు: సం. స. క్రి. చంపు
అంతముచూడు: సం. స. క్రి. 1. పగసాధించు
2. తుదముట్టచూచు
అంతలుసేయు: దే. అ. క్రి. 1. విస్తారముగాఁ బ్రవర్తించు
2. అనవసరముగా నధికముసేయు.
అంతుకనుగొను: } దే. స. క్రి. పారమ్యముచూచు, పాడుచేయు
అంతు తెలిసికొను: } 1. లోతుల నరయు
అంతు తెల్చుకొను: } 2. చావుచూడు
3. రహస్యము కనుగొను
అంతుపట్టు: దే. అ. క్రి. లోతు తెలియు
స. క్రి. తుదికనుగొను
అంతుదొరకు: దే. అ. క్రి. పత్తా తెలియు
అందంబుగూడుకొను: దే. అ. క్రి. ఇష్టములేకున్నను పైకి ఇష్టమున్నట్లు కనఁబడు;- మీఁదఁ గార్యంబుగల మాకు దేనిం గాదనఁబనిలేదని యందంబు గూడుకొని ఛందోవర్తనుండై ఆము. 6. ఆ. ఆము 5. ఆ. ఇట కలసికొను శ. ర వ్యాఖ్య. కలిపికొను - వేదమువారివ్యాఖ్య.
అందగించు: దే. అ. క్రి. శోభిల్లు, రమ్యమగు

అందపడు: వై. అ. క్రి. (అందము+పడు) రమ్యమగు
(ప్రే). అందపఱచు

అందముసేయు: దే. స. క్రి. చక్కదనము కల్పించు. షోడశ. 5. ఆ.

అందవుచేయు: అన్యదే. స. క్రి. ఓడల తెరచాపలకు అడుగు చిన్న గుడ్డకట్టు

అందించు:
అందిచ్చు: } దే. స. క్రి. (అందు+ఇచ్చు) అందునటు ఇచ్చు భార. విరా. 4 ఆ. బ. స. 4 ఆ.
అందుకొనియిచ్చు, చేతికిచ్చు, ఉ. హరి. 143.

అందిచ్చు : దే. స.క్రి. 1. ధనమును ఇతరులకు తెలియకుండ చేర వేయు
2. కావలసినది యిచ్చి సహాయపడు.

అందియిచ్చు:
అందు : } దే. స. క్రి. పొందు. భార. అర. 2 ఆ
2. కైకొను, పుచ్చుకొను, పట్టుకొను, మార్క. 5
3. చేరు కాశీ. 2. ఆ. 4.
4. అవలంబించు, పూను, కళా. 6. ఆ.
అ. క్రి. లభ్యమగు, దొరకు, ప్రాప్తమగు, విజ.3. ఆ.
సాటియగు, సమానమగు, సరిపడు— దానిజుట్టు కత్తిరించుటచేత ముడివేయుట కందదు.

అందుకొను.
అందికొను: } దే. స. క్రి. ప్రతిగ్రహించు, పుచ్చుకొను, ఆము. 7. ఆ.భాగ. 10. ఆ.
2. పట్టుకొను, కళా. 3.ఆ. బండి అందుకో.
3. స్పృశించు, అంటు. జై. 6. ఆ. పైదూలము అందుకో చూతము.
4. కలియు, కూడు.
5. ఉపక్రమించు, పూను, కకు. 2 ఆ.
ఆలంబమగు, చేరు. ఉదా. నీ పరుగు అందుకొను.

అందెవేయు : దే. అ. క్రి. ప్రావీణ్యము నొందు.

అంపించు : దే. స. క్రి. ప్రే. చూ. అంచు.
అంపించుకొను : దే. అ. క్రి. ప్రే. అనుజ్ఞ తీసికొను
అంపు : దే. స.క్రి. (అంపకాలు)నూతనవివాహితను కో
నకు పంపు. రూ. అనుపు, అనుచు, అంచు
1. ఆజ్ఞాపించు
2. పంపు
అంబటికోసము కుదురు : దే. అ. క్రి. తెలం. జీతము తీ
లేక తీసికొనక అన్నముతిని సేవచేయు.
అంబటికిపడియుండు : దే. అ. క్రి. కేవలము కూటి కాసపడిఁ
అంబాడు : దే. అ. క్రి. పాఱాడు.
అకటావికటముచేయు : దే. స. క్రి. తాఱుమాఱుసేయు
అక్కజపడు : } వై. అ. క్రి. (అక్కజము + పడు)
అక్కజంపడు : } ఆశ్చర్యపడు
అక్కటపడు : దే. అ. క్రి. ఆశ్చర్యపడు, దుఃఖపడు.
అక్కటపించు: దే. స. క్రి. కనికరించు
అక్కఱగొను: దే. స. క్రి. అపేక్షించు; ప్రయోజనపడు.
అక్కఱకు వచ్చు: దే. అ. క్రి. 1. పనికివచ్చు
2. అవసరము వచ్చు.
3. సహాయపడు.
అక్కఱపడు: దే. అ. క్రి. అక్కఱగొను, ఆసపడు
అక్కలు : } దే. స. క్రి. ఉబ్బించు
అక్కల్లు : } ముడుగుఱ్ఱొమ్మక్కలఁ జేసి
అక్కళించు : దే. అ. క్రి. ఆకలి మొ॥ వాని చేత కడుపుఁ
పోవు; దించుకొనిపోవు. సంకుచితమగు, ప్ర
నీ కడుపు అక్కళించు
అక్కిలఁజేయు : దే. స. క్రి. కలఁచు. (రూ. అక్కిలిపఱచు
అక్కిల్లు : దే. అ. క్రి. అక్కళించు.

అక్కిలిపడు : ద్వ. అ. క్రి.
1. కలఁతపడు భాగ. 7. స్కం
2. చెడు, నశించు, పండి. పురా.
అక్కెత్తుకొను : దే. అ క్రి. ఊమ్ము ఎత్తుకొను, కు. సం. 5. ఆ.
అక్షయమగు : సం. స. క్రి. ఎప్పుడు వట్టి పోకుండు.
నాశనము నందకుండు. షోడశ. 5.
అగడాడు : దే. స. క్రి. నిందించు
అగడుపడు : ద్వ. అ. క్రి. 1.దూఱుపడు, నిందపడు, విప్ర. 3. ఆ.
2. తొట్రుపడు, దురాశపడు, కలతనొందు.వసు. 6.ఆ.
అగడు పఱచు : దే. అ. (అల్లరిపెట్టు) నిందపాలుచేయు.
అగడుసేయు : దే. స. క్రి. నిందించు. పంచ. నా. 4. ఆ.
2. నిరాకరించు, నిరసించు నై. 7 ఆ.
అగదగులు : దే. అ. క్రి. 1. సమావేశమగు, కలియు, తటస్థమగు, 2. కనపడు,
అగపడు : ద్వ. అ. క్రి. (అగ్గము + పడు)
1. అధీనమగు, లోనగు బస. 2. ఆ భార. విరా. 2 ఆ.
భార. శాం. 3. ఆ.
2. లభించు, అందు, దొరకు భార. ద్రో 1. ఆ.
3. కనఁబడు, గోచరమగు, భార. విరా. 2. ఆ. బస. 1ఆ.
4. సంభవించు, కలుగు, చేటగుపడు.
అచ్చరా. ఆర.
అగలఁగొట్టు : దే. స. క్రి. భేదించు
అగలు : దే. అ. పగులు.
అగల్చు : దే. ప్రే. 1. భేదించు జై. 6. ఆ
2. పెల్లగించు.
సీ.....అంగదగొని మొదళు లగల్చికొనుచు.
భార. స్త్రీ. 2. ఆ

అగాడీపిగాడీచేయు: అన్య దే. స. క్రి. అశ్వాదుల నడపులో పెట్టు. ముందఱ మున్నూరు వెనుక యేనూరు పట్టు పగముతో నగాడీపిగాడీ చేసి దానికి దానా పాణీ పెట్టిరనుచున్నారు. కు. రా.

అగాదుచేయు : అన్య దే. స. క్రి. (ఫిరంగి మొ॥ వానిని) పేల్చు

అగాధమగు : సం. అ. క్రి. (నై. జి.) 1. పూర్తిగా చెడిపోవు. 2. అల్లరిపడు. 3. లోతగు

అగావగు : అన్య. దే. అ. క్రి. కనబడకుండఁ బోవు

అగు : దే. అ. క్రి. విధేయ విశేషణమునకు, అనగా విశేష్యమునకు తరువాత నుపయోగించెడి విశేషణమునకు అన్వయ సంపూర్తికి నుపయోగించు క్రియ- వాఁడు సదాచారుడయ్యె.

విశేషణమునకు, విశేష్యమునకు అన్వయము కలుపుటకై యుపయోగించుకొను- ధర్మపరుండగు రాజు

3. పరిణమించు, మాఱు. శివ. నూ 3. ఆ.

4. తగు, అర్హమగు, ఆవశ్యకమగు భార. అశ్వ. 1. ఆ. నై. 3. ఆ

5. కలవాఁడగు. భార. ఆర. 6. ఆ.

అభిప్రాయమై యుండు = అభిప్రాయము కలవాఁడై యుండు. ఇట్టిచోట సకర్మక క్రియగాను అన్వయింపవచ్చును. 6. నెఱవేఱు. సిద్ధించు. భార. అను.2. ఆ.

7. సిద్ధమగు. ఆము. 4. ఆ

8. సంపూర్ణమగు పుస్తకము వ్రాతయైనది. భోజనములయినవి.

9. ఓపు, సమర్థుడగు, చాలు. భార. ఉ. 1. ఆ

10. ఉండు. జీవించియుండు, భార. కర్ణ. 2. ఆ.

11. జరుగు. వారింట పెండ్లి యగుచున్నది.
స. క్రి. 1. కలుగు, ఉ.హరి 4. ఆ. (ఇట్టిచోట కలవాడగు అని అ. క్రి. గాను అన్వయింపవచ్చును)
2. పొందు, ప్రాపించు
12స్వస్థితిని చెప్పు. ఉదా:-వాడు మనిసియైపుట్టినాడు, (మనుష్యుడని యర్థము)

అగుడుపడు : దే. అ. క్రి. అపహాసముపడు, చులకనగు

అగుదెంచు : దే. అ. క్రి. (అగు + తెంచు)అగు. నిర్వ. 6. ఆ. (అరుదెంచె పాఠాంతరము) భార. విరా. 4. ఆ. (ఇట స్వార్థమున తెంచు)
2. కావచ్చినది యగు, కానున్నది యగు; భార. విరా. 4. ఆ.

అగుభుగుల్కొను: దే. అ. క్రి. ఆర్భాటముచేయు, ఫెళఫెళ నార్చుచు బృథ్వి కంపింప నార్భాటముల్ చేసె నగుభుగుల్కొనగ జడిసి పగతురగుండె జల్లనిపగుల, కా.క.

అగ్గజమగు: దే. అ. క్రి. 1. వలసినదాని కన్న మఱియు పెద్దదగు
2. దుర్భరమగు.

అగ్గపడు : దే. అ. క్రి. అగపడు

అగ్గమగు : దే. అ. క్రి. అధికమగు, లోబడు.

అగ్గముసేయు : దే. స. క్రి. ఒప్పగించు

అగ్గరించు : తెలం. దే. స. క్రి. అధికముగా నున్న భాగమును దీసి సరిచేయు

అగ్గలించు : దే. అ. క్రి. అతిశయించు, పూను, ఉత్సహించు, భార. విరా. 5. ఆ

అగ్గించు :
అగ్గించుకొను: } వై. స. క్రి. పొగడు, స్తుతించు,

అగ్గిరాజు : దే. స. క్రి. మంటలెత్తు, ఉడుకు,
అగ్గిరాజుచు, వింతనుండు నా యతినమదిని మించు.
అగ్నియిచ్చు : సం. స. క్రి. దహనముచేయు, అగ్నిసంస్కారము చేయు – పురపురఁ బొక్కుచు ఒకసతి కరంకముందేరఁ బనిచి గారవమున నెయ్యురఁ దానును నగ్నియిచ్చి.
భా. శాంతి. 3. ఆ
అఘటించు : సం. స. క్రి. చెడఁగొట్టు, విడఁగొట్టు, నై ష. 2. ఆ.
అఘోరించు :
అహోరెంచు : } దే. అ. క్రి. (వ్యవ) – ఏడ్చు, వ్యర్థమగు పనిచేయు– [పెద్దలు పిన్నలయెడ ప్రేమతో పల్కుదురు.]
అచలించు : దే. అ. క్రి. ఆగ్రహించు.
అచ్చగు : దే. అ. క్రి. గ్రంథము ముద్రితమగు
అచ్చనగాయలాడు: దే. స. క్రి. (తెలం)– ఇష్టము వచ్చినట్లు ఆడించు
అచ్చనపుచ్చు : దే. స. క్రి. ఊడబెఱుకు, ఆటలో అచ్చనగాయ తీసినట్లు తీయు.
కు. సం. 2. ఆ.
అచ్చనలాడు : దే. అ. క్రి. గంతులు వేయు. జై. 1. ఆ.
అచ్చరవడు: వై. అ. క్రి. అచ్చెరువు పడు. కు. సం. 1. ఆ.
అచ్చలించు: దే. అ. క్రి. పట్టుదల నొందు, పట్టుపట్టు, ఆగ్రహించు.
అచ్చు : దే.అ.క్రి. నష్టపరిహారము గట్టు, అప్పుపడు, ఋణపడు, ఋణస్థుడగు, బాకీయుండు. హరిశ్చంద్ర. 2. ఆ.
స. క్రి. 1. ఇచ్చు. ఉ. హ. 5.ఆ.
2. దండుగగా చెల్లించు, విజ్ఞా.ప్రా. కాం.
అచ్చికబుచ్చికలాడు: దే. అ. క్రి. 1. ఇచ్చకములాడు.
2. కలుపుగోలుతనము ప్రకటించు.
అచ్చివచ్చు : దే. అ. క్రి. కలిసివచ్చు, అనుకూలమగు. శుభకరమగు
అచ్చుకట్టు:వ్యా. స. క్రి. 1. వేఱువేఱుగాఁజేయు, ఏర్పఱచు.
లక్ష్మ్మి.5. ఆ.
2. మళ్ళుమళ్ళుగఁజేయు వై. 1. ఆ

అచ్చుకట్టు కట్టు :
అచ్చుకట్టు చేయు :
అచ్చుకట్టుతీయు
అచ్చుకట్టుసవరించు
} దే. స. క్రి. సాగుచేయు, అచ్చుకట్టు. క్రొత్తగా భూమిని మాగాణిచేసి గనిమలు వేసి కయ్యలుచేయు.

అచ్చుకొను: దే. అ. క్రి. ఒకరీయవలసిన ఋణమును తానిచ్చుటకు ఒప్పుకొను, అవార్తీపడు,-నేను వాని యప్పు నచ్చుకొన్నాను.

అచ్చునిలుపు : దే. అ. క్రి. దృష్టాంతము చూపు కు. సం.

అచ్చుపడు : నై. అ. క్రి. అంకితమగు. ఉదా-భావజు కేళియచ్చుపడి.
1. ఉపయోగపడు.
2. ముద్రితమగు
3. మూర్తీభవించు, రూపమొందు. భార. అర. 7. ఆ
4. సార్థకమగు. భార. విరా. 5 ఆ.
5. నిరూపితమగు. ఏర్పడు. భార. శాం. 1. ఆ.
6. సుప్రసిద్ధమగు. భార. శల్య. 1ఆ.
7. స్వాధీనపడు.
8. పూటపడు.

అచ్చుపడు : దే. అ. క్రి. అనుకూలమగు కు. సం. 8-158

అచ్చుపఱచు: నై. స. క్రి. ఏర్పఱచు. నియమించు, భార. విరా. 4 ఆ.

అచ్చుపోయు: దే. స. క్రి. కరువున పోయు, మూసపోయు,
2. వృషోత్సర్జనము చేయు.

అచ్చుబోసి విడుచు : దే. స. క్రి. స్వేచ్ఛగా వదలు

అచ్చులు పెట్టు: దే. అ. క్రి. గుర్తులు పెట్టు కు. సం. 411.

అచ్చులొత్తు : దే. స. క్రి. ముద్రలు వేయు

అచ్చువోయు (రూ) చేయు: దే. స. క్రి. ఆబోతును చిహ్నముగా ముద్రించి విడుచు

అచ్చువేయు : } ద్వ. స. క్రి. ముద్రించు, అచ్చొత్తించు.
అచ్చొత్తు :
అచ్చెరువడు : దే. అ. క్రి. ఆశ్చర్యపడు.
అచ్చెరువందు : దే. అ. క్రి. ఆశ్చర్యము పొందు
అజ్జకువేయు : దే. స. క్రి. తరలించుకొనిపోవు. రా. బాల. కాం.
అజ్జసేయు : దే. అ. క్రి. మొండికెత్తు
అజ్జాడించు : దే. స. క్రి. ఆజ్ఞాపించు, సమయముచేయు
అజ్జాయించు : దే. అ. క్రి. 1. నిదానించు
2. అంచనావేయు
అజ్జోడించు : దే. అ. క్రి. ఆలస్యము చేయకుండ పనిచేయు
అజ్జోరించు : దే. అ. క్రి. మాఱుపలుకకుండు రంగా 219
అటకాపులుచేయు : } దే. స. క్రి. అడగించు, బలాత్కారముగా నిరోధించు
అటకాయించు :
అటమటపడు : దే. అ. క్రి. దుఃఖపడు
అటమటించు : దే. స. క్రి. ధిక్కరించు, మించు, స్వా. 5. ఆ.
1. చలించు, స్వా. 5. ఆ. అని. శ. ర. ఈ పాఠము ఈ అర్థమును ప్రామాదికములు.
2. వంచించు విజయ. 3. ఆ.
3. అపహరించు లేక దాచు వి. పు. 6. ఆ.
అటవటిల్లు : దే. అ. క్రి. తపించు
అటుంచు : దే. స. క్రి. ప్రక్కనఁ బెట్టు
అటుపెట్టు : దే. స. క్రి. అటువెట్టు, ఎడగానుంచు;
అట్టకట్టు : దే. అ. క్రి. అట్టగా నేర్పడు (రూ) అట్టలుగట్టు, అంటలుగట్టు
అట్టహాసముచేయు : సం. అ. క్రి. 1. అనవసరముగా పెను ప్రయత్నము చేయు
2. ఆర్భాటము చేయు
3. హడావిడి చేయు
4. పెద్దగా నవ్వు

అట్టిటు సేయు : దే. స. క్రి. తలక్రిందులుసేయు

అట్టిట్టగు : దే. అ. క్రి. తారుమారగు

అట్టిట్టుపడు : దే. అ. క్రి. తారుమారుపడు

అట్టిపెట్టుకొను: దే. అ. క్రి. ఉంచుకొను

అట్టుడుకున ట్టుడుకు: దే. అ. క్రి. 1. తహతహపడు,
2. బాగుగా తప్తమగు
3. అందరు అదే చెప్పుకొను.
4. ఒకేసారిచలించు

అట్టిపెట్టు : దే. స. క్రి. ఉంచు

అడకత్తెరలోపడు:
అడకొత్తునపడు :
} దే. అ. క్రి. 1. కష్టములలోచిక్కు.
2. క్లిష్టమగు సమస్యలలో నిఱుకుకొను,
3. ఇద్దఱమధ్య సతమతమగు.

అడకించు : దే. స. క్రి. ఉల్లసమాడు, ఉడికించు. ప్రభా. 3.ఆ
వంచించు, మోసపుచ్చు భో. 6.ఆ

అడకు : దే. స. క్రి. దాచు.

అడఁగఁగొట్టు : దే. స. క్రి. తగ్గించు.

అడగఁద్రొక్కు :
అణఁగద్రొక్కు :
} దే. స. క్రి. అడగునట్లుత్రొక్కు, నిందించు

అడఁగారిపోవు:
అడఁగారు :
అణఁగారు :
} దే. అ. క్రి. 1. అడఁగు 2. ఉపశమిల్లు. తగ్గు
3. క్రుంగు, అడుగంటు, నశించు.

అడఁగించు : దే. స. క్రి. అణఁగఁగొట్టు

అడఁగు : దే. అ. క్రి. 1. తగ్గు,
2. ఉపశమిల్లు.
3. నశించు. భార. ఉద్యో. 1 ఆ.
4. లోఁబడు, విధేయమగు, లొంగు

అడఁగు : 5. నమ్రమగు
6. ఇముడు
7. నిషిద్ధమగు
8. మాయమగు
9. దాఁగికొను
10. మరణించు

అడఁగొను : దే. అ. క్రి. అడకట్టు, ముద్దకట్టు.
స. క్రి. ముద్దగాఁ జేయు, ప్రోగుజేయు. కు. సం. 11 ఆ.
సాంద్రమగు-అడగొనియున్న శోకాటవిఁ జిక్కువడిన
రాముని జూచి పాయంగ లేక సౌమిత్రి యుండె.
కుశ. పాం.

అడగోలుకొను : దే. స. క్రి. వశము చేసికొను, వశపఱచుకొను.
దశ. 5. ఆ.
2. అపహరించు భో. 9. ఆ.

అడచిపడు : దే. అ. క్రి. ఎగిరిపడు, గర్వించు, కాశీ. 5. ఆ.

అడచు : దే. ప్రే. 1. అడఁగఁ జేయు, అడగించు
2. అడఁగునట్లు చేయు
3. అపహరించు భార. ఆశ. 4. ఆ.

అడజడిపెట్టు : దే. స. క్రి. దుఃఖపెట్టు మార్క. 1. ఆ.

అడపు : దే. స. క్రి. అణచు

అడరు : దే. అ. క్రి. 1. అతిశయించు, హెచ్చు,
భార. విరా. 1. ఆ.
2. విజృంభించు, వీర. 4. ఆ.
3. వర్ధిల్లు, రామా. 1. ఆ.
4. వ్యాపించు, ప్రసరించు భార. కర్ణ. 2. ఆ.
5. కలుగు భార. అర. 6. ఆ.
6. పూను భార. అను. 3. ఆ.
7. తాకు, పైఁబడు భార. భీష్మ. 3. ఆ.

అడరుదెంచు : దే. అ. క్రి. అడరు, అతిశయించు
అడరుపడు : దే. అ. క్రి. విజృంభించు ఉ. రా. 4. ఆ.
అడరించు : దే. ప్రే. 1. అడరఁజేయు
2. బాణాదులు ప్రయోగించు భార. ద్రో. 2. ఆ.
అడరుచ్చు : దే. ప్రే. అడరించు జై. 7. ఆ.
అడలడిపోవు : దే. అ. క్రి. భయము నశించు
"అడలడిపో సేలందెదు." మించు.
అడలించు : ప్రే. భయపెట్టు
అడలిపోవు : దే. అ. క్రి. భయపడు
అడలు : దే. అ. క్రి. 1. ఏడ్చు, విలపించు. భార. విరా. 2. ఆ.
2. శోకించు భార. భీష్మ. 1. ఆ.
3. భయపడు
అడలుకొను : దే. అ. క్రి. అడలు, శోకించు. అచ్చ. అయో.
అడవి పట్టు : దే. అ. క్రి. అడవిపాలగు
అడవియగు : దే. అ. క్రి. పాడగు 2. స్వేచ్ఛానువర్తియగు
అడిగికొను : దే. స. క్రి. అడుగుకొను
1. ప్రార్థించు వి. పు. 6. ఆ.
2. యాచించు,
– వా డూరూర అడిగికొని పదివేలు గడించినాడు
3. ముష్టి యెత్తికొను, యాయవారము చేయు
అడిగిపుచ్చు : దే. స. క్రి. (యజ్ఞార్థమై) పంచు (అడిగిపుచ్చితి నేను నైదు గ్రామములు) ద్వి. భా. 5. ఆ.
అడిచిపడు : ద్వ. అ. క్రి. 1. తమకించు, త్వరపడు. భార. శాంతి. 3. ఆ.
2. కోపగర్వాదులవలన నెగిరిపడు,
భార. కర్ణ. 3. ఆ భార. సౌప్తి. 1. ఆ
3. మండిపడు నై. 4. ఆ.
(రూ) అడచిపడు

అడితిచేయు : దే. అ. క్రి. కమీషన్ వ్యాపారముచేయు

అడిత్రాగుడగు : దే. అ. క్రి. అధికదాహమగు, నీరు లేమి యగు "అడిత్రాగుడైన, వఱదల యెడనైనను" మించు.

అడిపెట్టు : దే. స. క్రి. తనఖాపెట్టు, ఆదిపెట్టు, కుదువపెట్టు

అడుకు : దే. స. క్రి. దొంతరగా జేర్చు, ఒకదానిపై నొకటి పెట్టు.

అడుకొఁను : దే. అ. క్రి. అడుగుకొను హంస. ౩.

అడుగంటు : దే. అ. క్రి. అడుగున మాడు. ఇగురునట్టు, మొదలు తాకు, మొదలు నశించు

అడుగిడు : దే. అ. క్రి. అడుగు వేయు

అడుగు : దే. స. క్రి. స్త్రీని కనయగోరు భా. విరాట.
1. ప్రశ్నించు
2. యాచించు
3. కావలెనని చెప్పు
4. కావలెనని కోరు,
– వాడు పుస్తకము నన్నడిగి తీసికొనినాడు

అడుగుకొను : దే. అ. క్రి. బిచ్చమెత్తుకొను

అడుగుతప్పు : దే. అ. క్రి. దారితప్పు

అడుగుతాటించు : ద్వ. స. క్రి. కాళ్ళతోఁ దన్ను సాం. మా.
(బాధచే) కాళ్ళు తన్నుకొను, కాళ్ళు కొట్టుకొను.

అడుగువాటు : దే. అ. క్రి పెట్టిన యడుగును మీఱు, జనదాటు,

అడుగుదీయు : దే. అ. క్రి. అడుగెత్తు

అడుగుద్రొక్కు : దే. అ. క్రి. 1. పెండ్లాడు, వసు.
2. కాలుత్రొక్కు

అడుగుపడు :
అడుగువడు : } ద్వ. అ. క్రి. 1. క్రిందగు
2. అధమమగు

అడుగుపఱచు : దే. స. క్రి. తిరస్కరించు, తక్కువచేయు
ప్రే. అడుగుపడఁజేయు చంద్రా: 5. ఆ.

అడుగుపెట్టు : ద్వ. అ. క్రి. 1. పాదముంచు
2. ప్రవేశించు
3. గిన్నె (మొ॥వానికి) అడుగుభాగము నమస్కా

అడుగుమాలిపోవు: దే. అ. క్రి. నిర్మూలమగు
2. మొదటికి నశించు భార. ఉద్యో. 3. ఆ.

అడుగుముట్టు : దే. అ. క్రి. 1. నిర్మూలమగు
2. అట్టడుగు తాఁకు, అడుగంటు
వసు. 4. ఆ.

అడుగులంఁబడు : దే. అ. క్రి. నమస్కరించు, కాలికి బంధమగు

అడుచు : దే. స. క్రి. కొట్టు, భార. ఆది. 1.ఆ. అను. 1. ఆ.

అడువు : దే. స. క్రి. అడుగు

అడ్గు దే. స. క్రి. అడుగు. పండి. పర్వత. పు.

అడుగువట్టు : దే. అ. క్రి. 1. అడుగంటు, శూన్యమగు,
2. పాదముపట్టు

అడుమానముపెట్టు: } దే. స. క్రి. కుదువపెట్టు
అయికముపెట్టు :

అడ్డకట్టు దే. స. క్రి. (అడ్డము + కట్టు) అడ్డగించు, నిరోధించు
అరికట్టు. పర. 4. ఆ

అడ్డగించు : దే. స. క్రి. అడ్డుపడు, నిరోధించు,

అడ్డగోలుచేయు : దే. స. క్రి. ఒకవిధానము ననుసరింపక చేయు
2. ఎగుడుదిగుడుచేయు

అడ్డపట్టు : దే. స. క్రి. (అడ్డ + పట్టు) (శిశువును) చేతుల
మీాద అడ్డముగా పట్టు. సా. 2. భా.

అడ్డపడు: ద్వ. అ. క్రి. (అడ్డముగా నిలబడు) కార్యమునకు అడ్డువచ్చు. విఘ్నముచేయు
2. కష్టము మొ॥ వాని బారిఁబడకుండ నడ్డముగ నిల్చు, రక్షించు. భార. ఉద్యో. 3. ఆ.

అడ్డపెట్టు : }
అడ్డవెట్టు : } దే. స. క్రి. (అడ్డము + పెట్టు) అడ్డుకట్టు,నిరోధించు కాశీ. 1 ఆ.

అడ్డమాడు : దే. స. క్రి. ఎదురు చెప్పు.

అడ్డముతగులు : దే. స. క్రి. అడ్డపడు,నిరోధించు. తనకు వచ్చు లాభాదులను మఱి యొకరు మధ్యలో నుపయోగించుకొను

అడ్డముపడు : దే. అ. క్రి. వ్యాధిచే మంచమును బట్టు.

అడ్డాలుపడు : దే. అ. క్రి. నిరోధించు, పసిపిల్లలు తల్లిదండ్రుల నెత్తుకొనుమని నిరోధించు

(అడ్డాలపుడే బిడ్డలు కాని గడ్డాలపుడు గాదు.)

అడ్డిపడు : ద్వ. అ. క్రి. ఆఁగిపోవు, నిలిచిపోవు

అడ్డిపెట్టు ; దే. అ. క్రి. బోదెలో నీళ్ళు నిలుచునట్లు కట్టవేయు.
(అడ్డి – అడ్డుకట్టు)

అడ్డిపోవు : దే. అ. క్రి. ఆఁగిపోవు, నిలిచిపోవు.

అడ్డిసేయు : దే. స. క్రి. అడ్డగించు, ఎదురుచెప్పు–
– తన్ను మఱలింప నర్థించి వినయసూక్తులు నల్కవిప్రులంగూడి, అడ్డిసేయక రాము నరికట్టఁదలఁచి, అడ్డంబునచ్చెనాయనఁదనుల్ నిండి– రా. అయోధ్య.

అడ్డు: దే. స. క్రి. అడ్డగించు నీలా. 1. ఆ

అడ్డుకొట్టు దే. స. క్రి.మధ్యలో అటకాయించు

అడ్డుకొను : దే. స. క్రి. అడ్డుగొను (నిరోధించు)

అడ్డుగొను : దే. అ. క్రి. (అడ్డు + కొను) అడ్డపడు.
అచ్చరా. యు. కాం.

అడ్డునపడు : (తెలం.) దే. అ. క్రి. 1. లేవలేని స్థితియం దుండు.
2. పేదయగు
3. మఱుగుపడు
4. మఱపునందు.

అడ్డుపడు : దే. స. క్రి. రక్షించు, అభ్యంతరపెట్టు
అణకించు : దే. స. క్రి. అడకించు - భాగ. 1 స్కం. శ. ర.
అణఁగారిపోవు : దే. అ. క్రి. తగ్గిపోవు, లోఁబడిపోవు, నశించిపోవు, నొక్కుపడిపోవు
అణఁగారు : దే. అ. క్రి. 1. అడఁగారు 2. ఉపశమిల్లు
అణఁగిమణఁగియుండు: దే. అ. క్రి. నింపాదిగ నుండు
అణఁగు : దే. అ. క్రి. 1. తగ్గు
2. ఉపశమిల్లు
3. నమ్రమగు
4. నశించు
5. లోఁబడు

అణచు : దే. స. క్రి. అడఁచు
అతకడచు : దే. స. క్రి. అతకరించు, దాటు
అతకరించు : వై. స. క్రి. 1. క్రిందు పఱచు, మించు, అధఃకరించు హరి. పూ. 4. ఆ.
2. ఉల్లంఘించు లక్ష్మి. 4. ఆ.
అతలకుతలమగు: దే. అ. క్రి. 1. కుమ్ముపడు, 2. నలగబడు
అతికించు : దే. స. క్రి. కరిపించు, కలుపు
అతిక్రమించు : సం. స. క్రి. మీఱు
అతితెలివిపోవు : దే. అ. క్రి. (వ్యా) కుత్సితము నెఱపు, విపరీతముగా ప్రవర్తించు
అతివర్తించు : సం. స. క్రి. మించు, మీఱు. భార. శాంతి. 5. ఆ.
అతిశయించు : సం. స. అ. క్రి. హెచ్చు

అతిశయిల్లు : సం. అ. క్రి. అతిశయించు, అగలించు
అతుకు : దే. అ. క్రి. 1. అంటుకొను, అత్తుకొను
2. అతుకు, అనుకూలమగు, సరిపడు, కలియు

అత్తమిల్లు . స. క్రి. అని శర. అతికించు, కలిసిపోవునట్లు చేయు
వై. స. క్రి.
కూడుకొను,– పతి సతి యుత్తమిలుచు మించు
భార. అను. ఉద్యో. 3. ఆ.
అ. క్రి. 1. అస్తమించు, క్రుంకు. కాశీ. 1, ఆ,
2. ఒఱగు, అవనతమగు స్వా. 2. ఆ.
3. వ్యాపించు, క్రమ్ము జై. 2. ఆ,
4. పవళించు, శయనించు. అచ్చ. బాల.
5. ఉపశమించు
6. నశించు, అంతరించు

అత్తు : దే. అ. క్రి. 1. కలుగు, పంచ నా. 1. ఆ.
2. కలసిమెలసియుండు
3. ఏకీభవించు. భార. స్త్రీ. 2. ఆ.
విజ్ఞా. వ్యా. కాం.

అత్తుకొను : దే. అ. క్రి. అత్తు
అదమాయించు : దే. స. క్రి. ఆజ్ఞపెట్టు, తనచేతనుసమర్థించు (నె.జి.)
అదరగట్టు : దే. స. క్రి. ఓడ కదలకుండునట్లు చేయు
అదరఁగొట్టు : దే. స. క్రి. చలించునట్లు సేయు, భయపెట్టు, బుకాయింపులతో తనమాట నెగ్గించుకొను
అదరఁజూచు : దే. అ. క్రి. భయపడునట్లు చూచు
అదరవులేకుండు: దే. అ. క్రి. ఆధారము లేకుండు
అదరవైచు : దే. స. క్రి. అదలించు, గద్దించు. ప్రభా. 3. ఆ.
అదరించు : దే. స. క్రి. భయపెట్టు

అదరవేయు : దే. స. క్రి. అదరునట్లు కొట్టు
అదరిపడు : ద్వి. అ. క్రి. ఉలికిపడు, త్రుళ్ళిపడు, ఎగిరిపడు
భార. ఆది. 5. ఆ.
అదరు : దే. అ. క్రి. 1. చలించు, 2. భయాదులవలన సంభ్రమమునొందు, త్రుళ్ళు. భార. విరా. 5. ఆ.
అదరుపాటు : దే. అ. క్రి. భయము పొందు. జ్వలించు
అదలించు : (తెలం) దే. స. క్రి. ఎదుటివానిని చులుకనగా తీసివేయు, (రూ) అదలించికొట్టు
1. భయపెట్టు 2. సరకుగొనకపోవు, ఎడ్లనుతోలు
అదలు : దే. అ. క్రి. భయపడు, బెదరు
అదలుచు : దే. ప్రే. అదలించు, (రూ) అదల్చు
అదల్చు : దే. ప్రే. 1. అదలించు, భయపెట్టు 2. ధిక్కరించు 3. బెదరించు. భార. కర్ణ. 2. ఆ.
అదవదపడు: ద్వి. అ. క్రి. కలతపడు, తొట్రుపడు, రామా. 4. ఆ.
అదపెట్టు : దే. అ. క్రి. మొఱపెట్టు [హం. విం.
అదసీయంబగు: సం. అ. క్రి. దీని సంబంధమైనదియగు. శివరా. 245.
అదిగదీయను: } దే. అ. క్రి. మెచ్చుకొను
అదిగపను :
అదిరిపడు : ద్వి. అ. క్రి. అదరిపడు భార. ఆది. 1. ఆ.
అదిశించు : వై. స. క్రి. అతిక్రమించు
అదుకు : దే. స. క్రి. అతుకు
అదుకుకొను : దే. అ. క్రి. (స్వార్థమునం గొను) అంటుకొను
అదుము : దే. స. క్రి. అణచు భార. ఆశ్ర. 2. ఆ.
నొక్కు.
అదురు : దే. అ. క్రి. చలించు, కదలు
అదురుకొను : దే. అ. క్రి. భయపడు

అదుకుచు : }
అదుర్చు : } దే. అ. క్రి. చలించు (చూ) అదుకుచు, అద్రుచు అదరుచు భార. ద్రో. 5. ఆ.

అద్దతో గిద్ద వేయు: దే. అ. క్రి. 1. సహజమగు
2. సులభమగు
3. సామాన్యమగు

అద్దళించు : దే. స. క్రి. మర్దించు, చేతులతో మెదపు,
– కలిసంపు ముద్దపాకంబుగా నద్దళించి ధ. వి.

అద్దించు : దే. స. క్రి. 1. ఊహించు
2. ఫలపరిమితి నూహించు
3. రంగు వేయునట్లు చేయు

అద్దికొను : దే. స. క్రి. హత్తుకొను

అద్దు : దే. స. క్రి. 1. త్రోచు, త్రోcగcజేయు, ముంచు
భార. శాం. 3. ఆ. బస. 5. ఆ.
2. రంగు వేయు
3. నీరు, సిరా, మొ॥ గుడ్డ, కాగితము మొ॥ వానిచే పీల్చుకొనునట్లుచేయు.
–ఆమె అంగవస్త్రముతో నీరుఅద్దినది.
అద్దుకాగితముతో సిరా అద్దితిని

అద్దెడుగిద్దెడగు : దే. అ. క్రి. 1. అధికమగు
2. రెట్టింపగు

అద్రుచు : దే. స. క్రి. అదుర్చు, ఇందలి 'అ' కారము లఘువు.
భార. ఆది. 5. భీష్మ. 2. ఉ. హరి. 4.

అధఃకరించు : సం. స. క్రి. క్రిందుచేయు, అతకరించు, తక్కువ చేయు, కొంచెపఱచు

అధికరించు : సం. స. క్రి. 1. చదువు
2. సంపాదించు, నేర్చు హర. 7. ఆ.
3. ఉద్దేశించు, మించు
అధిక్షేపించు : సం. స. క్రి 1. దూఱు
2. బెదరించు
అధిగమించు : సం. స. క్రి. అతిక్రమించు, పొందు
అధిరోహణము సేయు: సం స. క్రి. ఎక్కు శివత. 244.
అధిరోహించు : సం. స. క్రి. ఎక్కు, ఆరోహించు
అధివసించు : }
అధివాసించు: } సం. అ. క్రి. నివసించు, ఉండు. కాశీ. 6. ఆ.
అధిష్ఠించు : సం. స. క్రి. 1. ఆశ్రయించు
అ. క్రి. 2. కూర్చుండు
అధీనముతప్పు : సం. అ. క్రి. 1. (స్త్రీ) భర్తృవిహీనయగు.
2. స్వాధీనము తప్పు
అధ్యక్షించు : సం. స. క్రి. పాలించు, ఏలు, సభకు అగ్రాసనాధిపత్యము వహించు
అధ్యయనించు : సం. స. క్రి. అధ్యయనము సేయు
అధ్యాసించు : సం. స. క్రి. ఆరోపించు
అధ్యాహరించు : సం. స. క్రి. ఊహించు
అద్భుతంపడు : సం. అ. క్రి. ఆశ్చర్యము చెందు హర. 1.
అద్భుతమందు : సం. అ. క్రి. ఆశ్చర్యమందు
అనఁగు : దే. అ. క్రి. కలయు
అనఁబట్టు : దే. అ. క్రి. అనఁదగు కు. సం.
అనకొన(గొన)లేకుండు: దే. అ. క్రి. మొదలు తుదలు ఏర్పడకుండు, అంతులేకుండు
అనగి పెనఁగు : దే. అ. క్రి. కలసిమెలసి యుండు
అనచిపుచ్చు : దే. స. క్రి. పంపు భార. శాం. 3. ఆ.

అననురూపములగు: సం. అ. క్రి. తగనివియగు. భార. విరా. 4-103.
అనఁబట్టు : దే. స. క్రి. 1. విమర్శించుటకుఁబూను
2. నిందించుటకు పూనుకొను
అనలద్రావితమగు: సం. అ. క్రి. నీఱుగాచేయబడినది యగు,
ఉ. నా. 1-97
అనలుగొనలుసాఱు : దే. అ. క్రి. విస్తరించు
అనవటిల్లు : దే. అ. క్రి. అన్నము పక్వమై చల్లారు
అనారిలు : దే. అ. క్రి. త్రోఁచు
అనిపించు : దే. అ. క్రి. అన్పించు
కళా. స. 20
అనిపించుకొను: దే. అ. క్రి. 1. అనునట్లు చేసికొను
2. ఒప్పించుకొను
3. తిట్టించుకొను
4. పంపించుకొను
5. పొమ్మని చెప్పించుకొను
అన్పించు : దే. అ. క్రి. సెలవుకొను. ప్రభా. 4. ఆ.
అనునట్లు చేసికొను
అను : దే. స. క్రి. చెప్పు భార. ఆది. 8. ఆ.
2. అని చెప్పు భార. ఆది 4. ఆ.
3. అని తలచు
4. నిందించు
భార. ఆది. 5 ఆ.
5. అని ప్రసిద్ధుడగు, ప్రసిద్ధమగు భార. ఆర. 4 ఆ.
6. చదువు: పద్యము మొ॥నవి చదువు
7. పాడు_అనగ ననగ రాగ మతిశయిల్లుచు నుండు,
8. ఉచ్చరించు _
రామ రామ అంటే ముక్తిపొందుదువు.
9. అని యడుగు
భార. ఆది. 2. ఆ

అనుకనుకగు : దే. అ. క్రి. జవజవలాడు

అనుకరించు : సం. స. క్రి. అనుకరణము చేయు, ఒకరు చేయునట్లు చేయు, పోలు

అనుకీర్తి సేయు : సం. స. క్రి. కీర్తించు

అనుకు : దే. అ. క్రి. గరిటెజారుగా పలుచనగు – (అనుకుం బాసెము)

అనుకూలించు : సం. అ. క్రి. అనుకూలమగు, ప్రతికూలము కానిదగు, ఉపయోగించు

అనుకొను : దే. అ. క్రి. తలంచు

అనుగమించు : సం. స. క్రి. అనుసరించు, వెంబడించు
2. అనుకరించు, పోలు, భార. సభా. 1. ఆ.
భార. ఆర. 5. ఆ.

అనుగలించు : దే. అ. క్రి. ఇష్టపడు

అనుగ్రహించు : సం. స. క్రి. 1. (అనుగ్రహము చూపు) కనికరించు
2. పోషించు

అనుచరించు : సం. స. క్రి. అనుసరించు భార. విరా. 1. ఆ.

అనుచు : దే. స. క్రి. పంపు (గూ) అంచు

అనుతాపించు : సం. అ. క్రి. పరితపించు

అనునయించు : సం. స. క్రి. బుజ్జగించు, సాంత్వనముచేయు

అనునాయించు : సం. స. క్రి. 1. ఊరడించు. భార. ఉద్యో. 3. ఆ.
2. గౌరవించు భార. ఉద్యో. 3. ఆ.

అనుపు :
అన్పు :
అనుచు : } దే. స. క్రి. చూ. అంచు

అనుపుదిద్దు : దే. స. క్రి. పేర్చు

అనుపుపఱచు : దే. స. క్రి. బలపఱచు

అనుపుపెట్టు : దే. స. క్రి. తోడుపంపు

అనుబంధించు : సం. అ. క్రి. ఎడతెగకకల్గు, అనుస్యూతమగు,
అనుబంధినడపు: సం. స. క్రి. బంధుత్వము నెఱపు
అనుబలమగు : సం. అ. క్రి. సహాయమగు. కు. సం 1.
అనుభవించు : సం. స. క్రి. అనుభవమునొందు, ప్రత్యక్షజ్ఞానము నొందు.
2. సుఖదుఃఖాదుల నొందు, సుకృత దుష్కృతములనొందు. భార.ఉద్యో.
3. భుజించు, భార. అను. 3 ఆ.
అనుభోగించు : సం. స. క్రి. భోగించు
అనుమతించు : సం. స. క్రి. సమ్మతించు, ఒడంబడు
అనుమానపడు : మి. అ. క్రి. 1. సందేహించు
2. అనుకొను
3. ఊహచేయు
అనుమానించు : సం. అ. క్రి. 1. ఊహించు
2. సందేహించు. భార. ఉద్యో. 2.ఆ.
3. స్త్రీవిషయికముగా దురూహించు
అనుమోదించు : సం. అ. క్రి. 1. సంతోషించు
2. సమ్మతించు
అనుమోదిల్లు : సం. అ. క్రి. సంతోషించు
అనురంజిల్లు : సం. అ. క్రి. ప్రకాశించు
అనురాగించు : సం. అ. క్రి. అనురాగము పొందు
భార. భీష్మ. 4. ఆ.
అనురాగిల్లు : సం. అ. క్రి. అనురాగము పొందు
అనులోధించు : సం. స. క్రి. అనుసరించు
అనులాపించు : సం. అ. క్రి. మాటిమాటికి చెప్పు
అనువగు(వ్యవ): దే. అ. క్రి. లోకువగు.
ఉ. ఇంత అనువైపోయానా నీకు?

అనువగు :
అనువందు : } దే. అ. క్రి. పిలుపడు
అనువొందు :

అనువచించు :
అనువాచించు : } సం. స. క్రి. మఱలఁ జెప్పు

అనువదించు :
అనువాదించు : } సం. స. క్రి. 1. ఒకరనిన దానిని మఱల నను
2. ఒక భాషలోని విషయమును మఱి యొక భాషలోనికి మార్చు

అనువయించు : సం. స. క్రి. బట్టలు నేయు. భార. ఆది. 1. ఆ.
అనువర్ణించు : సం. స. క్రి. వచించు, చెప్పు. భార. భీష్మ. 1. ఆ.
అనువర్తించు : సం. స. క్రి. అనువర్తించి నడచు, అనుసరించు
అనువారు : దే. అ. క్రి. పిలుపడు.
అనువుకొను : దే. అ. క్రి. పొందుపడు
అనువుకొల్పు : దే. స. క్రి. ప్రే. పొందుపఱుచు
అనువుచేయు : ద్వ. స. క్రి. సిద్ధపఱచు, సన్నాహముచేయు, సన్నద్ధముసేయు. భార. శల్య. 1. ఆ.
అనువుపడు : దే. అ. క్రి. సరిపడు, యుక్తమగు
అనువుపఱచు : దే. అ. క్రి. పొందుపఱచు నైష. 5.49. ఉ. హరి. 291
అనువుసేయు : దే. స. క్రి. వీలుచేయు
అనువొందు : దే. అ. క్రి. తగియుండు
అనువొప్పు : దే. అ. క్రి. ఒప్పు
అనుశాసించు : సం. స. క్రి. శిక్షించు, దండించు, భార. అర. 1 ఆ.
అనుష్ఠానముచేయు : మిశ్ర. స. క్రి. కల్లుత్రాగు (తెలంగాణా)
అనుష్ఠించు : సం. స. క్రి. ఆచరించు, చేయు, భార. విరా. 1. ఆ.
పఠించు, చదువు. ద్వి. బస. 7. ఆ.
అధర్మస్త్రీసంగమము చేయు.

అనుసంధించు: సం. స. క్రి. 1. నియమించు, పర్పాటుచు.
భార. ద్రోణ. 2 ఆ.
2. బోధపఱచుకొను. భార. భీష్మ. 1. ఆ.
కూర్చు, సంఘటింపఁజేయు.
అనుసరించు: సం. స. క్రి. 1. వెంటఁబోవు, వెంబడించు.
2. అనుకరించు, ఒకరుచేయునట్లుచేయు.
అనుస్మరించు: సం. స. క్రి. స్మరించు.
అనూదించు: సం. స. క్రి. తర్జుమాచేయు, అనుసరించిచెప్పు.
అన్చు : దే. ప్రే. రూ. అంచు.
అన్ను : దే. అ. క్రి. నుదించు ప. పీ.
అనూనయించు: సం. స. క్రి. గౌరవించు, పూజించు.
అనూనముగఁజేయు: సం. స. క్రి. తక్కువకాకుండచేయు. షోడశ. 5.
అన్యథాకరించు: సం స. క్రి. వేఱుసేయు, మఱియొకవిధముగాచేయు, వ్యతిరేకముజేయు, భార. ఆది. 7 ఆ. నై. 7 ఆ.
అన్నియుండు : దే. స. క్రి. నిండుగా నుండు, కొఱత లేకుండు
"అన్ని యున్నయట్టి యగ్రహారంబులో." మించు.
అన్నుకొను : దే. అ. క్రి. మత్తెక్కు
అన్నుకొలుపు : ప్రే. అన్నుకొనఁజేయు
అన్నెక్కు : దే. అ. క్రి. మత్తెక్కు, అందగించు
అన్వయించు : సం. అ. క్రి. 1. ప్రవర్తించు, సరిపడు, కుదురు, పొసగు
ఆ సూత్ర మిక్కడ అన్వయింపదు. ఆ ధర్మశాస్త్ర వాక్యము లీ విషయమున అన్వయింపవు.
2. బోధపడు, తెలియు.
– ఆ శ్లోకము నాకు అన్వయింపలేదు.
స. క్రి. (1) భావానుకూలముగ పదములను కూర్చు.
(2) భావమును వివరించు – ఈపద్యమును అన్వయింపుము.

అన్వేషించు : సం. స. క్రి. వెదకు  భార. విరా. 3 ఆ.
అన్వేష్టించు : సం. స. క్రి. చుట్టుకొను.
అపకరించు : సం. స. క్రి. అపకారము సేయు
అపకర్షించు : సం. అ. క్రి. వెనుకకు లాగు
అపక్రమించు: సం. అ. క్రి. యుద్ధమువలనఁ బాఱిపోవు.
2. తొలగిపోవు.
అపచయించు: సం. స. క్రి. పువ్వులుగోయు, చిదుము.
అపచరించు: సం. స. క్రి. అపచారము చేయు.
అపనయించు: సం. స. క్రి. 1. తొలగించు,  భార. ఆర. 1 ఆ.
2. నివారించు  నైష. 1 ఆ.
అపప్రథయగు: సం. అ. క్రి. అపకీర్తిపాలగు.  భోజ. 7.156.
అపలపించు: సం. స. క్రి. కప్పిపుచ్చు.
అపలాపించు: సం. స. క్రి. 1. నిరసించు.
2. తక్కువపఱచు.  భార. ఆర. 5 ఆ.
3. కప్పిపుచ్చి చెప్పు.
అపవాదించు: సం. స. క్రి. అపవాదముచేయు.
అపవారించు: సం. స. క్రి. మఱుగుపెట్టు.
అపసరిల్లు : సం. స. క్రి. 1. (ధనాదులను) దొంగిలించు,
2. మోసపుచ్చి తీసికొనిపోవు.
3. పోగొట్టు, తీఱఁజేయు,
అ. క్రి. 4. తొలఁగు  [భార. అను. 4. ఆ.
అపహాసించు: సం. అ. క్రి. కంట నీరు క్రమ్మునట్లు నవ్వు.
స. క్రి. గేలిచేయు, పరియాచకముచేయు,
భార. ఆర. 5 ఆ.
అపహ్నవించు: సం. స. క్రి. మఱుగు పఱచు.
అపాకరించు: సం. స. క్రి. దూరముచేయు, వర్జించు.

అపార్కముచేయు: సం. స. క్రి. అపహాసముచేయు.
అపాహరించు: సం. స. క్రి. అపహరించు.
అపేక్షించు: సం. స. క్రి. ఆశించు, కోరు, వేడు. భార. ఆది. 3. ఆ
భార. ఆది. 1. ఆ.
అపోహపడు: మి. అ. క్రి. అపార్థముచేసికొను (అపోహముపడు)
భ్రాంతిపడు.
అపోహముపుచ్చు: మి. స. క్రి. భ్రంశముచేయు. పాడుచేయు.
కు. సం. 7. ఆ.
అప్పగించు: వై. స. క్రి. 1. ఒప్పగించు,
2. సురక్షితముగ నుంచుటకై యిచ్చు.
భార. విరా. 1. ఆ.
3. కైవసము సేయు.
అప్పజెప్పు: దే. స. క్రి. అధీనములోనుంచు.
"బూదల నమ్మల కప్పజెప్పి" మించు.
అప్పనగొను: దే. స. క్రి. కానుక గ్రహించు, అనుమతిపుచ్చుకొను.
అప్పనమగు : } దే. స. క్రి. అర్పించు
అప్పన సేయు : }
అప్పనముగొను: దే. స. క్రి. పన్నుగాఁ బుచ్చుకొను.
అప్పనముచేయు: దే. స. క్రి. భక్షించు
అప్పళించు: వై. అ. క్రి. 1. యత్నించు, పూను.
భార. విరా. 2 ఆ.
2. అభిలషించు, కోరు. నై ష. 1 ఆ.
స. క్రి. 1. ఆస్ఫాలనముచేయు, చఱచు.
2. మోదుకొను (ఉదరము)
కొట్టుకొను. భార. విరా. 3. ఆ.
3. అదుము, నొక్కు బస. 1 ఆ.
ఆక్రమించు. భార. విరా. 2 ఆ.

అప్పళించు : 4. కప్పు. స్వా. 5. ఆ.
5. గ్రహించు. నై. 6. ఆ.
6. తుడుచు, ఉ. రా. 6 ఆ.
7. మొత్తు, నై. 2. ఆ.
8. స్పృశించు, హరి. పూ. 8. ఆ.
9. విప్పుకొను, (తెలం).
10. వికాసమును పొందు (తెలం).
అప్పు(లు)పొడుచు: దే. స. క్రి. అప్పుచేయు.
అప్పువడు : ద్వ. అ. క్రి. ఋణపడు, బాకీపడు (అప్పుపడు)
అబింటరగు: దే. అ. క్రి. క్రమము చెడు.
అబేసుచేయు: అన్య. దే. తెరచాపలను పైకెత్తు.
అబ్బగించు: దే. అ. క్రి. సహించు, తాళు, ఓర్చు,
కు. సం. 2. ఆ. 12. ఆ.
అబ్బనెంచు: దే. స. క్రి. తిట్టు.
అబ్బాయను: దే. అ. క్రి. బాధపడు.
అబ్బాలాడు: దే. అ. క్రి. సంభ్రమించు. 2. తడబడు.
అబ్బు : నై. అ. క్రి. 1. దొరకు, లభించు. భార. శాం.5.ఆ.
—వానికి చదు వబ్బలేదు. భార. శాంతి. 6 ఆ.
2. సిద్ధించు, ఈడేరు. నై. 4. ఆ.
అబ్బుకొను: దే. అ. క్రి. కైవసము చేసికొను,
2. కౌగిలించుకొను.
3. చుట్టుకొను.
అబ్బురపడు: నై. అ. క్రి వెఱగుపడు; ఆశ్చర్యపడు.
అబ్బోయను: దే. అ. క్రి. ఆశ్చర్యపోవు.
అబ్రపడు : నై. అ. క్రి. ఆశ్చర్యపడు.
అబ్రహ్మణ్యముపెట్టు: సం. అ. క్రి. చంపవలదని మొఱపెట్టు.
స్వా. 3. 102. దశ. 2. 399.

అభిగమించు: సం. స. క్రి. ప్రత్యుత్థానముచేయు.
అభిఘరించు: సం. స. క్రి. సంస్కారార్థము కొంచెము నేయి వేయు
కాశీ. 7. ఆ.

అభిఘారించు: } సం. స. క్రి. అభిఘరించు.
అభిఘారము చేయు: }

అభిచరించు: సం. అ. క్రి. 1. చుట్టుచుతిరుగు.
2. సంచరించు.

అభిదర్శించు: సం. స. క్రి చూచు.

అభినందించు; సం. అ. క్రి. సంతోషించు స. క్రి. స్తుతించు.

అభినయించు: సం.అ.క్రి. అభినయము సేయు.నృత్తానర్తనముచేయు.

అభినవించు: సం. అ. క్రి. నాట్యముచేయు. కు. కం-
ఇచట రసాలతీరు నూతనముగా కలిగింప
జేయునన్న యర్థముకూడ పొసగును.
క్రొత్తగాఁగలుగు.

అభినిర్మించు: సం. స. క్రి. నిర్మించు.

అభినుతియించు: సం. స. క్రి. అభినుతియించు. నరా. 10-86.

అభిభవించు: సం. స. క్రి. 1. తిరస్కరించు, తెగడు,
2. జయించు.

అభిభాషించు: సం. స. క్రి. భాషించు.

అభిమంత్రించు: సం. స. క్రి. 1. పిలుచు. 2.మంత్రముచేసంస్కరించు.
భార. ఆది. 5 ఆ. భార. ద్రో. 1 ఆ.

అభిమర్శించు: సం. స. క్రి. 1. స్పృశించు, తాకు,
2. తడవు.
3. పొందు, అనుభవించు. కాశీ. 3 ఆ.

అభిమానపడు: మి. అ. క్రి. మర్యాద పోవునని బాధపడు,
ఒకమర్యాదను నిలఁబెట్టుకొను.
2. ఆత్మగౌరవమును లెక్కించు.

అభిమానించు : సం. స. క్రి. 1. సమ్మానించు, గౌరవించు.
2. తనది అను భావముతో పూనుకొను,
– నీవు అభిమానించినగాని యీపని నెఱవేఱదు.

అభియోగించు: సం. స. క్రి. ఎదుర్కొను, శత్రువు నెదిరించు.

అభిరమించు: సం. అ. క్రి. రమించు.

అభిలషించు: సం. స. క్రి. కోరు.

అభివర్ణించు : సం. స. క్రి. కొనియాడు, వివరించు.

అభివర్తించు: సం. అ. క్రి. వర్తించు.

అభివర్షించు; సం. అ. క్రి. వర్షించు.

అభివినుతించు: సం. స. క్రి. మిక్కిలి పొగడు మా. పు. 2

అభివీక్షించు : సం. స. క్రి. వీక్షించు.

అభివేష్టించు: సం. స. క్రి. చుట్టుకొను.

అభివ్యాపించు: సం. స. క్రి. వ్యాపించు.

అభిశంసించు : సం. స. క్రి. నిందించు, నిరసించు.

అభిషేకమాడు : సం. స. క్రి. స్నానముచేయు. పాండు. 1. 2.

అభిషేకించు : సం. స. క్రి. 1. స్నానము చేయించు.
2. రాజ్యమునకు పట్టము కట్టునపుడు స్నానముచేయించు,
3. పట్టాభిషేకముచేయు.

అభిష్టుత్యమగు: సం. అ. క్రి. మిక్కిలి పొగడ్తకెక్కు.
భార. శాం. 6.74.

అభిసంరక్షితమగు: సం. అ. క్రి. చక్కగా రక్షింపబడినదియగు.
భార. ఆది. 5–3.

అభిసరించు : సం. స. క్రి. 1. ప్రియు లొకరి నొకరు ఉద్దేశించు.
2. ప్రియుల నుద్దేశించి సంకేతమునకుపోవు.

అభ్యర్చించు : సం. స. క్రి. పూజించు, అర్చించు.

అభ్యర్థించు : సం. స. క్రి. 1. కోరు. 2. వేడు. భార. ద్రో. 5 ఆ.
అభ్యవహరించు : సం. స. క్రి. ఆహారించు, ఆరగించు. నై. 6 ఆ.
అభ్యసించు : సం. స. క్రి. 1. చేసినపని ధ్రువపడుటకై మఱలఁజేయు.
2. విద్యాపులు వశమగుటకై మఱల మఱలఁ జదువు.
3. అలవాటు చేయు.
4. నేర్చుకొను.
అభ్యాసించు : సం. స. క్రి. అభ్యసించు. శివ. రా. 3. ఆ.
అభ్యుత్థానమగు:
అభ్యుత్థానముసేయు: } సం. స. క్రి. లేచి యెదురువచ్చు. కు. సం. 974
అభ్యుదయించు: సం. స. క్రి. ఉదయించునట్లు చేయు.
అభ్యుద్ధరించు: సం. స. క్రి. పైకెత్తు.
అభ్యుపగమించు: సం. స. క్రి. 1. అంగీకరించు, ఒప్పుకొను.
2. తెలిసికొను. కాశీ. 2. ఆ.
అమయు : దే. అ. క్రి. ఉపయుక్తమగు. 2. సిద్ధమగు. (తెలం.)
అమరకమిచ్చు : దే. స. క్రి. కవులిచ్చు.
అమరాడు : దే. అ. క్రి. ఒప్పు.
అమరించు : దే. స. క్రి. అమరు. ప్రే.
అమరు : దే. అ. క్రి. ఒప్పు, పొందు. 1. ఆ. 2. కుదురు.
3. పొందికపడు, సరిపడు, భార. భీష్మ. 2. ఆ.
4. సిద్ధమగు, ఉ. హరి. 6. ఆ. 5. సిద్ధించు, ఫలించు.
అచ్చ. బాల. 6. పొందుగా కుదురు (తెలం).
అమరుచు : దే. స. ప్రే. 1. అమరఁజేయు
2. చేయు, భార. ఆది. 6. ఆ.
3. ఏర్పఱచు. 4. పెట్టు 5. సిద్ధపఱచు.

అమలగు : దే. అ. క్రి. 1. అధికార మాచరితమగు. (తెలం) ఆచరణ యోగ్యమగు.
2. ఆచరణయం దుంచఁబడు,
అమలుతోనుండు: అన్య. దే. అ. క్రి. ఆచరణలోనుండు.
అమలుచేయు: అన్య. దే. అ. క్రి. రాజాజ్ఞ నాచరణలోఁబెట్టు (గూ) అమలులో పెట్టు.
అములుచేయు: అన్య. దే. అ. క్రి. దురధికారముచేయు.
అముద్రితమగు: సం. అ. క్రి. విడిగానుండు, ముద్రవేయకుండనుండు జై. 1_74.
అమ్ము : దే. స. క్రి. వెలకిచ్చు, విక్రయించు.
అమ్ముకొను: దే. స. క్రి. విక్రయించుకొను, వెలకిచ్చు.
అ. క్రి. అమ్ముడుపోవు, వెలకు నీయబడు, అమ్మకమగు. వరా. 11 ఆ.
అమ్ముడగు: దే. అ. క్రి. అమ్ముడుపోవు, విక్రయింపబడు.
2. మఱొకనికి బానిసవలె ప్రవర్తించు.
అమ్ముడుకడచు: దే. అ. క్రి. కాపురమునకు పోవు. పా. మ. 3. ఆ.
అమ్ముడుపడు: దే. అ. క్రి. విక్రయమునుపొందు, చెలామణీయగు
అమ్ముడుపెట్టు: దే. స. క్రి. విక్రయించు, వై. జ. 3_82.
అమ్ముడుపోవు: దే. అ. క్రి. (తెలం) _ ఇతరులకు స్వాధీనమగు, లగ్నమగు, (నె. జి.)- లంచము తిని చెప్పిన పని చేయు.
అయజియలుపెట్టు: దే. స. క్రి. ప్రశంసించు.
అయిదుపదిసేయు: దే. స. క్రి. నమస్కరించు, యుద్ధపరాఙ్ముఖుఁడగు
అయిపోవు : దే. అ. క్రి. పూర్తియగు, మిక్కిలి పేదవడు.
అయిరకొను: దే. అ. క్రి. ఐరకొను, చక్కబడు, వర్ధిల్లు.
అయిరగు : దే. అ. క్రి. కండ్లకలక వచ్చినపుడు కండ్లయందు పుండగు.

అయిరానపడు:
హైరానపడు: } -హిం- అ. క్రి. ఆయాసపడు.
అయివచ్చు: దే. అ. క్రి. అచ్చివచ్చు.
అరకాలనేలరాచు: దే. స. క్రి. ద్వేషముతో హింసించు
అరకాలరాచు: దే. స. క్రి. నాశనముచేయు
అరకొను: దే. అ. క్రి. అరగొను
అరకొరగాచేయు: దే. అ. క్రి. ముక్కలు ముక్కలుగా చేయు (అసంపూర్తిగా)
అరగలిగొను: ద్వ. అ. క్రి. (అరగలి+కొను) సందేహించు
బస. 4. ఆ. బస. 3. ఆ.
అరగొనికాలు: దే. స. క్రి. వేగముగాకాలు.
అరగొను: దే. స. క్రి. వేగిరపడు, సందేహించు.
అరగొరలాడు: దే. అ. క్రి. అస్పష్టముగా చేయు
అరచావుచచ్చు: దే. అ. క్రి. మృతప్రాయమగు
అరచేతులిడు: దే. అ. క్రి. అధికప్రమాదము నివారించుటకు అల్ప ప్రయత్నముచేయు
అరణమిచ్చు: దే. స. క్రి. ధనాదికము వధూవరుల కిచ్చు
కు. సం. 736
అరపు: దే. స. క్రి. అనుచ్చు, నితంబాన్వృత్తి యరపి. ప్ర. 5. ఆ
అరమరపడు: దే. అ. క్రి. 1. సంశయించు.
2. జంకు.
3. కపటవర్తనము కలిగియుండు.
అరమోడ్చు: దే. స. క్రి. కన్ను మో॥ నవి సగము మూడుచు
అరయు: దే. స. క్రి. 1. విచారించు 2. వెదకు 3. తెలిసికొను
హరి. ఉ. 7. ఆ.
4. రక్షించు. భార. ద్రో. 2. ఆ
అరలు: దే. అ. క్రి. వికసించు

అరలేకిచ్చు : దే. స. క్రి. కొంచెతలేకుండ ఇచ్చు. పూర్తిగా సంతోషపెట్టు. చా. మ.
అరవరయగు : దే. అ. క్రి. క్రోధాదులచే క్షుబ్ధుడగు, కలతనొందు
అరవాయిగొను: ద్వ. అ. క్రి. (అరవాయి + కొను) సంకోచించు భార. ఉద్యో. 1. ఆ. కర్ణ. 3 ఆ.
అరవెట్టు : దే. స. క్రి. ప్రక్కకు పెట్టు, దాచు, వ్రాల్చు
అరసేయు : దే. స. క్రి. మోసగించు
అరాబుపరపించు: అన్య. దే. అ. క్రి. మందు పఠపించు (బొ. కా)
అర్ధాన్నమగు : దే. అ. క్రి. పాడడిపోవు
అరికట్టు : దే. స. క్రి. 1. చుట్టుముట్టికొను, నిరోధించు, నిర్వ. 3. ఆ
2. పరివేష్టించు. చుట్టువారుకొను భార. ఆర. 5. ఆ. భాగ. 5. స్కం. 2. ఆ.
అరికట్టుకొను : దే. స. క్రి. అరికట్టు వరా. 9. ఆ.
అరిగించు : దే. స. క్రి. అరుగునట్లుచేయు
అరిగాపువెట్టు దే. అ. క్రి. కావలిపెట్టు
అరిగొను : దే. అ. క్రి. (అరి + కొను,) అడ్డుపడు. వీరచరిత్రము కప్పముంగొను. శ. ర.
అరిణెపెట్టు : దే. స. క్రి. నీళ్లు పారించుటకు దోనె తీయు
అరిపడు : ద్వ. అ. క్రి. అడ్డుపడు భాగ. 3. స్కం.
అరివోయు ; దే. స. క్రి. అల్లెత్రాటిని బిగించు, బాణము సంధించు
అరివెట్టు : దే. అ. క్రి. కప్పము చెల్లించు
అరుగు : దే. అ. క్రి. పోవు, గమించు
అరుగుదెంచు : దే. అ. క్రి. (అరుగు + తెంచు)
1. వచ్చు. భార. ఆది. 7 ఆ. ఆర. 3 ఆ
2. పోవు. జై. 4. ఆ.
(ఈ అర్థము ప్రాయికము గాదు.)

అరుణించు . సం. అ. క్రి. ఎఱ్ఱనగు ద్వి. భా

అరువారు : దే. అ. క్రి. ఆశ్చర్యమగు, అపురూపమగు.

అరుదుపడు : ద్వి. అ. క్రి. ఆశ్చర్యపడు

అరుదెంచు : దే. అ. క్రి. (అరుగు + తెంచు) 1. వచ్చు. 2. పోవు
జై. 4. ఆ.

అరుదేరు : దే. అ. క్రి. వచ్చు, పోవు.

అరుపు సేయు : దే. స. క్రి. (నె.జి) అభ్యంతరము పెట్టు.

అరువిచ్చు : దే స. క్రి, చేబదులిచ్చు.

అరువు : దే. స. క్రి. విధిగా నిచ్చు, (పన్ను మొదలైనవి.)

అరువుదెచ్చు : దే. స. క్రి. 1. అడిగి తెచ్చు.
2. ఎరవు తెచ్చు.
3. పెండ్లికై యితరుల యాభరణములను
కొన్ని రోజులకు తెచ్చుకొను.

అరువులేకుండు : దే. అ. క్రి. యోగ్యతలేకుండు
ఉ:- వాడు, అరువై చేయించనేల.

అర్కాటు సేయు: అన్య. దే. అ. క్రి. గంతులువేయు.
అంత వారలలోన నర్కాటు సేసి. కా. క.

అర్గు : దే. అ. క్రి. 1. అఱగు. పండి. 2. ఆ. పు.
2. అరుగు.

అర్చించు : సం. స. క్రి పూజించు, సమర్పించు. శ. ర.

అర్థమిచ్చు : సం. స. క్రి. ధనము నొసగు. చా. ప

అర్థము తెలుపు : మి. స. క్రి. పరిస్థితి విశదముచేయు.
"ప్రజల జీవితసరణి యర్థంబు తెలుపు" మించు.

అర్థించు : సం. స. క్రి. కోరు, వేడు.

అర్పించు : సం. స. క్రి. అప్పగించు.

అర్యాచేయు : దే. స. క్రి. చాపలుదించు. కా. క.

అఱకలుగు : దే. అ. క్రి. (దీనికి వ్యతిరేకముననే ప్రయోగము) అఱలేక. (కొంకులేక)

అఱగాలు : దే. అ. క్రి. సంపూర్ణముగా కాలు. కు. సం. 5-51.

అఱగోఱసేయు: దే. అ. క్రి. న్యూనపఱచు.

అఱచు : దే. అ. క్రి. కూయు. రామా. 2. ఆ. 2.
2. విలపించు. భార. ద్రో. 2. ఆ.
3. బిగ్గరగా మాటాడు.
4. ప్రేలు, వాగు.
5. ఆవు కప్ప మొదలగునవి అఱచు.

అఱచేయు : దే. స. క్రి. అఱసేయు, మోసపుచ్చు.

అఱమఱల్ చేయు: దే. అ. క్రి. అపసవ్యముగా ప్రవర్తించు.

అఱము : దే. అ. క్రి. గదమాయించు.

అఱమొఱపడు:
అఱిమొఱిపడు: } దే. అ. క్రి. కలతపడు.

అఱవఱసేయు: దే. స. క్రి. (అఱవఱలు + చేయు) ఖండించు, ధ్వంసముచేయు. హరి. ఉ. 6 ఆ.

అఱవుళ్ళచేయు: దే. స. క్రి. ఖండించు.

అఱవు సేయు: దే. స. క్రి. గాయపఱచు.

అఱసేయు : దే. స. క్రి. భేదముకల్పించు (అఱవఱల్ + చేయు) ఖండించు.

అఱిమించు : దే. స. క్రి. అఱుమఁజేయు, ప్రతిఘటించు

అఱిమిక్రాను : దే. అ. క్రి. అఱిమిరోగము కలదియగు

అఱిముఱియగు : దే. అ. క్రి. తఱుచగు

అఱియు : దే. అ. క్రి. నశించు.

అఱు : దే. అ. క్రి. 1. క్షయించు, 2. నశించు. భార. ఆది. 2. ఆ.

అఱుక్రమ్మ్రు : దే. స. క్రి. కవియు, మీఁదికివచ్చు.
రా. సుం. కాం. 265 పు.

అఱుగఁదీయు : దే. స. క్రి. 1. అఱుగునట్లుచేయు.
2. తోము. రాచు.

అఱుగు : దే. అ. క్రి. 1. అన్నాదులు జీర్ణమగు.
2. క్షయించు,తఱుగు.భార.ఆర.4 ఆ.
(రూ)అఱువు. మొదటిరూపము.
అఱూ.

అఱుగుపడు : ద్వ. అ. క్రి. (అఱుగు+పడు)
1. క్షయించు, 2. నశించు, 3. హీనమగు,
హరి. పూ. 5. ఆ.

అఱుపు: దే. స. క్రి. దక్కించు శ. ర.

అఱుము : దే. స. క్రి. రూ. (అర్మ్మ). ఎదుర్కొను, బాధించు,
వశపఱచుకొను, యుద్ధమున ఆక్రమించు.
అ. క్రి. సాహసించు, విజృంభించు,
సన్నద్ధుఁడగు. భార. ఉద్యో. 3 ఆ.

అఱువు : దే. అ. క్రి. అఱుగు, జీర్ణించు, క్షయించు.

అఱ్ఱాకయిడు : దే. స. క్రి. అడ్డగించు

అఱ్ఱాకలుపెట్టు : దే. స. క్రి. బాధించు.

అఱ్ఱాగు :
అఱ్ఱాచు : } దే. స. క్రి. బాధించు

అఱ్ఱాడు : దే. అ. క్రి. (అఱ్ఱు+ఆడు) చుట్టును తిరుగు.
మార్కం. 5. ఆ. ప్రభా. 1. ఆ.
గాద్గద్యము పొందు (తెలం)

అఱ్ఱుజూచు : దే. అ. క్రి. అతిగా కాంక్షించు

అలంకరించు : సం. స. క్రి. కైసేయు, సింగారించు

అలంకారించు : సం. స. క్రి. అలంకరించు. సానం 5. ఆ. పండి. 4 ఆ.

అలగు : దే. అ. క్రి. 1. వెనుదీయు, 2. శోకించు. భాగ. 1స్కం
3. శ్రమపడు, బాధనొందు.
భాగ. 10 స్కం.
4. సంకోచించు. భాగ. 1 స్కం.శ.ర.
అలచు : దే. స. క్రి. అలగు. ప్రే. అలయఁజేయు.
బాధపెట్టు. [భార. ఉద్యో. 1 ఆ.
అలజడిచేయు : దే. అ. క్రి. రొదచేయు.
అలజడిపడు : దే. అ. క్రి. అలజడి నొందు.
అలజడిపెట్టు : దే. స. క్రి. ప్రే. అలజడి నొందించు.
అలజళ్ళమాన్చు: దే. స. క్రి. బాధలు పోగొట్టు. చా. ను.
అలతబెట్టు : దే. స. క్రి. బాధపెట్టు.
అలఁతికిఁదెచ్చు: దే. స. క్రి. మితికిదెచ్చు, చులుకనజేయు.శుం.సం.9
అలఁదు : దే. స. క్రి. పోయు, పూయు.
అలఁదుకొను : దే. అ. క్రి. పూసికొను.
అలఁదురు : దే. అ. క్రి. ఉన్మూలించు, దుఃఖించు.
భార. ఆది. 5. ఆ. నిర్వ. 5. ఆ.
అలక్ష్యముచేయు: మి. స. క్రి. అనాదరించు, నిరసించు.
అలపరించు : దే. స. క్రి. అలవరించు, (అలవాటుచేసికొను)
-అచ్చట నుష్ణోదకంబేని శీతోదకంబేని నొక్కండ పిపాసకై పుచ్చుకొన నలపరింపవలయుగాని యన్యావస్థితముగ బుచ్చుకొనినన్ కడుపున బల్లి పుట్టుచున్నది. నీ. యా.
అలమటపడు : ద్వ. అ. క్రి. వగచు, చింతపడు.
అలమటించు : దే. అ. క్రి. చింతించు, వగచు. వి.పు.5.ఆ.శ.ర.
అలమరు : దే. అ. క్రి. చింతించు, విచారించు, హరిశ్చం.1ఆ.
అలమారుచు : దే. స. క్రి. బండియెడ్లను మార్చికట్టు. శ. ర.
అలమిపట్టు : దే. స. క్రి. క్రమ్మిపట్టుకొను- (ముక్కలమిపట్టె.)

అలము : ఉభ. దే. స. క్రి. కవియు, క్రమ్ము. భార. శాం.4.ఆ.
1. ఆక్రమించు. రా. యు. కాం. ఆము. 1. ఆ.
2. కౌగిలించు. హంస. 3. ఆ.
3. దరిజేరు. సమీపించు మార్క. 8. ఆ.
4. పరివేష్టించు, చుట్టుకొను. భాగ. 9. స్కం.
5. కప్పు. హంస. 2. ఆ.
6. పట్టుకొను. కువల. 4. ఆ.
7. ప్రాయు. ఆము. 5. ఆ. ఆం. బా. 3.
అ. క్రి. 8. ప్రాప్తమగు.

అలముకొను : దే. అ. క్రి. 1. అలము, క్రమ్ము, జై. 7. ఆ.
2. పైకొను (క్షేత్రయ్య.)
3. ప్రసరించు. భార. శాం. 4. ఆ.
4. కలసిపోవు, ఏకీభవించు. వసు.1.ఆ.
స. క్రి. 1. క్రమ్ము, ఆక్రమించు.
2. కౌగిలించుకొను. వసు. 5. ఆ.
3. పొందు, నై. 4. ఆ.
4. కప్పు. యయా.5.ఆ. 5. వ్యాపించు.

అలయించు : దే. స. క్రి. శ్రమపెట్టు.

అలయు : దే. అ. క్రి. శ్రమపడు. భార. అర.2. ఆ. ధర.7ఆ.
2. విసుగుచెందు. భా. ఆది. 8. ఆ.
3. తడయు. ఆలస్యముచేయు, ఉ. హరి. 2. ఆ.
ఇట విసుగు అని శ. ర.

అలరారు : దే. అ. క్రి. (అలరు+ఆరు.) అలరు.
1. పుష్పించు. ఆము.5.ఆ.నై.6. ఆ.
2. వికసించు. దశ.1.ఆ. 3. ఒప్పారు

అలరించు : దే. స. క్రి. సంతోషపెట్టు. పూజాదులుచేయు.

**అలరు :** దే. అ. క్రి. 1. వికసించు, విరియు. భార. విరా. 2ఆ.
2. పుష్పించు, భార. శల్య. 1 ఆ.
3. సంతోషించు నై. 1. ఆ.
4. ఒప్పు, ప్రకాశించు

**అలరుచు :** దే. స. క్రి. అలరజేయు
1. వికసింపజేయు హేం. పంచ 3. ఆ.
2. పుష్పింపజేయు 3. సంతసింపజేయు
4. ఒప్పజేయు 5. చేయు. విజ. 1. అ.

**అలరొందు :** దే. అ. క్రి. సంతోషించు.

**అలవడు :** ద్వ. అ. క్రి. (అలవు+పడు)
1. చనువుకలుగు. భార. విరా. 1 ఆ.
ఇట అభ్యాసపడు, వాడుకపడు అని శ. ర.
2. తగు. హరి. ఉ. 8. ఆ.
3. సిద్ధించు. అబ్బు. భార. ఆర. 7. ఆ.
4. స్వాధీనమగు. లొంగు. భార. భీష్మ. 2. ఆ.
5. కుదురుపడు. భార. విరా. 4. ఆ.
6. ఒప్పు రా. బాల. కాం.

**అలవరించు :**
**అల్వరించు [రూ] :** ద్వ. స. క్రి. అలవడు, ప్రే. అలవడజేసికొను.
1. అబ్బునట్లు చేసికొను. భార. అను. 4. ఆ.
2. అలంకరించు (క్షేత్రయ్య.)
3. బోధించు. పూను. జై. 3. ఆ.
4. సవరించు, దిద్దు. హరి. పూ. 5. ఆ.
5. సిద్ధపఱచు. ఉ. హ. 4. ఆ. జై. 8. ఆ.
6. వశపఱచు, స్వాధీనపఱచు. భార. ఉద్యో. 1ఆ.
7. గ్రహించు, పట్టుకొను.
భార. విరా. 4. ఆ. భార. ద్రో. 5. ఆ.
8. ఒప్పించు. భార. విరా. 2. ఆ

అలవరుచు : దే. స. క్రి. అలవడు. ప్రే. అలవడఁజేయు, అలవరించు. భార. శాం. 3. ఆ.
ఇట పూను అని యర్థము. తగిలించు
అలవరించెనృపతికరములకు కంకణాభరణంబుల్. నై.

అలవర్చు : అలవరుచు. ప్రే.

అలవలము సేయు:
అలబలము సేయు: } దే. అ. క్రి. కలకలము సేయు, సందడిచేయు.

అలవాటుపడు : దే. అ. క్రి. వాడుకయగు.

అలసగు :
అలుసగు : } దే. అ. క్రి. చులుకనయగు (తెలం.)

అలసుచిక్కు :
అలుసుచిక్కు : } దే. అ. క్రి. (తెలం) సందుదొరకు 2. ఇతరులవెలితిని ఆధారముగా గొను.

అలసపడు : దే. అ. క్రి. మందమగు. దశ. 2. ఆ

అలికమగు : దే. అ. క్రి. సన్నమగు కు. సం. 3. 51

అలికిపెట్టు : దే. స. క్రి. ఆస్తి సర్వమును నాశనముచేయు

అలియించు : దే. స. క్రి. శ్రమపెట్టు

అలియు : దే. అ. క్రి. అలఁయు

అల్లిబిల్లియగు : దే.అ.క్రి. (తెలం) కౌగిలించుకొను 2. స్నేహమగు 3. లేనిదానిని ఉన్నట్లు కల్పింపజేయు.

అలుకించు : దే. స. క్రి. జంకించు

అలుకు : దే. అ. క్రి. 1. భయపడు 2. జంకు 3. వెనుదీయు భార. విరా. 5. ఆ.
స. క్రి. ఇల్లు లోనగు వానిని అలుకు, గుడ్డతో కలయరాచు, సమ్మార్జనముచేయు, చల్లు
భార. శాం. 1. ఆ. బస. 4. ఆ. 13. పు. బస. 7. ఆ.

అలుగులుపడు : దే. అ. క్రి. వ్యాకులపడు

అలుగనోడు : దే. అ. క్రి. కోపింప వెఱచు.

అలుగు : దే. అ. క్రి. కోరిక సమకూరమి నిష్ఠురమున చెట్టపడు.
2. కోపమునొందు. భార. ఆది. 4ఆ. శాం. 6. ఆ.
3. ద్రోహము చేయదలచు. మార్క. 8అ(రూ)అల్గు.

అలుగులపడు : ద్వి. అ.క్రి. (అలుగుల + పడు.)
1. నలుగుచుపడు. ఉ. హరి. 3. ఆ.
2. బాధపడు. భార. ఆది.8. ఆ.నిర్వ. 10.ఆ.
కష్టముల జిక్కు.

అలుగులువారు : } దే. అ. క్రి. చెఱువునిండి నీళ్ళు పొంగి
అలుగులువెడలు : } ప్రవహించు,

అలుగెల్లు : దే. అ. క్రి. కోపము పొందు.

అలువు : దే. అ. క్రి. అలుగు. భార. శాం. 1. ఆ.

అలుకు : దే. అ. క్రి. అలుకు
1. భయపడు. భార. ఉద్యో. 1. ఆ.
స. క్రి. 2. నేల అలుకు. గుడ్డతో కలయరాచు.
యయా. 2-5.

అల్గు : దే. అ. క్రి. అలుగు భార. ఆది. 1 ఆ.

అల్దు : దే. స. క్రి. అలము. మేదు.

అల్లకల్లోలమగు: దే. అ. క్రి. సుస్థితి పాయు,
స. క్రి. అల్లటపెట్టు,కష్టపెట్టు,శ్రమపఱచు. బస.1ఆ.

అల్లటివేయు : దే. అ. క్రి. వెనుకకు మొగ్గవేయు,
_వేవేగముగ భూమివిభు కొల్వు జొచ్చి
పల్లటివేసి, యా పలికొండ కెరగి
అల్లటివేసియు నైతన్న మ్రొక్కి కా. క.

అల్లరిచేయు : దే. అ. క్రి. గలభాచేయు.

అల్లరిపడు : } దే. స. క్రి. అల్లరిపెట్టు.
అల్లరియగు: }

అల్లలనాడు : ద్వ. అ. క్రి. (అల్లన + అల్లన + ఆడు.) మిక్కిలి చలించు. స్వా. మను. 2. ఆ.

అల్లలాడు : ద్వ. అ. క్రి. మిక్కిలి చలించు.

అల్లల్లాడు : ద్వ. అ. క్రి. అల్లలాడు.

అల్లాడిపోవు : దే. అ. క్రి. బాధపడిపోవు, తహతహపడు.

అల్లాడు : ద్వ. అ. క్రి. (అల్ల + ఆడు.) 1. చలించు భార. ఆర. 6. ఆ.
2. తిరుగు, 3. తహతహపడు,
4. బాధపడు.

అల్లారుచు : ద్వ. స. క్రి. ప్రే. అల్లాడఁజేయు.

అల్లార్చు : ద్వ. స. క్రి. అల్లారుచు. 2. హృదయపూర్వకముగ జేయు, ఆడించు.

అల్లిబిల్లికొను : దే. అ. క్రి. అల్లికొనియుండు, పెనఁగొను. స్వా. 2. ఆ.

అల్లు :
అల్లుకొను: } దే. అ. క్రి. లేనివి కల్పించు, ప్రాకు.
స. క్రి. చాప మొదలగునవి అల్లికచేయు.
2. కూర్చు- కవి పద్యాలు అల్లుచున్నాడు.

అల్వరించు : ద్వ. స. క్రి. అలవరించు, అలవాటుజేసికొను. నిర్వ. 1. ఆ.

అలోలక్ష్మణాయను : దే. అ. క్రి. ఉస్సురను, 2. బాధపడు.
3. రోదించు.

అళికించు : దే. స. క్రి. భయపెట్టు, హింసించు.

అళుకుమాలు : దే. అ. క్రి. నిర్భయమగు.

అళువుసేయు : దే. స. క్రి. అగడుసేయు, అల్లరిపెట్టు.

అవకతవకయగు: దే. అ. క్రి. తారుమారగు, చెడు.

అవకర్ణించు : సం. స. క్రి. పెడచెవినిపెట్టు, నిర్లక్ష్యముచేయు.
భార. ఆది. 2. ఆ. ఆది. 8. ఆ.

అవగణించు : సం. స. క్రి. అలక్ష్యముచేయు.
అవగమించు : సం. స. క్రి. తెలిసికొను.
అవగాహించు : సం. అ. క్రి. మునుగు.
2. ప్రవేశించు, చొచ్చు. వరా. 2. ఆ.
స. క్రి. ఆకళించు, తెలిసికొను. కాశీ. 3. ఆ.
అవగాహనముచు: సం. స. క్రి తీర్థమాడించు. కు. సం. 12_27.
అవఘళించు : దే. అ. క్రి. 1. ప్రసరించు, వ్యాపించు. కాశీ.1 ఆ.
2. స్పర్థసేయు, ప్రతిఘటించు.
కాశీ. 2. ఆ. నై. 1. ఆ.
స. క్రి. అతిశయించు, మీఱు.
హరి. పూ. 8 ఆ. 4. స్వా. 3. ఆ.
అవతరించు : సం.అ.క్రి. 1. తీరమునుండి నదిమొ॥వాని లోనికిదిగు,
వాహనాదులనుండి దిగు.ఉ.హరి.1.ఆ.
2. దేవతాదులు భూలోకమున జనించు.
అవతరిల్లు : సం. అ. క్రి. అవతరించు.
అవతారమగు : }
అవతారమందు: } సం. అ. క్రి. అవతారమెత్తు.
అవతారించు : సం.అ.క్రి. అవతరించు, దేవతాదులు భూలోకమున
బుట్టు. (శ్రీ)రంగ. మా. 10. ఆ.
అవదూరు : మి. స. క్రి. అపదూరు, వృథాగా నిందించు,
అవధరించు : సం. అ. క్రి. హెచ్చరికపడు, శ్రద్ధవహించు, సావ
ధానుడగు. దశ. 2. ఆ.
స. క్రి. చిత్తగించు, విను. భార. విరా. 1 ఆ.
3. నిశ్చయించు, ధరించు. స్వా. మను. 3 ఆ.
(అవధారు.)
అవధారు : సం. అ. క్రి. సావధానముగా చిత్తగించు; గ్రంథా
దులు రచించు. హర. 12.

అవధిఁబెట్టు : మి. స. క్రి. శ్రమపెట్టు, ఆజ్ఞపెట్టు. ఆము. 5. ఆ. ఎల్ల యేర్పఱచు.

అవధిబోవు : మి. అ. క్రి. 1. అంతమునందు, నశించు. హరి. పు. 5. ఆ.
2. కష్టమునందు, బాధపడు. భార. విరా. 1. ఆ.

అవమతించు : మి. స. క్రి. అవమానించు.

అవమానపడు : మి. అ. క్రి. భంగపడు, అవమానమునొందు.

అవమానపఱచు: మి. స. క్రి. అవమానపడు ప్రే. అవమానముచేయు, తిరస్కరించు.

అవమానపెట్టు: మి. స. క్రి. భంగపఱచు, అవమానపఱచు, అవమానించు.

అవమానించు : సం. స. క్రి. అవమానపఱచు, పరాభవించు.

అవయమగు : దే. స. క్రి. ఉచితమగు, తగు. కు. సం. 9.

అవరోధించు : సం. స. క్రి. నిరోధించు, అడ్డగించు, ముట్టడించు. భార. ఆర. 1 ఆ.

అవలంబించు : సం. స. క్రి. ఆశ్రయించు. ఊతగాకొను.

అవలుంచించు : సం. స. క్రి. త్రెంచు, కత్తిరించు, భార. ఆర. 3 ఆ.

అవలోకించు : సం. స. క్రి. 1. వీక్షించు, 2 గ్రంథాదులను పరిశీలించు, విచారించు.

అవశేషించు : సం. అ. క్రి. శేషించు, మిగులు.

అవసరంబను : మి. అ. క్రి. సమయ మనిచెప్పు. కు. సం. 9–39.

అవసరంబిచ్చు : మి. అ. క్రి. దర్శనమిచ్చు.

అవసరమిచ్చు : మి. అ. క్రి. దర్శనమిచ్చు. –అవసరంబిచ్చి శివుడు బ్రహ్మాదిదేవతల గారవించె.

అవస్థపడు : మి. అ. క్రి. బాధపడు.

అవస్థపెట్టు : మి. స. క్రి. బాధపెట్టు.

అవస్థలపొలగు: మి. అ. క్రి. స్థితిభేదముపొందు. 2. కష్టములకుచిక్కు
అవాయియగు : అన్య. దే. అ. క్రి. నదంతి ప్రబలు.
అవియఁబడు : దే. అ. క్రి. అవియు. (కర్త్రర్థమునఁ బడు).
అవియబారు : దే. అ. క్రి. అవియు.
అవియు : దే. అ. క్రి. (తెలం)నీరగు.2.పాలు, మొ॥విరిగిపోవు.
3. వేడికి మెత్తనగు. 4. కాలి బొబ్బలెత్తు. (నె జి.)
1. పగులు, భార. భీష్మ. 1. ఆ.
2. నొచ్చు, బాధపడు.
భార. భీష్మ. 1. ఆ.
3. పైకినిగిడివచ్చు, విచ్చు
భార. ఉద్యో. 4. ఆ.
4. చెడు.
అవు : దే. అ. క్రి. అగు. 1. కలుగు. భార. ఆది. 8. ఆ.
2. శక్యమగు. భార. ఆది. 2.ఆ.
3. పరిణమించు, అయియుండు.
భార. శాం. 1 ఆ.
అవునవిపించుకొను: దే. అ. క్రి. ప్రశంసకొను, అంగీకారమునుపొందు
అవులబెట్టు : దే. స. క్రి. పోద్రోలు, పరిత్యజించు.
అవులు : దే. అ. క్రి. ఔలు. (అములు) క.వ.రా. యు.కాం.
అవేక్షించు : సం. స. క్రి. చూచు.
అవ్వలద్రోలు : దే. స. క్రి. తిరస్కరించు,
అవ్వలికించు : దే. స. క్రి. పైకి త్రోసివేయు, చెఱగు. దశ. 10
అష్టాంగమెఱగు: మి. స. క్రి. సాష్టాంగపడు.
అసటపెట్టు: దే. స. క్రి. బురదలోపెట్టు, కీడుపఱచు.
అసడ్డసేయు : దే. స. క్రి. ఉపేక్షించు (నె. జి.)
అసమడించు : దే. స. క్రి. లెక్కబెట్టు, క. వ. రా. యు. కాం.
అసమెకు్క : దే. అ. క్రి. ప్రసిద్ధికెక్కు.

అసరవేయు : దే. అ. క్రి. ఆలస్యముచేయు. శ.ర.
అసలాడు : దే. అ. క్రి. అతిశయించు. భార. అను. 2. ఆ.
అసలుకొను : దే. అ. క్రి. బురదయగు, బురదచేయు.
అసలుకొలుపు: దే. స. క్రి. ప్రే. బురదకలదిగాఁ జేయు.
అసలుద్రొక్కు : దే. స. క్రి. ప్రే. గోడకట్టుటకు పేడ, మన్ను, బూడిద కలిపి త్రొక్కు.
అసలు మసలు : దే. అ. క్రి. అలరారు, శోభిల్లు.
అసహ్యపడు : మి. అ. క్రి. ఈర్ష్యపడు. 2. అసూయపడు 3. రోతపడు
అసహ్యించు : సం. అ. క్రి. అసహ్యపడు.
అసహ్యించుకొను: మి. స. అ. క్రి. అసహిష్ణుతచూపు.
అసికి పోవు: దే. అ. క్రి. పైకి పొక్కకుండు, కామాపగు.
అసిబోవు : దే. అ. క్రి. (అసి + పోవు) తప్పిపోవు. రామా. 2. ఆ.
అసియాడు : దే. అ. క్రి. (అసి + ఆడు) 1. చలించు, నడకు. నై. 6ఆ. 2. బెదరు, సడలు, విజ. 1 ఆ. 3. తిరుగు, సంచరించు రామా. 2. ఆ
అసియార్చు : దే. స. క్రి. కదలునట్లుచేయు. అసియాడఁజేయు కాశీ. 7. ఆ.
అసివారుపోవు : దే. అ. క్రి. విహారముచేయు
అసివోవు : దే. అ. క్రి. 1. పోవు, నశించు, వరాహ. 8. ఆ. 2. తప్పిపోవు, దశ. 4. ఆ
అసురుసురగు : దే. అ. క్రి. నలగు, శ్రమచెందు
అసురుసురుమను: దే. స. క్రి. శపించు, బాధతో తిట్టు
అస్తమించు : సం. అ. క్రి. 1. అడగు. 2. కనపడకపోవు
అస్తవ్యస్తమగు: సం. అ. క్రి. తారుమారగు

అస్తుపిస్తగు : దే. అ. క్రి. అస్తవ్యస్తసుగు 2. తారుమారగు.
అస్తోపిస్తగు : దే. అ. క్రి. అటో ఇటో తేలని స్థితి యేర్పడు.
అహంకరించు: సం. అ. క్రి. గర్వించు. భార. అర. 5. ఆ. శివ. రా. 1 ఆ.
అహంకారించు: సం. అ. క్రి. అహంకరించు.
అహంభావముకనబఱచు: } సం. అ. క్రి. గర్వించు
అహంభావముచూపు : }
అహమించు : సం. అ. క్రి. గర్వించు జై. 2. ఆ.
అహంకారుడగు: సం. అ. క్రి. గర్వముకలవాడగు. వి. పు. 5. 23.
అహంబ్రహ్మభవించు : సం. అ. క్రి. నేనే బ్రహ్మమును అని అనుకొను.
అహోయను : సం స. క్రి. ఔనను, సమ్మతించు. సారంగ. 2. 121
అహోరించు : } మి. అ. క్రి. 1. ఏడ్చు
అఘోరించు : } 2. వ్యర్థమగు పని చేయు

# ఆ

ఆంకగొను : దే. స. క్రి. ఆజ్ఞగొను.
క. ఆంకగొన కుభయబలములు
పొంకం బటి. కు. సం. 12 ఆ.
(ఆఁక శబ్దమునకు పూర్ణబిందు రూపమునకు నిర్ధారకము.)

ఆందోళపడు : సం. అ. క్రి. 1. వ్యాకులపడు.
2. డోలాయమాన మానసుడగు.

ఆందోళించు : సం. స. క్రి. 1. ఆందోళనచేయు.
2. ఊగులాడు.
3. ఊగించు. (నె. జి.)

ఆంధ్రించు : సం. స. క్రి. తెనుగు చేయు.

ఆంధ్రీకరించు : సం. స. క్రి. తెనుగున ననువదించు.

ఆంధ్రీకృతమగు: సం. అ. క్రి. తెనుగుగా నగు.

ఆఁకగొను : దే. అ. క్రి. 1. నిరోధమొందు. 2. ఆఁగు.

ఆఁకగొలుపు . దే. స. క్రి. ఆకర్షించు. ఉ. హరి. 1. ఆ.

ఆఁకట్టు : దే. స. క్రి. (ఆక + కట్టు)
1. అడ్డగించు, నిరోధించు. కవి క. 4 ఆ. నీలా. 2ఆ.
ఇట వ్యాపించు అనవచ్చును.
2. ఉపయోగింపక నిలువయుంచు.
వ్యవ. ఆ పదార్థమంతయు నీకై ఆఁకట్టియుంచితిని.

ఆఁకట్టుకొను : దే. అ. క్రి. సొంతమునకు దక్కించుకొను.

ఆఁకను బెట్టు : దే. స. క్రి. ఆజ్ఞపెట్టు. విప్ర. 5 ఆ.

ఆఁకపడు : దే. అ. క్రి. 1. అడ్డునొందు.
2. ప్రతిహతమగు. రా. కిష్కిం.

ఆఁక(వె)పెట్టు: దే. స. క్రి. 1. ఆఁకిడు,
2. అడ్డగించు. రా.యు.కాం.కళా.5ఆ.

ఆఁకలువిడుచు: దే. అ. క్రి. బంధనములు విడుచు.
"ఆ నాల్గుమేఘూలనాఁకలు విడిచి భూనాథ! పనుపుము." చా. చ. 3. ఆ.

ఆఁకించు : దే. స. క్రి. నిరోధించు.

ఆఁకిడు : దే. స. క్రి. (ఆఁక + ఇడు) 1. అడ్డగించు.
2. ఆఁకపెట్టు. భార.ఉద్యో. 3 ఆ.కాశీ.7ఆ.

ఆఁకొను : దే. అ. క్రి. (ఆఁకలి + కొను) ఆకలిజెందు.
భార. ఉద్యో. 3 ఆ. భాగ. 10. పూ.

ఆఁగించు : దే. స. క్రి. ఆగునట్లుచేయు.

ఆఁగికొను : దే. స. క్రి. 1. అడ్డుకొను.
2. నిరోధించు. దశ. 5 ఆ.

ఆఁగు : దే. అ. క్రి. 1. నిరుద్ధమగు, అణఁగు;
2. తాళు; ఓపు.
వ్యవ. ఆబాధకు వాఁడాగలేక పాఱిపోయెను
3. సమర్థుడఁగు.
4. నిలఁబడు. భార. భీష్మ. 2 ఆ.
విరా. 3 ఆ.

ఆఁగు : దే. స. క్రి. 1. అడ్డగించు, ఆవు - గోవులనెట్టు లాగితివి. భార. విరా. 3 ఆ. రామా. 8 ఆ.
2. నిషేధించు. భార. ఆది. 3 ఆ.
3. రాజ పురుషాజ్ఞచేత నిలువఁజేయు, పోకుండనాపు. విజ్ఞా. వ్యవ.
4. మోచు; వహించు.
భాగ. 10 స్కం.
5. కాపాడు.

ఆఁగు :
6. ముట్టడిచేయు.
7. ఆక్రమించు.
8. నివారించు.

ఆఁగుదెంచు : దే. అ. క్రి. ఆఁగు.

ఆఁచికొట్టు : దే. స. క్రి. నిదానించి కొట్టు.

ఆఁచికొను : దే. అ. క్రి. 1. నాచికొను.
2. అపహరించుకొను. హరి. ఉ. 6ఆ.
(పాఠాం.) చూరాడికొను

ఆఁచు : దే. స. క్రి. ఆగు ధాతువు ప్రేరణార్థకము.
1. ఆగఁజేయు. కళా. 1 ఆ.
ఇట అణగించు అని యర్థము.
2. నిలుపు.

ఆఁటగు : దే. అ. క్రి. చాలు.

ఆఁటు : దే. అ. క్రి. 1. సమృద్ధమగు. యయా. 1 ఆ.
2. తాళు. రాఘ. 2 ఆ.
3. సరిపోవు. (ఆఁటివచ్చు.)

ఆఁటుగొను : దే. అ. క్రి. వెనుదీయు, తాళు.
ఆఁటుగొన్న సముద్రంబు పోటుగొనదె.

ఆఁటువచ్చు : దే. అ. క్రి. సరిపోవు.

ఆఁపు : దే. అ. క్రి. ఆగు ధాతు ప్రేరణార్థకము.
పండి. పురా.

ఆఁపివెట్టు :
ఆఁపు(పి)వెట్టు: } దే. స. క్రి. 1. ఒకరిని నిలిపిపెట్టు.
2. ప్రత్యేకముగా నేర్పఱచియుంచు.

ఆఁపుసేయు : దే. స. క్రి. 1. నిరోధించు, అప్పగించు, అని. 3 ఆ.
2. నిలుపు; నిల్వఁజేయు, ఆకట్టుకొను,
ఇతరులను రాకుండ నడ్డగించు;

ఆకంపించు : సం. అ. క్రి. 1. మిక్కిలి కంపించు. మార్క. 7 ఆ.
2. కొంచెము కంపించు; సంక్షోభము నొందు.

ఆకర్ణించు : సం. స. క్రి. విను. భాగ. 8 స్కం.

ఆకర్షించు : సం. స. క్రి. లాగు, అభిముఖునిగా చేయు.

ఆకలించు : వై. స. క్రి. ఆకళించు, అవగాహనము చేసికొను. రాఘ. 1 ఆ. ప్రభా. 4 ఆ.

ఆకాంక్షించు : సం. స. క్రి. వాంఛించు, కోరు.

ఆకారించు : సం. స. క్రి. పిలుచు, ఆహ్వానించు, కూపుకట్టు.

ఆకుపోయు : దే. స. క్రి. నారుపోయు, వరిమొదలగు వాని మొక్కలు మొలచుటకై మండిలో చల్లు.

ఆకులంబగు : మి. అ. క్రి. కలతపడు.

ఆకులపడు : మి. అ. క్రి. (ఆకులము + పడు) ఆకులత చెందు, కలవరపడు.

ఆకులు వేసికొను: దే. అ. క్రి. తాంబూలము వేసికొను. హంస. 1 ఆ.

ఆక్రందించు : సం. అ. క్రి. 1. మొఱపెట్టు. 2. ఏడ్చు.
సం. స. క్రి. పిలుచు.

ఆక్రమించు : సం. స. క్రి. 1. అడుగు; మార్కొను. (యుద్ధమునకు) భార. ఆది. 7ఆ. శల్య. 1ఆ.
2. బలాత్కారమున పట్టుకొను. భార. విరా. 3 ఆ.
3. వశపఱచుకొను; స్వాధీనముచేసికొను. మార్క. 6ఆ.
4. అతిక్రమించు; దాటు. భార. ఉద్యో. 1 ఆ.
5. పోవు, ఆవేశించు. భార. అర. 2ఆ.

ఆక్రోశించు : సం. స. క్రి. 1. తిట్టు. 2. శపించు, 3. ఉద్ఘోషించు 4. చాటు. కాశీ. 2 ఆ.

ఆక్షేపించు : సం. స. క్రి. 1. అడ్డగించు,
2. తిరస్కరించు: దూఱు.
భార. ఆది. 9 ఆ.
3. ఆకర్షించు.
4. ఎత్తిపొడుచు: దోషము లెంచుచు అను.
5. చిమ్ము. కు. సం. 8 ఆ.

ఆగడము సే(చే)యు: దే. స. క్రి. రట్టుచేయు; అల్లరిచేయు.

ఆగడించు : దే. స. క్రి. 1. ఆగడముచేయు. 2. బాధించు.
3. ఉపద్రవము నొందఁజేయు.
పండి. మహిమ.

ఆగఁబట్టు : దే. స. క్రి. 1. ఆపు 2. నిలుపుచేయు.

ఆగముచేయు : దే. స. క్రి. 1. అల్లరిచేయు, 2. పాడుచేయు,
3. వెదచల్లు 4 వ్యర్థముచేయు. (నె.జి.)

ఆగిచేయు : దే. స. క్రి. వ్యవ. యాగీచేయు. అల్లరిపెట్టు (నె.జి.)

ఆగివచ్చు : దే. అ. క్రి. కొన్నిరోజులపాటు ఒదిగినచ్చు, ఆటెనచ్చు.

ఆగుబ్బతిలు : దే. అ. క్రి. అతిశయించు.

ఆగుబ్బుకొను : దే. అ. క్రి. అతిశయించు. భాగ. 7 స్కం.

ఆగుబ్బులురేఁగు: దే. అ. క్రి. అతిశయముగాను.

ఆగ్రహించు : సం. స. క్రి. 1. కోపించు. మార్క. 7 ఆ.
2. చలపట్టు, అభినివేశమునొందు,
భార. కర్ణ. 2 ఆ.

ఆఘాతించు : సం. స. క్రి. 1. వధించు, చంపు.
2. కొట్టు, పడగొట్టు. హరి.ఉ.7 ఆ.

ఆఘోషించు . సం. అ. క్రి. 1. అఱచు. ఉ. హరి. 6 ఆ.
2. మ్రోయు, జై. 6 ఆ.
స. క్రి. 3. చాటు, ప్రకటించు.

ఆఘ్రాణించు : సం. స. క్రి. మూచూచు, మూర్కొను, వాసన చూచు. పాండు. 3 ఆ.

ఆజ్ఞచేయు : మి. స. క్రి. ఆజ్ఞాపించు, వధించు.
ద్వి.........మాయావి
రాచవారల మును వీడు వధియించినాఁడు
కావున వీని వేగమె యాజ్ఞచేసి
నే నత్తు. క. న. రా. ఆర.

ఆజ్ఞపడు : మి. అ. క్రి. ఆజ్ఞాబద్ధుఁడగు; ఆజ్ఞపొందు, కేయూర. 1 ఆ.

ఆజ్ఞపె(వె)ట్టు : మి. స. క్రి. ఆజ్ఞచేయు.

ఆజ్ఞాపించు : సం. స. క్రి. ఆజ్ఞాపనముచేయు, ఆనతిచ్చు

ఆచమించు : సం. అ. క్రి. చూపుడువ్రేలు పైకి విడిచి, నడిమి వ్రేలి మొదటికి బొటనవ్రేలి చివరచేర్చి, పట్టిన పుడిసిలిలో జలము గ్రహించి మూఁడుసార్లు లోపలికి పుచ్చుకొను; ఆచమనముచేయు. భార. ఆది. 6 ఆ.

ఆచరించు : సం. స. క్రి. నడుపు, చేయు. చూ. ఆచారము.

ఆచారమెఱుఁగు: సం. స. క్రి. చేయవలసిన పనిచేయు; పని తెలిసికొను

ఆచికొట్టు : దే. స. క్రి. గట్టిగాకొట్టు.

ఆచికొను : దే. స. క్రి. దక్కించుకొను; వశపఱచుకొను.

ఆచూకితీయు :
ఆచూకీతీయు : } దే. స. క్రి. జాడతీయు, కనిపెట్టు.

ఆచూచు : దే. స. క్రి. లోని గుణము చూచు.
"కుట్టి యాచూడఁగ దోసకాయవె" హర.వి.2 ఆ.

ఆచోకితీయు : దే. అ. క్రి. ఆచూకీతీయు.

ఆచ్ఛాదించు : సం. స. క్రి. కప్పు.

ఆనందించు : సం. అ. క్రి. సంతోషించు; సంతసించు.
స.క్రి. 1. ఆనందింపఁజేయు.
భార. సభా. 2 ఆ.
2. స్తుతించు. వసు. 1 ఆ.

ఆనకట్టు : దే. అ. క్రి. ముల్లువిఱిగి చర్మముమీఁద కాయనగా నేర్పడు.

ఆనకట్టు : దే. అ. క్రి. ఏటికి అడ్డముగాకట్ట కట్టు. (నె.జి)

ఆనకపోవు : దే. అ. క్రి. ఆను. వ్యతి లెక్కలోపడకపోవు.
ఉదా. కంటి కానదు (వ్యవ.)

ఆనతి(యి)చ్చు: దే. అ. క్రి. (ఆనతి + యిచ్చు) సెలవిచ్చు; దయతో చెప్పు. కళా. 4 ఆ.
ఆజ్ఞాపించు. భార. ఆది. 2 ఆ.

ఆనపెట్టు : దే. స. క్రి. ఆజ్ఞాపించు; ఆజ్ఞపెట్టు; ఒట్టుపెట్టు.

ఆనపొడుచు : దే. స. క్రి. ఆజ్ఞపెట్టు, ఆజ్ఞాపించు. ప్రభా. 5 ఆ.

ఆనయించు : సం. స. క్రి. 1. తెచ్చు.
2. తెప్పించు భార. అర. 6 ఆ.

ఆనవాలుపట్టు : దే. స. క్రి. గుర్తించు; చిహ్నములచే తెలిసికొను.

ఆనవైచు : దే. అ. క్రి. ఒట్టువేయు, ఆనపెట్టు.

ఆనపో(వో)వు : దే. అ. క్రి. ప్రమాణములుచేయు; ఒట్టువేసికొను.
సీ. కాబోలు నని విన్న కన్నవా రెన్న నే
ర్పున గని యానలు వోయివోయి.
నిరం. 2. ఆ.

ఆను : దే. అ. క్రి. 1. ఆనికయగు; అంటియుంచు.
ఉదా. ఆపూలము గోడలమీఁద
ఆని యున్నది.
2. ఒఱఁగు, ఆతలగడమీఁద ఆని
కూర్చుంటిని.

ఆనుకొను : దే. స. క్రి. 1. ఆశ్రయముగాఁ జేసికొను.
2. ఊఁతగాఁ జేసికొను.

ఆనుపానులు తెలియు: దే. అ. క్రి. గుట్టుమట్టులు తెలియు.

ఆపసోపాలుపడు : దే. అ. క్రి. ఆయాసపడు, (అన్యదే).
తెచ్చికోలు ఆయాసము ప్రదర్శించు.

ఆపాదించు : సం. స. క్రి. 1. ఆపాదిల్లఁజేయు; కలిగించు.
2. చేయు. భార. విరా. 3 ఆ.
3. ఉపపాదించు, తెలుపు. నరస. 2 ఆ.

ఆపాదిల్లు : సం. అ. క్రి. కలుగు.

ఆప్తీకరించు : సం. స. క్రి. ఆప్తునిగఁజేసికొను, దగ్గఱకుచేర్చుకొను.
ద్వి. అంటియుఁ దాశరథాకు జలమ్ము
లంటని గతియెంత యాప్తీకరించి
నడిపిన మదిలోన నానీదు చెలిమి.
క. వ. రా. యుద్ధకాం.

ఆపుచేయు : దే. స. క్రి. నిలుపుదల చేయు.

ఆపోవకపోవు : దే. అ. క్రి. దాహము తీఱకపోవు (వ్యతిరేకార్థమున ప్రయోగము.

ఆపోవు : దే. అ. క్రి. (ఆదట+పోవు) తనియు; తృప్తిపడు.
భార. ఆది. 8 ఆ. ఉద్యో. 2 ఆ.
సంతృప్తిపడు (తెలం)

ఆపోశనించు : సం. స. క్రి. 1. ఆపోశనముపట్టు; త్రాగు.
ఆము. 5 ఆ.
2. అన్యాయముగా ఒకరి ఆస్తిని
అపహరించు. (వ్యవ).

ఆపోశనముపట్టు : సం. స. క్రి. ఒక విషయమును ముఖ్యముగా
శాస్త్రము మొదలగు విద్యా విషయమును క్షుణ్ణముగా నభ్యసించు.

ఆబపడు : దే. అ. క్రి. పేరాసనొందు.

ఆబరించుకొను : దే. స. క్రి. సముకూర్చుకొను షోడ. 5. ఆ

ఆబోరుదక్కించు: అన్య. దే. స. క్రి. 1. పరువునిలువబెట్టు
2. గౌరవమర్యాదలుకాపాడు.

ఆమంత్రణముసేయు : మి. స. క్రి. 1. సాగనంపు; వీడుకొలుపు, భార. ఉద్యో. 3. ఆ
2. ప్రయాణకాలమున అనుమతి బొందు భార. ఉద్యో. 4. ఆ
3. ఆమంత్రించు, వీడ్కొను. భార. ఉద్యో. 2. ఆ

ఆమంత్రించు : సం. స. క్రి. 1. అనుమతించు; పిలుచు
2. వీడ్కొను; పోయివచ్చెద నని చెప్పి విడిచిపెట్టు. హర. వి.4. ఆ.

ఆమంబులుసేయు: దే. స. క్రి. అపక్వముగానుంచు

ఆమతించు : వై. స. క్రి. 1. పిలుచు; భార. ఆర. 6. ఆ
2. సత్కరించు; పూజించు; అచ్చరా. బాల.
3. అప్పనముసేయు. మార్కం.1. ఆ
4. అతిశయించు, భాగ. 10. స్కం.

అ. క్రి. పుట్టు. కలుగు

ఆమతికొల్పు: దే. స. క్రి. నెలకొల్పు.

ఆమతిల్లు: వై. అ. క్రి. పుట్టు. – ఇంపామతిలంగ నిల్ప – యయా.1. ఆ.

ఆమికొను : / ఆముకొను : } దే. అ. క్రి. 1. మదించు. హరి. పూ. 7. ఆ.
2. హెచ్చు, అతిశయించు. క్షేత్రయ.శ.ర.
3. కవియు; పైకొను. కృ. శకుం. 3. ఆ.

ఆముకవియు : దే. అ. క్రి. 1. మదించు: మదమెక్కు. సారం. 1.ఆ.
2. మిక్కిలి క్రమ్ముకొను. రామా.6 ఆ.
ఆమువలచు : దే. అ. క్రి. ఆమెక్కు
ఆమెక్కు : దే. అ. క్రి. ఆముకొను
ఆమెత(పె)వెట్టు : దే. స. క్రి విందుచేయు
ఆమోదించు : సం. అ. క్రి. 1. సంతోషించు; సంతసించు
2. పరిగ్రహించు, అంగీకరించు
ఆమ్రేడించు : సం. అ. క్రి. ద్విరుక్తమగు పా. 5 ఆ
ఆయత్తపడు : మి. అ. క్రి. సిద్ధమగు. సిద్ధపడు.
రం. రా. ఉ. 145 పు. సా. 2 ఆ.
ఆయతించు దే. స. క్రి. విస్తరింపఁజేయు
ద్వి. ఇది దేశ మిది కాల మిది సేఁతయనుచు
మదిఁ దలంపక తాను మది నెంచినట్లు
సేయు నాతని పనుల్ చెడు మత్తచిత్తు
డాయతించిన హావి రన్నంబునట్ల
క. వ. రా. యు.
ఆయతిచూపు : వై. స. క్రి. విస్మృతినెఱపు
ఆయపఱచు : దే. స. క్రి. సాగుబడిచేయు
ఆయమెఱుఁగు : దే. స. క్రి. ఆదాయము తెలిసికొను, చా. మ.
ఆయువారమెత్తు: దే. స. క్రి. ఇంటింట బిచ్చమెత్తు. మించు.
ఆయాసపడు . మి. అ. క్రి. (ఆయాసము + పడు) శ్రమపడు
ఆయాసపెట్టు : మి. స. క్రి. (ఆయాసము + పెట్టు) శ్రమపఱచు
ఆయికము వెట్టు: దే. స. క్రి. అడుమానము పెట్టు; కుదువబెట్టు
ఆయితపడు : దే. అ. క్రి. (ఆయితము + పడు) సిద్ధపడు
ఆయితపెట్టు : దే. స. క్రి. (ఆయితము + పెట్టు) సిద్ధముచేయు
విజ. వి. 2 ఆ.
ఆయిత్తపడు : దే. అ. క్రి. (ఆయిత్తము + పడు) ఆయితపడు. సా.1ఆ

ఆయివెట్టు : దే. స. క్రి. 1. ఆవిరికి ఉడికించు.
2. జ్వరాదులు దిగుటకు కృత్రిమ స్వేదము గలిగించు.

ఆయోజించు : సం. అ. క్రి. మిక్కిలి ఆలోచించు.

ఆరంభించు : సం. అ. క్రి. ప్రారంభించు; యత్నించు, కడగు మొదలుపెట్టు, ఉపక్రమించు.

ఆరగించు : వై. స. క్రి. (ఆహరించు).
1. భుజించు. భార. ఉద్యో. 3 ఆ.
2. త్రాగు. హరి. పూ. 5 ఆ.
శేష. 3 ఆ. శ. ర.

ఆరగింపుచేయు: దే. స. క్రి. దేవునికై నైవేద్యము పెట్టు.

ఆరగూరు . దే. అ. క్రి. నిండు.

ఆరచించు : సం స. క్రి. రచించు; ఏర్పఱచు.

ఆరటపడు : దే. అ. క్రి. (ఆరటము + పడు) నందురు; పరితపించు.

ఆరటపఱచు : దే. స. క్రి. ఆరటపెట్టు.

ఆరటపెట్టు : దే. స. క్రి. (ఆరటము + పెట్టు) పరితపింపఁజేయు.
భార. ద్రోణ. 4 ఆ.

ఆరటించు : దే. అ. క్రి. ఆరటపడు; పరితపించు.
ఆవద్రాగినవానికరణి నారటించుచు.
సా. 3 ఆ.

ఆరఁబండు : దే. అ. క్రి. 1. మిగుల నుగ్గు, పరిపక్వస్థితికి వచ్చు.

ఆరబముసేయు: దే. అ. క్రి. ప్రారంభించు.

ఆరబాఱు : దే. అ. క్రి 1. వ్యాపించు. క. వ. రా. ఆర.
2. ఎండిపోవ నారంభించు.

ఆరఁబెట్టు : దే. స. క్రి. 1. ఎండవేయు (బట్టలు).
2. పిండి మొదలగువస్తువులు ఎండలో బెట్టు.

ఆరయు : దే. స. క్రి.
1. వెదకు. భార. ఉద్యో. 1 ఆ.
2. విచారించు; ఆలోచించు.
భార. ఉద్యో. 3 ఆ.
3. తెలిసికొను; గ్రహించు.
భార. ఆది. 6 ఆ.
4. చూచు
5. రక్షించు; కాపాడు.
భార. ఆది. 4 ఆ.

ఆరవేయు : దే. స. క్రి. ఎండవేయు.

ఆరాటపడు : దే. అ. క్రి. ఆరటపడు 1. బాధపడు, ఆయాసపడు.

ఆరాటించు : దే. అ. క్రి. ఆరటపడు; తపించు; దుఃఖపడు.

ఆరాతీయు ; దే. అ. క్రి. కూపులుతీయు; గుట్టు కనుగొను; ఆనూకీతీయు.

ఆరాధించు : సం. స. క్రి. 1. సంతోషపఱచు.
2. పూజించు.
3. సేవించు.

ఆరముగ్గు : దే. అ. క్రి. మిక్కిలి పరిపక్వస్థితికి వచ్చు.

ఆరించు : దే. స. క్రి. ఎండునట్లుచేయు.

ఆరితేఱు : దే. అ. క్రి. దిట్టరియగు; అనుభవముకలవాడగు.
హంస. 5 ఆ.

ఆరు : దే. అ. క్రి. 1. కలుగు; జనించు. భార. కర్ణ. 3 ఆ.
భార. శాంతి. 1 ఆ.
2. ఒప్పు; మనోహరమగు.
భార. ఆది. 3 ఆ. భార. ద్రో. 1 ఆ.
3. నిండు; పూర్ణమగు.
భార. అశ్వ. 4 ఆ.

ఆరునూరగు: దే. స. క్రి. తలక్రిందగు; ఏది యేమైన నగు.
ఆరునూరునూరారగు: (అయినను) దే. అ. క్రి. ఏమి సంభవించినను.
ఆరుపోరులేకపోవు; దే. అ. క్రి. పోబడి (జాడ) తెలియకపోవు.
ఆరుమూ(డగు: దే. అ. క్రి. 1. వ్యర్థమగు.
2. సగానికి సగమగు.
ఆరుమూళ్ళగు: దే. అ. క్రి. ఆరుమూ(డగు.
ఆరోగ(గి)ణ మొనర్చు: దే. స. క్రి. భుజించు.
ఆరోపించు: సం. స. క్రి. 1. ఇతరులపైని లేనిది మోపు.
సా. 2 ఆ.
2. ఒక పదార్థమును మఱియొక పదార్థముగా చెప్పు.
ఆరోహించు: సం. స. క్రి. ఎక్కు. నై. 1 ఆ.
ఆరోహింపించు: సం. స. క్రి. ఆరోహింప(జేయు. కవి. 2 ఆ.
ఆర్చు (రూ.) ఆరుచు: దే. అ. క్రి. అఱచు.
1. (జంతువులు) కూయు.
2. (ఉత్సాహాదులవలనబిగ్గఱగా చెప్పు, కేకలు వేయు. భార. అశ్వ 3 ఆ.
3. యోధులు మొ॥ వారు బొబ్బలు పెట్టు, బొబ్బరించు, ఘోషించు.
భార. ద్రో. 5 ఆ. భార. ఆది. 6 ఆ.
స. క్రి. I ఆడుధాతువు యొక్క ప్రేరణరూపము రూ. ఆడించు
1. కదలు నట్లుచేయు
2. నాట్యమాడ(జేయు
భార. ఉద్యో. 2. ఆ. శాం. 1. ఆ
3. విసనకఱ్ఱ మొ॥ నవి వీచు; విసరు;
ఆము. 2. ఆ.

ఆర్చు : 4. జూదమాడించు, భార. ఉద్యో. 3ఆ.
5. పలుకునట్లుచేయు, భార. విరా. 2 ఆ.
6. (బాణములు) వేయు; ఏయు;
ప్రయోగించు భార. భీష్మ. 1 ఆ.
**II** ఆఱుధాతువు ప్రేరణము, ఆఱుచు; ఆరజేయు.
1. (దీపము) ఆఱిపోవునట్లుచేయు
నై. 7 ఆ.
2. తడిలేకుండఁగఁజేయు. పారి. 2. ఆ.
3. అణగించు; క్షీణింపఁజేయు.
భార. అశ్వ. 4. ఆ.
4. స్నానాదులు చేయించు
5. కను ఱెప్పలు కదలించు

ఆర్భటించు : సం. అ. క్రి. ఆర్భాటించు; డాబుచేయు.

ఆర్భాటముచేయు: సం. అ. క్రి. 1. అనవసరముగా అధికప్రయత్నము చేయు.
2. హడావడిచేయు

ఆర్జించు : సం. స. క్రి. సంపాదించు; గణించు

ఆఱడిచేయు : దే. అ. క్రి. వ్యర్థముచేయు,

ఆఱడిపడు : దే. అ. క్రి. 1. దూఱుపడు, నిందపడు
2. వ్యర్థమగు. రామా. బాల.
3. నాశముచెందు; హానిచెందు
రా. కిష్కిం.

ఆఱడిపుచ్చు : దే. స. క్రి. 1. ఆఱడిపోవఁజేయు.
2. వ్యర్థముచేయు. భార. విరా. 2 ఆ.
3. భంగపఱచు; హంస. 1 ఆ.
4. హింసించు; చంపు

ఆఱడి పె(వె)ట్టు: దే. స. క్రి. వ్యర్థముచేయు, నిందమోపు.

ఆఱడిపో(వో)వు: దే. అ. క్రి. 1. నిందపడు, దూఱుపడు. నిర
2. వ్యర్థమగు. భార. అశ్వ.
3. చెడు, భగ్నమగు.
భార. ద్రో.
4. చచ్చు. భార.ఆశ్ర.1 ఆ.పూ

ఆఱు : దే. అ. క్రి. 1. ఉపశమిల్లు.
భార. ఆది. 4 ఆ. ఆర.
2. తడిలేకుండ నగు, ఎండు.
3. నశించు.

ఆఱుచు : దే. అ. క్రి. అఱచు.
స. క్రి. ఆఱు ధా ప్రే. 1. ఉపశమింపఁజే
2. తడిలేకుండఁజేయు; తడియార్చు,
సాసం.
3. నశింపఁజేయు. రూ.

ఆఱుపు : దే. స. క్రి. ఆఱు ప్రే. ఆఱుచు.

ఆఱ్చుకొనిపోవు: దే. అ. క్రి. ఆర్చుకొనిపోవు, చిక్కిపోవు.

ఆఱ్పు : (ఆర్పు) దే. స. క్రి. దీపము నిప్పు మొదలైనవి తీసి
కొంపలార్పు, సుస్థితిని తొలగించ

ఆఱుమూడగు : దే. అ. క్రి. (ఆఱుసంఖ్య మూడుసంఖ్య అగ
1. క్షీణమగు.
2. వ్యత్యస్తమగు (ఆం. శే. 6) "పనియం
ఆఱుమూడైనది." 'అర్మడి' అయినదియ
వాడుక. రూ. అర్మడు.

ఆఱుమూడుచేయు : దే. స. క్రి. (ఆఱుసంఖ్య మూడుసంఖ్యచే
1. క్షీణముచేయు.
2. వ్యత్యస్తముచేయు.

ఆలంబించు : సం. స. క్రి. 1. అవలంబించు; ఊఁదు;
2. ఆశ్రయముగాఁగొను; పట్టుకొను.
3. ధరించు.

ఆలంభించు : సం. స. క్రి. చంపు.

ఆలకించు : వై. స. క్రి. 1. విను. విక్ర. 1 ఆ.
2. ఆదరించు. చంద్రా. 4 ఆ.

ఆలక్షించు : సం. స. క్రి. 1. పాటించు.
2. చూచు; కనుఁగొను.

ఆలఁతిసేయు : దే. అ. క్రి. రాగాలాపన చేయు. కు. సం. 5 ఆ.
హరి. పూ. 8. ఆ.

ఆలపించు : వై. స. క్రి. రాగ మాలాపించు: రాగము పాడు
పాండు. 3. ఆ.

ఆలపుచ్చు : దే. స. క్రి. ఉపేక్షసేయు, తిరస్కరించు

ఆలభించు : సం. స. క్రి. పశువిశసనముచేయు

ఆలముచేయు : దే. స. క్రి. (శబ్దపల్లవము) 1. ఉపేక్షించు;
ఉపేక్షచేయు భార. విరా. 2. ఆ.
2. యుద్ధముచేయు (నె. జి.)

ఆలసించు : వై. అ. క్రి. ఆలస్యముచేయు; తడయు. కళా. 2 ఆ.

ఆలాపించు : సం. స. క్రి. 1 రాగము విస్తరింపఁజేసి పాడు
2. సంభాషించు.

ఆలింగనముచేయు : మి. స. క్రి. కౌగిలించుకొను

ఆలించివిను : దే. స. క్రి. శ్రద్ధతో విను కు. సం. 5. ఆ

ఆలిఁగొను దే. స. క్రి. (ఆలి + కొను) 1. అపహసించు.

ఆలించు : వై. స. క్రి. ఆలకించు
1. విను. విక్ర. 1ఆ.
2. ఆదరించు భార. అర. 2 ఆ.

ఆలిఁజేయు : దే. స. క్రి. 1. భగ్నముచేయు; చెఱచు; కు.సం.4.ఆ.
2. కీడ్పఱచు, నిరసించు, చులుకనగాఁ జేయు. బస. 4 ఆ.
(ఆలిసేయు ముద్రితము)
3. గేలిసేయు

ఆలిఁబుచ్చు : దే.స.క్రి. ఆలిఁబఱచు; అవమానపఱచు. పండి.మహి.
( "ఆలఁబుచ్చితివో" ముద్రితము )
ఆలిఁజేయు మొదలగువానిని బట్టి 'ఆలిఁబుచ్చు' అని గ్రహింపఁ బడినది.

ఆలికించు . సం. స. క్రి. వ్రాయు. శివరా. 2. ఆ.
భార. విరా. 4. ఆ.
2. తక్కువపఱచు; తేలికగాఁజూచు
3. అవమానించు; నిర్వ. 5. ఆ

ఆలిసేయు : దే. స. క్రి. అపహసించు; చెఱచు

ఆలోకించు : సం. స. క్రి. వీక్షించు, చూచు, భార. భీష్మ. 1. ఆ

ఆలోచించు : సం. స. క్రి. యోచించు; మంచిచెడ్డలుపరామర్శించు

ఆలోడించు : సం. స. క్రి. 1. కలుగఁజేయు
2. బాగుగా విమర్శించు; పరిశీలించు
3. మథించు. భార.అను.4 ఆ.కాశీ.3.ఆ

ఆవటంబగు : ఆవటమగు దే. అ. క్రి. తగు; భాసించు
"పూవిలుకాని కెంపుల గొడుగనంగ
నావటం బెంతయు నావటంబయ్యె"
కు. పా. 776.

ఆవటముచేయు: దే. స. క్రి. పొందికపఱచు. పాండు. 2. ఆ.

ఆవటించు : దే. స. క్రి. 1. ఆవటిల్లఁజేయు; పొందుపఱచు.
పి. శకుం. 2. ఆ.
2. కల్గించు

ఆవటిలు : దే. అ. క్రి. 1. పొందుపడు. రామా. 8. ఆ.
2. కలుగు; బాధపడు, అంగలార్చు

ఆవటిల్లు : దే. అ. క్రి. ఆవటిలు.

ఆవడిసేయు : దే. స. క్రి. బాధపెట్టు

ఆవపాఱు : దే. అ. క్రి. 1. జ్ఞప్తికివచ్చు
2. తోచు

ఆవరించు : సం. స. క్రి. 1. చుట్టుకొను, ఆక్రమించు, క్రమ్ము
2. కప్పు

ఆవరించుకొను : మి. స. క్రి. ఆవరించు

ఆవరిల్లు : సం. అ. క్రి. సంప్రాప్తమగు

ఆవర్తించు : సం. స. క్రి. 1. (పాఠమును) వల్లించు. స్వా. 2.ఆ
2. పలుమార్లుచెప్పు. నైష. 7 ఆ.
3. మఱల్చు. నైష. 5. ఆ.
అ. క్రి. 4. వర్తించు; ఉండు, కలుగు

ఆవలించు : దే. అ. క్రి. ఆవులించు

ఆవలింతలువచ్చు: దే. స. అ. క్రి. విసుగు గల్గించు (వ్యవ.)

ఆవలిమోమిడు : దే. అ. క్రి. అనిష్టముసూచించు విప్ర. 2. ఆ.

ఆవహించు: సం. స. క్రి. (ఆవహిల్లు. ప్రే.)
1. స్నేహము, దుఃఖము, ప్రీతి మొ॥కల్గించు,
భార. ఉద్యో. 4 ఆ. ఆను. 2. ఆ.
భార. శాం. 3. ఆ.
2. చేయు భార. ఆర. 5. ఆ
3. ఆవాహనముచేయు; మంత్రమూలమున రప్పించు
భార. ఆశ్రమ. 2. కాశీ. 4. ఆ.

ఆవహించు : 4. ఆవేశించు; సోకు
ఆమెను అమ్మవా రావహించినది.
ఆమెను గ్రహమావహించినది మొ॥
ఈ అర్థమునందు అకర్మకముగాను
వాడుకగలదు.
ఆమెకు గ్రహమావహించినది. నిద్ర
ఆవహించినది.

ఆవహిల్లు : సం. అ. క్రి. ఆవహించు

ఆవాసించు : సం. అ. క్రి. 1. ఆవాసముచేయు; నివసించు
2. జీవించు భాగ. 9. స్క.

ఆవాహించు : సం. స. క్రి. పిలుచు; మంత్రములచే (దేవతలను)
ఆహ్వానించి పూజాస్థానమునుపొందించు

ఆవించు : దే. స. క్రి. ఆవి కల్గించు; ఆవిరిమీద వండు.
కాళ. 3. ఆ.

ఆవిగొను : దే. అ. క్రి. నేడియెక్కు

ఆవిరిల్లు : దే. అ. క్రి. చెమర్చు. ( శ. ర. ) ఆవిరిగలదియగు

ఆవిర్భవించు : సం. అ. క్రి. ప్రభవించు, పుట్టు

ఆవిర్భవిలు(ల్లు) సం. అ. క్రి. ఆవిర్భవించు, పుట్టు. కకు. 2. ఆ

ఆవిష్కరించు: సం. స. క్రి. 1. ప్రకటించు; వెలయించు
2. బయల్పఱచు

ఆవులించు : దే. అ. క్రి. 1. ఆవులింత విడుచు, జృంభించు
భార. ఉద్యో. 1. ఆ. భార. ఆర. 4. ఆ
2. వికసించు; తెఱచికొను. కు. సం. 3 ఆ
3. నోరు తెఱచు నిర్వ. 4. ఆ
4. నోరు వెళ్ళబెట్టు, సమాధానము
చెప్పలేక నోరు తెఱచి యుండు
5. ఊపిరివిడుచు, చచ్చు

ఆవేదించు : సం. స.. అ. క్రి. 1. తెలుపు, చెప్పు. భార.ఆది.7. ఆ
2. విజ్ఞాపనముచేయు, మనవిచేయు.
3. వ్యాజ్యము వేయు.

ఆవేశించు : సం. అ. క్రి. 1. ప్రవేశించు; చొచ్చు,
2. కలుగు. భార. శాం. 6 ఆ.
3. నిలుచు.
స. క్రి. 4. గ్రహాముసోకు.

ఆశంకించు : సం. అ. క్రి. 1. అనుమానపడు; శంకజేయు; ప్రశ్నించు.
2. భయపడు.

ఆశంసించు : సం. స. క్రి. కోరు.

ఆశపడు : మి. అ. క్రి. అపేక్షపడు, కోరు.

ఆశపెట్టు : మి. స. క్రి. అపేక్షపెట్టు; ఆశ కలిగించు.

ఆశవదలు : మి. అ. క్రి. 1. నమ్మకము చెడు.
2. బ్రతుకడని ధ్రువపడు.

ఆశాసించు : సం. స. క్రి. 1. ఆశీర్వదించు.
2. కోరు. భార. ఆశ్ర. 1 ఆ.

ఆశించు : సం. స. క్రి. 1. అపేక్షించు, ఆసించు. కోరు. ఉ. రా. 1 ఆ.
2. దీనుడైకోరు. (వ్యవ)

ఆశీర్వచించు : సం. స. క్రి. ఆశీర్వచనముచేయు, దీవించు.

ఆశీర్వదించు : సం. స. క్రి. దీవించు.

ఆశ్రయించు : సం. స. క్రి. ఆశ్రయము చేయు; అండగొను అవలంబించు; శరణుజొచ్చు.

ఆశ్లేషించు : సం. స. క్రి. 1. కౌగిలించు. జై. 3 ఆ.
2. క్రమ్ము.

ఆశ్వసించు : సం. స. క్రి. 1. ఊరడిల్లు, 2. ఊరడించు.

ఆశ్వాసించు : సం. స. క్రి. 1. ఊరడిల్లు, 2. ఊరడించు.
3. ఓదార్చు మార్క. 8 ఆ.

ఆసగొను : వై. అ. క్రి. ఆశ కలిగియుండు;

ఆసచేయు : వై. స క్రి. ఆశించు. అభిలషించు. వి. పు. 2 ఆ.

ఆసన్నమగు : సం. స. క్రి. సమీపించు. షోడ. 5 ఆ.

ఆసన్నించు : సం. అ. క్రి. ఆసన్నమగు; సమీపించు. అధ్యా. యు.

ఆసపడు : వై. అ. క్రి. కోరు; అపేక్షపడు.
స. క్రి. ఆశించు, భార. శాం. 1 ఆ. అశ్వ. 4 ఆ

ఆసమాలు : వై. అ. క్రి. నిరాశపడు.

ఆసయిచ్చు : వై. అ. క్రి. ఆశకల్పించు, అవకాశమొసగు.

ఆసరాయగు : వై. అ. క్రి. తోడుపడు; ఆశ్రయమగు.

ఆసపు : దే. అ. క్రి. ఆయాసపడు; వేసరు.

ఆసాదించు : సం. స. అ. క్రి. 1. ప్రాపించు, పొందు. 2. పొందించు
3. సిద్ధముచేయు 4. దగ్గఱునుంచు.
దేవతార్చనలోని విగ్రహములను
నియమిత ప్రదేశములందుంచు.

ఆసించు : వై. అ. క్రి. ఆసపడు; రా. ఆర.
స. క్రి. అపేక్షించు; కోరు.
భార. అశ్వ. 1 ఆ. కాశీ. 7 ఆ.

ఆసుపో(వో)యు: దే. అ. క్రి. (ఆసు + పోయు) 1. ఆసుమానిమొల
లకు నూలుపోగు సారించు. శ. ర.
ఆసున నూలు త్రోడు.
2. అటునిటు తిరుగాడు; ఏమియుతోచక
తిరుగాడు.
3. ఒకపని అయినదాక తిరుగాడు.
4. పోగుపోయు.
5. బట్టలనేత కుపక్రమించు.

ఆసేధించు : సం. స. క్రి. (వ్యవహారముచ)నిరోధించు; అడ్డగించు.
నాదిని రాజాజ్ఞచే అడ్డగించు,
వారంటు అమలుజరుపు

ఆస్థానముగు : మి. అ. క్రి. సభచేయు, కొలువుండు. కాశీ. 7 ఆ.

ఆస్ఫాలించు . సం. స. క్రి. 1. ఆస్ఫోటించు; చఱచు (భుజాదులు)
అప్పళించు. 2. కదల్చు
అ. క్రి. చలించు, అదలు

ఆస్ఫోటించు : సం. స. క్రి. 1. చఱచు, రాయు
2. పొడుచు
3. చీల్చు, పగులగొట్టు నై. 8 ఆ.
4. తన్ను. కాశీ. 7 ఆ.
5. తర్జించు కాశీ. 4 ఆ.

ఆస్వదించు : సం. స. క్రి. 1. అనుభవించు 2. చలించు
3. త్రాగు 4. తిను. కాశీ. 5 ఆ. 6 ఆ

ఆస్వాదించు సం. స. క్రి. ఆస్వదించు భార. సభా. 2 ఆ.
ఇట త్రాగు అని అర్థము

ఆహరించు : సం. స. క్రి. 1. అపహరించు. షోడ 4. ఆ. శ.ర.
2. పైకిలాగు; ఉద్ధరించు. ఆము. 3 ఆ
ఇట ఆకర్షించు శ.ర.
3. తీసికొనివచ్చు; అనునయించు
కాశీ. 4. ఆ.
4. తిను, ఆహారముగాఁ గొను
భార. అను. 1. ఆ.
5. మఱలించు
6. గ్రహించు. భార. అను. 4 ఆ

ఆహాకొాట్టు : మి. అ. క్రి. ముఖప్రీతికై చెప్పినదెల్ల బాగున్నదను

ఆహాపట్టించు : మి. అ. క్రి. ఆశ్చర్యము కలిగించు

ఆహారించు : సం. స. క్రి. ఆరగించు, భుజించు వై. 2. ఆ. రూ. ఆహారించు

ఆహిపె(వె)ట్టు : దే.స.క్రి. 1. ఉంకువచేయు, ఆధివెట్టు(ముద్రిత పా.) 2. కుదువఁబెట్టు

ఆహ్లాదించు : సం. అ. క్రి. సంతోషించు

ఆహ్వానించు : సం. స. క్రి. పిలుచు; దగ్గఱకుఁ జేర్చు

# ఇ

ఇంకఁగొట్టు : దే. స. క్రి. ఇనుకునట్లు చేయు.

ఇంకఁబాఱు : దే. అ. క్రి. ఇంకు భాగ. 8 స్కం.

ఇంకు : దే. అ. క్రి. ఇనుకు.

1. నీరు నేలలోనికి ఇనికిపోవు. భార. ఉ. 4 ఆ.

2. ఆవిరిగా పైకిపోవు, ఎండిపోవు. పండి. దీక్షా. 61 పు.

3. తడిలేనిదగు.

4. జలాదికము ఇగిరిపోవు, కనబడకుండపోవు. భార.విరా.1ఆ.

5. జలములేనిదగు, ఎండిపోవు. భార. ఉద్యో. 4 ఆ.

6. క్షీణమగు, నశించు. భీమ. 4 ఆ.

ఇంగలంవెట్టు (తెలం) దే. అ. క్రి. కోపమువచ్చు.

ఇంగిలించు : దే. అ. క్రి. దాగుకొను.

ఇంచు : దే. అ. క్రి.

1. ఇంపగు. భార. ఉద్యో. 2 ఆ.

2. ఒప్పు. వా. 2 ఆ.

3. అతిశయించు. నై. 3 ఆ.

4. ఆనందించు. భా. బా. 66

స. క్రి. అభిలషించు, కోరు, హరి. నలో. 2 ఆ.

ఇంచుమించుజేయు: దే. స. క్రి. రమారమిగా సరిజేయు.

ఇంచుమించులాడు: ద్వ. స. క్రి. (ఇంచుమించులు + ఆడు) న్యూనాధిక్యములు పలుకు, తిరస్కరించు. విజ.1ఆ.

ఇంటికిఁగాకపోవు: దే. అ. క్రి. రజస్వలయగు.

ఇంటికిదూరమగు: దే. అ. క్రి. బహిష్ఠగు.

ఇంట్రపడు: ద్వ. అ. క్రి. (ఇంట్రము + పడు) సంకటపడు. హరి. ఉత్త. 9 ఆ.

ఇండెగట్టు: దే. అ. క్రి. మూలఁగుచ్చు.

ఇండెగొట్టు: దే. స. క్రి. గొడ్డలితో నఱకునపుడు గాడిపెట్టు.

ఇండెలుపెట్టు: దే. స. క్రి. చిన్నకుప్పలుపెట్టు. (అ.జీ.)

ఇండెవాయు: దే. అ. క్రి. చీలు, ఆస్ఫోటితమగు.

ఇండెవాఱు: దే. అ. క్రి. బీటవోవు.

ఇంతలింతలుసేయు: దే. స. క్రి. చిన్నవిసేయు.

ఇంతింతగు: దే. అ. క్రి. క్రమముగాఁ బెద్దదగు.
2. చిన్నదగు.
ఉదా:-ఇంతింతైవటుఁడింతయై. భాగ. 7స్కం.

ఇంతింతనరానిదగు: దే. అ. క్రి. చెప్పశక్యముగానిదగు;

ఇంతొప్పఁజెప్పు: దే. స. క్రి. ఇంతచక్కఁగాఁజెప్పు.

ఇందమను: దే. స. క్రి. ఇందయను.
2. తీసికొనుమను.

ఇందు: దే. అ. క్రి. 1. ఒంటఁబట్టు. వేం. పంచ. 2 ఆ.
2. స్రవింపక నిలుచు. య. 4 ఆ.
3. రుచించు.
'జిహ్వాకున్ వంటకమిందునే!'

ఇందెపడు: దే. అ. క్రి. ఒరపిడిపొంది అరలుకట్టు

ఇంధనము వేయు: దే. అ. క్రి. ఎగరేపు. (రా. సీ.)

ఇంపెసలారు: దే. అ. క్రి. (ఇంపు + ఎసలారు.) శోభించు. నై. 3 ఆ.

ఇంపొందు : దే. అ. క్రి. (ఇంపు + పొందు) 1. ఆనందించు.
భా. రా. యు. కాం.
2. ఒప్పు. దశా. 1 ఆ.

ఇంపుసొంపారు : దే. అ. క్రి. మిక్కిలి శోభించు. (పండితా.)

ఇక్కట్లుచిక్కు: } దే. అ. క్రి. 1. బాధలుపడు, 2. చిక్కులుపడు.
ఇక్కట్లుపడు : } 3. అగచాట్లుపడు.

ఇక్కడక్కడపడు: ద్వ. అ. క్రి. (ఇక్కడ + అక్కడ + పడు) కలఁగు
క్షోభించు, నిర్వ. రా. 6 ఆ.

ఇక్కలుపడు . ద్వ. అ. క్రి. (ఇక్కలు + పడు) స్థానభ్రంశమునొందు,
చలించు, భాగ. 8 స్కం.

ఇక్కుముట్టు : దే. అ. క్రి. పడుముపట్టు

ఇకిలించు దే. అ. క్రి. వెకలిగానవ్వు

ఇగముదుల్పు: (తెలం) దే. స. క్రి. 1. మబ్బుకుదుర్చు
(మందకొడితనము పోగొట్టు)
2. జాడ్యము వదల్చు

ఇగముపుట్టు : దే. అ. క్రి. చలివచ్చు (తెలం.)

ఇగమెక్కు : దే. అ. క్రి. 1. మంచెక్కు
2. తడియెక్కు

ఇగిడించు : దే. స. క్రి. నిగిడించు, ప్రయోగించు, పయు. హార. 7. ఆ.

ఇగిరించు . దే. అ. క్రి. చిగురించు. రాజ. చ. 1. ఆ.
2. కలుగు, పొడము. వసు. 2. ఆ
3. ఎఱుపెక్కు య. 3. ఆ.
స. క్రి. ఇగురు ధా. ప్రే. 1. ఇగిరిపోఁజేయు
2. నశింపజేయు. పద్మ. పు. 7. ఆ.
3. పోగొట్టు

ఇగిలించు : దే. అ. క్రి. దంతపు చిగుళ్ళు కనఁబడునట్లుచేయు శుక. 2. ఆ.
పండ్లనువెలువఱచు శుక. 1 ఆ
ఇగురబెట్టు : దే. స. క్రి. అత్తెసరుబెట్టి యిగుర్చు
ఇగురించు : దే. స. క్రి. 1. ఇగురబెట్టు 2. వనవేయు
ఇగురు : దే. అ. క్రి. 1. చిగురించు
2. ఆనందించు. కాశీ. 7. ఆ.
3. ఇంకు. భా. రా. అర. 2 ఆ.
ఇగురుకొను :
ఇగుర్కొను : } దే. అ. క్రి. చిగురించు. (శ్రీ)రాధా. 4ఆ. చెన్న. 1ఆ.
ఇగురుచు :
ఇగుర్చు : } దే. అ. క్రి. 1. చిగురించు స్వా. 3. ఆ.
2. పొడము భీమ. 1. ఆ.
భార. విరా. 2 ఆ.
స. క్రి. 1. ఇగురఁజేయు. (శ్రీ)రాధా 4. ఆ.
2. వికసింపజేయు
3. ఇంకఁజేయు. నై. 6 ఆ.
ఇగురుచూపు : దే. అ. క్రి. 1. తలయెత్తు. 2. చిగురించు.
ఇగురువెట్టు ; దే. అ. క్రి. (ఇగురు + పెట్టు).
1. అనురక్తమగు. భార.విరా. 2 ఆ.
2. అలరు. అచ్చ. అయో. 3 ఆ.
3. కలుగు, పారి. 5 ఆ.
4. ప్రారంభమగు. కాశీ. 1 ఆ.
ఇగురులుకుట్టు : దే. స. క్రి. మర్మభేదనముచేయు
ఇగులుచు : ఇగుల్చు. దే. అ. క్రి. ఇగిలించు. వేం. పంచ. 4 ఆ.
నై. 7 ఆ.

ఇగ్గు: దే. అ. క్రి. 1. వెనుకకు ఒఱగు. విజ. 2 ఆ.
2. వెనుక ఒఱగు. శ. ర.
స. క్రి. లాగు. బిల్హ. 3. ఆ. సుభద్రా. 2 ఆ.
తన్ను రా. సీ.
ఇగ్గుకొను: దే. అ. క్రి. ఇగ్గు.
ఇగ్గులాడు: దే అ. క్రి. పెనఁగు. కవిరా. 2 ఆ.
స. క్రి. వెనుకకీడ్చు. రస. 3 ఆ.
పెనఁగులాడు; బలాత్కరించు.
ఇగ్రుచు: దే. అ. క్రి. ఇగురుచు, పొడము.
కవిక. 3 ఆ. శివరా. 2 ఆ.
ఇగ్రుచు–ఇందలి 'ఇ' కారము లఘువు
ఇగ్రువగు: దే. అ. క్రి. ఇగురుచు (పండితా.)
ఇచ్చకమాడు: దే. స. క్రి. 1. అచ్చిక బుచ్చికలాడు.
2. ప్రియవచనములాడు.
ఇచ్చకములాడు: } దే. స. క్రి. ముఖప్రీతిగా మాటాడు.
ఇచ్చకాలాడు: }
ఇచ్చగించు. నై. అ. క్రి. 1. ఇష్టపడు; భార. ఉద్యో. 4 ఆ.
2. ఆనందించు. వసు. 2 ఆ.
స. క్రి. 1. కోరు. ఉ. రా. 6 ఆ.
2. మెచ్చు. నై. 1 ఆ.
3. సమ్మతించు. ఉ. హరి. 7 ఆ.
ఇచ్చగొను: ద్వ. స. క్రి. (ఇచ్చ + కొను) కోరు. భాగ. 4 స్కం.
ఇచ్చపుట్టు: దే. అ. క్రి. అభిలాషకలుగు.
ఇచ్చు: దే. స. క్రి. 1. ఒసఁగు.
2. స్వాధీనపఱచు. భీమ. 5 ఆ.
3. చేయు. భార. ద్రో. 5 ఆ.
4. దానముచేయు.

ఇచ్చు : 5. వెలిపుచ్చు. కాశీ. 3 ఆ.
6. అర్పణముచేయు. వి. పు. 1 ఆ.
7. కలుగఁజేయు. భార. ద్రో. 1 ఆ.
8. వదలిపెట్టు. భార. ఆది. 7 ఆ.
9. సమ్మతించు. మార్కం. 3 ఆ.

ఇచ్ఛించు : సం. అ. క్రి. ఇచ్ఛగించు. భాగ. 8 స్కం.
-స. క్రి. కోరు.

ఇజారాపాడు : అన్య. దే. స. క్రి. గుత్తకు తీసికొను (హిం.)

ఇజుకుసేయు దే. స. క్రి. శ్రమపెట్టు

ఇటయటపడు : దే. అ. క్రి. చెల్లాచెదరగు (పండితా.)

ఇటుగూడు దే. అ. క్రి. ఈ రీతి అనుకూలమగు (పండితా.)

ఇటుపట్టు ; దే. అ. క్రి. ఈ విధముగాపట్టు (పండితా.)

ఇట్టట్టాడు : దే. అ. క్రి. ఊగియాడు, బెసకు

ఇట్టలమగు : దే. అ. క్రి. అధికమగు (పండితా.)

ఇట్టికలాడు : దే. అ. క్రి. ఒప్పులకుప్పాటలాడు. ప్ర. నుదురుపాటి వెంకన్న పార్వతీ కళ్యాణయక్షగానము.

ఇట్టికసూడు : దే. అ. క్రి. ఇటుక ఆవముకాల్చు.

ఇడఁగను : దే. అ. క్రి. ఇచ్చు వీలు కలుగు (పండితా.)

ఇడియు : దే. అ. క్రి. 1. చీలు, బ్రద్దలగు. పాండు. 1. ఆ.
2. నలగు ఆము. 4. ఆ
3. విఱుగు ఆము. 6. ఆ
4. పోవు.

ఇడు : దే. స. క్రి. 1. ఇచ్చు. భార. విరా. 1. ఆ. 9. పాండు. 3. ఆ. వ్రాసియిచ్చిన అని భావము) కళా. 2. ఆ. (బలిగానిచ్చు అని భావము.)
2. ఉనుచు. భార. సభా. 2. ఆ.

ఇడు : 3. చల్లు. –చవుటనిడిన విత్తులు
వాసిష్ఠ. 1. ఆ.
4. నాఁటు, పాతు. పారి. 2. ఆ.
5. విడిచిపెట్టు. కళా. 4. ఆ.
6. ప్రయోగించు. ప్రభా. 4. ఆ.
7. ఆరోపముచేయు. సా. 2. ఆ.
8. కట్టు, నిర్మాణముచేయు. ఆము.4ఆ.
9. (పుట్టలు; గ్రుడ్లు మొదలగునవి)పోయు,
పెట్టు, విక్ర. 2. ఆ. స్వా. 5. ఆ.
10. దాచియుంచుకొను. పారి. 2. ఆ.
(ఈపదమునకు సందర్భానుసారముగా
ననేకములగు నర్థాంతరము లిట్లు
గ్రహింపనగును)

ఇడుకొను : దే. అ. క్రి. పెట్టుకొను, ఉంచుకొను, నిలుపు

ఇడుగడవడు : ద్వ. అ. క్రి. (ఇడుగడ+పడు)
బాధపడు, పరితపించు. కు. సం. 6. ఆ.

ఇడుగడసేయు : దే. అ. క్రి. ఈసుపొందు

ఇడుమపడు : ద్వ. అ. క్రి. (ఇడుము+పడు) కష్టపడు.
భార. అర. 2. ఆ.

ఇడుము : దే. స. క్రి. చేర్చు. శుక. 1. ఆ

ఇడుముకొను : దే. స. క్రి. ఆక్రమించు

ఇడుములబడు : దే. అ. క్రి. కష్టములపాలగు

ఇనుకు : దే. అ. క్రి. ఇంకు మైరా. 3. ఆ,

ఇనుమడించు–ఇన్మడించు: దే. అ. క్రి. రెట్టింపగు. భార. స్త్రీ. 2 ఆ.
స. క్రి. ద్విగుణీకరించు, రెట్టించు (శ. ర.)

ఇప్పించు : దే. స. క్రి. (ఇచ్చు ధా. ప్రే.) ఈఁజేయు
కాశీ. 4. ఆ. రామా. 8. ఆ

ఇబ్బందిపడు ద్వ. అ. క్రి. చిక్కుపడు, శ్రమపడు (వ్యవ.)
—వాఁడు డబ్బులేక యిబ్బంది పడుచున్నాడు.
ఇబ్బందిపెట్టు : దే. స. క్రి. ఇరకటముపెట్టు, బాధపెట్టు
ఇబ్బడించు–ఇమ్మడించు: దే. అ. క్రి. రెట్టింపగు
ఇమిడించు : దే. స. క్రి. ఇముడునట్లుచేయు
ఇముకు : దే. అ. క్రి. ఇంకు (ఆం. పా.)
ఇముడు : దే. అ. క్రి. 1. అడగు, లీనమగు. గీ. రా. వి. 1 ఆ.
2. నెఱవేఱు, సిద్ధించు. హరి. పూ. 5ఆ.
పొందుపడు. (శ. ర.)
స. క్రి. అడచియుంచు, మఱుగుపఱచు. దశా. 4. ఆ.
ఇముడుకొను : దే. అ. క్రి. (ఇముడు + కొను) (స్వార్థమున)
ఇముడు. పొందుపడు, కువల 4. ఆ.
స. క్రి. 1. ఇముడ్చుకొను
2. దాఁచు. మఱుగుపఱచు
3. పోషించు ప్రబోధ. 5. ఆ.
ఇముడుచు : దే. స. క్రి. (ఇముడు ధా. ప్రే) ఇముడఁజేయు.
శ. ర. (రూ) ఇముడ్చు.
ఇమురు : దే. అ. క్రి. ఇంకిపోవు (రూ. ఇముడుకొను)
ఇమురుకొను–ఇమురు. దే. అ. క్రి. (ఇమురు + కొను) – (స్వార్థమున)
ఇంకు, హరించు. రం. రా. అయో. 141
ఇమ్మడించు : దే. అ. క్రి. ఇనుమడించు
ఇమ్ముకొను : దే. అ. క్రి. 1. కలుగు. కాళిందీ. 2. ఆ.
2. ఉండు రాఘవ. 2. ఆ.
(రామాయణార్థమున కలుగు అనియు
భారతార్థమున 'ఉండు' అనియు,
రెండర్థములకు నిది యుదాహరణము)–
స. క్రి. ప్రాప్తించు, పొందు, చెన్నమల్లు సీసములు.

ఇయ్యఁబడు : ద్వి. స. క్రి. (ఇయ్యన్ + పడు.) ఈయవలసియుండు. మల్హా. 2 ఆ.

ఇయ్యకొను : ద్వి. స. క్రి. (ఇయ్య + కొను) ఈయకొను, సమ్మతించు. భార. విరా. 3 ఆ.
అ. క్రి. అంగీకరించు. భార. ఆది. 4 ఆ. విరా. 5 ఆ.

ఇయ్యకొలుపు : ద్వి. స. క్రి. (ఇయ్యకొను. ధా. ప్రే.) ఒప్పించు, భార. ఉద్యో. 1 ఆ. దశ. 3 ఆ.

ఇయ్యసేయు : వై. అ. క్రి. (ఇయ్య + చేయు) సమ్మతించు. రాజశేఖరవిలాసము. 3 ఆ.

ఇరకటపడు :
ఇరకాటపడు :
ఇరకాటములోపడు: } దే. అ. క్రి. ఇబ్బందిపడు, సందిగ్ధములోపడు. సందిగ్ధావస్థలోఁబడు.

ఇరవందు : దే. అ. క్రి. (ఇరవు + అందు) ఇరవొందు, ఒప్పారు భాగ. 10 స్కం. పూ. 493.

ఇరవగు : దే. అ. క్రి. నెలకొను, ఉండు. విప్ర. 2ఆ. నైష. 1ఆ.

ఇరవారు : దే. అ. క్రి. (ఇరవు + ఆరు) స్థిరపడు. భా. రా. సుం.

ఇరవుకొను : దే. అ. క్రి. (ఇరవు + కొను.)
1. నెలకొను, ఉండు. పాండు. 1. ఆ.
2. స్థిరపడు. రామ. రా.
3. పొడము, జనించు, శశాం. 4. ఆ
స. క్రి. ఆక్రమించు. పాండు. 5. ఆ.

ఇరవుకొలుపు : దే. స. క్రి. (ఇరవుకొను ధా. ప్రే.)
1. నెలకొలుపు రసిక. 6. ఆ.
2. నిలుపు

ఇరవుకొల్పు : దే, స. క్రి. ఇరవుకొలుపు (నిలుపు) చంద్ర. 2 ఆ.

ఇరవుపడు : ద్వ. అ. క్రి. (ఇరవు+పడు)
1. ఇరవుకొను
2. శోభిల్లు భాగ. 5. స్కం. 1 ఆ.

ఇరవుపఱచు : ద్వ. స. క్రి. (ఇరవుపడు ధా. ప్రే.)
ప్రతిష్ఠించు, నిలుపు. పాండు. 5 ఆ.

ఇరవేదు : దే. అ. క్రి. స్థానము లేకపోవు

ఇరవొందు దే. అ. క్రి. (ఇరవు+ఒందు)
1. నెలకొను, వసించు. భాగ.6స్కం.
2. సంప్రాప్తమగు, కలుగు
ఉ. హరి. 4 ఆ.
3. పొలుపారు, ఒప్పు. నరసభూపా. 1. ఆ.

ఇరికించు :
ఇఱికించు :
ఇఱుకు :
దే.స.క్రి. 1. మధ్యలో కష్టముమీఁదస్థానముకల్పించు.
2. సందున అదుము.

ఇరిమిరిమిచూచు: దే. అ. క్రి. మిక్కిలి భయపడిచూచు

ఇరియించు : దే. స. క్రి. (ఇరియు ధా. ప్రే.)
1. చుట్టు దశ. 11. ఆ.
2. భస్మముచేయు. ఉద్భటా. 3 ఆ.

ఇరియు : దే. అ. క్రి. బిగియు

ఇరుచంబడు : దే. అ. క్రి. ఇరుకుపడు

ఇరుముకొను : దే. అ. క్రి. మఱుగుపడు. భా. రా. యు. కాం.

ఇరులుకొను : దే. అ. క్రి. (ఇరులు+కొను)
1. చీకటిక్రమ్ము. భయముగొలుపు
స్వా. పీఠి. 12.
2. దట్టముగా అల్లుకొను. ఆము. 5ఆ.

ఇర్లుగొను : దే. అ. క్రి. ఇరులుకొను, చీకటిక్రమ్ము. కు. 3 ఆ.

ఇఱీంచు, ఇఱియించు: దే. స. క్రి. నొక్కిపట్టు. పద్మ. పు. 10 ఆ.
ఇఱికించు : దే. స. క్రి. ఇముడఁజేయు. ఆము. 4 ఆ. స్వా.4ఆ.
ఇఱికికొను : దే. అ. క్రి. తగులుకొను
ఇఱికిపట్టు : దే. స. క్రి. బాహుబంధమున గట్టిగాపట్టుకొను
ఇఱియించు : దే. స. క్రి. ఇఱియు ధా. ప్రే.
1. బిగించు కాశీ. 4. ఆ.
2. నశియింపజేయు
ఇఱియు : దే. అ. క్రి. 1. బిగియు నై. 4. ఆ.
2. అధికమగు ద్వి. హరి. పూ.
3. నలగు శ.ర.
స. క్రి. చేర్చు, కదియజేయు
పిన. శకుం. 3 ఆ.
ఇఱుకు : దే. అ. క్రి. 1. కొంచెపుతావున నణగు. అచ్చ. సుం. కాం.
2. రెంటిసందునచిక్కి అదుముడుపడు. నలగు. హరి. ఉత్తర. 6. ఆ.
ప్రే ఇఱికించు. భార.2.ఆ.నిర్వ.7ఆ
3. రెంటిసందున బెట్టి నొక్కు
హరి. పూ. 5. ఆ.
ఇఱ్ఱింకులింకించు. దే. స. క్రి. భయపెట్టు. భీమ. పు. 2 ఆ.
ఇఱ్ఱింకులింకు : దే. అ. క్రి. (ఇఱ్ఱింకులు + ఇంకు)
1. మిక్కిలి శుష్కించు. ఆము.4 ఆ.
2. భయపడు, బెదరు
3. నశించు భీ. 3. ఆ.
ఇఱ్ఱింకులుచేయు: దే. స. క్రి. నశింపఁజేయు, పోగొట్టు నై. 7. ఆ.

ఇలకఱచు : దే. స. క్రి. ఈలకఱచు, పండ్లు బిగించు.
ఆము. 5. ఆ.
స. క్రి. బిగఁబట్టు భా. రా. యు, 702
సేల కంటుకొనిపోవు, శుష్కించు

ఇలుకరించు : దే. స. క్రి. విప్పు. తెఱచు. వరా. పు. 10. ఆ.
ఇలుకు :
ఇల్కు : దే. అ. క్రి. నీలుగు. చచ్చు. భార. శల్య. 1. ఆ.
ఇలువుట్టు : దే. అ. క్రి. నీలుగు.
ఇల్కఱచు : దే. అ. క్రి. ఇలకఱచు. భా. రా. యు. 999
ఇల్లడపడు : దే. అ. క్రి. తాకట్టుపోవు.
ఇల్లడపెట్టు : దే. స. క్రి. ఇల్లడగానుంచు. భార. విరా. 2 ఆ.
ఇల్లడయిడు : దే. స. క్రి. ఇల్లడగానిడు. కాశీ. 4 ఆ. విక్ర. 7 ఆ.
ఇల్లడసేయు : దే. స. క్రి. న్యాసముగా నుంచు.
ఇల్లిటమువచ్చు: దే. అ. క్రి. ఇల్లరికమునకు వచ్చు (తెలం.)
ఇల్లునిండు : దే. అ. క్రి. ఇంటికి సంపూర్ణశోభ కల్గించు.
'ఇల్లునిండు నైదువ.'
ఇల్లువట్టు : దే. అ. క్రి. వైధవ్యమునందు.
ఇవతళించు : ద్వ. అ. క్రి. చల్లనగు. కవికర్ణ. 3 ఆ.
ఇవతాళించు : ద్వ. అ. క్రి. (ఇవక + తాళించు).
1. చల్లనగు. దశా. 7 అ. 1 ఆ.
2. గడకట్టు. హర. 4 ఆ.
ఇవముకొను. ద్వ. అ. క్రి. 1. కొంకఱలుపోవు. కాశీ. 6 ఆ.
2. చలిచే బాధపడు. పాండు. 4 ఆ.
ఇవముగొను-ఇవముకొను: దే. అ. క్రి. 1. తడియు, నాను. కళా. 4 ఆ.
2. తేమచే నిండు. యయా. 1 ఆ.
ఇవిరించు : దే. అ. క్రి. చిగిరించు, ఎఱ్ఱనగు (శ. ర.)
ఇవురబాఱు : దే. అ. క్రి. ఇంకు. భార. ద్రో. 2 ఆ.

ఇవురముచూపు (తెలం): } దే. స. క్రి. 1. ఉపాయము చెప్పు.
ఇవురముచెప్పు (తెలం): } 2. కార్యదక్షత చూపు.

ఇవురముచేయు :
ఇగురముగాచేయు: } దే. స. క్రి. పొదుపుగాచేయు.

ఇవురు : దే. అ. క్రి. ఇగురు.

ఇవురొత్తు : దే. అ. క్రి. పొడచూపు. వే. పంచ.

ఇవుల్చు :
ఇవులుచు :
ఇగులుచు : } దే. అ. క్రి. శుష్కించు.

ఇషారాచేయు (తెలం) : అన్య దే. అ. క్రి. సంజ్ఞచేయు.

ఇసడిలు : దే. అ. క్రి. ఈసడిల్లు (విసుగు). భా. రా. అర. 2ఆ.

ఇసిడింతలువారు : దే. అ. క్రి. అదరు, చలించు.

ఇసిరింతలువారు : దే. అ. క్రి. (ఇసిరింతలు + పాఱు); చలించు, అదరు. వి క్ర. 8 ఆ. హర. 5 ఆ.

ఇసీయను-ఇసిరోయను: దే. అ. క్రి. రోతను సూచించు.

ఇస్సను : దే. అ. క్రి. బాధను సూచించు.

ఇహిహీయను : దే. స. క్రి. 1. పరిహసించు.
2. ఎదుటివారిని తేలికగా భావించి నవ్వు.

ఈంద్రము సేయు : దే. స. క్రి. (ఈంద్రము + చేయు.)
పీడించు, బాధించు. భాగ. 8 స్కం.

ఈంద్రవడు : దే. స. క్రి. 1. వెంబడించు.
2. ఒకఁడు లాగుచుండగా ఈడిగలఁబడు

ఈంద్రించు : దే. స. క్రి. ఈంద్రము సేయు. కాళ. 4 ఆ.

ఈఁకు : దే. అ. క్రి. ఇంకు (శ. ర. బ్రా.) ఇంకు

ఈఁగలుగు : దే. స. క్రి. ఈయగలుగు. (కు. సం.)

ఈఁగు : దే. స. క్రి. 1. పోగొట్టు. భార. ఆది. 2 ఆ.
2. తీర్చు. భార. ఉద్యో. 2 ఆ.
3. తొలఁగించుకొను.
భాగ. 10 స్కం. ఉ. 290.
అ. క్రి. 1. చొచ్చు, పాండు. 1 ఆ.
2. దాఁగు. ఉ. హరి. 2 ఆ.
రం. రా. యు. 353.
(ఈగు, ఇగ్గు. అని శ. ర.)
3. ప్రతీకారము సేయు. భాగ. 6 స్కం.
4. తొలగు. భాగ. 8 స్కం. 5 దూను.

ఈచఁబోవు : దే. అ. క్రి. రోగాదులవలన కాళ్ళేతులు సన్నగిలు.

ఈఁజాలు : దే. అ. క్రి. ఇచ్చుటకు సమర్థమగు. (కు. సం.)

ఈఁతకొట్టు : దే. అ. క్రి. (ఈఁత + కొట్టు) ఈదు (శ. ర.)
ఈఁతలుకొట్టు. (వా.)

ఈఁదాడు : దే. అ. క్రి. (ఈదు + ఆడు) ఈఁదులాడు. స. శ.
(సక్తమగు అని భావము.)

ఈఁదు : దే. అ. క్రి. ఈఁదులాడు. నిర్వ. 8 ఆ.
స. క్రి. (ఈఁది నది మొ॥వానిని దాటు.)
నిరం. 4 ఆ. భార. ఉద్యో. 2 ఆ.

ఈఁదులాడు : దే. అ. క్రి. (ఈఁదులు + ఆడు)
1. ఈఁదు. దశా. 3. ఆ.
2. వ్రేలాడు. స్వా. 4. ఆ.

ఈఁబడు : ద్వ. అ. క్రి. (ఈన్ + పడు) ఈయఁబడు.
భాగ. 5 స్కం. 2 ఆ.

ఈఁబూను : దే. స. క్రి. ఇచ్చుటకు ప్రయత్నించు. కు. సం.

ఈకొను : ద్వ. స. క్రి. ఈయకొను, అంగీకరించు.
రాధా. 1 ఆ.

ఈక్షించు : సం. స. క్రి. 1. చూచు. కాశీ. 7 ఆ.
2. ఆలోచించు. ఉద్భటా. 1 ఆ.

ఈచవడు : ద్వ. అ. క్రి. (ఈచ + పడు)
1. వంకరయగు. పాండు. 4 ఆ.
2. ఈచవోవు, శక్తిహీనమై పలుచబడు

ఈచవోవు : దే. అ. క్రి. (ఈచ + పోవు).
1. సన్నగిల్లు. ఉ. హరి. 2 ఆ.
2. వ్యర్థమగు. నీతి. సీ. 83.

ఈచు : దే. అ. క్రి. (పాడిపసులపాలు) వట్టు;
ఎండిపోవు. (శ. ర.)

ఈచుకపోవు-ఈచకపోవు: దే. అ. క్రి. పశువులు గర్భధారణశక్తిని
పోగొట్టుకొను.

ఈచుకొనిపోవు-ఈచుకపోవు: దే. అ. క్రి. (నెలలు నిండకపూర్వమే
పశువుల గర్భము చెడు. వా.)
ఉమ్మగిలు.

ఈటార్చు : దే. స. క్రి. (ఈటాఱు. ధా. ప్రే.) తడిపోఁగొట్టు.
హార. 2 ఆ.

ఈటాఱు : దే. అ. క్రి. (ఈటు+ఆఱు) ఎండు, తడిపోవు.
పిన. శకుం. 3 ఆ.

అన్న ముడికిన తరువాత పైన చెమ్మ లేకుండ నుండు.

ఈటువోవు : దే. అ. క్రి. (ఈటు + పోవు).
1. వీటిఁబోవు, వ్యర్థమగు. (శ. ర.)
2. శూన్యమగు. (శ. ర.)

ఈడగు : దే. అ. క్రి. సమానమగు, సాటివచ్చు.

ఈడఁబడు : ద్వ. అ. క్రి. (ఈడన్ + పడు) వెనుకబడు.
ప్రాఁతవడు. హార. 7 ఆ.

ఈడఁబోవు : దే. అ. క్రి. (ఈడన్ + పోవు) వెనుకఁదీయు.
నిర్వ. 4 ఆ. భార. విరా. 3 ఆ. 5 ఆ.

ఈడవిడుచు : దే. స. క్రి. (ఈడ + విడుచు) దిగవిడుచు.
జాఱవిడుచు. భార. అశ్వ. 1 ఆ.
కు. సం. 7 ఆ.

ఉపేక్షసేయు.

ఈడాడు : దే. స. క్రి. (ఈడు + ఆడు) కవియు, మార్కొను.
రం. రా. ఆర. 181 పు.

ఈడిగిలఁబడు : } ద్వ. అ. క్రి. (ఈడిగిలన్ + పడు).
ఈడ్గిలఁబడు : }
1. వెలికిలఁబడు. నిర్వ. 6 ఆ.
2. (భయాదులచే ముందుకురానని చదికిలఁబడు.) ప్రభా. 5 ఆ.
3. శక్తిహీనమగు.

ఈడిగిలు : దే. అ. క్రి. ఈడిగిలఁబడు, చదికిలఁబడు.
ప్రభా. 3 ఆ. జై. 2. ఆ.

(రూ) ఈడిగిల్లు-ఈడిగిలు, పట్టి ప్రాకులాడు
_పోవవేలొకో ప్రాణములు మేననింక
ఈ వేడుకలు చూడ నీడిగిల్లెడునో?
ఎంతకు నోర్చితి నెవ్వారి నిట్లు
కాంతుల నెడఁబాపి గాసిఁ బెట్టితినో?
క. వ. రా. సుం. 2074

ఈడ్రించు : దే. అ. క్రి. వేడిమి ఎక్కువయగు.

ఈడు : దే. అ. క్రి. 1. సాఁగు (శ.ర.)
2. జాఱు (చూ. ఈడవిడుచు.)
(ఈడిక, ఈడుచు శబ్దములకు ధాతు ప్రకృతి,)
స. క్రి. పిదుకు. భాగ. 10 స్కం. పూ. 966

ఈడుకుదురు : దే. అ. క్రి. వధూవరులకు వయస్సునందు పొందిక కుదురు.

ఈడుచు : }
ఈడ్చు : } దే. స. క్రి. (ఈడు ధా. ప్రే.)
తిగుచు, లాగు. ఉ. రా. 2 ఆ.

ఈడుజోడగు : దే. అ. క్రి. పెండ్లికావలసిన యువతీయువకులకు వయస్సు సరిపడు.

ఈడువచ్చు : దే. అ. క్రి. (ఈడు+వచ్చు.)
1. సమానమగు. కాశీ. 1 ఆ.
2. రజస్వలయగు; రజస్వల కానుండు.
వ్యవ. ఆమె యీడువచ్చిన పిల్ల. ఇంకను పెండ్లి కాలేదు.

ఈడుసేయు : దే. స. క్రి. (ఈడు+చేయు) పోల్చు. కవిక. 3 ఆ.

ఈడేర్చు : దే. స. క్రి. (ఈడేరు ధా. ప్రే.)
1. ఈడేఱఁజేయు, సిద్ధింపజేయు.
2. కాపాడు; ప్రోచు. సా. 3 ఆ.

ఈడేర్చుకొను. దే. అ. క్రి. (ఈడేర్చు + కొను. స్వార్థమున).
కార్యసిద్ధి నొనరించుకొను, సిద్ధింపఁజేసికొను. రామా. 7 ఆ.

ఈడేఱించు : దే. స. క్రి. (ఈడేఱు ధా. ప్రే.)
సిద్ధింపఁజేయు, అపనయించు
పిన. శకుం. 4 ఆ.

ఈడేఱు : దే. అ. క్రి. (ఈడు + ఏఱు).
1. సిద్ధించు. నరా. 7 ఆ.
2. సఫలమగు. కళా. 2 ఆ.
3. సాంతమగు. మల్లభూ. నీతి. 71.
4. నెగ్గు. ఉ. రా. 7 ఆ.
5. నరిల్లు. సా. 3 ఆ.
6. రజస్వలయగు, యౌవనవతియగు.
య. 3 ఆ.

ఈడేఱుచు : దే. స. క్రి. (ఈడేఱు ధా. ప్రే.)
1. ప్రోచు, కాపాడు. వేం. పంచ. 1ఆ.
2. సిద్ధింపఁజేయు (చూ. ఈడేర్చు.)

ఈడిలఁబడు :
ఈడిగిలఁబడు : } దే. అ. క్రి. ఈడిగిలఁబడు. చెన్న. 2 ఆ.

ఈడిలు : దే. అ. క్రి. ఈడిగిలు, (చూ. ఈడ్గిలఁబడు.)

ఈడ్చిచెప్పు :
ఈడ్చిచదువు : } దే. అ. క్రి. 1. సాగదీయు.
2. ప్రయత్నించి సమకూర్చు.

ఈడ్చు–ఈడుచు : దే. స. క్రి. (తెలం) దువ్వి ఈర్పులుతీయు.
భార. ఉద్యో. 3 ఆ.

ఈడ్వఁబడు : ద్వ. అ. క్రి. (ఈడ్వన్ + పడు) లాగఁబడు. భార. విరా. 1 ఆ.

ఈడ్వడు · } ఈడ్పడు : ద్వ. అ. క్రి. (ఈడు + పడు) సాటియగు. ఆము. 1 ఆ.

ఈతలాతలగు : దే. అ. క్రి. (ఈతల + ఆతల + అగు.)
1. తాఱుమాఱగు. వరా. 11 ఆ.
2. ఆలస్యమగు. వ్యవ. నేను వచ్చుట కొంచె మీతలాత లగును.

ఈతలేయు : దే. అ. క్రి. పశువుల గర్భముపోవు (రా. సీ.)

ఈదరగొట్టు : దే. అ. క్రి. చల్లగాలికొట్టు.

ఈదాడు : దే. అ. క్రి. ఈదు.

ఈనికొను : దే. అ. క్రి. ఉద్భవించు.

ఈను : దే. అ. క్రి. పశ్వాదులు ప్రసవించు. భార. శాం. 4 ఆ.
స. క్రి. 1. కలిగించు. స్వా. 1 ఆ.
2. వెలువరించు. ఆము. 7 ఆ.
3. నెఱవేర్చు. భాగ. 8 స్కం.
4. ఈయననుట. (కుం. సం.)
(ఇచ్చు ధాతువుపై నుజ్యంతరూపము- ఈ ఆదేశము.)

ఈనెకట్టు : దే. అ. క్రి. ముదురు.

ఈనెలుతీయు : దే. స. క్రి. దోషోద్ఘాటనచేయు.

ఈనోపు : దే. అ. క్రి. ఇచ్చుటకు సమర్థమగు. (కు. సం.)

ఈయకొను : ద్వ. స. క్రి. (ఈయ + కొను) ఇయ్యకొను, అంగీకరించు. దశా. 2 ఆ.

ఈయనేర్చు : దే. స. క్రి. దానముచేయ నేర్చు. చా. మ.

ఈరంగమాడు :
వీరంగమాడు:(రూ) } దే. అ. క్రి. చిందులుత్రొక్కు.

ఈరములువట్టు: దే. అ. క్రి. (ఈరములు + పట్టు)
పొదలచాటున దాగియుండు,
బాటసారులఁగొట్టి ధనాదుల నపహ
రించు. భాగ. 6 స్కం.

ఈరసపడు : వై. అ. క్రి. (ఈరసము + పడు.)
అసూయచెందు, ఓర్వలేకపోవు.
కాశీ. 4 ఆ.

ఈరసమాడు : ద్వ. స. క్రి. (ఈరసము + ఆడు) తిరస్కరించు,
త్రోసి రాజను. వరాహ. 11 ఆ.

ఈరసమెత్తు : ద్వ. అ. క్రి. అసూయపడు, ఈర్ష్యాగ్రస్తుడగు.
భార. ఉద్యో. 3 ఆ.

ఈరసించు : వై. అ. క్రి. 1. ఈర్ష్యపడు, అసూయచెందు.
శ. ర.
2. ద్వేషించు. పగగొను. (శ.ర.)
3. కోపించు, కుపితుడగు.

ఈరికలీను : దే. అ. క్రి. ఈరికలెత్తు. కాళిందీ. 1 ఆ.

ఈరికలెత్తు : దే. అ. క్రి. (ఈరికలు + ఎత్తు)
అంకురించు, మొలకెత్తు.
భాగ. 3 స్కం. విజ. 2 ఆ.

ఈరు . దే. స. క్రి. వెండ్రుకలుదువ్వు, ఈళ్ళుక్రుక్కు.

ఈరుచు . దే. స. క్రి. దువ్వెనతో ఈళ్ళను ఈర్చు.
ఈరు - పేనుగ్రుడ్లు.

ఈర్చు : దే. స. క్రి. ఈరుచు (శ.ర.)

ఈఱెలుగుపడు : ద్వ. అ. క్రి. (ఈఱెలుఁగు+పడు) గద్గదకంఠుఁడగు, హీనస్వరుడగు. హార. 2 ఆ.

ఈలకఱచు : } దే. అ. క్రి. (ఈల+కఱచు) ఇలకఱచు.
ఈల్కఱచు : } ప్రాణములు బిగపట్టు. భార. కర్ణ. 2ఆ. భార. ద్రో. 2 ఆ. భా. రా. యు. 996. (ఈలగఱచుకొని–ముద్రి. ఈలుగఱచుకొని పాఠాంతరము.)

ఈలుగు : దే. అ. క్రి. నీలుగు, చచ్చు. భార. కర్ణ. 2 ఆ. విజృంభించు, ఈల్గు (గ్రా.)

ఈల్గు : దే. అ. క్రి. ఈలుగు. భార. భీష్మ. 2 ఆ.

ఈల్గువడు : దే. అ. క్రి. నిస్సత్తువపొందు.

ఈలువుగొను : దే. స. క్రి. (ఈలువు+కొను) మానము చెఱచు, రమించు. శుక. 2 ఆ. ఈలువు చెఱచు.

ఈవలవల సేయు: దే. స. క్రి. (ఈవల+అవల+చేయు) తలక్రిందుచేయు. భా.రా.యు. 263

ఈవలావలగు : దే. అ. క్రి. తలక్రిందులగు, భా. రా. యు. 1319

ఈవలావలపడు: దే. అ. క్రి. 1. సంకటపడు.
2. కలతపడు,
3. ఏమియు తోఁచక తిరుగు.

ఈసడచేయు : దే. స. క్రి. (ఈసడము+చేయు) ఈసడించు, నిరసించు. కాళిందీ. 2 ఆ.

ఈసడించు : దే. అ. క్రి. విరోధించు, పగగొను. వసు. 4 ఆ.
స. క్రి. 1. దూఱు; నిందించు. కళా. 3 ఆ.
2. నిరసించు, తక్కువపఱచు. నరస. 1ఆ
3. రోతఁగొను, అసహ్యించుకొను.
పాంచా. 3 ఆ.

ఈసుమను : దే. స. క్రి. నీరసము కలిగించు (తెలం).

ఈసురోమను : దే. అ. క్రి. నీరసించు.

ఈసువడు : వై. అ. క్రి. (ఈసు + పడు) నిందనొందు,
దూఱువడు. శివరా. 3 ఆ.
అసూయపడు.

ఈసెక్కు : దే. స. క్రి. కోపగించు. నృ. పు. 1 ఆ.

# ఉ

ఉంకించు : దే. అ. క్రి. 1. యత్నించు, కడగు. విజ. 2 ఆ.
2. సిద్ధమగు. సిద్ధముగా నుండు. భార. సౌ. 1. ఆ.
3. ఆరంభించు, మొదలిడు. భార. విరా. 3 ఆ.
4. ఊఁచు, కుప్పించు. ఆము. 1 ఆ.

ఉంకు : దే. అ. క్రి. 1. భయపడు. దశా. 4 ఆ.
2. నేలఁగొట్టిన పైకెగయు. ఉ. హరి. 4 ఆ.

ఉంకువపెట్టు : దే. స. క్రి. (స్వయంవరాదుల యందు) పణముగా జేయు.

ఉంకువసేయు : దే. స. క్రి. కానుకసేయు.

ఉంకెకుఁ : దే. అ. క్రి. జంకు; వెనుదీయు. విజ్ఞా. ప్రా. 107.

ఉంగిడిగొను : దే. అ. క్రి. (ఉంగిడి + కొను) ఉంగిడివచ్చు. కాశీ. 2 ఆ.
(ఉంగిడి-గొడ్లకు వచ్చువ్యాధి.)

ఉంచు : దే. స. క్రి. 1. కూర్చుండజేయు. విక్ర. 1 ఆ.
2. స్థాపించు, కట్టు. వసు. 1 ఆ.
3. అలంకరించు, ధరింపజేయు. వసు. 3 ఆ.
4. నియమించు, ఏర్పాటుచేయు. వసు. 6 ఆ.

ఉంచు : 5. తాఁకట్టిడు, న్యాసముచేయు.
ఆము. 1 ఆ.

6. ఒకచోట బెట్టు.

ఉంచుకొను : దే. స. క్రి. (ఉంచు+కొను).
1. ఉండునట్లు చేసికొను.
2. (వేశ్యాదుల) వశమునఁబెట్టుకొను.

ఉండఁగట్టు : దే. అ. క్రి. (ఉండ+కట్టు) ఉండలుండలుగా నగు.

ఉండు . దే. అ. క్రి. దీనికి ఉందురు, ఉండ్రు, ఉంటిమి ఉన్నను, ఉన్నది, ఉన్నె, ఉన్నే మున్నగు రూపములు సిద్ధించును.

1. స్థితమగు. భార. ఆది. 7 ఆ.
2. వర్తిల్లు. భార. ఆది. 5 ఆ.
3. వసించు. విక్ర. 2 ఆ.
4. జీవించు. భార. ఆది. 221
5. నిలుచు. పారి. 1 ఆ.
6. ఊరకుండు. భార. ఆది. 8 ఆ.
7. శేషించు. నై. 4 ఆ.
8. ధాతుజన్యములగు అన్యయములకు గొన్నిపట్ల నుప్రయుక్తములగును విక్ర. 3 ఆ.

ఆయురభ్యుదయముల పొందియుండు.

9. తుమున్నంతముల కనుప్రయుక్త మయి యొక్కొక్కప్పుడు భవిష్య దర్థమును సూచించును.

మహాశాహారము గనడింపనున్నాడు.
హర. 2 ఆ.

10. తుమున్నంతముల కనుప్రయు క్త్వై
యొక్కొక్కప్పుడు 'సిద్ధమగు'
మున్నగు నర్థముల నిచ్చును.
–తానుభుజియింప నుండి యా సక్తు
నతిథి కిచ్చె. భార. అశ్వ. 4 ఆ.

స. క్రి. 1. చేయు. వరాహ. 9 ఆ.
2. పొందు. భాగ. 10 స్కం.

ఉండుకొను : దే. అ. క్రి. (ఉండు + కొను. స్వార్థమున) ఉండు. కాళిందీ. 2 ఆ.

ఉక్కడగించు : దే. స. క్రి. (ఉక్కడచు ధా. ప్రే.)
1. నిస్సత్వముచేయు.
2. వధించు, చంపు.
3. నాశనముచేయు (చూ. ఉక్కడఁచు)

ఉక్కడఁగు : దే. అ. క్రి. (ఉక్కు + అడఁగు) నిస్సత్వమగు, బలహీనమగు. భార. సభా. 1 ఆ.

ఉక్కడఁచు : దే. స. క్రి. (ఉక్కడఁగు ధా. ప్రే.)
1. ఉక్కడగించు, నిస్సత్వముచేయు.
2. చంపు. మార్కం. 6 ఆ.
3. నాశనముచేయు. భాగ. 3 స్కం. 33

ఉక్కణఁగు: దే. అ. క్రి. ఉక్కడఁగు (చూ. ఉక్కణఁచు.)

ఉక్కణఁచు : దే. స. క్రి. (ఉక్కణఁగు ధా. ప్రే.) చంపు, వధించు. రుక్మాం. 5 ఆ

ఉక్కణగించు : దే. స. క్రి. ఉక్కణఁచు. వి. పు. 1 ఆ.

ఉక్కదీయు. దే. అ. క్రి. గాలియాడక శరీరము తపించు.

ఉక్కపెట్టు : ద్వ. అ. క్రి. ఎండకాలమున గాలిలేక దేహము తపించు.

ఉక్కపోయు : ద్వ. అ. క్రి. (ఉక్క + పోయు) ఉక్కపెట్టు.

ఉక్కఁబట్టు : వై. స. క్రి. 1. ఊపిరాడకుండ మూయు.
2. విడిచిపెట్టు, మాను, కాశీ. 3 ఆ.

ఉక్కఱు : దే. అ. క్రి. (ఉక్కు+అఱు)
1. ఉక్కడఁగు, దుర్బలముగు, భార. ఆర. 4 ఆ.
2. దైన్యమందు, అధైర్యపడు. భార. ఉద్యో. 3 ఆ.
3. బెదరు, భయపడు. భార. విరా. 5 ఆ.

ఉక్కళించు : దే. స. క్రి. పచ్చిపసిమి పోవునట్లు గిన్నెలో వేచు.

ఉక్కసిల్లు : దే. అ. క్రి. పగులు.

ఉక్కాడు : దే. అ. క్రి. (ఉక్కు+ఆడు) పగగొను, విరోధించు భార. శాం. 3 ఆ.

ఉక్కించు : దే. స. క్రి త్రొక్కు. భాగ. 3 స్కం.
పరితపింపజేయు.

ఉక్కిపోవు : దే. అ. క్రి. చెమటవలన బాధపడు.

ఉక్కిరిబిక్కిరియగు: దే. అ. క్రి. సంక్షోభమందు.

ఉక్కుమడఁగు : దే. అ. క్రి. (ఉక్కు+మడఁగు)
1. ఉక్కుచెడు. భార. విరా. 5 ఆ.
2. చచ్చు. (చూ. ఉక్కుమడఁచు)

ఉక్కుమడఁచు : దే. స. క్రి. (ఉక్కుమడఁగు ధా. ప్రే.)
ఉక్కుచెడఁజేయు, చంపు. భార. ఉద్యో. 4 ఆ.

ఉక్కుమిగులు: దే.అ.క్రి. (ఉక్కు+మిగులు) 1. బలమును కనబఱచు
2. పరాక్రమము నెఱపు.
3. ప్రబలు, అతిశయించు. భార.భీష్మ.1ఆ.

ఉక్కుమీఱు : దే. అ. క్రి. (ఉక్కు+మీఱు) ప్రబలుడగు.
భాగ. 6 స్కం. ఉ.రా. 3 ఆ.

ఉక్కుమెఱయు: దే. అ. క్రి. శౌర్యమును ప్రదర్శించు.
ఉక్కుమీఱు. భా. రా. అర. 1 ఆ.

ఉక్కురోషపడు: దే. అ. క్రి. అసమర్థముగా కోపపడు.

ఉక్కువడు: ద్వి. అ. క్రి. (ఉక్కు+పడు.)
1. దుర్బలుఁడగు. హర. 6 ఆ.
(ఉక్కివడు ముద్రి.)
2. దైన్యమందు. హర. 6 ఆ.
(ఉక్కెవడి ముద్రి.)

ఉక్కెక్కు: దే. అ. క్రి. (ఉక్కు+ఎక్కు) బలిష్ఠమగు.
కాళ. 4 ఆ.

ఉక్కోలుకొను: దే. స. క్రి. ఆచ్ఛాదించు, క్రమ్ముకొను.
—పౌజులుతీర్చి కదలి
దుగ్రాంశుపదధూళి యుక్కోలుకొనఁగ.
క. వ. రా. యు. కాం.

ఉక్రోషపడు: దే. అ. క్రి. (ఉక్కు+రోషము) రోషాతిశయమును బొందు.

ఉగియు: దే. అ. క్రి. ఉరియు, స్రవించు. పండితా. మహిమ.

ఉగ్గగట్టు: దే. స. క్రి. (ఉగ్గు+కట్టు) బిగించు. వి. పు. 7ఆ.

ఉగ్గఁబట్టు: దే. అ. క్రి. అన్నపానాదులు చేయక, కార్యసాధనకు బెదరించు.
బిగబట్టు (చూ) ఉక్కబట్టు.

ఉగ్గడించు: వై. అ. క్రి. శబ్దించు. గలుగల్లు మను.
'బంగరుటందియ లుగ్గడింపగన్.
పాండు. 2 ఆ.

స. క్రి. 1. ప్రకటించు, వెలిపుచ్చు.
భార. విరా. 1 ఆ.
2. వచించు, చెప్పు. హరి. ఉ. 3 ఆ.

**ఉగ్గడించు :** 3. వర్ణించు, కొనియాడు.
భాగ. 3 స్కం. భార. ఉద్యో. 3 ఆ.
4. ఉచ్చరించు, పఠించు.
చంద్రి. 6 ఆ. నైష. 4 ఆ.
5. (గ్రంథాదులు) రచించు. వ్రాయు.
ఉద్భ. 1 ఆ.

**ఉగ్గముకట్టు :** దే. అ. క్రి. చెంబు మొదలగువాని మూతికుతికిలో త్రాడుగట్టి పైకిదీసి, ఉగ్గమునలెచేయు. నాలుగుమూలలు భద్రముగా సమకూర్చు.

**ఉగ్గళించు :** నై. అ. క్రి. నట్టువుఁడు కొలిపించు. (శ.ర.) తద్ధిత్తాది శబ్దములను తాళానుసారముగ పలుకు.
స. క్రి. 1. కౌగిలించు. గంధ. 1 ఆ.
2. పెంచు, పెరిగించు. అప్ప. 4 ఆ.

**ఉగ్గలు :** దే. అ. క్రి. (ఉగ్గు+అలు)
1. ముడుతలులేక స్నిగ్ధమైయుండు.
2. బిగువులేకపోవు.

**ఉగ్గించు :** దే. స. క్రి. నేఁతనేయునపుడు పడుగుపేకలపోగులను చేర్చు. (శ.ర.)

**ఉగ్గుపెట్టు :** (తెలం) దే. స. క్రి. 1. పసిపిల్లలకు బియ్యమువేయించి మెత్తగా నండి అన్నముపెట్టు.
2. పసిపిల్లలకు ఆముదముతో చనుబాలు కలిపిపెట్టు.

**ఉగ్గులువాలు :** దే. అ. క్రి. (నూలుపోగు) మెలివడు (శ.ర.)

ఉగ్గువడు : ద్వ. అ. క్రి. (ఉగ్గు+పడు)
1. క్షీణించు, చెడు. కళ. 1 ఆ.
2. ముడుతపడు. కవిక.5 ఆ. (శ.ర.పా)
(తగ్గుపడి. ముద్రి.)

ఉచ్చపోయు : ద్వ. అ. క్రి. మూత్రవిసర్జనముచేయు.

ఉచ్చరించు . సం. స. క్రి. 1. వాక్రుచ్చు, చెప్పు.
2. పలుకు.
3. రచించు. చంద్ర. వి. 1 ఆ.

ఉచ్చరియించు : సం. స. క్రి. ఒనరించు, చేయు. శ్రీ.రం.మా. 2 ఆ.

ఉచ్చలించు : సం. అ. క్రి. కదలు.

ఉచ్చాటనచేయు : సం. స. క్రి. వెళ్ళగొట్టు.

ఉచ్చాటనముసేయు: సం. స. క్రి. పెల్లగించు

ఉచ్చాటించు: సం. స. క్రి. వేళ్ళతో పెల్లగించు. హరి. పూ. 6 ఆ.

ఉచ్చిపాఱు :
ఉచ్చిపోవు :
ఉచ్చివెడలు :
} దే. స. క్రి. భేదించుకొనిపోవు.

ఉచ్చు : దే. అ. క్రి. 1. వెలువడు, బయటకువచ్చు.
భార. భీష్మ. 3 ఆ. భార. పూ. 83.
2. అంకురించు, మొలచు.
వరాహ. 6 ఆ.
3. నొచ్చుకొను.- సుయోధనుని
యుల్లం బుచ్చిపో నాడుమీ.
భార. ఉద్యో. 97.
స. క్రి. 1. భేదించు, చీలుచు.
స్వా. 4 ఆ. భార. విరా. 5 ఆ.
2. నాటు,గ్రుచ్చుకొను.ఉ.రా.4 ఆ.
3. విడుచు, వెలువఱచు. శివలీ.2 ఆ.

ఉచ్చులుపన్ను : దే. స. క్రి. 1. జంతువులను చంపుటకై వలలు మున్నగునవి పన్ను.
2. పడగొట్ట యత్నించు.

ఉచ్చువేయు (రూ) ఉచ్చులువేయు: దే. స. క్రి. 1. ఉరులలో బంధించు.
2. పశువుల బంధించు, ముడివేయు.
3. పన్నాగములు పన్ను.

ఉచుకరించు : దే. అ. క్రి. ఉచుక్కుమను. (అనాదరము తెలుపు ధ్వన్యనుకరణము)

ఉచ్ఛేదించు : సం. స. క్రి. పెఱుకు.

ఉజ్జగించు : దే. స. క్రి. 1. విడుచు. నిర్వ. 5 ఆ.
2. సమాప్తిచేయు. భార. కర్ణ. 1ఆ.
3. చల్లార్చు, నశింపజేయు. పాండు. 2 ఆ.
4. నిరసనచేయు. విజ. 1 ఆ.

ఉజ్జగింపించు : దే. స. క్రి. (ఉజ్జగిల్లు ధా. ప్రే.)
1. ముగింపించు.
2. సమాప్తి నొందించు. పాండు. 2 ఆ.

ఉజ్జగిలు : దే. అ. క్రి. పోవు, నశించు. స్వా. 5 ఆ.

ఉజ్జగిల్లు : దే. అ. క్రి. ఉజ్జగిలు. శివరా. 3 ఆ.

ఉజ్జగొను : దే. స. క్రి. (ఉజ్జ+కొను) లక్ష్యముచేయు, సరకుగొను. రుక్మాం. 5 ఆ. శ.ర.పా. ఉజ్జగించు. ముద్రితక్రమము ననుసరించి శ. ర. పాఠమే గ్రాహ్యము.
ఊహించు. రుక్మాం. 5 ఆ

ఉజ్జనసేయు : ద్వం. స. క్రి. [ఉజ్జనము + చేయు] త్యజించు, విడుచు. కాశీ. 4. ఆ.

ఉజ్జాడించు : దే. స. క్రి. పలుగువేసి కదల్చు

ఉజ్జాయించు : దే. స. క్రి. ఊహించు (శ. ర.)

ఉజ్జీవించు: సం. అ. క్రి. 1. బ్రతుకు. 2. చక్కగాఁబెలుగు ఉ. రా. 6 ఆ.

ఉజ్జృంభించు : సం. అ. క్రి. చెలరేగు, విజృంభించు. హర. 7 ఆ.

ఉటంకించు : దే. స. క్రి. సంగ్రహించు శ. ర.
2. ఉదాహరించు
3. ఎత్తిపాడుచు (వా)

ఉట్టంకించు : సం. స. క్రి. స్తుతించు శతకంఠ. 1 ఆ.

ఉట్టాడు : దే. అ. క్రి. ఊటాడు, త్వరపడు. పాండు. 1 ఆ.

ఉట్టికట్టుక ఊఁగు: }
ఉట్టికట్టుకఊఁరేగు : } దే. అ. క్రి. 1. స్థిరముగానుండు
2. ఒక్కడే ఉండు
3. స్వార్థపరు డగు

ఉట్టిపడు : దే. అ క్రి. (ఉట్టి+పడు)
1. కాఱు, స్రవించు. భాగ. 6 స్కం.
2. ప్రత్యక్షమగు; స్పష్టముగాఁ దోచు ప్రభా. 1. ఆ. పెద. శకుం. 2 ఆ.
3. అతిశయించు.పెంపొందు. కళా.6 ఆ.
4. శీఘ్రముగా వచ్చు. బహు. 3. ఆ.
5. ఆకస్మికముగా కలుగు. భాగ.6 స్కం.
6. ఊడిపడు, దిగివచ్చు. కాళిందీ. 3 ఆ.

ఉట్టు : దే. అ. క్రి. కల్లుమొదలగునవి బొట్టు బొట్టుగా ఊరు,లేక, కాఱు. (నె. జి.)
1. పుట్టు, కలుగు ద్వా. 7. ఆ
2. స్రవించు, కారు. భార. ద్రో. 5 ఆ భార. శాం. 3 ఆ.

ఉట్టికెక్కు : (తెలం) దే. అ. క్రి. భద్రముగా నుండు
ఉడాయికొట్టు : అన్య దే. అ. క్రి. బుకాయించు
ఉడాయించు : అన్య దే. అ. క్రి. 1. సరకుగొనకపోవు
2. సులభముగా దాటు
3. విదలించు
4. తప్పించుకొని పాఱిపోవు
ఉడికించు : దే. స. క్రి. (ఉడుకు ధా. ప్రే.) కోపము కలుగునట్లు చేయు.
1. పిండి, కూర మున్నగునవి ఉడుకునట్లు చేయు.
2. ఎత్తిపొడుచు, పరిహాసము చేయుచు లోపములను చాటు.
(ఉటకాడించు. ఉడకాడించు. ఉడుకాడించు) రూపాంతరములు.
ఉడికిలు : } దే. అ. క్రి. ఉడికిల్లు (ఆం. పా.)
ఉడికిల్లు : } 1. ఉడుకు, తపించు (శ.ర.బ్రౌ)
2. ఒరులు పరిహాసించిన బాధపడు. [వా]
ఉడిగించు, ఉడివించు : దే. స. క్రి. (ఉడుగు ధా. ప్రే.)
1. నిలిపివేయు, మాని పించు
భార. ఆది. 2. ఆ.
2. సంహరించు, రూపుమాపు.
హరి. 7. ఆ.
3. పోగొట్టు, అణచు. భార.ఆది.6 ఆ.
ఉడిగిపోవు . దే. అ. క్రి. (ఉడిగి + పోవు) ఉడుగు, వ్యర్థమగు,
వ...... ఉడిగిపోయిన ప్రమాకునం బోలెఁ బండ్లు డుల్లి. కవిక. 4 ఆ.

ఉడిపుచ్చుకొను : దే. స. క్రి. పోగొట్టుకొను, భంగపఱచుకొను
"మునుపటి పతివ్రతలు మహామూర్ఖచిత్తు
లైన దుర్జను లతిఘోరసూనసాయ
కాస్త్ర జర్జరితాత్ము లై యాసపడిన
మాన ముడిపుచ్చుకొనిరఁటే మచ్చకంటి."
హంస వింశతి. 1-127

ఉడివించు : దే. స. క్రి. (ఉడుపు ధా. ప్రే.)
1. నిలిపివేయు. భార. ఆది. 2 ఆ.
2. నశింపఁజేయు. భార. ఆది. 7 ఆ.

ఉడివుచ్చు : దే. స. క్రి. (ఉడిగి + పుచ్చు)
చెఱచు, భంగపఱచు. హంస. 1 ఆ.

ఉడుపు : దే. స. క్రి. అణగించు, నిరోధించు, ఎక్కునుడించు,
వదలు, పోఁగొట్టు, ఆపు, మాన్చు.

ఉడ్పు-ఉడుపు : దే. స. క్రి తీర్చు, మానుపు. ద్వి.హరిశ్చ.ఉ.1718

ఉతకలెత్తు : దే. స. క్రి. దొంగతనముచేయు

ఉతుకు : దే. స. క్రి. మురికి పోవుటకై తడిపినబట్టలు రాతి
మీదవేసి గుంజు
2. కొట్టు(వ్యవ.)వానిని రెండుతుకుము.

ఉత్కంపించు : సం. అ. క్రి. వణకు; హరి.ఉ. 9. ఆ.

ఉత్కర్షించు : సం. స. క్రి. స్తుతించు, వేం. పంచ.2.ఆ.
అ. క్రి. అతిశయించు, పెంపొందు
భార. అను. 4 ఆ.

ఉత్క్రమించు : సం. అ. క్రి. నిష్క్రమించు, వెడలిపోవు (ప్రాణి.)
కవిక. 5. ఆ.

ఉత్క్రోశించు: సం. అ. క్రి. ఉప్పొంగు, హర్షించు. ద్వా. 4. ఆ.

ఉత్క్షేపించు. సం. స. క్రి. ఎగజిమ్ము. భా. రా. కిష్కిం. 808.

ఉత్తంభించు : సం. స. క్రి. 1. నిలుపు. శ. ర.
2. పొడిగించు. శ. ర.

ఉత్తరించు : / ఉత్తరియించు: } ఉభ. దే. స. క్రి. 1. ఖండించు, నఱకు. ఉ. రా. 2ఆ.
2. తెగనఱకు, తిరస్కరించు. పాండు. 3 ఆ.

సం. స. క్రి. 1. నద్యాదులను దాటు. భాగ. 3. స్కం
2. కడచను, దాటి ముందునకుఁ బోవు నై. 7 ఆ.

ఉత్తరమాడు : మి. అ. క్రి. బదులుపల్కు.

ఉత్తరమించు: సం. అ. క్రి. (ఉత్తరము + మించు). ఉత్తరదిక్కు దాటు. భా. ఆర.

ఉత్తలపడు : (ఉత్తలము + పడు) ద్వి. అ. క్రి.
1. క్షోభించు, కలఁతనొందు భార. భీష్మ. 2. ఆ.
2. త్వరపడు, తొందరచెందు. హరి. ఉ. 7. ఆ.
3. తారుమారగు భో. 4. ఆ.
4. పరితపించు భార. విరా. 5 ఆ.

ఉత్తలపెట్టు : దే. స. క్రి. (ఉత్తలము + పెట్టు)
1. పరితపింపజేయు. భార. ద్రో. 2 ఆ.
2. త్వరపెట్టు.
3. తారుమారొనర్చు.
4. కలఁతనొందించు. శ. ర.

ఉత్తలపొందు : దే. అ. క్రి. కలఁతపొందు

ఉత్తాడించు సం. అ. క్రి. తాడనముచేయు. కొట్టు. కాశీ 7 ఆ.

ఉత్థానించు : సం. స. అ. క్రి. 1. లేపు 2. లేచు

ఉత్థాపించు : సం. స. క్రి. నిగిడించు వేం. పంచ. 3 ఆ.
ఉత్పాటించు : సం. స. క్రి. పెకలించు. పారి. 4 ఆ.
ఉత్పాదించు : సం. స. క్రి. 1. పుట్టించు. కాశీ. 3 ఆ.
2. వెలిగించు. హర. 3 ఆ.
ఉత్పాదిల్లు : సం. అ. క్రి. 1. బయలువెడలు. భీమ. 4 ఆ.
2. కలుగు. భార. సభా. 2 ఆ.
3. ప్రవేశించు. భాగ. 3 స్కం.
4. జన్మించు, పుట్టు. భార. ఆది. 3 ఆ.
ఉత్ప్రేక్షించు : సం. స. క్రి. 1. ఊహించు.
2. ఉత్ప్రేక్షాలంకారముతో వర్ణించు.
3. ఉత్ప్రేక్షతో చెప్పు.
ఉత్సర్జించు : సం. స. క్రి. విడుచు. కాశీ. 6 ఆ.
ఉత్సహించు : సం. అ. క్రి. 1. ఉత్సాహపడు. దశా. 2 ఆ.
2. కడగు. భార. శాం. 4 ఆ.
ఉత్సాదించు : సం. స. క్రి. 1. పెల్లగించు.
2. పైకెత్తు.
3. నాశనముచేయు. భార. ఆది 3 ఆ.
ఉత్సారించు : సం. స. క్రి. 1. కదలించు. 2. తొలగించు.
ఉత్సాహించు : సం. అ. క్రి. 1. ఉత్సాహపడు. స. శ. 26
2. యత్నించు. చంద్రా. 4 ఆ.
3. ఉప్పొంగు, చెలరేగు. జై. 6 ఆ.
ఉత్సేకించు : సం. అ. క్రి. 1 అతిశయించు. 2. గర్వించు.
3. పొంగు. 4. ఉప్పొంగు.
ఉత్సృజించు : సం. స. క్రి. విడుచు.
ఉదకమాడు :
ఉదకములాడు : } మి. అ. క్రి. ప్రసవించు.

ఉదయించు : సం. అ. క్రి. 1. సూర్యచంద్రాదులు పొడముట.
2. కలుగు. భార. శాం. 3 ఆ.
3. ప్రవేశించు.
'వసంతకాల ముదయించెన్ సౌఖ్య
సంధాయియై' భీమ. 5 ఆ.

ఉదరిగొను : దే. అ. క్రి. (ఉదరి + కొను)
1. వంగు.
2. తపించు. హ. 5 ఆ.

ఉదరిపడు : ద్వి. అ. క్రి. అదరిపడు. హరి. ఉ. 7 ఆ.

ఉదరు : దే. అ క్రి. 1. అదరు. హరి. ఉ. 7 ఆ.
2. విజృంభించు. భాగ. 8 స్కం.
3. కోపించు. భార. ఆది. 6 ఆ.
4. భయపడు.
ద్వి. హరిశ్చ. పు. 406. కు. సం. 12 ఆ.

ఉదలు : దే. స. క్రి. విడుచు. (చూ. ఉదలుచు)

ఉదలుచు : దే. స. క్రి. (ఉదలు + చు. స్వార్థమున 'చు' వర్ణము.)
1. విడుచు. భార విరా. 2 ఆ.
2. విడిపించు. (చూ. ఉదల్చు).

ఉదల్చు : దే. స. క్రి. విడిపించు. భార. అర. 6 ఆ.

ఉదాసించు : సం. స. క్రి. 1. తిరస్కరించు.
2. ఉపేక్షించు. దశా. 7 ఆ.

ఉదాహరణముచేయు: సం. స. క్రి. ఉట్టంకించునట్లు చేయు. (చాటు)

ఉదాహరించు : సం. స. క్రి. 1. ఉదాహరణముగాఁ జెప్పు.
కళా. 7 ఆ.
2. ఉదాహరణముగాఁ జూపు.
శుక. 3 ఆ.

ఉదిరిపడు : ద్వి. అ. క్రి. అదరిపడు, దశా. 4. ఆ.

ఉదియసేయు : నై. అ. క్రి. (ఉదియ+చేయు) యత్నించు.
నై. 8 ఆ.

ఉదిలకొను : దే. అ. క్రి. 1. అధైర్యపడు. భార. ఆది. 2 ఆ.
2. త్వరపడు. నైష. 4. ఆ.
3. వ్యాపించు. హర. 6 ఆ.
4. అతిశయించు. కేయూర. 4 ఆ.
(ఉదిలపడు. రూపాంతరము)

ఉదిలఁగొను : ఉదిలకొను. దే. అ. క్రి. 1. చలించు
భార. శాంతి. 3. ఆ.
2. జంకు, వెనుదీయు. భీమ. 2 ఆ.
3. పరితపించు ఉ. హరి. 5. ఆ

ఉదియకొను
ఉదియగొను } దే. అ. క్రి. యత్నించు.

ఉదిలు : దే. అ. క్రి. 1. పడిపోవునట్లుండు. భీమ. 4. ఆ.

ఉదుకు: ఉతుకు: దే. స. క్రి. 1. మురికిపోవుటకై తడిపిన బట్టలు
రాతిపైగుంజు. ఆము. 1. ఆ.
2. తాడించు. భా. రా. యు. 680
3. నశింపజేయు. భీమ. 6. ఆ.

ఉదుకుష్టపడు :
ఉతుకుష్టపడు : } దే. అ. క్రి. మిక్కిలిగ శరీరాయాసము
ననుభవించు

ఉదుటారు : దే. అ. క్రి. (ఉదుటు+ఆరు) తుళ్ళిపడు.
కాళిందీ. 2. ఆ.

ఉదుటుచేయు : దే. అ. క్రి. విజృంభించు.

ఉదుటెక్కు : దే. అ. క్రి. (ఉదుటు+ఎక్కు) (ప్రాయముచే)
విలాసము కలదగు,
విజృంభించు. ఆము. 6. ఆ.

ఉదురు : దే. అ. క్రి. 1. గర్వించు.
2. తిరస్కరించు ఉ. రా. 6. ఆ.
'కంపించు' అని (సూ. ని.)
3. పాఱు. పోవు. కళా. 6. ఆ.

ఉద్గవించు : సం. అ. క్రి. 1. ఊరు, పైకివచ్చు. భాగ. 3. స్కం.
2. ఎగురు. ఉ. రా. 3 ఆ.

ఉద్గారించు : సం. అ. క్రి. త్రేచు
స. క్రి. వెలిఁగ్రక్కు. విడుచు.
పిన. శకుం. 1. ఆ. ఉద్భ. 2. ఆ.

ఉదాటించు : సం. స. క్రి. 1. కవియు. ఎదుర్కొను.
భాగ. 8. స్కం.
2. భేదించు, పగులఁగొట్టు. నైష. 6 ఆ.
3. చంపు, చావఁగొట్టు. – నిశాచరుల నుద్ఘాటించె. వి. పు. 6. ఆ.
4. ఊడఁగొట్టు, పడగొట్టు.
కాశీ. 7. ఆ.
5. పెఱుకు. ఊడదీయు. భీమ. 6. ఆ.
అ. క్రి. వ్యాపించు, విస్తరించు.
వరాహ. 1. ఆ.

ఉద్ఘోషించు : సం. అ. క్రి. ఉఱుము. కవిక. 6. ఆ.
స. క్రి. నొక్కి చెప్పు.

ఉద్దండించు : సం. అ. క్రి. వ్యాపించు. కాశీ. 1. ఆ.
స. క్రి. విడుచు, త్యజించు.
భాగ. 10. స్కం. పూ.
అతిశయించు, విజృంభించు

ఉద్దించు : దే. అ. స. క్రి. సరిపోలు, ఎనచేయు. ఉ. హరి. 2 ఆ.
కాళ. 3 ఆ.

ఉద్దించుకొను : దే. అ. క్రి. సరిపోల్చుకొను
ఉద్దిగొను : దే. అ. క్రి. (ఉద్ది + కొను) జంటయగు.
భాగ. 10. స్కం.
ఉద్దిచేయు : దే. స. క్రి. (ఉద్ది + చేయు) జోడించు, జతగూర్చు.
కాశీ. 7. ఆ.
ఉద్దియచేయు : దే. అ. క్రి. యత్నించు,
-మేను దొఱఁగ నుద్దియ చేసె" మించు.
ఉద్దివైచుకొను : దే. అ. క్రి. సమానమగు. కే. చ. 4-147.
ఉద్దీపించు : సం. అ. క్రి. 1. ప్రకాశించు. భాగ. 1. స్కం.218
2. అతిశయించు. భార.భీష్మ.1.ఆ.
స. క్రి. రగుల్చు. వెలిగించు.కు. సం. 6. ఆ.
ఉద్దెసించు : దే. స. క్రి. ఉద్దేశించు. బసవ. 3. ఆ.
ఉద్దేసించు : వై. స. క్రి. ఉద్దేశించు.
ఉద్దేశించు : సం. స. క్రి. 1. గుఱించు. భాగ. 7. స్కం.
2. భావించు. నిర్వ. 4. ఆ.
ఉద్యోతించు : సం. అ. క్రి. ప్రకాశించు. వెలుగొందు.
ద్వా. 1. ఆ. కళా. 2. ఆ.
ఉద్ధరించు : సం. స. క్రి. 1. పెల్లగించు
2. మీదికెత్తు. లేవదీయు. స్వా. 1. ఆ.
3. రక్షించు. మార్కం. 2. ఆ.
ఉద్బోధించు : సం. స. క్రి. 1. మేలుకొలుపు
2. రగుల్చు. వరాహ. 5. ఆ.
ఉద్భవించు : సం. స. క్రి. పుట్టు. భీమ. 3. ఆ.
ఉద్భవిల్లు : సం. అ. క్రి. ఉద్భవించు.
ఉద్భాసిల్లు : సం. అ. క్రి. మిక్కిలి ప్రకాశించు. వసు. 1 ఆ.
ఉద్యమించు : సం. స. క్రి. ప్రారంభించు, మొదలుపెట్టు,
అ. క్రి. కడగు, యత్నించు. భాగ. 4 స్కం.

ఉద్యాపనచేయు: మి. స. క్రి. (ఉద్యాపనము + చేయు) విడుచు, త్యజించు. నైష. 2 ఆ.

ఉద్యోగించు : సం. అ. క్రి. 1. యత్నించు. హరి. పూ. 7 ఆ. పూనుకొను,
2. సిద్ధపడు, భార. ఉద్యో. 1 ఆ.

ఉద్యోతించు : సం. అ. క్రి. ప్రకాశించు.

ఉద్రేకించు : సం. అ. క్రి. 1. అతిశయించు. పాండు. 3 ఆ.
2. కలఁగు. కాశీ. 4 ఆ.

ఉద్వసించు : సం. స. క్రి. దేవతాదులను పూజానంతరము స్వస్థానమునఁజేర్చు. కాశీ. 4 ఆ.

ఉద్వహించు : సం. స. క్రి. 1. ధరించు భాగ. 8 స్కం.
2. మోచు. పాండు. 5 ఆ.
3. పట్టుకొను. పాండు. 1 ఆ.
4. పెండ్లియాడు. బ్రహ్మ. 1 ఆ.
5. ఎగఁబట్టు.
6. ఎత్తిపట్టుకొను.

ఉద్వాసనముచెప్పు: మి. స. క్రి. 1. వెళ్ళగొట్టు.
2. దేవతలను పూజాంతమున సమంత్రకముగాఁ బంపించు.

ఉద్వాసించు : సం. స. క్రి. విడనాడు. నిర్వ. 9 ఆ.

ఉద్విగ్నమగు : సం. అ. క్రి. వ్యాకులమగు, భయమగు. భాగ. 10 స్కం.

ఉద్వీక్షించు : సం. స. క్రి. చూచు. కాశీ. 6 ఆ. ఆవేశపడు.

ఉద్వేగించు . సం. అ. క్రి. 1. వ్యాకులపడు.
2. భీతిల్లు. కు. సం. 9 ఆ.

ఉద్వేగిల్లు : దే. అ. క్రి. భయపడు. హరి. పూ. 8 ఆ.

ఉనుకు : దే. అ. క్రి. తెలియు. క. వ.రా. సుంద. 2105
ఉనుకువగొను : దే. అ. క్రి. (ఉనుకువ+కొను) ఉండు, నివసించు. పాండు. 4 ఆ.
ఉనుచు :
ఉంచు : } దే. స. క్రి. ఉంచు, ఉండఁజేయు.
ఉనుపు : దే. స. క్రి. బట్టలను రంగుగలవానిగా చేయు.
ఉన్నతిల్లు : సం. అ. క్రి. మిక్కుటమగు. కు. సం. 7. ఆ.
ఉన్మార్జించు : సం. స. క్రి. తుడిచివేయు. హరి. ఉ. 4. ఆ.
ఉన్ముద్రించు : సం. స. క్రి. వెల్లడిచేయు కాశీ. 7 ఆ.
ఉన్మూలించు : సం. స. క్రి. 1. పెల్లగించు. భీమ. 4. ఆ.
2. చంపు. భాగ. 7. స్కం.
3. నశింపజేయు. దశా. 6. ఆ.
భార. ఆర. 3 ఆ.
ఉపకరించు : సం. అ. క్రి. ఉపయోగించు. పారి. 5. ఆ.
ఉపక్రమించు : సం. అ. స. క్రి. మొదలిడు. రామా. 4. ఆ.
మార్కం. 2. ఆ.
ఉపచరించు : సం. స. క్రి. 1. సమ్మానించు. మల్హా. 3 ఆ.
2. సేవించు. ఉ.హరి. 1 ఆ. సా. 3 ఆ.
3. బోధించు. నిరం. 4 ఆ.
4. ఉపచారముచేయు.
భార. స్త్రీ. 2 ఆ.
ఉపజీవించు : సం. స. క్రి. ఆశ్రయించి జీవించు.
భార. అను. 1 ఆ.
ఉపతపించు : సం. స. క్రి. 1. దుఃఖపడు.
2. అసూయపడు. కాశీ. 3 ఆ.
ఉపతాపపడు : సం. అ. క్రి. బాధపడు.
ఉపతాపమొనరించు: సం. స. క్రి. బాధకలుగజేయు. భార. ఆది. 3 ఆ.

ఉపతాపించు : సం. అ. క్రి. దుఃఖపడఁజేయు.
ఉపదర్శన మాచరించు: సం. అ. క్రి. పెత్తనముచేయు, కాశీ. 7 ఆ.
ఉపదేశమగు : సం. స. క్రి. బోధనయగు.
ఉపదేశించు : సం. స. క్రి. బోధించు. మార్కం. 2 ఆ.
ఉపధావించు : సం. స. క్రి. వెంబడించు. కాశీ. 3 ఆ.
ఉపన్యసించు : సం. స. క్రి. వివరించు, చెప్పు.
భార. శాం. 1 ఆ. అను. 4 ఆ.
ఉపపాదించు : సం. స. క్రి. 1. తెలుపు. హరి. ఉ. 2 ఆ.
2. ఒకవిషయమును ప్రవేశపెట్టు.
ఉపభోగించు : సం. స. క్రి. అనుభవించు. రంగా. 3 ఆ.
ఉపమానించు : సం. స. క్రి. ఉపమించు.
ఉపమించు : సం. స. క్రి. 1. పోల్చు. సాదృశ్యము చెప్పు.
పాండు 4. ఆ. భార. సభా. 1 ఆ.
2. పోలు, సదృశమగు,
స్వా. 6. ఆ. భార. ఆది. 5. ఆ.
ఉపయోగపడు : సం. అ. క్రి. మేలు చేకూర్చు.
ఉపయోగించు : సం. అ. క్రి. 1. ఉపయోగపడు. భాగ. 3. స్కం.
2. ఒదవు. లభించు. శ.ర.
స. క్రి. 1. భక్షించు. తిను. భార. ఆర. 1. ఆ.
2. అనుభవించు. వినియోగించు.
భార. ఆది. 5. ఆ.
ఉపరమించు : సం. స. క్రి. వదలు. పరిత్యజించు.
ఉపరోధించు : సం. స. క్రి. అడ్డగించు. భార. ఆర. 7. ఆ.
ఉపలక్షించు . సం. స. క్రి. చూచు. భాగ. 8. స్కం. భార. ఆర. 2 ఆ.
ఉపలాలించు : సం. స. క్రి. బుజ్జగించు. భార. శాం. 1. ఆ. వి. పు. 6 ఆ.
ఉపవరమగు : దే. అ. క్రి. మేలుకొను. మెలకువ గను. శుక. 1 ఆ.

ఉపవసించు : స. అ. క్రి. ఉపవాసముచేయు, పస్తుండు.
కాశీ. 7. ఆ.

ఉపవేశించు : సం. అ. క్రి. కూర్చుండు. భాగ. 1. స్కం.

ఉపశమించు : సం. అ. క్రి. 1. శాంతించు.
2. తగ్గు; క్షీణించు.
3. అడఁగు, నశించు.
స. క్రి. 1. శాంతింపఁజేయు. భాగ. 4. స్కం.
2. అణచు. వి.పు. 2. ఆ.

ఉపశమింపఁజేయు: సం. స. క్రి. ఉపశమించు ప్రే.

ఉపశమియించు : సం. అ. స. క్రి. ఉపశమించు, శాంతింపఁజేయు
అహ. 2. ఆ.

ఉపశమిల్లు : సం. అ. క్రి. 1. చల్లారు. భార. ఆర. 1. ఆ.
2. అడఁగు, నశించు. భార. ఆర. 1 ఆ.

ఉపశిక్షించు : సం. స. క్రి. నేర్పు; శిక్షణయిచ్చు,

ఉపశ్లోకించు : సం. స. క్రి. నుతించు, పొగడు. ద్వా. 11. ఆ.

ఉపసంహరించు: సం. స. క్రి. 1. చంపు. లయమొనరించు,
మార్క. 4. ఆ.
2. మఱల్చు, భాగ. 1. స్కం.
3. అణఁచు; ఉపశమింపఁజేయు.
భార. శాంతి. 5 ఆ.
4. ముగించు, పూర్తిచేయు,
5. తిరిగి వెనుకకు లాగుకొను,
—అతడు తీర్మానము నుపసంహరించుకొనెను. (వ్యవ.)

ఉపసర్పించు : సం. స. క్రి. సమీపించు.

ఉపస్తరించు : సం. స. క్రి. అభిఘరించు. భీమ. 2 ఆ. హర. 2 ఆ.

ఉపహసించు : సం. అ. క్రి. నవ్వు. కు. సం. 7 ఆ.
స. క్రి. పరిహసించు, ఎగతాళి చేయు.

ఉపార్జించు : సం. స. క్రి. సంపాదించు. భార. శాం. 1 ఆ.

ఉపాలంభించు : సం. స. క్రి. దూఱు. నిందించు. భాగ. 8 స్కం.

ఉపాశ్రయించు: సం. స. క్రి. సేవించు, కొలుచు. సమీర. 1 ఆ.

ఉపాసించు : సం. స. క్రి. 1. సేవించు, కొలుచు. భార. శాం 1 ఆ.
2. పారాయణముచేయు. నిర్వ. 10. ఆ.

ఉపేక్షించు : సం. స. క్రి. అశ్రద్ధచేయు; విడిచిపుచ్చు.
భాగ. 3 స్కం.

ఉప్పడించు, ఉప్పళించు: దే. స. క్రి. 1. గుడ్డలు వేడినీటిలో వేసికుంజు
2. బట్టను పేరుకొన్న మురికి వదలుటకు ముద్దగా గుంజు.

ఉప్పతించు : దే. స. క్రి అసహానముచే బరులపై నిందారోపణము చేయు. పార్వతీ. 6 ఆ.

ఉప్పతిలు (ల్లు). వై. అ. క్రి. 1. కలుగు; పుట్టు. భాగ. 7 స్కం.
2. సంభవించు; తటస్థించు. కాశీ. 1 ఆ.
3. అతిశయించు; పెంపొందు.
భీమ. 5 ఆ.
4. పూర్ణమగు, నిండు. దశా. 6 ఆ.
5. (దాహాదులు) అగు.
భాగ. 8 స్కం.

ఉప్పవడు : దే. అ. క్రి. చప్పవడు.

ఉప్పయనము సేయు : దే. అ. క్రి. గుమికూడు, మొత్తమగు.
కు. సం. 3 ఆ.

ఉప్పరముదాఁటు: ద్వ. అ. క్రి. (ఉప్పరము + దాటు) వ్యాపించు; విస్తరించు; మిన్నుముట్టు.
ఉ. హరి. 5 ఆ.

ఉప్పరమెత్తు : దే. అ. క్రి. ఆకాశమున కెత్తు.
ఉప్పరించు : దే. స. క్రి. పై కెత్తు. ఉ.హరి. 6 ఆ.
ఉప్పవడమగు : దే. అ. క్రి. ఉపవడమగు. వాల్మీ. 3 ఆ.
ఉప్పళించు : దే. అ. క్రి. ఉప్పరించు.
ఉప్పు : దే. స. క్రి. 1. ఉడుకబెట్టు. కాళ. 3 ఆ.
2. గుడ్డలు చవుడులోనుప్పు.
ఉప్పుతిను : దే. స. క్రి. 1. ఆశ్రయించిబ్రదుకు.
2. సొమ్ముతిను.
3. ప్రాపుపొందు.- వాఁడు నాయుప్పు తిని నాకే ముప్పు తలపెట్టినాడు. (వ్యవ)
ఉప్పుతో తొమ్మిదియుండు: దే. అ. క్రి. సర్వసమృద్ధముగా నుండు. -ఉప్పుతో గూడ తొమ్మిదియుండునచట. మించు.
ఉప్పురియు: దే. అ. క్రి. నమ్మైపోవు; చిఖికిపోవు; ఉరెసిపోవు.
ఉప్పెనబోవు : దే. అ. క్రి. కొట్టుకొనిపోవు.
ఉప్పెల్లు : దే. అ. క్రి. చవుడుబాఱు, సవరెక్కు.
ఉప్పొంగు : దే. అ. క్రి. (ఉబ్బి+పొంగు.)
1. మిక్కిలిపొంగు. భార. ఉద్యో. 4 ఆ.
2. అధికమగు. భార. ఉద్యో. 2 ఆ.
3. మిక్కిలి సంతోషించు. పారి. 2 ఆ.
ఉబలాటపడు : ద్వ. అ. క్రి. (ఉబలాటము+పడు.)
1. మిక్కిలి కోరు.
2. ఉత్కంఠతోనుండు. తహతహపడు.
ఉబుకు : దే. అ. క్రి. 1. ఉప్పొంగు, సంతోషించు. శుక. 1 ఆ.
2. పైకిలేచు. శశాం. 3 ఆ.

ఉబుసుపుచ్చు : దే. అ. క్రి. (ఉబుసు + పుచ్చు) కాలక్షేపముసేయు
పారి. 2 ఆ. శుక. 11 ఆ. కాశీ. 3 ఆ.

ఉబుసుపోవు : దే. అ. క్రి. కాలక్షేపమగు. కాశీ. 3 ఆ.

ఉబ్బడఁగు : దే. అ. క్రి. (ఉబ్బు + అడఁగు.)
క్షీణదశనొందు. సాం. ని. మాన. 49
ఆ. స. మాన. 70

ఉబ్బతిలు : వై. అ. క్రి. ఉబ్బు, పొంగు. భాగ. 8 స్కం.

ఉబ్బరపోవు : ద్వ. అ. క్రి. (ఉబ్బరము + పోవు.)
1. ఆశ్చర్యపడు. కాశీ. 6 ఆ.
నైష. 3 ఆ.
2. బాధపడు. హర. 2 ఆ.
3. సొమ్మసిల్లు.
4. కడుపు ఎక్కువగా నుబ్బు.
5. భయభ్రాంతులగు.

ఉబ్బరించు : వై. అ. క్రి. 1. ఉబ్బు, పొంగు, (సముద్రము)
కవిరా. 4. ఆ.
2. కడుపుబ్బు (శ. ర. వా.)
3. మారామువట్టు. రం. రా. యుద్ధ.

ఉబ్బరికచేయు : దే. అ. క్రి. (ఉబ్బరిక + చేయు,) విజృంభించు
భాగ. 10. స్కం.

ఉబ్బలబడు : దే. అ. క్రి. ఉబ్బవేయు. వేం. ప. 4. ఆ.

ఉబ్బసపుచ్చు : ద్వ. అ. క్రి. (ఉబ్బసము + పుచ్చు) ఆయాసపడు,
స. క్రి. ఆయాసపెట్టు ద్వా. 2. ఆ.

ఉబ్బించు : దే. స. క్రి. (ఉబ్బు ధా. ప్రే.)
1. పొంగఁజేయు హర. 6. ఆ.
2. వృద్ధినొందజేయు, పెంచు. ఉ. రా. 2. ఆ.
3. ముఖస్తుతిచే నానందింపఁజేయు. విక్ర. 7. ఆ.

ఉబ్బు : నై. అ. క్రి. 1. పొంగు. వి. పు. 7. ఆ.
2. ఉద్ధతమగు, నైష. 8. ఆ.
రం. రా. ఆర.
3. అతిశయించు, కాశీ. 1. ఆ.
4. గర్వించు. భార. ఉద్యో. 2. ఆ.
5. వేడుకపడు ఆము. 4. ఆ.
6. సంతోషించు. ఉ. రా. 2. ఆ.
7. ప్రకటమగు. కాశీ. 3. ఆ.
8. విస్తరించు. పారి. 5. ఆ.

ఉబ్బెత్తు : నై. అ. క్రి. ఉబుకు.

ఉబ్బసపోవు : నై. అ. క్రి. ఉబ్బరపోవు.

ఉభయతోముఖిఁబట్టు : మి. స. క్రి. ఉభయతోముఖియైన, అనగా ఈనుచున్న గోవును దానముపట్టు (మ. దా. వి.)

ఉమియు నై. అ. క్రి. ఉమ్మివేయు భార.ఆర. 4 ఆ.
స. క్రి. 1. వెడలఁగ్రక్కు, ఆము. 4. ఆ.
2. నోటినుండి పారవేయు
కు సం. 4. ఆ.
3. వెలువఱచు. హరి. పూ. 2 ఆ.
(ఉముచు; ఉమ్మూ; రూ)

ఉమ్మగించు : దే. అ. క్రి. ఉక్కపెట్టు

ఉమ్మగిల్లు : నై. అ. క్రి. 1. ఆవిరిచే నుడుకు. (శ.ర.)
2. వార్చియుంచిన అన్నము మొదలగునవి పాత్రవేడిమిచే నుడుకునందలి తడితొలగు. స్వా. 4 ఆ.

ఉమ్మదించు : దే. అ. క్రి. ఉక్కపోయు.

ఉమ్మలించు : దే. అ. క్రి. 1. బాధపడు. భార. శల్య. 2 ఆ.
2. తాపమునొందు. కాశీ. 2ఆ. నిర్వ. 8ఆ

ఉమ్మలికపడు : దే. స. క్రి. బాధపడు.

ఉమ్మలికించు : దే. అ. క్రి. దుఃఖించు. వి. పు. 5 ఆ.

ఉమ్మవేయు : దే. అ. క్రి. 1. ఉక్కపోయు.
2. ఎండ బాధనొందు. (నె. జి.)

ఉమ్మసలారు : దే. అ. క్రి. ఉమ్మపోయు. కేయూర.

ఉరడించు :
ఉరవణించు : } దే. అ. క్రి. ఉగ్గడించు, హరి. ఉ. 8 ఆ. (శ.ర.పా)

ఉరరీకరించు : సం. స. క్రి. సమ్మతించు. చం. రా. 3 ఆ.

ఉరలంగొట్టు : దే. స. క్రి. పడగొట్టు.

ఉర(రు)లంద్రోచు : దే. స. క్రి. (ఉరలన్ + త్రోచు)
దొర్లించు. హరి. పూ. 5 ఆ.
2. వ్రాలు. నృసింహ. 4 ఆ.

ఉరలంబడు : ద్వ. అ. క్రి. (ఉరలన్ + పడు) 1. దొర్లు. (శ.ర.)
2. కూలు. నైష. 6 ఆ.

ఉరలంబాఱు : దే. అ. క్రి. (ఉరలన్ + పాఱు) చలించు.
1. బెదరు. భార. భీష్మ. 3 ఆ.
2. ఉప్పు ఉర్లు.
3. లోపల తంపినలన భూమి పేటుబెట్టు.
(తెలం)

ఉర(రు)లు : దే. అ. క్రి. 1. పడు, రాలు. కు. సం. 4 ఆ.
2. దొర్లు. భాగ. 8 స్కం.
3. పగులు; బీటలుదీయు. భాగ. 8స్కం.
4. దగ్ధమగు. భీమ. 4 ఆ.
5. స్రవించు. భార. విరా. 2 ఆ.
6. వీడు. పాండు. 1 ఆ.

ఉర(రు)లుకొను: దే. స. క్రి. (ఉరలు + కొను) (స్వార్థమున) వీడు; కోలుపోవు. భాగ. 2 స్కం.

ఉరళించు : దే. అ. క్రి. వెలుగు; ప్రకాశించు. శర. బ్రా.

ఉరవడించు : ద్వ. అ. క్రి. 1. వేగిరపడు. రం. రా. యు.
2. విజృంభించు. భార. ఉద్యో.2 ఆ.
3. పరాక్రమించు. భాగ. 7 స్కం.

ఉరవణించు : ద్వ. అ. క్రి. 1. వేగిరపడు.
2. చెలరేగు. భార. కర్ణ. 2 ఆ.
3. దండెత్తు. మార్కం. 6. ఆ.
స. క్రి. 4. ఎదుర్కొను, ప్రతిఘటించు.

ఉరాటంవేయు ; దే. స. క్రి. ఉరిత్రాడు తగిలించు. (సరస్వతీ కల్యాణము).

ఉరిదీయు : దే. స. క్రి. ఉరిపోయు.

ఉరిపోయు : దే. స. క్రి. ఉరిపోసి చంపు. (వా)

ఉరియాడు : దే. అ. క్రి. 1. సంశయించు, సందేహపడు. భార. విరా. 2 ఆ.
2. కళవళపడు; కలఁగు. భార.ఆర.1ఆ.
3. చెదరు; విడివడు. చిత్ర. భా. 8 ఆ.
4. గద్గదికమగు. భార. శల్య. 2 ఆ.

ఉరియు : దే. అ. క్రి. 1. చలించు, కంపమందు. హరి. పూ. 8 ఆ.
2. నెరయు, తెల్లపడు. హంస. 2 ఆ.
3. పక్వమగు, ఉడుకు. భార. శల్య.2 ఆ.
4. పరితపించు భార. మహాస.
5. రాలు, దగ్ధమగు, భోజ.3.ఆ.
6. రేఁగు, రాయిడినొందు.
7. ధ్వనిచేయు [భార. ద్రోణ. 5 ఆ.

ఉరివోయు : దే. అ. క్రి. (ఉరి + పోయు) ఉరిపోసికొనిచచ్చు,
స. క్రి. ఉరిదీయు.

ఉరిసిపోవు : దే. అ. క్రి. ఉరియు

ఉరు : దే. అ. క్రి. 1. మేలగు, శ్రేష్ఠమగు. ఆము.6 ఆ.
2. తగు, ఉచితమగు, భార.శాం.5 ఆ.

ఉరుకు : దే. అ. క్రి. పఱుగెత్తు. [ఉఱుకు. చూ.]

ఉరుజగొను : దే. అ. క్రి. (ఉరుజ + కొను) వ్యాపించు.
భీమ. 2 ఆ.

ఉరులు . దే. అ. క్రి. ఉరలు

ఉరులుకొ(గొ)లుపు : దే. స. క్రి. 1. పడు,రాలు, భార.ద్రోణ.1 ఆ.
2. దొరలు. జాఱిపడు, భార.సౌ.

ఉరు(వు)లొడ్డు: దే .స. క్రి. 1. అపాయముకలిగించుటకు ప్రయత్నించు

ఉరువడించు : ఉరువణించు : దే. అ. క్రి. పరాక్రమించు.
కళా. 8 ఆ.

ఉరువడిగొను . దే. అ. క్రి. వేగముచూపు.

ఉరువడు : ద్వా. అ. క్రి. (ఉరువు + పడు) నెఱవేఱు
సిద్ధించు. కళా. 3. ఆ.
2. వలపన్ను

ఉరువు : ఉభ: దే. స. క్రి. 1. విడుచు, త్యజించు. భార.శాం.6.ఆ.
2. లేవనెత్తు. భాగ. 10. స్కం.
3. వెడలించు, వెలువఱచు. భార. యు.

ఉరువులూదు : దే. స. క్రి. రూపములు కల్పించు. మించు.

ఉర్లబడు : ద్వా. అ. క్రి. ఉరులంబడు
1. కూలు, విఱిగిపడు. చంద్రా. 1. ఆ.
2. బందాలుపడు

ఉర్లిపడు : దే. అ. క్రి. పెళ్లుపెళ్లుగా విఱిగిపడు

ఉర్లు : దే. అ. క్రి. ఉరలు. [ఉరులు చూ.]
1. పడు, రాలు. ఉ. రా. 3. ఆ.
2. దొర్లు; జాఱిపడు. జై. 4. ఆ.

ఉఱకలుపెట్టు : దే. అ. క్రి. 1. ఉత్సాహముపొందు
2. పఱుగులుపెట్టు

ఉఱవగు : దే. అ. క్రి. ఎక్కువయగు, లావగు,

ఉఱిమిచూచు దే. స. క్రి క్రోధాదులచే కండ్లుపెద్దవిగాచేసిచూచు

ఉఱియు : దే. అ. క్రి. 1. ఇల్లులోనగు వాని పైకప్పు చెడి యూ ద్వారమున వర్షమునీరు పడు. కాశీ. 6 ఆ.
2. (వర్షాదులు) కురియు, పడు. శుక. 1 ఆ.
3. కేఁగు.

ఊఱు : యు. నై. అ. క్రి. 1. నచ్చు, ఇష్టమగు. భార. ద్రో. 2 ఆ.
2. తగు, ఒప్పు. భార. 2 ఆ.
3. ధర్మమగు, న్యాయమగు భార. ఆది. 5 ఆ.
4. బయలుదేఱు, పొడము. భా. రా. యు.
5. మేలగు, శ్రేష్ఠమగు.
6. ఉడుగు. మాను.
ఈ క్రింది వానికి వ్యతిరేకార్థము నందే ప్రయోగములు కానవచ్చుచున్నవి. భార. ఆది. 2 ఆ.
7. జంకు, వెనుదీయు. క. కు. 4 ఆ.
స. క్రి. 1. సరకుగొను, లెక్కచేయు. భార. ఆది. 6 ఆ.
2. అంగీకరించు.

ఉఱుకు(ఉర్కు) : దే. అ. క్రి. 1. దుముకు, దూఁకు. భార.విరా.2 ఆ.
2. పాఱు, పఱుగెత్తు. హరిశ్చ. 4 ఆ.
3. బయలుపడు. పద్మ. 7 ఆ.

ఉఱుకులాడు : దే. అ. క్రి. 1. తొందరపడు.
2. దుముకులాడు. (రా. సీ.)

ఉఱుకొ(గొ)ట్టు : దే. అ. క్రి. (ఉఱు + కొట్టు)
1. కోతి ఉఱ్ఱునని ధ్వనిచేయు (శ.ర.)

ఉఱుచు : స. క్రి. 1. పోగొట్టు, నశింపఁజేయు. కు. సం.
అ. క్రి. 2. ఇంటికప్పునుంచి వాన నీరు కాఱు.

ఉఱుసుకించు : దే. అ. క్రి. ఉఱుము.

ఉఱుము : దే. అ. క్రి. గర్జించు. భార. ఆది. 8 ఆ.

ఉఱుముకొను : దే. స. క్రి. గద్దించు.

ఉఱ్ఱటలూగు : దే. అ. క్రి. (ఉఱ్ఱటలు + ఊఁగు)
1. మిక్కిలియూఁగు. కృ.శకుం.2.ఆ.
2. చలించు. శ. ర.

ఉఱ్ఱటలూచు : దే. స. క్రి. (ఉఱ్ఱటలూఁగు ధా. ప్రే.)
మిక్కిలియూచు. వేం. ప. 4. ఆ.

ఉఱ్ఱట్లూఁగు దే. అ. క్రి. (ఉఱ్ఱట్లు + ఊఁగు) మిక్కిలియూఁగు.
శశాం. 5. ఆ.

ఉఱ్ఱాడు : దే. అ. క్రి. [ఉఱ్ఱు + ఆడు] మిక్కిలి చలించు.
హంస. 1. ఆ.

ఉఱ్ఱుకట్టు : దే. స. క్రి. [ఉఱ్ఱు + కట్టు] పాలుతీయునప్పుడు
పశువు కాళ్ళను త్రాటితో కట్టు

ఉఱ్ఱూతలూఁగు: దే. అ. క్రి. [ఉఱ్ఱు + ఊఁతలు + ఊఁగు]
1. మిక్కిలియూఁగు. ఉ. హరి. 4.ఆ.
2. మిక్కిలి చలించు. కాశీ.2.ఆ.
3. వేగిరపడు సురా.47.

ఉలకఁబారు దే. అ. క్రి. (ఉలకన్ + పాఱు) వెలికి ప్రసరించు, భాగ. 8. స్కం.

ఉలవరించు : దే. అ. క్రి. 1. తడిచే నేల పదనగు శ.ర.
2. చేను బాగుగా ఎండ తాకినంతనే పొడియగు.

ఉలికిపడు : ద్వ. అ. క్రి. [ఉలికి + పడు] ఆకస్మికముగా కలిగిన భయాదులచే కంపించు
భాగ. 8. స్కం. భార. ఆది. 1. ఆ.

ఉలియాడు : దే. స. క్రి. [ఉలి + ఆడు] గంట్లు వేయు

ఉలియు : దే. అ. క్రి. 1. మ్రోయు, శబ్దించు. ఆము. 1 ఆ.
2. వెడలు, ప్రకటమగు. పాండు 5. ఆ.
3. తక్కు, పోవు, ఉ. రా. 8. ఆ.
4. చేష్టలుకలుగు. భార. ఆది. 1. ఆ.
5. అఱచు, రుతముచేయు కు. సం. 5. ఆ.

ఉలివాడు : దే. అ. క్రి. [ఉలివు + ఆడు] 1. చలించు
కళా. 2. ఆ.
2. [ఉలి + వాడు] కొంచెమువాడు
కు. సం. 10. ఆ.

ఉలుకు : దే. అ. క్రి. ఉలికిపడు. (రూ)
1. భయపడు, బెదరు.
భార. ఆర. 2 ఆ.
2. తపించు, తప్తమగు. రామా. 5 ఆ.
3. అసూయపడు, చూపోపకపోవు.
భార. ఉద్యో. 2 ఆ.
4. మిఱుమిట్లుగొను. కు. సం. 10 ఆ.
5. పొర్లు, నిండి ప్రక్కకు పాఱు.
6. దోషము బయటపడెనని బెదరు.

ఉలు(ల్చు)చు : దే. స. క్రి. ఊడదీయు.
ఉలుపవట్టు : - అన్య. దే. స. క్రి. ఉలుపావట్టు. పాం:సు. 5 ఆ.
ఉలుపావట్టు : - అన్య. దే. స. క్రి. (ఉలుపా+పట్టు)
1. కానుకిచ్చు, ఇచ్చు.
రామా. 8 ఆ.
ఇట్లు, ఉలుపాలుపట్టు. ఆము. 4 ఆ.
ఉలుపాచేయు. మ. 4 ఆ.
ఉలుపాలించు : దే. స. క్రి. కానుక యిచ్చు.
ఉలుపు : దే. స. క్రి. ఉలుచు.
సీ. మొకములమీఁద గోలుసు
లులిపి జాగిలముల నుసికొలిపి రపుడు. సా.3 ఆ.
ఉలుము : దే. స. క్రి. ఉలుపు.
ఉల్కు-ఉలుకు: దే. అ. క్రి. బెదరు, భయపడు. ద్వి. హరి. 1 భా.
ఉల్చు : దే. స. క్రి. ఉలుచు, ఊడఁదీయు. జై. 1 ఆ.
ఉల్టాతిరుగు : అన్య దే. తిరుగఁబడు. (తెలం)
ఉల్టాసీదాలుకొట్టు: మి. అ. క్రి. 1. క్రిందుమీఁదు లగు.
2. కష్టసుఖము లనుభవించు.
3. లాభ నష్టములందు.
4. వ్యవహారమున మునిగి తేలుచుండు
ఉల్పాపెట్టు : మి. స. క్రి. కానుకపెట్టు.
ఒంటికొమ్ము పెద్దేనుగునైతే ఉల్పా
పెట్టాడు. (బో. క.)
ఉల్లంఘించు : సం. స. క్రి. 1. కడచు; దాఁటు. కాశీ. 6 ఆ.
2. అతిక్రమించు,మీఱు. హరిశ్చ. 2ఆ.
3. అగౌరవముచేయు, నిరసించు.
భాగ. 8 స్కం.
అ. క్రి. ఎగురు. భాగ. 8 స్కం.

ఉల్లసమాడు : దే. స. క్రి. (ఉల్లసము + ఆడు.)
1. ఎత్తిపొడుచు. భార. శల్య. 2 ఆ.
2. పరిహాసించు; వేళాకోళముచేయు.
3. నిందించు; దూఱు. కాశీ. 4 ఆ.

ఉల్లసములాడు : దే. స. క్రి. ఉల్లసమాడు.

ఉల్లసించు : సం. అ. క్రి. 1. వ్యక్తమగు. ఉ. రా. 1. ఆ.
2. సంతోషించు. భాగ. 10. స్కం.

ఉల్లసిల్లు : సం. అ. క్రి. 1. వ్యక్తమగు.
2. సంతోషించు. ద్వా. 6 ఆ.
3. కలుగు, పుట్టు. హరి. 4 ఆ.
4. ప్రకాశించు, ఒప్పు. కాశీ. 5 ఆ.
5. వికసించు, విచ్చు. కాశీ. 1. ఆ.
6. పెచ్చుపెరుగు. భాగ. 1 స్కం.

ఉల్లాపించు : సం. స. క్రి. దుర్భాషలాడు; నిందించు. కు. సం. 5 ఆ.

ఉల్లాసమగు : సం. అ. క్రి. సంతోషమగు.

ఉల్లాసించు : సం. అ. క్రి. 1. సంతోషించు. శివరా. 3 ఆ.
2. ఒప్పు, ప్రకాశించు. హరి. పూ. 8 ఆ.

ఉల్లేఖించు : సం. స. క్రి. 1. విస్తరించి చెప్పు. కాశీ. 6 ఆ.
2. అంటు. శివరా. 3 ఆ.

ఉవ్విళులూరు : ఉవ్విళ్లూరు: 1. దే. అ. క్రి త్వరపడు. భార. విరా. 5 ఆ.
2. ఆశించు, కోరు. కళా. 5 ఆ.

ఉవ్విళులూర్చు : సం. స. క్రి. ఉవ్విళ్ళూర్చు. కవిక. 4 ఆ.

ఉవ్విళ్లగొను : దే. అ. క్రి. (ఉవ్విళ్ళు + కొను)
త్వరపడు. కవిక. 2 ఆ.

ఉవ్విళ్లుగొలుపు : దే. స. క్రి. (ఉవ్విళ్ళుగొను ధా. ప్రే.)
త్వరపెట్టు. ప్రభా. 3. ఆ.
ఉవ్విళ్లూరు : దే. అ. క్రి. (ఉవ్విళ్ళు+ఊరు)
1. తొందరపడు.
2. ఆసించు, కోరు. భార. విరా. 1 ఆ.
ఉవ్విళ్ళూర్చు : దే. స. క్రి. (ఉవ్విళ్ళు+ఊరు. ధా. ప్రే.)
ఆశ కలుగజేయు, కోరెక పుట్టించు.
కాశీ. 4 ఆ.
ఉవ్వెత్తుగావచ్చు: దే. అ. క్రి. 1. అధికముగా వచ్చు.
2. విజృంభించు.
ఉవ్వెత్తుగొను . ద్వ. అ. క్రి. (ఉవ్వెత్తు+కొను)
అడచు, నశింపఁజేయు
భాగ. 10 స్కం.
ఉష్ణించు : సం. అ. క్రి. 1. ఎండు; స. శ.
2. వేఁడెక్కు. వరాహ. 6 ఆ.
ఉసికొను : దే. అ. క్రి. (కుక్క) కవియు; మీఁదబడు.
చూ. ఉసికొలుపు.
ఉసికొలు(ల్పు)పు: దే. స. క్రి. (కుక్కను) 1. కవియించు. య. 2 ఆ.
2. ప్రేరించు. రాధికా. 1ఆ.
ఉసితీసికొను : దే. అ. క్రి. అవకాశము తీసికొను.
ఉసిరిపోవు : దే. అ. క్రి. ఉసురుసురగు. ఆయాసపడు.
ఉసిలిపోవు : దే. అ. క్రి. తప్పించుకొనిపోవు.
ఉసివోవు : దే. అ. క్రి. (ఉసి+పోవు) తప్పిపోవు.
గుఱికి తగులక దాఁటిపోవు. కకు. 4 ఆ.
ఉసుఁగు : దే. అ. క్రి. నుసుగు, తొలఁగు పండి. పురా.
ఉసురను : దే. అ. క్రి. 1. కలఁతను సూచించు.
2. విసుగుకొను.
3. దిగులుపడు.

ఉసుఱుకొను : ద్వ. అ. క్రి. (ఉసురు+కొను)
1. వర్ధిల్లు, వృద్ధిపొందు. కాశీ. 3 ఆ.
2. ప్రాణము తీయు.

ఉసురుగొట్టు . ద్వ. అ. క్రి. (ఉసురు+కొట్టు)
ఇతరులను అన్యాయముగా బాధించుటచేత, వారి ఘోష కొట్టి బాధననుభవించు.
ఉ. వాడి ఉసురుగొట్టి వీడు చెడినాడు.

ఉసురుతగులు : ద్వ. అ. క్రి. (ఉసురు+తగులు) పాపము తగులు.

ఉసురుపోసికొను: దే. స. క్రి. బాధించు.

ఉసురుబోవు : దే. అ. క్రి. ప్రాణము పోవు.

ఉసురుమను : } దే. అ. క్రి. (ఉసురు+అను.) దుఃఖించు
ఉసురుసురగు: } బాధపడు. సా. 2 ఆ.

ఉసూరుమను : దే. అ. క్రి. ఉసురను.

ఉస్సను : దే. అ. క్రి. ఉసూరుమను.

ఉస్సురను : దే. అ. క్రి. ఉస్సను.

# ఊ

ఊంచు : దే. అ. క్రి. ఊఁచు, ఉమ్మివేయు

ఊఁకరలిచ్చు ద్వ. అ. క్రి. (ఊకరలు + ఇచ్చు)
1. శిశువులు ఆనందముతో "ఊ ఊ" అని ధ్వనిచేయు భో. 7 ఆ.
2. హుంకరించు (చూ. ఊకరలుగొట్టు, ఊకరలు పెట్టు. మొ॥)

ఊఁకరలుగొట్టు : ద్వ. అ. క్రి. (ఊకరలు + కొట్టు)
హుంకరించు. ఆనందభయాదులచే నఱచు. బస. 7ఆ
ఇట్లే, ఊకరలువెట్టు. బస. 5. ఆ.

ఊఁకెంచు : దే. అ. క్రి. ఉంకించు. పూను. భార. కర్ణ. 3 ఆ.

ఊఁకువగు . ద్వ. అ. క్రి. (ఊకువ + అగు) పూను. రా. సుం.

ఊఁకువేయు దే. అ. క్రి. కనిపెట్టుకొనియుండు, వ్యగ్రుఁడగు

ఊఁకొట్టు : ద్వ. అ. క్రి. (ఊ + కొట్టు) ఊఊ అను. చంద్రా. 3ఆ.
స. క్రి. ఊ ఊ అనుచు విను.

ఊకొను : ద్వ. అ. క్రి. (ఊ + కొను) ఊఁ అను. పార్వ. 6 ఆ.
స. క్రి. విను. కాశీ. 7 ఆ.
భార. ఉద్యో. 3 ఆ.

ఊఁగాడు : ద్వ. అ. క్రి. (ఊఁగు + ఆడు) ఊగియాడు
చిత్ర. భా. 3 ఆ.

ఊఁగించు : దే. స. క్రి. ఊగునట్లుచేయు;
1. మనుష్యునితటపటాయించునట్లుచేయు
2. మాటనేర్పు చేత నితరుని అనిశ్చిత బుద్ధిగలవానిగాఁ జేయు.

ఊఁగియాడు : దే. అ. క్రి. (ఊఁగి + ఆడు) సంచరించు, కదలిపోవు కాశీ. 3. ఆ.

ఊఁగిసలాడు దే. అ. క్రి. ఆందోళనపడు

ఊఁగు : దే. అ. క్రి. 1. ఆందోళించు. ముందు వెనుకల కుయ్యెలలోనుండి యూఁగాడు. భార. అర. 4ఆ.
2. కదలు. వేం.పం. 1 ఆ.

ఊఁగులాడు : దే. అ. క్రి. (ఊగులు + ఆడు)
1. ఊఁగాడు: శ. ర.
2. సంచరించు: కలఁతనందు. వీథి. 50.

ఊఁచపడు ద్వ. అ. క్రి. (ఊఁచ + పడు)
1. ఊఁచవలె సన్నమగు; కృశించు
2. ఊఁచ కలదగు భాను .2 ఆ.
(రెండర్థములకు నిదియుదాహరణము.)

ఊఁచపోవు దే. అ. క్రి. (ఊఁచ + పోవు) ఊఁచవలె నగు. కృశించు. భల్లా. 4. ఆ. శ. ర.

ఊఁచముట్టుగొను : దే. స. క్రి. (ఊఁచముట్టు + కొను) నిశ్శేషముగాఁ జంపు, చంపు భార. శల్య .1 ఆ.

ఊఁచిపోవు : దే. అ. క్రి. కృశించు

ఊచు : దే. స. క్రి. [ఊఁగు భా. ప్రే.]
1. ఊఁగఁజేయు, ఆందోళింపజేయు భార. అర. 4. ఆ.
2. ఆడించు, కదలించు. ద్వి. హరి. ఉ.
అ. క్రి. సందేహించు, కొంకు. రాధికా.1 ఆ. సందేహము సిగ్గులేక కేళికిరమ్మని సైగజేసెనని భావము]

ఊఁచుక్రొనిపోవు ; దే. అ. క్రి. రోగముచే నీరసముగు

ఊఁటాడించు : దే. స. క్రి. [ఊఁటాడు ధా. ప్రే.]

1. మాఱుమ్రోగించు, ప్రతిధ్వనింపఁ జేయు, జై. 7 ఆ.

2. ఓడించు, ఓడఁజేయు. విజ. వి.2 ఆ.

ఊఁటాడు : దే. అ. క్రి. [ఊఁటు+ఆడు]

1. త్వరపడు; వేగిరపడు. పద్మ. 10 ఆ.

2. ఊఁగు, ఊఁగాడు. భాగ. 6 స్కం.

3. అలయు,సొమ్మసిల్లు. వేం.పంచ.3 ఆ.

4. తొలగిపోవు. రాధికా. 2. ఆ.

5. అధికమగు, పెంపొందు, వరాహ. 3 ఆ.

6. సంచరించు. తిరుగు, పొందు. 3 ఆ.

స. క్రి. 7. వెనుకకులాగు, ముందునకు పోనీకుండు. జై. 8 ఆ. ఎత్తిపోడుచు

ఊఁటు దే. స. క్రి. దూఁటు, పొడుచు. భార.భీష్మ.3 ఆ.

ఊఁడు : దే. స. క్రి. నాఁటు, గ్రుచ్చు, [చూ.ఊఁడుకొను]

అ. క్రి. రాలు, వదలు, త్యక్తమగు.

ఊఁడుకొను : దే. అ. క్రి. (ఊడు+కొను) నాటు. హరి. ఉ. 7 ఆ.

2. మరణించు.

"దాయ యింక మనకుఁ దానచిక్కె
ఊఁడుకొనఁగ వైవు దుర్విధ్రములు వీని
మీఁద మెలగకుండ, మిడుకకుండ."

నృ. పు. 4 ఆ.

ఊఁడుచు, ఊడ్చు: దే. స. క్రి. 1. నాఁటు నాటు. (శ. ర.)
2. చిమ్ము, సమ్మార్జించు. (శ. ర.)

ఊఁడ్చు : దే. స. క్రి. 1. నాఁటువేయు. హర. 3 ఆ.
2. చీపురుగట్టతో బాగుచేయు.

ఊఁతకొ(గొ)ను: దే. స. క్రి. 1. ఆధారముగాఁ బట్టుకొను. భార. భీష్మ. 2 ఆ.
2. ఆధారము చేసికొను. భాగ. 7 స్కం.
3. ఊఁదు.
4. అవలంబించు.

ఊఁతమిచ్చు : దే. స. క్రి. ఊఁతయిచ్చు.

ఊఁతయిచ్చు : దే. స. క్రి. అవలంబముగాఁ జేయు. నిర్వ. 8 ఆ.

ఊఁదరకొట్టు : దే. స. క్రి. (ఊఁదర+కొట్టు.)
1. అరటికాయలు మున్నగువానిరాశిపై నవి పండుటకు పొగవేయు.
2. ఎలుక, పాములు, మున్నగునవి చచ్చుటకై వానికన్నములోనికి పొగ పెట్టు.
3. తెలివిలేకుండఁ జేయు.

ఊఁదరఁగొట్టు : దే. స. క్రి. 1. తెగనూఁచు.
2. వాగుడుతో విసిగించు.

ఊఁదరలిడు : దే. స. క్రి. ఊఁదరకొట్టు, ద్వి. హరి. పూ.

ఊఁదరవెట్టు : దే. స. క్రి. (ఊఁదర+పెట్టు.)
1. పొగవేసి జంతువులను చంపు.
2. నిలువనీయకుండఁ జేయు. హరి. పూ. 7 ఆ.

ఊఁదివేయు : దే. అ. క్రి. పనిని తేలికగాఁజేయు.

ఊఁదు : దే. అ. క్రి. 1. నిప్పు మొదలగునవి రగుల్చుటకు నోటితో వేగముగా గాలి విడుచు. కాశీ. 6 ఆ.
2. ఉబుకు, ఉబ్బు. బస. 3 ఆ.
స. క్రి. 1. నోటిగాలి శీఘ్రముగా విడిచి నిప్పురగుల్చు. మార్క. 3 ఆ.
2. కరగించు. మార్క. 3 ఆ.
3. నోటిగాలిచే ఎగురఁగొట్టు. విజ. 1 ఆ.
4. శుభాదులను పూరించు.
5. ఎగురఁగొట్టు. విజ. 1 ఆ.
(4, 5. అర్థముల రెంటికి నిది యుదాహరణము)
6. గ్రహించు, పట్టుకొను. భార. ఆది. 7 ఆ.
7. అవలంబించు, ప్రధానముగాఁగొను. భార. ఉద్యో. 2 ఆ.
8. నిలుపు, ఆను. భాగ. 6 స్కం.
9. నొక్కు, ఒత్తిడిచేయు. కాశీ. 3 ఆ.
10. నాటు, గ్రుచ్చు. కాశీ. 5 ఆ.
11. చేపలను ఊఁతతోఁబట్టు శ.ర.
12. రహస్యము చెప్పు.

ఊఁపోడు : దే. అ. క్రి. ఊఁగాడు. రాజ. చ. 1 ఆ.

ఊఁపు : దే. స. క్రి. ఊఁచు. నైష. 5 ఆ.

ఊకు : దే. స. క్రి. పోవునట్లుగాఁ జేయు.

ఊకుండు : దే. అ. క్రి. ఏమియు ననకుండు.

ఊకొను : దే. అ. క్రి. ఊరొకొను. తూష్ణీంభావము పూను (ఊకో = ఊరొక)

ఊఁగించు ; దే. స. క్రి. పాటచే తల యూపించు.

ఊఁగిసలాడు : దే. అ. క్రి. 1. ఊఁగులాడు.
2. సంకోచించు.

ఊఁచపోవు : దే. అ. క్రి. నిస్సత్తువ పొందు.

ఊఁచు : దే. అ. క్రి. వ్యాధిచేత తలవెంట్రుకలు రాలు.
(శ. ర. ప్రౌ.)

ఊఁటాడించు : దే. స. క్రి. ఊఁటాడు ఘా. ప్రే.

ఊఁటాడు : దే. అ. క్రి. ఊఁగాడు, వడకు, త్వరపడు, సంచరించు, అతిశయించు, తొలఁగు.

ఊఁటారు : దే. అ. క్రి. శక్తిహీనమగు.

ఊఁటించు : దే. స. క్రి. 1. బెల్లించు. ఆం. భా. తృ.
2. వంచించు; మోసముచేయు. (శ.ర.)

ఊఁటు : దే. అ. క్రి. పశువులు మొదలైనవి నిశ్శేషముగా త్రాగిపోవు.

ఊఁటుగారు : దే. స. క్రి. 1. భూగర్భమునుండి యెక్కువవానల చేత నీరుకారు.
2. సత్తువ కారిపోవు.

ఊఁటెక్కు : దే. స. క్రి. క్రిందబడు, పైకుబుకు.

ఊఁడఁదన్ను : దే. స. క్రి. 1. తొలగించు; నశింపఁజేయు.
వరాహ. 5 ఆ.
2. ఊడునట్లు తన్ను. (వ్యు)

ఊఁడఁబీకు : దే. స. క్రి. (ఊడన్ + పీకు) ఊడునట్లు లాగు.
వా. ఆం. పదా.

ఊఁడఁబెరుకు: దే. స. క్రి. ఊడఁబీకు, స్థానభ్రష్టముచేయు.

ఊడనిబాడు : దే. అ. క్రి. 1. వెడలిపోవు, నెమ్మదిగా తొలఁగి పోవు. కవిజ. 3 ఆ.
2. పాఱిపోవు, భయముచే నలుదెసలఁ బరుగిడు. ఉ.హరి. 6 ఆ.

ఊడలుదిగు-ఊడలుబాఱు: దే. అ. క్రి. 1. మదమెక్కు, దిట్టపడు.
2. శక్తిఉడిగి లేవలేకుండు. (నె.జి)

ఊడాడు : దే. అ. క్రి. ఊటాడు.

ఊడిపడు : ద్వ. అ. క్రి. (ఊడి+పడు)
1. ఉట్టిపడు, అకస్మాత్తుగా దిగివచ్చు.
2. గర్భవిచ్ఛిత్తియై క్రిందబడు. భో. 4 ఆ.

ఊడిపోవు : దే. అ. క్రి. ఊసిపోవు, విడిపోవు.

ఊడ్చినట్లగు . దే. అ. క్రి. సర్వనాశనమగు.

ఊడు : దే. అ. క్రి. 1. విఱుగు, రాలు. వీర. 2 ఆ.
2. సడలు, జాఱు. వరాహ. 10 ఆ.
3. తెగు, ఖండితమగు.
(చూ. ఊడుచు.)
4. భగ్నమగు; చెడిపోవు. శశాం. 4 ఆ.
5. చనిపోవు.
6. పాఱు, పరుగెత్తు. భార. అర. 2 ఆ.

ఊడుచు : దే. స. క్రి. (ఊడు ధా. ప్రే.)
1. ఊడఁజేయు, తొలగించు.
2. వదలించు, విప్పు.

ఊడ్చు : దే. స. క్రి. 1. సడలించు. బహు. 3 ఆ.
2. విప్పు, వదలించు. వరాహ. 4 ఆ.
3. విడుచు. భీమ. 5 ఆ.
4. పీఁకు, లాగివైచు. భార. కర్ణ.

ఊడ్చు : 5. చ్యుతమగు, గర్భపాతమగు. దశా. 6 ఆ.
6. నఱకు, ఖండించు. వసు. 3 ఆ.
7. పిండిజేయు, పొడిచేయు. భా. రా. కిష్కిం.
8. అపహరించు, బెదరించు, లాగుకొను. శుక .3ఆ
9. పొలమున మొక్కలునాటు.
10. కసవుచిమ్ము

ఊడ్చుకొనిపోవు: దే. అ. క్రి. సమూలముగా నాశనమగు.

ఊతాడు : దే. అ. క్రి. చేపలనుబట్టు సాధనముచే వేటాడు. (రూ- ఈటాడు). (నె. జి.)

ఊదరగొట్టు : దే. అ. క్రి. అదేపనిగా వాగు. ఎక్కువగ విసిగించు.

ఊదరపెట్టు : దే. స. క్రి. ఎలుకలు, దోమలు మొదలగునవి పోవుటకు ఊక పొగవేయు.

ఊదు : దే. అ. క్రి. ఏదియో రహస్యముగా చెప్పి ప్రేరేపించు. ఉదా- చెవిలో నూదు.

ఊను : దే. అ. క్రి. 1. కలుగు. భార. ఉద్యో. 3 ఆ.
2. నాటుకొను. భాగ. 10 స్కం.
స. క్రి. 1. పూను, గ్రహించు. దశా. 2 ఆ.
2. అవలంబించు, మొదలిడు. హరి. ఉ. 3 ఆ.
3. పొందు, కలిగియుండు. భార. శాం. 5 ఆ.
4. ధరించు, తాలుచు. ఉ. రా. 4 ఆ.
5. ఆను, మోపు. ఉ. రా. 2. ఆ.
6. యజ్ఞాదులుచేయు. ఉ. రా. 2 ఆ.
7. తోలు మెత్తపఱచు. (శ. ర)
8. ఊనగొట్టు, తోలు బాగుచేయుటకు నీటిలోనికి వ్రేలాడగట్టు.

ఊను్చ : దే. స. క్రి. 1. ఊనఁజేయు. నెలకొల్పు.
భార. శాం. 3 ఆ.
('వావిళ్ళ ప్రతి ఊన్పుము' ఆనంద ముద్రణము)
2. తగిలించు, బంధించు. ఆము. 4 ఆ.
3. పొందించు,కలుగఁజేయు. నై ష.2 ఆ.
4. యజ్ఞాదు లొనరింపఁజేయు.
భార. ఆది. 5 ఆ.

ఊపిరిపోవు : దే. అ. క్రి. ప్రాణముపోవు

ఊపిరియాడు : దే. అ. క్రి. గాలి పీల్చుకొనుటకు వీలగు

ఊబదేలు : దే. అ. క్రి. పుంస్త్వము పోగొట్టుకొను

ఊయు : దే. స. క్రి. ఉమ్మివేయు, ఉమియు

ఊరఁబోవు: దే. అ. క్రి. క్షీణించు

ఊరకపోవు : దే. అ. క్రి. ప్రయోజనములేకుండు

ఊరకుండు : దే. అ. క్రి. మౌనము వహించు

ఊరకొను : దే .అ. క్రి. మౌనము వహించు

ఊరాఉచు : దే. స. క్రి. ఊరార్చు. శ. ర.

ఊరార్చు : ద్వ. స. క్రి. (ఊఉపు + ఆఉచు)
1. ఊరడించు భార.విరా. 2 ఆ.
2. బతిమాలు కావ్యా. 3 ఆ.

ఊరించు : దే. స. క్రి. (ఊరు ధా. ప్రే.)
1. కలుగఁజేయు, హంస. 2 ఆ.
2. నోరూరునట్లు చేయు. భాగ.10స్కం.

ఊరీకరించు : సం. స. క్రి. అంగీకరించు క. కు. 1 ఆ.

ఊరు(రూ. ఊఱు): దే. అ. క్రి. 1. ఊటవచ్చు, లోపలనుండి ద్రవము పైకినచ్చు,
2. (తినఁగోరికచే) నోటినుండి ద్రవము కలుగు దశా. 7 ఆ.
3. కలుగు, పుట్టు హరి. ఉ.7 ఆ.
4. లావగు, పెరుగు. వరాహ. 4 ఆ.

ఊరుకొను : దే. స. క్రి. మూరుకొను, ఆఘ్రాణించు, వసు.3ఆ.

ఊరుచు : దే. అ. క్రి. ఊర్చు శ.ర.

ఊరుబిండిచేయు దే. స. క్రి. పచ్చడినూఱు, (మినుపపప్పు నానబెట్టి)

ఊరేగించు : ద్వ. స. క్రి. (ఊరేగు ధా.ప్రే.) ఊరేగునట్లుచేయు వెళ్ళగొట్టు. [రా.సీ.]

ఊరేగు : ద్వ. అ. క్రి. (ఊరు+ఏగు)
1. ఉత్సవములలో నూరిలో పల్లకి మున్నగువానిపై తిరిగి వచ్చు. సావి. 2 ఆ.
2. మిడిసిపడు.
3. పెద్దతికము పొందు.
4. నీ యిష్టము వచ్చినట్లు తిరిగి రమ్మని అసమ్మతితో చెప్పు.
5. వధూవరులు పెండ్లిలో నూరేగు.
6. ఊరునుంచి వెడలిపోవు.
7 ప్రదర్శించుకొను. (తన గొప్ప)

ఊరు(ర్చు)చు : దే. స. క్రి. చేతితో నొక్కితీయు. శుక. 3 ఆ.
అ. క్రి. నిశ్వసించు. దశా.8 ఆ.

ఊర్పుచ్చు : ద్వ. స. క్రి. (ఊర్పు+పుచ్చు) ఊపిరివెడలఁజేయు. ఊర్పు విడుచు. శేష. 5 ఆ. (శ.ర)

ఊరోప్వు : దే. అ. క్రి. (ఊర్పు+పోవు) ఊపిరాడు. నిర్వ.3ఆ.

ఊర్మడించు : దే. అ. క్రి. అతిశయించు. ప. పీ.
ఊఅడించు : దే. స. క్రి. (ఊఅడు ధా. ప్రే.) ఓదార్చు, ఊరట నొందించు. భాగ. 10 స్కం.
ఊఅడించు : ఆత్మనేపదము. రూ. ఊరడించుకొను.
ఊఅడి(ల్లు)లు : దే. అ. క్రి. 1. ఉపశమిల్లు. నైష. 3 ఆ.
2. స్వస్థతనొందు. ఉ. రా. 6 ఆ.
3. విశ్రాంతినొందు. హరి. పూ. 1 ఆ.
రూ. ఊరటిల్లు–ఊరటిలు.
ఊఅడు : దే. అ. క్రి. 1. విరమించు. భార. ఆది. 4 ఆ.
2. ఉపశమిల్లు పారి. 4 ఆ.
3. స్వస్థతనొందు భార. ఉద్యో. 3 ఆ.
స. క్రి. అప్పగించు. భార. అర. 2 ఆ.
ఊఅవేయు : దే. స. క్రి 1. నానబెట్టు.
2. చివుకునట్లుచేయు.
3. వ్యవహారమును తెమలకుండచేయు.
ఊలమాలగుడుచు : దే. అ. క్రి. [ఊల + మాల + కుడుచు]
1. తహతహపడు నవ. 3 భా. శ. ర.
2. గుక్కిళ్ళుమింగు బ్రా.
మొఱ్ఱపెట్టు [వ్య]
ఊలవడు : ద్వ. అ. క్రి. [ఊల + పడు] భోరుమను. హర. 2 ఆ
ఊలుకొను : దే. అ. క్రి. నూలుకొను, నిలుచు
[చూ. ఊలుకొలుపు] భాగ. 4. స్కం.
ఊలుకొలుపు : దే. స. క్రి. [ఊలుకొను. ధా. ప్రే.] నూలుకొలుపు. నిలుపు. రంగా. 3 ఆ.
ఊలొల్కొల్పు : దే. స. క్రి. ఊలుకొలుపు
ఊవాడు : దే. అ. క్రి. ఊంగాడు పారి. 1 ఆ.
ఊవిళ్లూరు : దే. అ. క్రి. ఉవ్విళ్లూరు పి. శకుం. 3 ఆ.

ఊవు : దే. అ. క్రి. ఊగు. చెన్న. 3 ఆ.

ఊసరపోవు : దే. అ. క్రి. 1. ఊషరక్షేత్రమగు
2. నేల చౌడెక్కిపోవు

ఊసరిల్లు : దే. స. క్రి. చిక్కు, కృశించు. శ. ర.

ఊసిపోవు : దే. అ. క్రి. 1. ఊడిపోవు 2. రంగుపోవు

ఊసుపోవు దే. అ. క్రి. [ఊసు + పోవు] కాలక్షేపమగు
తోచు. నిర్వ. 9. ఆ.

ఊహించు : సం. స. క్రి. ఆలోచించు, వితర్కించు
మార్కం. 1 ఆ.

# ఋ

ఋకు్కపెట్టు : సం. అ. క్రి. కంఠస్థముచేయు

ఋణమిచ్చు : సం. స. క్రి. అప్పిచ్చు [న్యాప]

ఋణముతీర్చు : సం. స. క్రి. 1. అప్పుతీర్చు.

2. సంబంధము విడిపోవు

ఋణానుబంధము తెగు: సం. స. క్రి. సంబంధము వీడిపోవు

షి. శకుం. 3. ఆ.

# ఎ

ఎంగిలాకులు తిను: దే. స. క్రి. ఉచ్ఛిష్టము తిను.
ఎంగిలాకులునాకు : దే. అ. క్రి. నీచమునకు పాల్పడు. వా.
ఎంగిలించు : దే. స. క్రి. ఎంగిలిచేయు. కు. సం. 3 ఆ.
ఎంగిలి కాశించు : దే. స. క్రి. ఉచ్ఛిష్టమున కాశించు.
ఎంగిలికూటి కాశించు : దే. అ. క్రి. పరస్త్రీ కాశించు. వా.
ఎంగిలిగావించు : దే. స. క్రి. (ఎంగిలి + కావించు.)
1. బలవంతముగా రమించు.
2. చెఱచు. నిర్వ. 6 ఆ.
3. ఎంగిలించు (వ్యా)
ఎంగిలి గుడుచు : దే. స. క్రి. నీచపుఁదిండి తిను. వా.
ఎంగిలిచేయి విసరు: దే. అ. స. క్రి. అతిలోభియగు. వా.
వ్యతిరేకార్థమున : ఎంగిలిచేయి విసరనివాడు.
ఎంగిలిచేయు : దే. స. క్రి. అపవిత్రముచేయు వా.
ఎంగిలిఁదిను : దే. స. క్రి. ఉచ్ఛిష్టము తిను; విడిచినది తిను. రుక్మాం. 5 ఆ.
ఎంగిలిఁద్రోవఁజను: దే. స. క్రి. ప్రాఁతదారి ననుసరించు. (చాటువు)
ఎంగిలిపడు : దే. అ. క్రి. 1. లంఘనములైనతర్వాత పథ్యము తిను.
2. ప్రొద్దుటిపూట బాలు రన్నము తిను.
(పెద్దవారు ప్రేమతో ననెడు మాట.)
వ్యవ. నాయనా! కొంచెమెంగిలిపడిపో!
ఎంగిలిమాటలాడు: దే. అ. క్రి. ఎరువు మాటలు మాటాడు.
ఎంగిళ్లెత్తు : దే. స. క్రి. 1. తినఁగా విడిచినవానిని పైకివేయు.
2. నీచపుఁ బనులకుఁ బాల్పడు. వా.

ఎంచు : దే. స. క్రి. 1. గణించు, లెక్కించు.
2. ఉన్నదున్నట్లు వర్ణించు. హర.5 ఆ.
3. పాటించు. వసు. 4 ఆ.
4. నుతించు. ఉ. రా. 6 ఆ.
5. మించు; నిరసించు. దశా. 2 ఆ.
6. తలంచు. సీతారా. 3 ఆ.
7. ఊహించు, పన్ను. దశా. 2 ఆ.
8. అనవసరముగా మోపు. ఉ. రా. 1 ఆ.
9. తప్పు లెన్ను.

ఎంచులుపెట్టు : దే. స. క్రి. తప్పులుపట్టు. వా.

ఎండఁగట్టు : దే. స. క్రి. 1. తిండిపెట్టక మాడ్చు.
2. తడిబట్టలు ఎండవేయు.
3. నిర్ధ్రివము చేయు.

ఎండకన్నునీడకన్నెఱుఁగకుండు: ఏకష్టమెఱుఁగకుండు. భార. ఆశ్ర.

ఎండకన్నెఱుఁగకుండు: దే. అ. క్రి. (వ్యతి) 1. ఇలువెడలకుండు
2. ఏకష్టమెఱుఁగకుండు భాగ. 8 స్కం.

ఎండఁగొట్టు దే. స. క్రి. 1. ఎండలో నానవేయు
2. శుష్కింపఁజేయు
3. నిర్ధ్రివముచేయు

ఎండతగులు : దే. అ. క్రి. ఆతపము తాకు

ఎండనీడలగు : దే. అ. క్రి. సంపదలుచెడు

ఎండపడు : దే. అ. క్రి. ప్రొద్దెక్కు. (ఉ. ఎండపడినది ఇఁకలే.)

ఎండఁబడు : ద్వా. అ. క్రి. ఎండతగులు కాశీ. 2 ఆ.

ఎండఁబాఱు : దే. అ. క్రి. నిర్ధ్రివమగు. స్వా. 3. అ.

ఎండఁబెట్టు : దే. స. క్రి. ఆతపమునఁ బెట్టు.

ఎండమావులఁబట్టు : దే. స. క్రి. అసాధ్యకార్యముచేయు.

ఎండవడు : ద్వ. అ. క్రి. (ఎండ + పడు) ఎండలోఁబ్రయాణము చేయు. గంధ. 66. ప. సం. 8. ఆ.

ఎండవాలారు : దే. అ. క్రి. చల్లబడు

ఎండించు : దే. స. క్రి. (ఎండు. ధా. ప్రే.) ఆర్చు. నిర్ధనముగా జేయు. దశా. 1 ఆ.

ఎండిపోవు : దే. అ. క్రి. ఎండుకొను, ఆహారములేక మాడు.

ఎండు : దే. అ. క్రి. 1. ఆఱు, ఆర్ద్రిమగు. చూ. ఎండించు.
2. నీరసించు, చిక్కు.
3. అన్నములేక మాడు.
4. తడియారు
5. శుష్కించు.

ఎంతకుఁదెచ్చు : దే. స. క్రి. అనర్థము కలిగించు

ఎంతకైన తగు : దే. అ. క్రి. ఏ చెడుకార్యమునైనఁ జేయు. వా.

ఎంతకైన దిగు : దే. అ. క్రి. ఏ చెడు కార్యమును జేయుటకైన సిద్ధపడు. వా.

ఎందునా కాకుండా పోవు : దే. అ. క్రి. దేనికి కాకుండా చెడిపోవు. సర్వవిధముల వ్యర్థుఁడగు.

ఎంపనూర్పిడి చేయు: దే. స. క్రి. బొమికలు నుసుముచేయు. ప. పి.

ఎకదొట్టు : దే. అ. క్రి. ఎగఁదొట్టు, అతిశయించు. ఉ: నిట్టూర్పెకదొట్టన్. ఆము. 5. ఆ.

ఎకసక్కమాడు :
ఎకసక్కెమాడు :
ఎకసక్కెములాడు: } దే. స. క్రి. పరియాచకములాడు. (రూ.) ఎక్కసక్కెము లాడు.

ఎక్కఁదీయు ; దే. స. క్రి. ఉద్ధరించు.

ఎక్కఁదోచు : దే. స. క్రి. పురికొల్పు.

ఎక్కఁద్రోయు : దే. స. క్రి. ఎగద్రోయు. ఉదా:- దీపపువత్తిని ఎగద్రోయు. (నే.జి)

ఎక్కఁబొడుచు : దే. స. క్రి. 1. పురిగొల్పు.
2. ద్వేషము పుట్టించు.

ఎక్కసమగు : దే. అ. క్రి. తిండి యెక్కువగు.

ఎక్కాడు : దే. స. క్రి. (ఎక్కు + ఆడు) 1. ఎక్కియాడు,
2. స్వారిచేయు, (పురికొల్పు) శ. ర. (వెక్కాడు అని పాఠాంతరము.)
3. అణఁగఁద్రొక్కు.
అ. క్రి. 4. అధికముగా మాటలాడు. (ఎక్కువ + ఆడు) తెలం.

ఎక్కాసమగు : దే. అ. క్రి. భుక్తాయాసము కలుగు.

ఎక్కించు : దే. స. క్రి. 1. ఎక్కఁజేయు, కాశీ. 2 ఆ.
2. ఎత్తు. పాండు. 1 ఆ.
3. కలిగించు. భార. శల్య.
4. అధికము చేయు. మల్ల. 2 ఆ.
5. ఎక్కుపెట్టు. పారి. 5 ఆ.
6. చెల్లించు. ఆం. భా. తృ.
7. కొండెములు పెట్టు.
8. పురికొల్పు.
9. దూర్చు.
10. ఒకదానిలోని వస్తువులు మఱొకదానిలోఁ జేర్చు. (గ్రంథములలోని విషయములు కూడ.)

ఎక్కికొను : దే. స. క్రి. (ఎక్కు + కొను, స్వార్థమున) ఎక్కు, అధిష్ఠించు. కాశీ. 4 ఆ.

ఎక్కించు : దే. స. క్రి. (ఎక్కు + ఇంచు) ఎక్కువెట్టు.
భారి. విరా.

ఎక్కు : దే. అ. క్రి. 1. అధిష్ఠించు. పారి. 1 ఆ.
2. పైకివెడలు. కాశీ. 2 ఆ.
3. నచ్చు. భార. విరా.
4. వృద్ధియగు. హరి. పూ. 5 ఆ.
5. అగు. రాఘవ. 3 ఆ.
6. సిద్ధించు. భా. రా. అయో.
7. విదితమగు. భార. ఆర.
8. ఆవేశించు. భా. రా. అయో.
9. అతిశయించు, కలుగు. మార్కా.
స. క్రి. 1. ఆరోహించు. ఆము. 6 ఆ.
2. అధిష్ఠించు. భార. ఆది. 6 ఆ.
3. ఆశ్రయముగాఁగొను.

ఎక్కుకొను : దే. అ. క్రి. ఎక్కు. అధిష్ఠించు. పార్వ. 6 ఆ.

ఎక్కుడించు : దే. స. క్రి. 1. వింటినారి కొప్పును దొలఁగించు.
భా. రా. ఆర. 1 ఆ. భార. విరా.
2. వృద్ధిచేయు. హరి. ఉ. 9 ఆ.

ఎక్కుదీయు : దే. స. క్రి. (ఎక్కు + తీయు) సజ్యముగాఁ జేయు.
నీలా. 3 ఆ.
ఇట్లే, ఎక్కుద్రోచు. భాగ. 10 స్కం.

ఎక్కుద్రోచు : దే. స. క్రి. సజ్యముగా చేయు.

ఎక్కులువెట్టు : దే. స. క్రి. (ఎక్కులు + పెట్టు) పురికొలుపు.
ప్రోత్సహించు. దశ. 8 ఆ.

ఎక్కువెట్టు : దే. స. క్రి. (ఎక్కు + పెట్టు) సజ్యముగాఁజేయు.
భార. ఉద్యో. 2 ఆ.
2. నారిని సంధించు. కళా. 1 ఆ.

ఎకొ్కను : దే. అ. క్రి. అతిశయించు.

"అనిన హేమావతికి నిట్టు లనియె హేల
తేపటికి నేఁటి ప్రాయంపు తీపు గలదె?
మోహ మెకొ్కనఁ జక్కని ముద్దుజాణ
నొకని బిగికౌఁగిటను జేర్చి యుండవలయు"

హం. విం. 1

ఎగఁగట్టు : దే. స. క్రి. 1. పైకిఁగట్టు.
2. ముడివేయు. నై. 1 ఆ.

ఎగఁగొట్టు : దే. స. క్రి. 1. ఎగురఁగొట్టు. చమ. 1 ఆ.
2. ఎగవేయు.

ఎగఁగొలుపు
ఎగకొ్కలుపు } దే. స. క్రి. పురికొలుపు.

ఎగగ్రోలు : దే. స. క్రి. పీల్చు. కళా. 6 ఆ.

ఎగఁచిపట్టు : దే. స. క్రి. విజృంభించి పట్టుకొను.

ఎగజల్లు : దే. స. క్రి. పీల్చు. కళా. 6 ఆ.

ఎగఁజేపు : దే. అ. క్రి. పశువు పాలీయక బిగఁబట్టు.

ఎగఁజోపు : దే. స. క్రి. 1. పైకిఁదోలు. కాళ. 3 ఆ.
2. విడుచు. రాఘవ. 2 ఆ.

ఎగఁదట్టు : దే. అ. క్రి. 1. పైకివచ్చు; నీరు పైకి ఉబ్బు.
2. అతిశయించు. చెన్న. 4. ఆ.
3. శ్వాసము పైకి వచ్చి యడ్డుపడు.
4. శ్లేష్మము ఎగఁదట్టు.

ఎగఁదన్ను : దే. అ. క్రి. 1. పశువు పాలీయకుండు;
2. ఎదురుగాఁ బాఱు;
ఉదా:- ఏరు ఎగఁదన్నినది. [వ్య.]
స. క్రి. పైకిఁద్రోయు;
ఉ. ఆవిరి మూఁత నెగదన్నినది. (వ్య)

ఎగఁదీయు : దే. స. క్రి. పైకెత్తు.

ఎగఁదొట్టు. దే. అ. క్రి. (ఎగన్+తొట్టు) అతిశయించు; ఉ. రా. 2 ఆ.

ఎగద్రొబ్బు : దే. స. క్రి. ఎగద్రోయు, ఎగవేయు.

ఎగఁద్రోచు : దే. స. క్రి. (ఎగన్+త్రోచు) పైకిఁదీయు; భార. సభా. 2 ఆ.
ఇట్లే, ఎగఁద్రోయు. హర. 7 ఆ.

ఎగఁద్రోయు : దే. స. క్రి. మీఁదికిఁ ద్రోయు.

ఎగఁద్రోలు : దే. స. క్రి. పురికొల్పు.

ఎగఁబట్టు : దే. స. క్రి. (ఎగన్+పట్టు)ఎత్తిపట్టు. శేష.5ఆ.శ.ర

ఎగఁబడు : ద్వ. స. క్రి. 1. పఱుగెత్తుకొని వచ్చు. కాశ. 2 ఆ.
2. మీఁదఁబడు. వ్య. వారందఱు అతని కెగఁబడిరి,

ఎగఁబాఱు : దే. అ. క్రి. (ఎగన్+పాఱు) ఎగువకుఁ బాఱు. మీఁదికిఁబాఱు. శ. ర..

ఎగఁబీల్చు : దే. స. క్రి. [ఎగన్+పీల్చు] పైకిఁ బీల్చు.
వాఁడు గాలి యెగఁబీల్చుచున్నాఁడు.

ఎగఁబెట్టు : దే. స. క్రి. ఎగఁగొట్టు వా.
ఎగవేయు.

ఎగఁబోయు : దే. స. క్రి. (ఎగన్+పోయు)
1. అతిశయింపఁజేయు. శశాం. 4 ఆ.
2. ప్రేరేచు. చం. రా. 5 ఆ.
అ. క్రి. దుర్బోధము చేయు. రాధా. 3 ఆ.
3. కట్టు తప్పు.
4. విచ్చలవిడి యగు.
5. ప్రోవు పైకిఁ బోయు.

ఎగఁబ్రాకు : దే. అ. క్రి. (ఎగన్ + ప్రాకు)
పైకిఁబ్రాఁకు నీలా. 1 ఆ.
పైకి ఎక్కు,
ఉన్నతపదవికి నేదోవిధముగా వెళ్ళు.

ఎగచు : } దే. స. క్రి. 1. తఱుము. భార. భీష్మ. 3 ఆ.
ఎవుచు : } నిర్వ. 7 ఆ. భాగ. 1 స్కం.
త్రోలు. భార. కర్ణ. 1 ఆ.
చోపు. స్వా. 4 ఆ.
2. ఎగయఁ జేయు.
దీనికి ఎగవన్ అను తుమున్నంతరూపము.
నిర్వ. 3. ఆ. 33. 4. ఆ.

ఎగజల్లు : దే. స. క్రి. దుర్వ్యయము చేయు

ఎగదువ్వు : దే. స. క్రి. (ఎగన్ + దువ్వు) పైకి దువ్వు. కవిజ3 ఆ.

ఎగనూకు : దే. స. క్రి. 1. సహాయపడు (తెలం.)
2. పైకిలేపు

ఎగనూదు : దే. స. క్రి. (ఎగన్ + ఊదు) 1. ఎగురనూదు
2. నిరసించు వసు. 5. ఆ.
(ఇది పైరెండర్థముల కుదాహరణమే)

ఎగనెత్తు : దే. స. క్రి. (ఎగన్ + ఎత్తు) పైకెత్తు. ప్రభా. 5 ఆ.

ఎగబట్టుకొనివచ్చు : దే. అ. క్రి. అంతయు తన వలననే అగునని
పిలువకయే జోక్యముకలిగించుకొను.

ఎగబడు : దే. అ. క్రి. ఆశతో ముందుకు వచ్చు.
ఉ. జనము ఎగబడి వచ్చినారు.

ఎగమీటు : దే. స. క్రి. (ఎగన్ + మీటు) పైకి మీటు.
వసు. 1. ఆ

ఎగ్రమింగు : దే. స. క్రి. [ఎగన్ + మ్రింగు] పూర్తిగా మ్రింగు. భాగ. 6 స్కం.

ఎగయఁబట్టు : దే. స. క్రి. పైకిఁ బ్రసరింపఁజేయు.

ఎగయించు : దే. స. క్రి. [ఎగయు ధా. ప్రే.)
1. ఎగయఁజేయు, ఎత్తు. భార. భీష్మ. 2 ఆ.
2. వ్యాపింపఁజేయు. కాశీ. 4 ఆ.

ఎగయు : దే. అ. క్రి. 1. ఎగురు. ప్రబోధ. 3 ఆ.
2. వ్యాపించు;
3. లేచు; వరాహ. 3 ఆ.
4. కలుగు; భాగ. 10 స్కం.
5. వెడలు. వరాహ. 12 ఆ.
6. ఊడివచ్చు. మార్కం. 1 ఆ.
7. ప్రజ్వరిల్లు.

ఎగయుదెంచు : దే. అ. క్రి. (ఎగయు + తెంచు, స్వార్థమున) పైకివచ్చు. రామా. 7 ఆ.

ఎగరొప్పు : దే. అ. క్రి. (ఎగన్ + రొప్పు)
1. వగర్చు. ప్రబంధ. 788
2. అలుపుతో రొప్పు.

ఎగరోఁజు : దే. అ. క్రి. ఎగరొప్పు. శ. ర. బ్రా.

ఎగవిడుచు : దే. స. క్రి. (ఎగన్ + విడుచు) విడిచివేయు. కళా. 3 ఆ.

ఎగవెట్టు : దే. స. క్రి. 1. ఉసికొల్పు.
2. పురికొల్పు.

ఎగవేయు : దే. స. క్రి. (ఎగన్ + వేయు)
1. ఋణాదులఁ దీర్పకుండు.
2. చేసిన దోషమును తప్పించుకొను. ద్వి. సారంగ. 3 ఆ.
3. చేయవలసిన పని చేయకపోవు.

ఎగవేసికొనిపోవు: దే. అ. క్రి. తప్పించుకొని పాఱిపోవు.
వ్య. ఎగేసికొనిపోవు.

ఎగవైచు : దే. స. క్రి. (ఎగన్ + వైచు)
1. ఎగురవేయు. రామా. 5 ఆ.
2. అప్పు ఎగవేయు.

ఎగసనద్రోచు : దే. స. క్రి. (ఎగసన + త్రోచు)
1. పైకిఁద్రోయు. కాళ. 4 ఆ.
2. పురికొల్పు.
3. పైకిదిద్దు. భా. రా. అరణ్య.
ఇట్లే, ఎగసనఁద్రోయు.

ఎగసికొలాడు : దే. స. క్రి. ఎగతాళి (పడు) చేయు.

ఎగసిపడు : ద్వ. అ. క్రి. (ఎగసి + పడు) 1. ఎగిరిపడు.
2. గర్వించు. రా. వి. 3 ఆ.
(రెండర్థములకు నుదాహరణము)

ఎగసిల్లు : దే. అ. క్రి. ఎగయు. అ. ప్ర.

ఎగాదిగ కనుగొను: దే. స. క్రి. కోపముతో నెదిరిని చూచు. ప.

ఎగాదిగా చూచు : దే. స. క్రి. 1. తేరిపాఱ జూచు.
2. ఆశ్చర్యముగఁ బైకి క్రిందికిఁ జూచు. వా.

ఎగిచిపట్టు : దే. స. క్రి. తఱిమిపట్టు. కు. సం. 9 ఆ.

ఎగిరించు : దే. స. క్రి. ఎగురునట్లుచేయు

ఎగిరిపడు : ద్వ. అ. క్రి. (ఎగిరి + పడు) 1. ఎగిసిపడు;
2. గర్వపడు; రాధికా. 3 ఆ.

ఎగియు : దే. స. క్రి. నొక్కు,

ఎగు : దే. అ. క్రి, 1. పైకిబోవు. క్రీడా.
2. ఎత్తగు విజ. 2 ఆ.
3. ఎగుచు (చూ. ఎగుబోద)
4. పూర్తియగు. (చూ. ఎగ్రమింగు)

ఎగుడుదిగుడగు. దే. అ. క్రి. పరిస్థితి క్రిందుమీఁదగు
ఎగుదు : దే. అ. క్రి. 1. పరుగెత్తు. బస. 6. ఆ.
2. వచ్చు. పండితా. పర్వ
ఎగుదు : దే. స. క్రి. సహాయపడు. రూ. ఎయిదు
ఎగుమతిచేయు : దే. స. క్రి. 1. ఓడకు సరుకు లెక్కించు. శ. ర.
2. దేశాంతరములకు సరకులంపు.
ఎగురఁగొట్టు ; దే. స. క్రి. 1. ఎగురునట్లుచేయు
2. లేకుండఁజేయు
ఎగురు : దే. అ. క్రి. 1. ఎగయు. స్వా. 4 ఆ.
2. పైకిలేచు దశా. 2 ఆ.
స. క్రి. ఎగురవేయు. హర. 1 ఆ.
ఎగురులాడు : దే. అ. క్రి. [ఎగురులు + ఆడు] దుముకులాడు. శ.ర.
1. కోపించు. [తెలం]
2. కోపముతోఁజిందులుద్రొక్కు.
ఎగువు : దే. స. క్రి. ఎగుచు [తోలు] భార. కర్ణ. 2 ఆ.
ఎగ్గతమగు : దే. అ. క్రి. ఏకాంతముగనుండు:
ఎవ్వరును లేకయుండు
"ఎగ్గత మైనచోట" మించు.
ఎగ్గాడు : దే. స. క్రి. నిందించు
ఎగ్గించు ; దే. స. క్రి. 1. తప్పుగా తలఁచు. భాగ. 10 స్కం.
2. దూషించు, ద్వా. 4. ఆ.
3. అనాదరించు. వసు. 2 ఆ.
ఎగ్గుగొను : దే. స. క్రి. [ఎగ్గు + కొను]
తప్పుగా భావించు. భార. కర్ణ. 3 ఆ.
ఎగ్గుచేయు : దే. స. క్రి. హానిచేయు
ఎగ్గుతలచు : దే. అ. క్రి. కీడు తలఁచు.

ఎగ్గులాడు :
ఎగ్గులుపలుకు : } దే. స. క్రి. నిందలుపలుకు.

ఎగ్గులుపట్టు : దే. అ. క్రి. తప్పులు పట్టు.

ఎగ్గులువడు : దే. అ. క్రి. నిందపడు.

ఎగ్గులువట్టు : దే. స. క్రి. 1. తప్పులు పట్టు.
2. అపార్థము చేసికొను.

ఎచ్చరించు :
ఎచరించు :
ఎచ్చరికించు : } దే. అ. క్రి. 1. హెచ్చరించు. పాండు. 3 ఆ.
2. పురికొలుపు, మల్హా. 2 ఆ.
3. స్మృతికిదెచ్చు. ఆము. 5 ఆ.
4. జాగరూకునిఁజేయు. వసు. 6 ఆ.
5. తెలియఁజేయు. దశా. 7 ఆ.

ఎచ్చరిలు, ఎచ్చిరిల్లు: దే. అ. క్రి. 1. వర్ధిల్లు; వృద్ధిపొందు. కళా. 6. ఆ.
2. జాగరూకుఁడగు (చూ. ఎచ్చరిల్లు)
3. చెలరేగు. (చూ. ఎచ్చిర్లు)

ఎచ్చరు : దే. అ. క్రి. హెచ్చరికతోనుండు.

ఎచ్చించు : దే. స, క్రి. పెంచు.

ఎచ్చిర్లు, ఎచ్చిరిలు. దే. అ. క్రి. చెలరేగు. రామా. 8 ఆ.

ఎచ్చిలు : దే. అ. క్రి. 1. వర్ధిల్లు. జై. 8 ఆ.
2. సేదదేఱు. కు. సం. 5 ఆ.
3. బాగుపడు. నా. పంచ. 1 ఆ.

ఎచ్చిలు ;
ఎచ్చిల్లు : } దే. అ. క్రి. వర్ధిల్లు, సేదదేఱు, బాగుపడు.

ఎచ్చు : దే. అ. క్రి. 1. మిక్కుటముగు. ఉ. రా. 7 ఆ.
2. విజృంభించు. ఉ. రా. 2 ఆ.

ఎచ్చులుబడు : దే. అ. క్రి. బడాయికొట్టు.

ఎచ్చులువలుకు : దే. అ. క్రి. 1. ప్రగల్భములాడు.
2. గొప్పలు చెప్పుకొను.

ఏట్టులను : దే. అ. క్రి. ఏ విధముగాఁ జెప్పవలయునో యట్లు చెప్పు. పండి. [ఎట్టులనినన్, ఎట్లన్నన్]

ఎడకట్టు : దే. అ. క్రి. [ఎడ+కట్టు]
ఆరింపుండు గుబులచీముపట్టు. శ. ర. ప్రా
స. క్రి. చేయు. కాశీ. 7 ఆ.

ఎడ కలుగ చను:
ఎడకలుగనిలుచు: } దే. అ. క్రి. దూరముగాఁబోవు. కళా. 1 ఆ.

ఎడగరపడు : ద్వ. అ. క్రి. [ఎడగర+పడు]
శ్రమపడు, అలయు. భార. సా. 1 ఆ.
[ముద్రితపా. వేగిరపడియెద వేల యింత. శ. ర. పా.]

ఎడగా చను : దే. అ. క్రి. దూరముగా పోవు. కళా. 1 ఆ.

ఎడగిల్లు : దే. అ. క్రి. వైతొలఁగు, తప్పుకొను. విప్ర. 2 ఆ.

ఎడగొను : దే. అ. క్రి. (ఎడ+కొను)
1. సందుచేసికొను. ప్రభా. 5 ఆ.
2. ఒకదానిప్రక్క ఒకటిచేరు. ప. పీ.

ఎడతప్పించు : దే. స. క్రి. వయస తప్పించు. పారి. 2 ఆ.

ఎడతాకు : దే. స. క్రి. 1. ప్రతిఘటించు. కృ. శకుం. పీఠి.
2. మిక్కిలిచేరు. అని. 3 ఆ.

ఎడతీయు : దే. అ. క్రి. ఎడతెగు.

ఎడతెగు : దే. అ. క్రి. 1. విడిపోవు. భార. విరా. 5 ఆ.
2. వేఱగు. భాగ. 8 స్కం.
3. నశించు. భాగ. 1 స్కం.

ఎడతొట్టుకొను : దే. అ. క్రి. మధ్య స్థలము వ్యాపించు. కు.సం.11ఆ

ఎడత్రెచ్చు : దే. అ. క్రి. ఎడతెగు.

"పెనకువ నెడత్రెవ్వక పదునెనిమిది దివసములు."

ఎడత్రెవ్వు : దే. అ. క్రి. (ఎడ+త్రెవ్వు)

1. తెగు, విచ్ఛిన్నమగు. భార.శల్య1ఆ.
2. ఎడఁబడు, చెడిపోవు. ఆము. 2 ఆ.
3. రాకుండు, ఆగిపోవు.

భార. శాం. 3 ఆ.

ఎడఁదొలఁగు : దే. అ. క్రి. దూరముగఁ దొలగు.

ఎడఁబడు : ద్వ. అ. క్రి. (ఎడన్+పడు)

1. విరామము కలుగు. కు. సం. 6 ఆ
   విరామముండు. భార. అర. 3 ఆ.
2. లోపమునచ్చు. రం. రా. బాల.
3. ఒకదాని తర్వాత నొకటియగు.
   భార. ఉద్యో. 2 ఆ.
4. దవ్వగు. భార. శాం. 6 ఆ.
5. జామీనుదారుఁ డగు. విజ్ఞా. వ్యవ.
6. పశ్చాత్తులు తప్పించుకొని వేఱగు.

చూ. పెడబడు.

ఎడఁబాపు : దే. స. క్రి. (ఎడన్+పాపు)

1. తొలగించు. ఉ. రా. 3 ఆ.
2. వేఱుచేయు.
3. తీర్చు. ఉ. రా. 5 ఆ.

ఎడఁబాయు : దే. అ. క్రి. (ఎడన్+పాయు) వేఱగు.

దూరమగు. వసు. 5 ఆ.

స. క్రి. వీఁడు. సా. 2 ఆ.

ఎడయెఱుఁగకుండు: దే. అ. క్రి. లోకవ్యవహార మెఱుఁగకుండు.
శు. సం. 5 ఆ.
ఎడదవచ్చు : దే. అ. క్రి. బుద్ధిపుట్టు కలువాయిశత.
ఎడనాడు : దే. స. క్రి. (ఎడన్+ఆడు)
దూఱు, నిందించు. భార. 6 స్కం.
ఎడపడు : దే. అ. క్రి. ఎడమగు, దూరమగు.
ఎడపిల్లయగు : దే. అ. క్రి. ఈడేరు. (తెలం)
ఎడపు : దే. స. క్రి. 1. (గడియమొ.) తీయు, తొలగించు.
హంస. 5 ఆ.
2. అంతరాయ మందించు.
భా. రా. బాల.
3. నీడు. భార. విరా. 3 ఆ.
4. నశింపఁజేయు. [చూ. ఎడయు]
ఎడపుచ్చు : దే. స. క్రి. 1. రాయబారము నడుపు.
2. కుంటెనతనము సేయు.
ఎడపెట్టు : దే. స. క్రి. 1. విడిచిపెట్టు. భార. అను. 4 ఆ.
2. మినహాయించు.
3. అడ్డుగా పెట్టు. [చూ. ఎడవెట్టు.]
ఎడమగు : } దే. అ. క్రి. 1. సందగు. 2. దూరమగు.
ఎడవోవు : } 2. కుడిప్రక్కకుఁబోవు [నె. జి.]
ఎడవిడివడు : దే. అ. క్రి. దూరమగు.
ఎడమపెనపెట్టు : దే. స. క్రి. 1. ఎడమకు పెనవేయు.
2. వ్యతిరేకముచేయు.
ఎడమవెట్టు : దే. స. క్రి. ప్రక్కకునెట్టు. హరి. పీఠి.
ఎడమిచ్చు : దే. అ. క్రి. చోటిచ్చు.
ఎడముకొను : దే. స. క్రి. (ఎడము+కొను) ఆక్రమించు:
అ. క్రి. అవకాశము చేసికొను. కళా. 3 ఆ.
ఎడయగు : దే. అ. క్రి. దూరమగు; బాహ్యమగు.

ఎడయాడు : దే. అ. క్రి. (ఎడ+ఆడు)
1. తిరుగాడు 2.పరిభ్రమించు. నై. ప.5ఆ.
2. నడచుకొను. దశ. 7 ఆ.
3.ఎడఁబాయు. ప. పీ.

ఎడయించు : దే. స. క్రి. (ఎడయు ధా. ప్రే.)
ఖండించు, నఱకు. భాగ. 6 స్కం.

ఎడయు : దే. అ. క్రి. 1. తొలఁగు, అచ్చ. సుం.
2. విముఖమగు. ఉ. రా. 6 ఆ.
3. చెడిపోవు. శుక. 2 ఆ.
స. క్రి. విడుచు. హరి. పూ. 9 ఆ.

ఎడయెఱుగు : దే. అ. క్రి. లోకవ్యవహారము తెలియు. ప. పీ.
[ఎడలి. పాఠాంతరము] భా. అర. 1 ఆ.

ఎడరు : దే. అ. క్రి. విఱుగు.

ఎడలించు: దే. స. క్రి. [ఎడలు. ధా. ప్రే.]
1. అపసరిల్లఁ జేయు. స్వా. 3 ఆ.
2. విసర్జించు,విసర్జింపఁజేయు. పారి.5ఆ
3. తీయు, [చిక్కు మొ] వదలుచు.
శుక. 3 ఆ. ఆము. 1 ఆ.
4. నశింపఁజేయు కాశీ. 3 ఆ.
5. బయలుచేయు. భాగ. 8 స్కం.
6. నఱకు. య. 2 ఆ.
7 సడలించు,విడిపోఁజేయు.భా.ద్రో.3ఆ.

ఎడలు : దే. అ. క్రి. 1. అపసరిల్లు నై. 6 ఆ.
2. సడలు. సా. 3 ఆ.
3. రాలు. కు. సం. 4 ఆ.
4. చెడు, నశించు. భో. 4 ఆ.
భార. ఉద్యో. 2 ఆ.

ఎడలు : 5. చనిపోవు. భార. ద్రో. 1 ఆ.
6. భగ్నమగు. భార. ద్రోణ. 1 ఆ.
7. దూరమగు. చం. రా. 4. ఆ.
8. బయలగు. భార. భీష్మ 2ఆ.

ఎడలుచు . దే. స. క్రి. (ఎడలు ధా. ప్రే.)
ఊడఁదీయు. చిత్ర. భా. 4 ఆ.

ఎడల్చు దే. స. క్రి. 1. అపసరిల్లఁజేయు. కువల. 1 ఆ.
2. ఊడఁదీయు చిత్ర. భా. 3 ఆ.
3. వెలికిఁదీయు కళా. 5.ఆ.

ఎడలువాపు : దే. స. క్రి. (ఎడలు+పాపు)
ఎడబాపు. బ్రహ్మో. 3 ఆ.

ఎడలుసేయు : దే. స. క్రి. (ఎడలు+చేయు)
ఎడఁబాపు కవిరా. 5ఆ.

ఎడవడు : ద్వ. అ. క్రి. విరామము కలుగు. స్వా. 5 ఆ.

ఎడవాయు : ద్వ. స. క్రి. వేఱుపడు. నిరం. 2 ఆ.

ఎడవెట్టు : దే. స. క్రి. [ఎడ+పెట్టు] 1. మినహాయించు;
2. మితివెట్టు; భార. ద్రోణ. 1. ఆ.
3. త్యజించు; విడుచు (చూ. ఎడపెట్టు.)

ఎడవోవు : దే. అ. క్రి. (ఎడ+పోవు) రాయబారమేగు.
శివ. సా.

ఎడసను : దే. అ. క్రి. (ఎడ+చను) వైతొలఁగు. శుక.1 ఆ.

ఎడసిపోవు : దే. అ. క్రి. తొలఁగిపోవు

ఎడసూఱగొనివేచు: దే. అ. క్రి. అవకాశము చిక్కించుకొను.
శు. సం. 3 ఆ.

ఎడసేయు దే. స. క్రి. (ఎడ+చేయు)
1. తిరస్కరించు. భాగ. 3. స్కం.
2. దూరముచేయు; భార. ఆది. 6 ఆ.

ఎడసొచ్చు : దే. అ. క్రి. [ఎడ + చొచ్చు] పైబడు; ప్రవేశించు భాగ. 6 స్కం.

ఎడుకసెప్పు ; దే. స. క్రి. సోదెచెప్పు. (నె. జి.)

ఎడుపువేయు : దే. స. క్రి. క్రుళ్ళినచోట నాటునాటు. (నె. జి.)

ఎతపడు : దే. అ. క్రి. తీవ్రముగా వేదన ననుభవించు

ఎతవచ్చు : దే. అ. క్రి. దుఃఖము వచ్చు (తెలం)

ఎత్తఁగొట్టు : దే. స. క్రి. [ఎత్తన్ + కొట్టు] పాఱద్రోలు ఆనంద. శీత.

ఎత్తరతత్తర చేయు : దే. స. క్రి. ఉక్కిరి బిక్కిరిచేయు

ఎత్తలిబెట్టు : దే. అ. క్రి. వెల్లువనలన భూముపైఇసుకదిబ్బలుపెట్టు

ఎత్తికొను దే. అ. క్రి. [ఎత్తు + కొను]

1. సిద్ధమగు; భాగ. 3. స్కం.

2. యత్నించు శ. ర.

3. కలుగు. వాని కైశ్వర్యమెత్తికొన్నది

స. క్రి. 1. గ్రహించు

2. పుడిసిలితో గ్రహించు. భార. విరా. 2. ఆ. ఆది. 2 .ఆ.

3. మోయు. భార. భీష్మ. 2. ఆ.

4. దొంగిలించు భార. ఆది. 1ఆ.

5. ఆరంభించు. "ఈ తప మెత్తికొనియె నగజ" కు. సం. 7 ఆ.

6. చంకబెట్టుకొను — "పిల్లవానినెత్తికొనుము.

7. యాచించు. బిచ్చమెత్తుకొను.

ఎత్తిపలుకు : దే. స. క్రి. దెప్పు.

ఎత్తిపెట్టు : దే. స. క్రి. దాచియుంచు. ప్రసక్తికి దెచ్చు. [వా]

ఎత్తిపెట్టు : } దే. స. క్రి, ఒకవ్యక్తిని అనవసరముగాఁ బొగడి
ఎత్తివేయు : } [కృ–వి–జి] పెద్దచేయు. నె. జి.

ఎత్తిపొడుచు : దే. అ. క్రి. తప్పులు వెల్లడించి మనసు నొచ్చునట్లు పలుకు. భా. 10. స్కం. పూ.

ఎత్తిపోవు దే. అ. క్రి. 1. చెడిపోవు. "ఇల్లాంధ్ర యీలువు నత్తిపోయె." వ.రా. 7 ఆ.
2. పూర్తిగాఁబోవు
"వాని బాకీ ఎత్తిపోయినది."

ఎత్తివేయు: } దే. స. క్రి. 1. ఎత్తివేయు, ఎత్తి క్రిందఁ బడవేయు.
ఎత్తివైచు : } 2. తేలికపఱచు
3. తీసివేయు. "మూలధనము లేక పాఠశాల ఎత్తివేసిరి"

ఎత్తివేసికొను : దే. స. క్రి. 1. ఉపసంహరించుకొను.
"వ్యాజ్యము నెత్తివేసికొనెను."
2. మానుకొను
"వ్యాపారము నెత్తివేసెను."

ఎత్తు : దే. అ. క్రి. 1. అతిశయించు. భార. ఉద్యో. 2 ఆ.
2. కలుగు. భా. రా. యుద్ధ.
3. పూను. భార. ఉద్యో. 4 ఆ.
4. దండెత్తు. భార. ఉద్యో. 2 ఆ.
స. క్రి. 1. పైకి లేవఁదీయు.
భార. ఉద్యో. 2 ఆ.
2. అర్పించు. ఉ. రా. 8 ఆ.
3. గ్రహించు. పుడిసిలితో గ్రహించు.
కాశీ. 3 ఆ. ఉ. హరి. 1 ఆ.
4. నిలుపు. భీమ. 5 ఆ.

ఎత్తు :

5. బ్రదికించు.
భారత. ఆది. 6 ఆ. భా. రా. యుద్ధ.
[ప్రాణములెత్తు=బ్రదికించు]
6. వెల్లగించు. వసు. 1 ఆ.
7. త్రోడు, పెట్టు. ఆముక్త. 4 ఆ.
8. చంకనిడుకొను. పాండు. 3 ఆ.
9. వహించు, ధరించు.
భా. రా. కిష్కిం. కాళ. 4 ఆ.
10. స్మరించు. పార్వ. 5 ఆ.
11. వెల్లడించు. వరాహ. 8 ఆ.
12. పడయు. పాండు 4 ఆ.
13. దొంగిలించు. ఆము. 5 ఆ.
14. హెచ్చించు. భారత. భీష్మ.
15. ప్రసరింపఁజేయు. శివరా. 1 ఆ.
16. ప్రస్తావించు. (వా)
"ఆ మాట యెత్తవద్దు."
17. పన్ను [తెలం.]
18. తంతులు ఎత్తు.

ఎత్తుకట్టు : దే. స. క్రి. 1. నిలుపుకొను.
—మద మెత్తికట్టె. కు. సం. 12 ఆ.

ఎత్తుకపోవు :
ఎత్తుకవచ్చు : } దే. స. క్రి. దొంగిలించు. [వా]

ఎత్తుకొను : దే. అ. క్రి. సిద్ధపడు. శుక. 4 ఆ.
స. క్రి. 1. తీసికొను. ప్రభా. 5 ఆ.
2. దొంగిలించు. విప్ర. 5 ఆ.
3. కాపాడు. విక్ర. 7 ఆ.
4. వేగము అందుకొను
"పోనుపోను గుఱ్ఱము ఎత్తుకొన్నది."

ఎత్తుదెంచు : దే. అ. క్రి. (ఎత్తు+తెంచు)
దండెత్తివచ్చు. భార. ఆది. 7 ఆ.

ఎత్తుపడు:
ఎత్తువడు: } ద్వ. అ. క్రి. (ఎత్తు+పడు)
1. సిద్ధింపకపోవు
2. భగ్నమగు
3. దివాలాతీయు
4. పశువు లేవలేకపోవు. ప్రబోధ. 3 ఆ.

ఎత్తుపెట్టు : దే. స. క్రి. కపటోపాయములు పన్ను.
1. పురికొలుపు
2. ప్రోత్సాహపఱచు
3. పోటీపెట్టు

ఎత్తులిడు : దే. స. క్రి ప్రోత్సహించు కళా. 7 ఆ.

ఎత్తులుపెట్టు :
ఎత్తులుపన్ను: } దే. అ. క్రి. 1. కొండెములు చెప్పు.
2. నేరనట్లుచేయు
ఉదా.– ఎఱుఁగనివాని కెత్తులుపెట్టు

ఎత్తులువెట్టు : దే. స. క్రి. మోసగించు వాల్మీకి 3 ఆ.
ప్రోత్సహించు శుక. 1 ఆ.

ఎత్తువచ్చు : దే. అ. క్రి. సాటియగు భాగ. 10. స్కం.

ఎత్తువడు : ద్వ. అ. క్రి. (ఎత్తు+పడు)
1. జనసత్త్వము లుడిగిపోవు (పశువులు)
హరి. పూ. 6. ఆ.
2. చెడిపోవు భాగ. 10 స్కం.
3. ఎత్తఁబడు. రామా. 7ఆ. రాధి. 2 ఆ.

ఎత్తువెట్టు : దే. స. క్రి. ప్రోత్సహించు హంస. ఆ.

ఎత్తువేయు : దే. స. క్రి. తూచు. తూనికవేయు శ. ర. వ.

ఎత్తువోవు : దే. అ. క్రి. (ఎత్తు+పోవు)
1. పడిపోవు. రామా. 4. ఆ.
"ఎత్తుపోయిన" శ. ర.
2. తీసిపోవు ఉ. హరి. 6. ఆ.

ఎత్తుసేయు : దే. స. క్రి. (ఎత్తు+చేయు)
1. కపటముపన్ను. మల్హాణ. 2 ఆ.
2. పోలు, సాటివచ్చు
"ఇంద్రనీలపురంగు నెత్తు సేయగడంగు."
రుక్మాం. 2. ఆ.

ఎత్తెఱుఁగు : దే. అ. క్రి. తెలివితక్కువగు. శుక. 3 ఆ.

ఎత్తెలగొను : దే. స. క్రి. 1. ఎత్తెలతోఁ జేపల నవలీలగాఁ బట్టినట్లు పట్టుకొను.
2. సులభముగా జయించు. నిర్వ.6 ఆ.

ఎదగు : దే. అ. క్రి. (ఎద+అగు)
పశువులు ఋతుధర్మము నొందు.

ఎదనెగ్గురను : దే. అ. క్రి. మనస్సు బాధపడు. శుక. 1 ఆ.

ఎదపగులు : దే. అ. క్రి. 1. అధికముగా చలించు.
2. గుండె పగులు.

ఎదపడు :
ఎదవడు : } వై. అ. క్రి. భయపడు. ఉ. రా. 6 ఆ.
చలించు. "భీతిచేఁ జాల నెదవడి
మారీచుఁ డిట్లని పల్కె."
క. వ. రా. అరణ్య.

ఎదపోవు : దే. అ. క్రి. ఋతుసమయమునకు వచ్చు.
"ఆవు ఎదపోయినది."

ఎదానబడు : దే. అ. క్రి. (ఎదాన+పడు) ఒకరిపై ఆధారపడు.

ఎదిరించు : దే. అ. క్రి. స. క్రి. ప్రతిఘటించు.

ఎదుగు : దే. అ. క్రి. 1. పెరుగు. శుక. 2 ఆ.
2. సమీపించు. భాగ. 10 స్కం.
3. అతిశయించు. నిర్వ. 4 ఆ.
4. ఈడువచ్చు. "ఎదిగిన పిల్ల."

ఎదురగు : దే. అ. క్రి. ఎదురు, అభిముఖము అగు.

ఎదురాడు : దే. స. క్రి. 1. ఎదురు తిరుగు. శుక. 2 ఆ.
2. ఎదురుమాటచెప్పు. ద్వా. 6 ఆ.

ఎదురుండు : దే. అ. క్రి. విరోధించు.

ఎదురు : దే. అ. క్రి. 1. ఎదురగు. వసు. 2 ఆ.
స. క్రి. ఎదిరించు, ప్రతిఘటించు.
భార. భీష్మ. 1 ఆ. భాగ. 3 స్కం.
మాఱొడ్డు, పఱచిన వస్తువులను కుప్పఁజేయు. [తెలం.]
2. కుప్పనుండి ఏరితీయు.

ఎదురుకొను : దే. స. క్రి. (ఎదురు+కొను)
1. ఎదురుగా వచ్చి యాహ్వానించు. విక్ర. 7 ఆ.
2. ప్రతిఘటించు. పాండు. 4 ఆ.
3. జయించు. రాధికా. 3 ఆ.
అ. క్రి. 1. ఎదురగు. ఉ. రా. 3 ఆ.
2. ఆసన్నమగు. విప్ర. 2 ఆ.

ఎదురుకోలుపు : దే. స. క్రి. (ఎదురుకొను ధా. ప్రే.)
స్మృతికిఁదెచ్చు. చం. రా. 5 ఆ.

ఎదురుకోళ్ళుచేయు: దే. స. క్రి. వరుఁడు రాఁగా మేళతాళములతో నెదురుగఁబోయి యాహ్వానించు. (తెలం)

ఎదురుచు : దే. అ. క్రి. స. క్రి. ప్రతిఘటించు. భార. కర్ణ. 2ఆ.

ఎదురుచూచు : దే. అ. క్రి. వేచియుండు. నైష. 4 ఆ.
ఎదురెదురు చూచు. (ఆమ్రేడితరూపము)
సు. రా.
స. క్రి. మించు, ఓడించు. ఆనంద. పీ?.
ఎదురులుచూచు : } దే. స. క్రి. ప్రతీక్షించు, ఎదురుచూచు.
ఎదుర్లుచూచు : } భా. రా. యు. కాం.
ఎదురుతాకగు : దే. అ. క్రి. (ఎదురు+తాకు+అగు)
ఎదురుపడు. జై. 7 ఆ.
ఎదురు తిరుగు : దే. స. క్రి. 1. ఎదురొడ్డను.
2. తిరుగబెట్టు.
ఎదురుదొట్టు : దే. స. క్రి. ఎదురించు.
ఎదురునడచు : దే. స. క్రి. ఎదురేగు. కళా. 8 ఆ.
ఎదురుపడు : ద్వ. అ. స. క్రి. 1. ఎదురగు. హంస. 2 ఆ.
2. ప్రతిఘటించు. భార. భీష్మ. 2 ఆ.
ఎదురుప్రోయు : ద్వ. అ. క్రి. మారు చెలగు.
ఎదురులెక్కు : దే. అ. క్రి. ఎదురుగాఁబోవు. స్వా. 5 ఆ.
ఎదురుసెలగు : దే. అ. క్రి. (ఎదురు+చెలగు)
ప్రతిధ్వనించు. భార. ఉద్యో. 4 ఆ.
ఎదురెక్కు : దే. అ. క్రి. (ఎదురు+ఎక్కు)
1. ఎదురుగాఁబోవు. ఆము క్త. 1 ఆ.
2. బాధించు. కళా. 4 ఆ.
ఎదురెక్కు; ఎదురీదు: దే. అ. క్రి. దుష్కర కార్యమున కుద్యమించు.
ఎదురొడ్డు : దే. అ. క్రి. 1. ఎదురు వ్యూహము పన్ను.
కవిక. 2 ఆ.
2. ప్రతిఘటించు. ఉ. రా. 3 ఆ.
స. క్రి. 1. ఎదురుచేయు. కళా. 8 ఆ.
2. ఎదురుపందెము పెట్టు.

ఎదురొత్తు : దే. స. క్రి. మారొత్తు. పారి. 1. ఆ.
ఎదుర్కొను; ఎదురుకొను: దే. స. క్రి. ప్రతిఘటించు. ఉ. రా. 2 ఆ.
ఎదుర్చు : దే. స. క్రి. ఎదురుచు.
భార. భీష్మ. 1 ఆ. కాశీ. 7 ఆ.
ఎదుర్పడు : దే. అ. క్రి. ఎదురుపడు, ఎదురగు, చూచు.
పారి. 3 ఆ.
స. క్రి. 2. ప్రతిఘటించు. భాగ. 3 స్కం.
ఎద్దుపట్టు : } దే, స. క్రి. ఎద్దును ముష్కహీనము చేయు.
ఎద్దుకొట్టు : } హరి. పూ. 6 ఆ.
ఎద్రుచు : దే. అ. క్రి. వ్యతిరేకను(?)గు. ఉ. హరి. 4 ఆ.
ఎనగొను : దే. స. క్రి. పొందు. కు. సం. 3 ఆ.
ఎనచు : దే. అ క్రి. ఉడికిన దానిని గరిటెతో మెత్తగాఁ జేయు.
ఎనపు : దే. స. క్రి. 1. ఎనుపు, కలిగించు. చంద్రి. 4 ఆ.
2. ఉడికిన కూరముద్దను కవ్వముతో బాగుగ మర్దించు. రూ. ఎనుపు.
ఎనఁబోలు : దే. అ. క్రి. సాటియగు. భాగ. 4 స్కం.
ఎనయగు : దే. అ. క్రి. పోలు.
ఎనయించు : దే. స. క్రి. [ఎనయు ధా. ప్రే.]
1. ఎనయఁజేయు. హంస. 2 ఆ.
2. ఘటింపఁజేయు. వసు. 1 ఆ.
3. అతుకు. హేం. పంచ. 2 ఆ.
ఎనయు : దే. స. క్రి. 1. పోలు. భార. శాం. 5 ఆ.
2. కూడు, సంగమించు.
హరి. 7 ఆ. హంస. 2 ఆ.
3. సోఁకు వసు. 3 ఆ.
4. పుచ్చుకొను. శుక. 2 ఆ.
5. పొందు. వసు. 3 ఆ.

ఎనయు అ. క్రి. 1. సమానమగు. భార. విరా. 3 ఆ.
2. అగు. శుక. 1 ఆ.
3. కాయు. హరి. పూ. 8 ఆ.
4. కూడు, రమించు.
భార. శాం. 4 ఆ. శశాం. 3 ఆ.
5. పట్టువడు. ఆము. 3 ఆ.
6. ఒప్పు. ఇందు. 1 ఆ.

ఎనవచ్చు : దే. అ. క్రి. 1. ఎనబోలు. భార. ఉద్యో. 4 ఆ.
2. సాటివచ్చు. (తెలం.)

ఎనపాయు : దే. అ. క్రి. (ఎన + పాయు) జోడువీడు, వియోగమందు. భా. రా. సుం.

ఎనవోలు : దే. అ. క్రి. ఎనవచ్చు. వసు. 2 ఆ.

ఎనసేయు : దే. స. క్రి. పోల్చు

ఎన్నవలుబెట్టు : దే. అ. క్రి. మాటలతో వాపోయి యేడ్చు

ఎన్నించు : దే. స. క్రి. ఉడికినదానిని కవ్వముతో బాగుగ మర్దించు [నె. జి.]

ఎనియు : దే. అ. క్రి. 1. కలిసికొను శ. ర.
2. ముద్దయగు. "పప్పు ఎనిసినది"

ఎన్నికకెక్కు : దే అ. క్రి. ప్రసిద్ధిచెందు హంస. 5 ఆ.

ఎన్నికచేయు : దే. స. క్రి. ఎంచు, గణించు.

ఎన్నికమీఱు : దే. అ. క్రి. ప్రసిద్ధిగాంచు. రుక్మిణి 1. ఆ.

ఎనుచు - ఎనుపు: దే. స. క్రి. 1. మెత్తగాజేయు
2. వేగునట్లుగాచేయు శ. ర.
3. కలుపు

ఎనుము : దే. స. క్రి. మెదుపు; కలుపు

ఎన్ను : దే. స. క్రి. 1. లెక్కించు. భార. ఆది. 1ఆ.
2. సరకుచేయు. ఆము. 4. ఆ.
3. కీర్తించు. నీలా. 2 ఆ.
4. నిద్రించు. హరి. పూ. 9 ఆ.
5. తలపోయు. విక్ర. 8 ఆ.

ఎన్నుకొను : దే. స. క్రి. (ఎన్ను+కొను)
1. గ్రహించు
2 ఏఱుకొను

ఎన్నెదలుకలుగు : దే. అ. క్రి. ఎన్నిగుండె లున్నవని నేటివాడుక.
బస. 6.

ఎమకు : దే. స. క్రి. సొనుకు; వెదకు. కాశీ. 5 ఆ.

ఎముకబలియు : దే. అ. క్రి. 1. దృఢమగు
2. గట్టిచాఱిన యెముక కలదగు
నరస. 1 ఆ.

ఎముకలేరు : దే. స. క్రి. (ఎముకలు+ఏరు)
1. ఎముకలు లేనివానినిగాఁ జేయు.
2. బాధించు
3. చంపు నైష. 7 ఆ.

ఎమ్ములు చిల్లులుపోవు : దే. అ. క్రి. మర్మభేదన మగు. సారం. 3 ఆ.

ఎమ్మెలు పచరించు : దే. అ. క్రి. వగలుపోవు. పారి. 5 ఆ.

ఎమ్మెలుసెప్పు : దే. అ. క్రి. నిరాడంబరముగఁజెప్పు. భాగ. 1 స్కం.

ఎయిదించు: } దే. స. క్రి. (ఎయిదు ధా. ప్రే.) ఎఱిఁగించు
ఎయ్దించు : } తెలియఁజేయు భార. విరా. 5 ఆ.

ఎయిదు : దే. అ. క్రి. 1. ఇముడు బస. 3 ఆ.
2. వచ్చు (చూ. ఎయ్దు)
3. పోవు. భార. ద్రో. 1 ఆ.
4. నిలుచు. కు. సం. 6 ఆ.
5. సరిపోవు. పండి. దీక్షా.

ఎయిదు స. క్రి. 1. ఎఱుఁగు, తెలిసికొను.
(చూ. ఎయిదించు)
2. వెంబడించు. భార. ద్రో. 3 ఆ.
3. పొందు. భార. విరా. 2 ఆ.
4. చేరు, సమీపించు. భార. ఆర. 4 ఆ.

ఎయిదు : } ఎయ్దు : } దే. అ. క్రి. 1. పోవు. భార. విరా. 4 ఆ.
2. వచ్చు. భార. ద్రో. 2 ఆ.
3. ఎగురు. కు. సం. 7 ఆ.
స. క్రి. 1. పొందు. భార. విరా. 2 ఆ.
2. వెంబడించు. భార. విరా. 3 ఆ.

ఎయ్యను : దే. అ. క్రి. తిరస్కార సూచకముగ ధ్వనిసేయు.
కు. సం. 12 ఆ.

ఎరగలివడు : ద్వి. స. క్రి. దగ్ధముసేయు. (హాలాహల విషము)
భాగ. 8 స్కం.

ఎరఁగు : దే. స. అ. క్రి. 1. నమస్కరించు. భార. ఆది. 7 ఆ.
2. ఉఱుకు. భార. శల్య. 1 ఆ.

ఎరగొను : దే. అ. క్రి. (ఎర + కొను)
1. ఆకలిగొను. రం. రా. యుద్ధ.
2. ఆఁకలి తీరు. మైరా. 2 ఆ.
3. పరవశమగు.
స. క్రి. మ్రింగు. ఉ. హరి. 5 ఆ.

ఎరచేయు: } ఎరసేయు: } దే. స. క్రి. ఉపేక్షించు పిన. శకుం. 2. ఆ.

ఎరలు : దే. అ. క్రి. ఉష్ణభావమొందు. కు. సం. 3 ఆ.

ఎరవఱలుపోవు : దే. అ. క్రి. దావానలముచే దగ్ధమగు.
భార. భీష్మ. 1 ఆ.

ఎరవిచ్చు : }
ఎరవీయు : } దే. స. క్రి. అప్పు ఇచ్చు.

ఎరవుచేయు : దే. స. క్రి. వేఱుఁగా దలఁచు. వ. పు.

ఎరవుతీయు : దే. స. క్రి. అప్పుచేయు.

ఎరవుపడు : ద్వ. అ. క్రి. (ఎరవు+పడు) భేదమునొందు, కలహించు. భార. ద్రో.

ఎరవుసేయు . దే. స. క్రి. [ఎరవు+చేయు] అన్యథా భావించు

ఎరవెట్టు : దే. స. క్రి. మోహము కల్గించు.

ఎరవేయు : }
ఎఱ్ఱవేయు : } దే. స. క్రి. 1. ఆహారముచూపి వలలోచిక్కించుకొను
2. లంచమిచ్చు.
3. ఎఱ్ఱను (పురుగు) గాలమునకు వేసి చేపను బట్టినట్లు లోఁబఱచుకొను

ఎరియబెట్టు: దే. స. క్రి. (ఎరియున్+పెట్టు) 1. పోగొట్టు; 2. నశింపఁజేయు రామా. 8 ఆ.
3. మండించు. కాల్చు. కు.సం.10 ఆ.

ఎరియించు దే. స. క్రి. [ఎరియు భా. ప్రే.] బాధించు హర. 3. ఆ.

ఎరియు : దే. అ. క్రి. 1. మరుగు
2. పరితపించు భార.అర.5 ఆ.
3. నశించు భార. స్త్రీ. 1ఆ.

ఎర్గు : దే స. క్రి, ఎఱుఁగు [తెలిసికొను] బస. 4. ఆ.

ఎఱగిపోనుండు : దే. స. క్రి. ఎక్కిపోనుండు. కు. సం. 11 ఆ.

ఎఱఁగివచ్చు : దే. స. క్రి. దిగివచ్చు, కు. సం. 1 ఆ.

ఎఱగు : దే. అ. స. క్రి. 1. ఉఱుకు కు. సం. 11 ఆ.
2. వ్రాలు భార. అను. 1 ఆ.
3. నమస్కరించు భార. అను. 4.
4. సక్తత గను కు. సం. 1 ఆ.

ఎఱగొను : ద్వ. అ. క్రి. (ఎఱ+కొను) 1. అరుణిమనొందు
2. బరిమీఁదనుండు రం. రా. ఆర.

ఎఱయు : దే. అ. క్రి. ఉష్ణభావమునొందు ప. పీ.

ఎఱిఁగించు : దే. స. క్రి. (ఎఱుగు ధా. ప్రే.)
1. ప్రకటించు. పారి. పీఠి.
2. నేర్పు. మల్హా. 1. ఆ.
3. తెలుపు. వై. 4. ఆ.

ఎఱుకచేయు : దే. స. క్రి. [ఎఱుక+చేయు]
1. తెలుపు. భార. శాం. 6. ఆ.
2. నిజమనుకొను వైజ. 4 ఆ.

ఎఱుకపడు : ద్వ. అ. క్రి. 1. తెలియు; భార. ఆది. 2. ఆ.
2. ప్రకటమగు; శుక. 1. ఆ.
3. బోధించు భార. ఆర. 2. ఆ.

ఎఱుకపఱచు : దే. స. క్రి. (ఎఱుకపడు ధా. ప్రే.)
1. తెలుపు శుక. 3 ఆ.
2. ప్రకటించు ఆము. 5. ఆ.

ఎఱుకవట్టు : దే. స. క్రి. గుర్తెఱుఁగు.

ఎఱుకవెట్టు: దే. స. క్రి. ఒక విషయమును గూర్చి యధికముగ మాటలాడు. (తెలం)

ఎఱుఁగు . దే. స. క్రి. 1. తెలియు, గ్రహించు. భార. ఆది. 3. ఆ.
2. నేర్చు. వాసిష్ఠ 1. ఆ.
3. అనుభవించు వి. పు. 1 ఆ.

ఎఱ్ఱజిగిదన్ను : దే. అ. క్రి. ఎఱ్ఱవారు. "దానఁ గకుత్స్థుఁ డెఱ్ఱజిగి దన్నిన కన్నరచూపు చూడ."

కకుత్. 5 ఆ.

ఎఱ్ఱసూదు : దే. స. క్రి. ఎఱ్ఱగా నూదు. "ఉట్టిపడట్లు కట్టెఱ్ఱ నూదినట్లు-దివ్యవాణి పలికె."

భాగ. 6 స్కం.

ఎఱ్ఱలువాఱు :
ఎఱ్ఱలుతోలు : } దే. అ. క్రి. సంజ యెఱుపులు తిరుగు

ఎఱ్ఱవారు : దే. అ. క్రి. ఎఱ్ఱనగు.

ఎలమించు : దే. అ. క్రి. ప్రకాశించు. కు. సం. 7 ఆ.

ఎలము : దే. అ. క్రి. 1. వికసించు. కు. సం. 7 ఆ.
2. ఒప్పు. కు. సం. 6 ఆ.
3. చిగుర్చు, లేఁతయగు. కు. సం. 6
4. ప్రకాశించు. వ. వి.

ఎలయించు : దే. స. క్రి. (ఎలయు ధా. ప్రే.)
1. తీసికొనిపోవు. భార. విరా. 2 ఆ.
2. ప్రోత్సహించు: పారి. 1 ఆ.

ఎలయించుకొను: దే. స. క్రి. ఎలయించు (తీసికొనిపోవు)

వి. పు. 8 ఆ.

ఎలయు : దే. అ. క్రి. 1. ఉత్సహించు. భార. ఆర. 5 ఆ.
2. కలుగు. నిర్వ. 7 ఆ.
3. ప్రవేశించు. భార. అను. 5 ఆ.
4. మూఁగు. భార. భీష్మ. 1 ఆ.

ఎలరారు : దే. అ. క్రి. 1. కలుగు. నిర్వ. 1 ఆ.
2. అధికమగు. భార. భీష్మ. 1 ఆ.
3. ప్రకాశించు. హరి. ఉ. 4 ఆ.
4. పుష్పించు, వికసించు.

భాగ. స్కం. 8

ఎలసుచు : దే. అ. క్రి. ఎలర్చు. (శ. ర.)
ఎలర్చు : దే. అ. క్రి. 1. అధికమగు.
2. ఆనందించు. భార. ఉద్యో. 4 ఆ.
3. ఒప్పు. వి. పు. 6 ఆ.
ఎలిగించు : దే. అ. క్రి. 1. కూయు. (శ్రీ)రాధా. 2 ఆ.
2. మొఱవెట్టు. భాగ. 8 స్కం.
ఎలుఁగించు : దే. అ. క్రి. కూయు. వరాహ. 3 ఆ: శివరా. 3 ఆ.
ఎలుఁగిచ్చు : దే. స. క్రి. పిలుచు. భా. రా. అయో.
అ. క్రి. ఒమలు పలుకు. శివ. సా.
ఇట్లే, ఎలుగులిచ్చు.
ఎలుఁగిడు : దే. అ. క్రి, (ఎలుగు+ఇడు) మొఱుఁగు.
రామా. 2 ఆ.
ఎలుఁగుచేయు : దే. అ. క్రి. ఎలిగించు, కూయు. ద్వా. 1 ఆ.
ఎలుఁగులిచ్చు : దే. స. క్రి. పిలుచు.
అ. క్రి. ధ్వనిచేయు, మ్రోగు, పలుకు,
ప్రతిగా పలుకు.
ఎలుఁగుపడు : దే. అ. క్రి. 1. డగ్గుత్తికపడు.
2. హీనస్వరమగు.
ఎలుఁగుసూపు : దే. అ. క్రి. 1. పలుకు. భార. అను. 1 ఆ.
2. హుంకరించు. భార. భీష్మ. 2 ఆ.
ఇట్లే, ఎలుగులు సూపు. హరి. ఉ.6 ఆ.
ఎలుఁగెత్తిచాటు : దే. స. క్రి. బహిరంగముచేయు, అందఱకుఁదెలియు
నట్లు చేయు.
ఎలుఁగెత్తు : దే. అ. క్రి. బిగ్గరగా నఱచు.
ఎల్లలువెట్టు : దే. స. క్రి. (ఎల్లలు+పెట్టు)
అవధి యేర్పఱచు. దశ. 2 ఆ.
ఎల్లాయివేయు : దే. స. క్రి. చాకలి గుడ్డ లుడుకబెట్టు.

ఎల్లిదించు : దే. స. క్రి. తేలికపఱచు. ప. వీ.
ఎల్లిపోవు : దే. స. క్రి. కుప్పనూర్చిపిడి పూర్తియగు.
ఎవయు : దే. అ. క్రి. ఎగయు. శ. ర.
ఎవుచు : దే. స. క్రి. ఎగుచు. కకు. 5 ఆ.
ఎసకమెసఁగు : దే. అ. క్రి. 1. అతిశయించు. భార. విరా. 1 ఆ.
2. కలుగు. భార. శాంతి. 5 ఆ.
3. ఒప్పు. బస. 1 ఆ.
ఎసగించు: దే. స. క్రి. (ఎసగు ధా. ప్రే.)
కలుగఁజేయు. వసు. 1. ఆ.
ఎసఁగు దే. అ. క్రి. ఈ పదము నిరనుస్వార మనికొందరు. కాని కవిత్రయము వారి నిర్ధారక ప్రయోగములు కానరావు. క్రింది ప్రయోగములచే సానుస్వార మగుట యుక్తము.
1. అతిశయించు భార. ఆది. 4 ఆ.
2. కలుగు భార. ఆది. 5. ఆ.
3. ప్రవర్తిల్లు భార. శాం. 6. ఆ.
4. ఒప్పు. స్వా. 3. ఆ. దశా. 1 ఆ.
ఎసకొను : } ఎసగొను : } దే. అ. క్రి. పురిగొను, (చూ. ఎసఁగొలుపు) విజృంభించు
ఎసకొలుపు : దే. స. క్రి. ఎసకొల్పు, ప్రేరేపించు. శ. ర.
ఎసకొల్పు : దే. స. క్రి. (ఎసకొను ధా. ప్రే.)
1. పురికొలుపు పారి. 5 ఆ.
2. కలిగించు ఆము. 6 ఆ.
ఎసపోయు: దే. స. క్రి. (ఎస+పోయు)
1. వినియోగించు. వ్యయించు. దశ. 11ఆ
2. పురికొల్పు;
3. వాంఛించు, క.వ.రా.యు.కాం.

ఎసరు : దే. అ. క్రి. ఏసరు, విజృంభించు. నిర్వ. 6 ఆ.

ఎసరుపెట్టు }
ఎసరుబెట్టు } దే. అ. క్రి. ఎసరినష్టముగకో ఎత్తులు వేయు. [వా]

ఎసరువెట్టు : దే. అ. క్రి. 1. వంటకై నీరుగ్రాగఁబెట్టు. పాండు.2ఆ.
2. కీడు కలిగించు చం.రా.5.ఆ.

ఎసరెత్తు : }
ఎసరెత్తుకొను: } దే. అ. క్రి. ఎసరుపెట్టు (తా. సం)

ఎసరేగు : దే. అ. క్రి. చెలరేగు; విజృంభించు; అతిశయించు
హరిశ్చం. 5. ఆ.

ఎసలారు : దే. అ. క్రి. (ఎసలు + ఆరు)
1. ఒప్పు. భార. అను. 3. ఆ.
2. అతిశయించు [వ్యా]

ఎసవు : దే. అ. క్రి. ఎసగు, ఒప్పు [సూ]

ఎసవెట్టు : దే. స. క్రి. పురికొల్పు

ఎస్సను : దే. అ. క్రి. తిరస్కారసూచకధ్వని చేయు.
కు. సం. 6 ఆ.

# ఏ

ఏఁకటపడు : ద్వ. అ. క్రి. అపేక్షించు, వాచిపోవు. వరాహ. 12ఆ.

ఏకటాకడయగు : దే. అ. క్రి. దిక్కులేర్పడకపోవు. క.వ.రా. బాల.

ఏకారు : దే. అ. క్రి. 1. మిక్కిలికోరు. కువల.2.శుక. 2 ఆ.
2. సేవించు భీమ. 3 ఆ.
3. బాధపడు హంస. 2 ఆ.

ఏఁగించు : దే స. క్రి. (ఏఁగు ధా. ప్రే.)
1. పంపు భార. ఆది. 6ఆ.
2. ఉత్సవముతోఁద్రిప్పు. ఆము.4 ఆ.

ఏఁగు : దే. అ. క్రి. 1. పోవు భో. 4 ఆ. కళా. 3. ఆ.
రాఘవ. 1 ఆ.
2. కడచు, ముందునకు నడచు. హరి.1ఆ
భార. విరా.1ఆ.
3. చనిపోవు. హంస. 1ఆ.
4. ఉత్సవముతోఁదిరుగు(పెద్దనచాటువు)
తెలం. 1. భరించు;
2. అనుభవించు;
3. సంసారముచేయు
"దీనితో ఏగలేను"
"వేగు. రూ. దీనితో వేగలేను."

ఏగుదెంచు : దే అ. క్రి. (ఏగు+ తెంచు)
1. వచ్చు. భార.ఆది.3..ఆ.
కాశీ. 6 ఆ. భీమ. 2 ఆ.
2. పోవు. జై. 2. ఆ.

ఏకతమాడు : ద్వ. అ. క్రి. ఆలోచించు స్వా.మ.పం.6ఆ.

ఏకభుక్తము సేయు : సం. అ. క్రి. 1. ఒంటిప్రొద్దు చేయు
2. ఒకమాఱు భుజించు ఆము.
ఏకమగు : సం. అ. క్రి. ఒకటియగు పరత.
ఏకముఖమగు : సం. అ. క్రి.ఏకరీతిగా నుండు
ఏకరు : దే. అ. క్రి. 1. ఉవ్విళ్ళూరు నల్ల.నీతి.గాథే.
2. భయపడు. పద్మ. 9 ఆ.
3. వాచిపోవు శుకా్సం. 4 ఆ.
ఏకరువుపెట్టు . దే.స. క్రి. ఏకరు విడు
ఏకవ్యాపకమగు: సం. అ. క్రి. అంతయు వ్యాపించు. విష్ణు. 3. ఆ.
ఏకశయ్య నుండు: సం. అ. క్రి. జతగూడియుండు. ద్వి.జ.గ.
ఏకాంతమాడు : సం. అ. క్రి. మంతనమాడు వ.రా.
ఏకాంతమిచ్చు : సం. అ. క్రి. రహస్యముగా మాటాడ నవకాశ మిచ్చు.
ఏకాక్షరప్రయోగము సేయు : సం స. క్రి. చులకనగా పిలుచు.
మన్నారుదాస. వి. రంగరాజ.
ఏకివేయు : దే. స. క్రి. ఒకవ్యక్తిని బాగుగా విమర్శించు; సర్వదోషములు మొగమోటమి లేక చెప్పు, లేక వ్రాయు.
ఏకీభావము నొందు: సం. అ. క్రి. ఏకీభవించు
ఏకీభవించు : సం. అ. క్రి. ఒక్కటియగు; కలసిపోవు. [చా]
కాశీ. 7 ఆ.
ఏకు : దే. స. క్రి. 1. దూది మొ॥ విడిపోవునట్లు యంత్రముతోఁ గొట్టు.
"దూది ఏకిరి."
2. దూదేకినట్లు విడఁగొట్టు.కకు. 5 ఆ.
3. దోషములు ప్రకటించు.
ఏకులువడకు : దే. స. క్రి. 1. ఏకులు చేయు.
2. మనిసి సన్నపడు.

ఏచు : దే. అ. క్రి. [ఈ పదము సకర్మకమైనపుడు సానుస్వారమని శ. ర. సూ. ని. కాని, ఏపరించు, ఏపులనుబట్టి నిర్ధారకముగా నిది నిరనుస్వారమే.]
1. అధికమగు. భా. రా. యు.
2. పెరుగు. భా. ఆది. 4 ఆ.
3. చెలరేగు. భార. ఉద్యో. 1 ఆ.
4. పొడచూపు. భాగ. 3 స్కం.
స. క్రి. బాధించు. భార. విరా. 2 ఆ.

ఏటవేయు : దే. స. క్రి. భారము వేయు.

ఏటికెదురీదు : దే. అ. క్రి. ఏ గడ్డు పనికైన వ్యతిరేకముగ నడచు. (వ్య)

ఏటులాడు :
ఏట్లాడు : దే. అ. క్రి. (ఏటులు + ఆడు.)
బాణప్రయోగముతోఁ బోరు; పోరు.
నిర్వ. 4 ఆ. రామా. 8 ఆ.
ఇట్లే, ఏట్లాడు. య. 1 ఆ.
భార. విరా. 5 ఆ.

ఏట్లుపెట్టు : దే. స. క్రి. దెబ్బలు కొట్టు.

ఏడాటలాడించు . దే. స. క్రి. (ఏడు + ఆటలు + ఆడించు)
మిక్కిలి శ్రమపెట్టు. శ. ర.

ఏడిపించు దే. స. క్రి. (ఏడుచు ధా. ప్రే.)
1. రోదనము చేయించు సిం. నార.
2. బాధించు, ఇట్లే, ఏడ్పించు. శివరా. 2 ఆ.

ఏడుచు :
ఏడ్చు : దే. అ. క్రి. రోదనముచేయు (చూ. ఏడిపించు)
ఇట్లే, ఏడ్చు భార. ద్రోణ. 2 ఆ.

ఏడ్చుకొను : దే. అ. క్రి. (ఏడ్చు + కొను. స్వార్థమున)
రోదనముచేయు. ద్వి. నల. 4 ఆ.

ఏతామెత్తు . దే. అ క్రి. ఏతాముపట్టు

ఏతులఁబోవు : దే. అ. క్రి. 1. గర్వపడు
2. హెచ్చులకుఁబోవు. పాండు. 7ఆ.

ఏతెంచు : దే. అ. క్రి. (ఏగు+తెంచు)
1. వచ్చు. వి.పు.7ఆ. భార.శాం.3 ఆ.
2. డగ్గఱు నైష. 8 ఆ.
3. కలుగు విక్ర. 3 ఆ.
4. జరుగు హరి.ఉ. 6 ఆ.

ఏతేరు : దే. అ. క్రి. వచ్చు

ఏదు : వై. అ. క్రి. 1. చెడు భార. ఆది. 6 ఆ.
2. పెంపొందు ప్రబంధ.
స. క్రి. 1. కాపాడు దశా. 1 ఆ.
2. పెంచు రామా. 3. ఆ.
3. పొందు. హరి. ఉ. 7 ఆ.
4. లోపించు
5. పరిత్యజించు, విడుచు

ఏపడఁచు : దే. స. క్రి. నశింపఁజేయు భార. కర్ణ 2. ఆ.

ఏపరించు ; దే. స. క్రి. (ఏపగు ధా. ప్రే.) 1. బాధించు
ద్వి. హరిశ్చ. ఉ.
2. దుఃఖింపఁజేయు ద్వి. హరిశ్చ.

ఏపారు దే. అ. క్రి. 1. అతిశయించు. భార. ఉద్యో. 2ఆ.
2. విజృంభించు. భార. భీష్మ. 2.
3. విలసిల్లు నైష. 5. ఆ.

ఏఁపు : దే. స. క్రి. (ఈ పద మీయర్థమున సానుస్వారమని సూని. శ. ర. కాని యది చింత్యము)
బాధించు. నవ. 2. ఆ.

ఏఁపుమీఱు : } దే. అ. క్రి. 1. వృద్ధియగు. 2. బాగుగ నెదుగు.
ఏఁపుచూపు : } "పైరు ఏఁపుగఁ బెరిగినది"

ఏఁపుమాఁపు : దే. స. క్రి. (ఏపు+మాపు)
1. మించు
2. జయించు సా. 2. ఆ.
3. చంపు విక్ర. 4. ఆ.

ఏఁపుమిగులు : దే. అ. క్రి. 1. విలసిల్లు;
2. సరిపడు. భాగ. 1 స్కం.
3. ఉత్సహించు. భార. భీష్మ. 2 ఆ.

ఏఁపురేఁగు : దే. అ. క్రి. 1. విజృంభించు. భాగ. 3 స్కం.
2. గడిమీరు.
3. విచ్చలవిడిగా విహరించు.
వేం. పంచ. 4 ఆ.

ఏమటసేయు : దే. అ. క్రి. నిలిచిపోవు; ఆగు. మల్హ. 3 ఆ.

ఏమఱించు : దే. స. క్రి. (ఏమఱు ధా. ప్రే.) రాధా. 1 ఆ.

ఏమఱిపడు : ద్వా. అ. క్రి. పరాకుపడు.

ఏమఱిలు : } దే. అ. క్రి. పొరపడు. కళా. 1 ఆ.
ఏమఱిల్లు : } స. క్రి. మఱచిపోవు. రాను. 4 ఆ.

ఏమఱు : దే. అ. క్రి. జాగరూకత లేకయుండు.
భారం. భీష్మ. 1 ఆ. ఆది. 6 ఆ.
స. క్రి. 1. ఉపేక్షించు. భార. ఆది. 8 ఆ.
భార. ఆర. 4. ఆ.
2. మఱచు; భార. విరా. 1 ఆ.
పరమ. 2 ఆ.
(ఏమాఱు అని బిల్హణీయము. 1 ఆ.)

ఏమఱుచు : దే. స. క్రి. (ఏమఱు ధా. ప్రే.)
ఏమఱఁజేయు. శ. ర.

ఏమాఱు : }
ఏమఱు : } దే. అ. క్రి. ఉపేక్షించు. ప్రే. ఏమార్చు.

ఏమియను : దే. స. క్రి. చీవాట్లుపెట్టు.

ఏమోయగు : దే. అ. క్రి. చెప్పరాని రీతిని బరిణమించు.
భీమ. 2 ఆ.

ఏయు : దే. స. క్రి 1. (బాణాదులను) ప్రయోగించు.
భార. అర. 4 ఆ.
2. పడఁగొట్టు. భార. ఆది. 7 ఆ.
3. వైచు. ద్వా. 2 ఆ.

ఏరుగు : దే. అ. క్రి. విసర్జించు; మలము విడుచు. (శ.ర.)

ఏరుతలచూపు : } దే. అ. క్రి. 1. ఏటికి నీరు తగులు.
ఏరువచ్చు : } 2. తలనొప్పి తగులు.

ఏరుపడు : ద్వ. అ. క్రి. వేర్పడు; పంక్తులుదీఱు.
రామా. 8 ఆ. కువల. 1 ఆ.

ఏరుపఱుచు : ద్వ. స. క్రి. (ఏరుపడు ధా. ప్రే)
నిర్ణయించు; ఏర్పాటుచేయు.
శివ. 1 ఆ.

ఏరువాకచేయు : దే. అ. క్రి. ప్రతి జ్యేష్ఠ పూర్ణిమ నాడు మొట్ట
మొదటి శుభలగ్నమున దుక్కిసాగించు

ఏరువాకసాగు : దే. అ. క్రి. జ్యేష్ఠ పూర్ణిమ నాడు వ్యవసాయ
మారంభించు. (ఇదిజిల్లా కొకనాడగును)

ఏరుసాగు : దే. అ. క్రి. దుక్కిదున్ను. ఆము. 4. ఆ.

ఏర్చు : దే. అ. క్రి. నొప్పికలుగు పాండు 4. ఆ.
స. క్రి. 1. కాల్చు భార. భీష్మ. 3 ఆ.
2. బాధించు ఆము. 1 ఆ.
3. ధ్వంసముచేయు. స్వా. 4 ఆ.
4. (మంచివి) ఎన్ను. భార. విరా. 1 ఆ.
5. విభాగించు స్వా. 5. ఆ.
6. కూర్చు పాండు. 5. ఆ.
7. నిర్ణయించు శివరా. 1 ఆ.

ఏర్చు 8. పన్ను భార. విరా. 4ఆ.
9. పరిశీలించు. ఆము. 1 ఆ.
10. తొలఁగించు భార. విరా. 2 ఆ.

ఏర్పడు : దే. అ. క్రి. (ఏరు+పడు)
1. వేఱగు భా.రా.యుద్ధ.
2. తెల్లమగు భార.ఆది. 1ఆ.
3. గోచరమగు భార.ఆది. 4 ఆ.
4. ఉండు మ ల్లా. శృం.

ఏర్పడుదెంచు : ద్వ. అ. క్రి. 1. వచ్చు, ప్రవేశించు. భార.ఆది.5 ఆ
2. స్పష్టముగాఁగనుపించు.
ప్రకటమగు భార. శాం. 1ఆ.

ఏర్పరించు : ద్వ. స. క్రి. 1. ఏర్పఱచు; నిర్ణయించు
భార.విరా. 1 ఆ.
2. విభాగించు మల్ల.నీతి.
3. ప్రకటించు; తెలుపు. ప్రభా. 3 ఆ.
4. నిర్మించు, కట్టు. విప్ర. 2 ఆ.
5. వ్యూహము పన్ను పారి. 5 ఆ.

ఏర్పఱచు : ద్వ. స. క్రి. (ఏర్పడు ధా. ప్రే.)
1. విభాగించు. కు. సం. 1 ఆ.
2. నిర్ణయించు. ఉ. రా. 1 ఆ.
3. చూపు. భార. విరా. 2 ఆ.
4. చక్కఁజేయు. భార. ఉద్యో. 4 ఆ.

ఏఱు : దే. స. క్రి. 1. ఒకటొకటిగాఁజేతితోనెత్తు.
భార. అశ్వ. 4 ఆ.
2. ఎన్ను. నైష. 7 ఆ. సావి. 2 ఆ.
3. నఱుకు. భార. ద్రోణ. 1 ఆ.

ఏఱుపఱచు : దే. స. క్రి. ఏర్పఱచు. శివరా. 1 ఆ.

ఏలాటమాడు : దే. స. క్రి. సయ్యాటమాడు.

ఏలు : దే. స. క్రి. 1. పరిపాలించు. భార. ఉద్యో. 4 ఆ.
2. కైకొను. దశా. 1 ఆ.
3. శాసించు, ఆజ్ఞాపించు.
(చూ. ఏలుదెంచు)

ఏలికొను : దే. స. క్రి. 1. దాసిగాఁ జేసికొను.
2. భార్యనంగీకరించు; "ఆలి నేలికొను."

ఏలుకొను : దే. స. క్రి. 1. పాలించు.
2. భార్యతో సంసారముచేయు.

ఏలుదెంచు : దే. స. క్రి. శాసించు. భార. విరా. 2 ఆ.

ఏలుబడి సెలుపు : దే. అ. క్రి. రాజ్యముచేయు.

ఏవగించు : దే. అ. క్రి. 1. రోఁతపడు. భార. ఆది. 7 ఆ.
2. అసూయచెందు, భార. కర్ణ. 2 ఆ.
స. క్రి. 1. నిరసించు. భార. ఆది. 7 ఆ.
2. విడుచు. భార. సభా. 2 ఆ.

ఏవపడు . ద్వ. అ. క్రి. రోఁతపడు. భార. అను. 3 ఆ.

ఏవబారు : దే. అ. క్రి. మనస్సు కలఁతనొందు. తన తప్పు లొరు లెత్తిపెట్టునపుడుమాత్సర్యపడు, కుత్సచెందు,
మొగముమొరకటించుకొను.

ఏవలాడు : దే. స. క్రి. నిందించు.
అసహ్యించుకొను. హం. విం. 3 ఆ.

ఏష్యములు పలుకు : దే. స. క్రి. భవిష్యత్తు చెప్పు. ఆము. 6 ఆ.

ఏసరించు :
ఏసరు : } దే. అ. క్రి. అతిశయించు. రుక్మాం. 8 ఆ.

ఏసరేగు : దే. అ. క్రి. (ఏస + రేగు) విజృంభించు;
అతిశయించు. రామా. 3ఆ. పాండు. 4ఆ.

ఏసరేయు . దే. అ. క్రి. ఏసరేగు. హర. 2 ఆ.

# ఐ

ఐదవెట్టు : దే. స. అ. క్రి. 1. అనుసరించు
2. వెంబడించు బస. 5.
3. వెనుకకుఁజను

ఐదుపదిసేయు : దే. స. అ. క్రి. 1. నమస్కరించు (శ.ర.)
వెనుదీయు నైష. 7.ఆ.

ఐపోవు : దే. అ. క్రి. అయిపోవు శ. ర.

ఐరకొను : దే. అ. క్రి. 1. సరియగు. వేం. పంచ. 1 ఆ.
2. పెరుగు. వేం. పం. 1 ఆ.

ఐరేండ్లకుబోఁవు : దే. అ. క్రి. రూ. అరివేణికిఁబోవు
ఐరేణికుండలు తెచ్చుటకుఁ బోవు. తెలం

ఐవచ్చు : దే. అ. క్రి. అయివచ్చు; అచ్చివచ్చు.
ఆం. భా. 3 ఆ.

# ఒ

ఒంగు : దే. అ. క్రి. 1. వంగు. గ్రా.
2. లొంగిపోవు

ఒంచు : దే. స. క్రి. వంచు. గ్రా.

ఒంటబట్టు : దే. అ. క్రి. తిన్న పదార్థముయొక్క సారము
శరీరమునకుఁ బట్టు
[ఆక్షేపణలో వాడుటగలదు.]

ఒంటరిగా నుండు : దే. అ. క్రి. ఒంటరిగానుండు

ఒంటికాలిమీదఁబోవు : దే. అ. క్రి. అతితీవ్రముగా నొకనిమీఁద
దెబ్బలాటకుఁ బోవు

ఒంటిగానుండు : దే. అ. క్రి. ఏకాంతముగా నుండు

ఒంటిపడు : ద్వ. అ. క్రి. (ఒంటి + పడు)
అసహాయుఁడగు. కేయూర. 3 ఆ.
ఇట్లే, ఒంటివడు. భార. ఆశ్ర. 2 ఆ.

ఒంటిపాటగు : దే. అ. క్రి. అవకాశముదొరకు, హంస. 3 ఆ.

ఒంటు : దే. అ. క్రి. పొందు, పొసగు, వరాహ. 2. ఆ.
స. క్రి. స్పృశించు, ముట్టు. శశాం. 2 ఆ.
ప్రకృతికి సరిపడు. (తెలం.)

ఒంటుకొను : దే. స. క్రి. 1. రమించు, శశాంక. 2 ఆ.
2. భాగములుచేసియెవరిది వారుతీసికొను
రూ. ఒడ్డుకొను

ఒండగు : దే. అ. క్రి. మఱియొకవిధముగా నగు, భార. ఆది.

ఒండాడు : దే. అ. క్రి. 1. మాఱుమాటాడు
ఎదురాడు. పాండు. 4 ఆ.

ఒండుపలుకు : దే. అ. క్రి. మాఱుపలుకు. (న్య) భార. భీష్మ. 3 ఆ.

ఒండొకబుద్ధిచేయు: దే. అ. క్రి. అన్యథాభావించు భార. ద్రోణ.1 ఆ.
ఒందించు : దే. స. క్రి. (ఒందు ధా. ప్రే.) కలుగఁజేయు విక్రమా. 2ఆ.
ఒందిలిపడు : గ్రా. అ. క్రి. దుఃఖపడు; దైన్యమందు, పారి.ఉ.1ఆ.
ఒందు : దే. అ. క్రి. 1. కలుగు. భార. ఆది. 8. ఆ. 2.
ఇంపగు; యుక్తమగు;
నాకొందఁగ వండిపెట్టు. భార.ఆది 6ఆ.
స. క్రి. 1. పొందు, పడయు. భార.అర.4 ఆ.
2. ప్రవేశించు కేయూర 3 ఆ..
3. కలియు, రమించు పారి.3 ఆ.
ఒకకొలికికివచ్చు : దే. అ. క్రి. ఒకదారికి వచ్చు. విప్రనా.2 ఆ.
ఒకగాడికట్టు : దే. స. క్రి. భిన్నప్రకృతుల నొకచోఁ జేర్చు.
గాటకట్టు. (న్యవ.)
ఒకచందమగు : దే. అ. క్రి. ఒక రీతియైనదగు. భార. భీష్మ.
ఒకటియడుగు : దే. స. క్రి. ఒక విషయమే అడుగు. వా.
ఒకనుడుగుఅను: దే. స. క్రి. పాటలో నొక చరణము పాడు.
ఒకమాటచేయు : దే. స. క్రి. ఒక యేర్పాటు చేయు. శుక.
ఒకమూలవేయు: దే. స. క్రి. ఒక వైపువేయు. శుక.
ఒకలాగగు : దే. అ. క్రి. నిశ్చింతగాఁ జెప్పలేనిదగు.
ఒక్కటించు : దే. స. క్రి. ప్రత్యేకించు. కట్టా.రామా.అయోధ్య.
ఒక్కకుత్తుకయగు: దే. అ. క్రి. ఒకటియగు. బస. పు.
ఒక్కటగు : దే. అ. క్రి. ఏకమగు.
ఒక్కటిచేయు : దే. స. క్రి. ఏకముచేయు.
ఒక్కరిపట్లపదుండ్రగు: దే. అ. క్రి. ఒకని పనికి పదిమంది సిద్ధమగు. వి. ప్ర.
ఒక్కాణించు : వై. స. క్రి. వ్యాఖ్యానించు, చెప్పు. ఆం. వ.
ఒగరుచు : దే. స. క్రి. ఒగర్చు (శ. ర.) ఊపు.

ఒగరులాడు : దే. స. క్రి. ఆశించు త్రాళ్ళ.
ఒగరెక్కు : ద్వ. అ. క్రి. ఒగరగు. చిత్ర. భా. 2 ఆ.
ఒగర్చు : వై. అ. క్రి. 1. ఒగరెక్కు. ఆముక్త. 2 ఆ.
2. ఆయాసపడు.
ఒగుడుకఱచు : దే. అ. క్రి. కృశించు, చిక్కు శ. ర.
ఒగ్గు : దే. అ. క్రి. 1. లగ్నమగు, తగులుకొను. శశాం. 2 ఆ.
2. రతికి సిద్ధపడు. "పునారతికినొగ్గు" దశా8.ఆ.శుక.4.
3. ఒప్పు, ఇష్టమగు. కువల. 5 ఆ.
4. వశమగు, లోబడు. ఉ. రా. 9 ఆ.
స. క్రి. 1. ఉంచు, పెట్టు. కళా. 3 ఆ.
2. పట్టు. ఆము. 2 ఆ.
3. ప్రవణముచేయు. పారి. 1 ఆ.
4. ఒడ్డు, పన్ను "పందెమొగ్గు"
5. వంచు. దశ. 4 ఆ.
ఒగ్గులుదిద్దు : దే. స. క్రి. సరిచేయు.
ఒగ్గులుపెటు : అన్య. దే. స. క్రి. కార్య ప్రతికూల ప్రయత్నము చేయు.
ఒచ్చపోవు : దే. అ. క్రి. అవమానపడు.
ఒచ్చపడు : ద్వ. అ. క్రి. (ఒచ్చము+పడు) అవమానముపడు.
ఒచ్చెమగు : దే. అ. క్రి. తక్కువగు.
ఒట్టికొను : దే. అ. క్రి. హత్తుకొను.
ఒట్టిడుకొను : దే. అ. క్రి. ఒట్టుపెట్టుకొను.
ఒట్టు : దే. అ. క్రి. 1. కలుగు. భాగ. 10 స్కం.
2. ప్రజ్వలించు. భార. ఉద్యో. 2 ఆ.

ఒట్టు : స. క్రి. 1. పెట్టు. భార. శల్య. 2 ఆ.
2. కాల్చు. భాగ. 5 స్కం.
3. త్రాగు. బహు. 2 ఆ.
4. కల్లు మొదలగునవి ఊరు (నె. జి.)
5. పాలిచ్చుట నిలిచిపోవు. (నె. జి.)
చూ. ఊటు. (నె. జి.)

ఒట్టుగొను : దే. అ. క్రి. (ఒట్టు+కొను)
ఒట్టుపెట్టుకొను. విజ్ఞా. ప్ర.

ఒట్టుపెట్టు : దే. స. క్రి. ఆనపెట్టు.

ఒట్టువెట్టు :
ఒట్టువెట్టుకొను: } దే. స. క్రి. (ఒట్టు+పెట్టు) నిషేధించు. శపించు. కాశీ. 7 ఆ. దశ. 6 ఆ.

ఒడఁగూడు : దే. అ. క్రి 1. కలియు. "పాండవులతోడ నొడఁగూడి బ్రదుకుమయ్య" భార. ఉద్యో. 3 ఆ.
2. కలుగు. "అబ్ధి కొడఁగూడె రత్నాక రాహ్వయంబు" కాశీ. 3 ఆ.
3. ఒప్పు. భార. ఉద్యో. 2 ఆ.
4. గుమిగూడు. భార. ఆది. 5 ఆ.
5. పేలగు. హర. 2 ఆ.
స. క్రి. కూడు. కు. సం. 4 ఆ.

ఒడఁగూర్చు : దే. స. క్రి. (ఒడఁగూడు ధా. ప్రే.)
1. కలిగించు. భార. ఉద్యో. 3 ఆ.
2. కూర్చు. కు. సం. 5 ఆ.
3. సమకూర్చు. హర. 2 ఆ.
4. ఫలింపఁజేయు. ఉ. రా. 2 ఆ.

ఒడఁగొను : దే. స. క్రి. (ఒడిమి+కొను)
కొల్లగొట్టు. (చూ. ఒడగోలు)

ఒడఁగోలుగొను : దే. స. క్రి. (ఒడగోలు + కొను) చూఱగొను, కొల్లగొట్టు. భో. 3 ఆ.

ఒడఁబడు : దే. అ. క్రి. 1. సమ్మతించు. భార. అర. 6 ఆ.
2. అనుకూలించు. భార. ఆది. 8 ఆ.
3. సరిపోవు. భాగ. 10 స్కం.
4. కుదురు, జరుగు. కు. సం. 10 ఆ.
స. క్రి. సహించు. భార. ద్రో. 2 ఆ.

ఒడఁబర్చు : దే. స. క్రి. ఒడఁబఱచు. బస. 4 ఆ.

ఒడఁబఱచు :
ఒడఁబఱుచు : దే. స. క్రి. (ఒడఁబడు ధా. ప్రే.) ఒడఁబడఁజేయు.

ఒడఁబఱపించు : దే. స. క్రి. ఒడఁబడఁజేయు. మల్హా. 2 ఆ. మల్హా. 2 ఆ. భాగ. 1 స్కం.

ఒడలంటు : దే. స. క్రి. అంగమర్దనముచేయు. శుక.

ఒడలుకాలు : దే. అ. క్రి. ఒడలుమండు కు.సం.

ఒడలుచెడు : దే. స. క్రి. దేహమునకుఁ జెఱుపు గలుగు. మించు

ఒడలుచేయు : దే. అ. క్రి. ఒళ్ళుచేయు, బలియు.

ఒడలుదాచు దే. అ. క్రి. పనిచేయకుండనుండు. పాంచాలీ.

ఒడలునిండు : దే. స. క్రి. శరీరమంతకు సరిపోవు. ఒడలునిండఁబట్టు మించు.

ఒడలుప్పొంగు: దే. అ. క్రి. శరీరముబ్బు విజయ.వి.

ఒడలెత్తు : దే. అ. క్రి. జన్మించు, పుట్టు. హరి.ఉ.7 ఆ.

ఒడలోడగు : దే. అ. క్రి శరీరము పాడగు. నిరం.

ఒడలోము : దే. స. క్రి. శరీరముకాపాడు. కు.సం.

ఒడలోర్చు : దే. అ. క్రి. శ్రమకు తట్టుకొను. నిరు.

ఒడికట్టు : దే. అ. క్రి. (ఒడి+కట్టు) అన్నిటికి సిద్ధపడు

ఒడికట్లుపడు : దే. అ. క్రి. గుబ్బిపలాడు:
"ఒకరిపైఁబడి గొనుకను ఒడికట్లు పడిరి.
తల్లడింపుచు వారు తల్లక్రిందైరి."

ఒడికమగు : దే. అ. క్రి. అందమగు

ఒడికములాడు : దే. అ. క్రి. (తెలం.) ఒప్పులు పలుకు

ఒడినించు : దే. స. క్రి ,, సంతానము కలిగించు

ఒడియించు : దే. స. క్రి. (ఒడియు. ధా. ప్రే.) ఒడియఁజేయు
తీయించు ఆం.భా.త్ర.

ఒడియు : దే. అ. క్రి. 1. వ్యాపించు, రంగ.3 ఆ.
2. కారు. హరిశ్చం.
3. ఒడుపు వేసికొని యుండు
"ఒడిసి తలపట్టి తివిచి" భార.విరా.2ఆ
స. క్రి. 1. పాఱఁద్రోలు దశా.1 ఆ.
2. అవలీలగాఁ బట్టుకొను జై. 3 ఆ
3. పొందు. పాండు. 2 ఆ.

ఒడుచు : దే. అ. క్రి. 1. గెలుచు, జయించు. భార.ఆది.3ఆ.
2. నశింపఁజేయు.పోఁగొట్టు. భీమ.6ఆ.
3. వేఁటాడు; చంపు. పి. శకుం. 2ఆ.
4. బలవంతముగలాగు. భార.ద్రో5.ఆ.
5. గ్రహించు కేయూర. 4ఆ.
6. నీకుకాకునట్లుచేయు
7. ఆచ్ఛ.
8. ఒకరిధనమును బూర్ణముగాహరించు
9. తుదముట్టించు

ఒడుపుచూడు : దే. అ. క్రి. 1. సమయ సందర్భముల నెఱుఁగు.
(తెలం)
2. అనువు నెఱుఁగు.

ఒడుపుచూపు : దే. స. క్రి. 1. నేర్పు కనంబఱచు.
2. చాకచక్యము చూపు.
3. వేగముచూపు.

ఒడుపుదప్పు : దే. అ. క్రి. వీలుదప్పు.

ఒడుసుపోవు : దే. అ. క్రి. గుడ్డనేత తెఱ్ఱలు తెఱ్ఱలుగా నేర్పడు. (నె. జి.)

ఒడ్డగించు : దే. స. క్రి. (రూ) ఒడ్డవించు. నంచు, వ్రాలుచు. పండితా. పర్వ.

ఒడ్డగిలు :
ఒడ్డగిల్వారు : } దే. అ. క్రి. ఒడ్డగిల్లు.
1. ఒఱగు.
2. స్రవించు. భాగ. 1 స్కం.
3. విజృంభించు. రామా. 8 ఆ.

ఒడ్డవించు : దే. అ. క్రి. ఒడ్డగించు. పం.

ఒడ్డాడు :
ఒడ్డగిల్లు : } దే. అ. క్రి. ఒడ్డగిలు, ఒఱగు. భీమ. 2 ఆ.

ఒడ్డారెంచు : దే. అ. క్రి. 1. పలుకు, మాటాడు. భాగ. 8 స్కం.
2. సాహసించు. భాగ. 8 స్కం.
3. ఎదిరించు. నృసింహ. పు. 4 ఆ.
4. తీర్చిదిద్దు.

ఒడ్డించు : దే. అ. క్రి. 1. వ్యతిరేకించు, విరోధించు. కు. సం. 8 ఆ.
2. నిరాకరించు. పాండు. 2 ఆ.
స. క్రి. ఒడ్డునట్లుచేయు. ప్రభా. 5 ఆ.

ఒడ్డిపోవు : దే. స. క్రి. అడ్డుపెట్టు.

ఒడ్డు : యు. దే. స. క్రి. 1. పందెమిడు.
"వివిధ వస్తువాహనంబులొడ్డి"
భార. ఆర. 2 ఆ.
2. వల మొ॥ పఱచు, పన్ను.
భార. విరా. 2 ఆ.
3. చాచు. భార. శాంతి. 4 ఆ.
4. (చెవి) ఒగ్గు. విక్ర. 5 ఆ.
5. ఏయు. కు. సం. 4 ఆ.
6. అడ్డముగా నుంచు, అడ్డు.
భాగ. 1 స్కం.
7. పడవైచు. భా. రా. యుద్ధ.

ఒడ్డుకొను : దే. అ. క్రి. తప్పుకొను. కళా. 8 ఆ. సిం. నార.
స. క్రి. ప్రారంభించు, పూను. మల్హ. 3 ఆ.
నీటికి గట్టు వేసినట్లు అడ్డము నిలుచు.

ఒడ్డుసూపు : దే. స. క్రి. (ఒడ్డు+చూపు) ప్రతిఘటించు.
దశ. 1 ఆ.

ఒత్తగిలు : } ఒత్తగిల్లు : } దే. అ. క్రి. 1. ఒఱగు; ప్రక్కకొఱగు. నైష. 7ఆ.
2. తొలఁగు. దశా. 3 ఆ.
3. అంటుకొను. కాశీ. 4 ఆ.
4. చలించు. పద్మ. 3 ఆ.

ఒత్తగు : దే. అ. క్రి. నిండగు. "అన్నము ఒత్తుగాఁదినెను."
(నె. జి.)

ఒత్తరించు : వై. స. క్రి. 1. మించు. భాగ. 8 స్కం.
2. ఉద్రేకము కలుగజేయు. జై. 8 ఆ.
3. అతిశయింపఁజేయు. దశ. 12 ఆ.
4. చిమ్ము; త్రోసివేయు.

ఒత్తళించు : వై. అ. క్రి. పెంపొందించు. కు. సం. 5 ఆ.

ఒత్తాసివచ్చు : దే. అ. క్రి. ఒకరికి సహాయపడు.

ఒత్తికొనివచ్చు : దే. అ. స. క్రి. త్రోసికొనివచ్చు. కవిక.

ఒత్తిడిచేయు :
ఒత్తిడిపెట్టు : } దే. స. క్రి. నిర్బంధపఱచు.

ఒత్తియాడు : దే. స. క్రి. దూషించు. నీలా. 2 ఆ. చంద్ర. 2 ఆ.

ఒత్తిలిచీఱు : దే. స. క్రి. గట్టిగాఁబిలుచు. హర.

ఒత్తిలిపాడు : దే. అ. క్రి. గట్టిగాపాడు. భాగ.

ఒత్తిలు :
ఒత్తిల్లు : } దే. అ. స. క్రి. ఒత్తిగిల్లు. 1. తప్పుకొను.
భార. అశ్వ. 1 ఆ.
2. చోటు తప్పు.
3. ఒత్తు, నొక్కు. ద్వా. 3 ఆ.
4. సందడించు.

ఒత్తు : దే. అ. క్రి. 1. అధికమగు. కళా. 3 ఆ.
2. కేకవేయు. హర. 2 ఆ
3. మీఁదికివచ్చు. ద్వా. 8 ఆ.
4. గ్రుచ్చుకొను. హర. 4 ఆ.
5. పొడము. కు. సం.
6. ఒఱగు. స్వా. 5 ఆ.
స. క్రి. 1. నొక్కు.
భార. విరా. 2 ఆ. కళా. 1 ఆ.
2. బాధించు. భార. శల్య. 2 ఆ.
3. ఊదు, వాయించు.
కాశీ. 6 ఆ. భాగ. 1 స్కం.
4. సవరించు. దశా. 3 ఆ.
5. పిసుకు. నైష. 7 ఆ.
6. తుడుచు, అద్దు. భార. ద్రో. 5 ఆ.
7. గెంటు. పరమ. 2 ఆ.

ఒత్తు : 8. పరిహసించు. కు. సం. 10 ఆ.
9. బలిమి నాక్రమించు. భార. మహాప్ర.
10. పరీక్షించు. ద్వి. హరిశ్చం.
ఒత్తుకొను . దే. అ. క్రి. 1. క్రోసికొను. భాగ. 10 స్కం.
2. ముమ్మురమగు. భాగ. 10 స్కం.
స. క్రి. 1. ఆక్రమించుకొను.
భార. ఉద్యో. 2 ఆ.
2. అద్దుకొను. దశా. 2 ఆ.
ఒత్తుదెంచు : దే. స. క్రి. నొక్కు. కు. సం. 9 ఆ.
ఒత్తుదేఱు : దే. స. క్రి. ఒరసికొను కు. సం.
ఒత్తులొత్తు : దే. అ. క్రి. ఒకరికి సహాయముగా బిగువు మాటలాడు. ముఖప్రీతికై మాటలాడు.
ఒత్తువడు : దే. అ. క్రి. అనుముడుపడు. హరి. పూ. 7 ఆ.
ఒత్తువెట్టు : దే. స. క్రి. మోసగించు. ప. పీ.
ఒపకలియాడు : దే. అ. క్రి. సరసములాడు. కు. సం.
ఒదయు : దే. స. క్రి. పొందు. శివతత్త్వ.
ఒదరు : దే. అ. క్రి. 1. వదరు, ప్రేలు. కవిక. 6 ఆ.
2. గర్వించు, విఱ్ఱవీగు.
నృసింహ. 4 ఆ. కు. సం. 12 ఆ.
స. క్రి. దూషించు. భార. సభా. 2 ఆ.
ఒదరుచు : దే. స. క్రి. ఒదర్చు. శ. ర.
ఒదర్చు : దే. స. క్రి. ఊడఁదీయు, పెఱుకు. ఆము. 3 ఆ.
ఒదలు : } పొదలు : } దే. అ. క్రి. వర్ధిల్లు. భాగ. 10 స్కం.
ఒదవు : వై. అ. క్రి. 1. కలుగు భార. విరా. 2 ఆ.
2. కాఱు. భా. శాం. 4 ఆ.
3. దొరకు. భా. శాం. 3 ఆ.

ఒదవు

4. వినియోగపడు.
5. వచ్చు. భార. ఉద్యో. 4 ఆ.
6. పెంపొందు. ఆము. 5 ఆ.
7. ఒప్పారు. హరి. ఉత్తర. 5 ఆ.
8. సిద్ధించు. వేంక. పంచ. 3 ఆ.
స. క్రి. ఇచ్చు. దశా. 3 ఆ.

ఒదికిలఁబడు : ద్వ్య. అ. క్రి. ప్రక్కకొఱగు. దశ. 10 ఆ.

ఒదికిలు : దే. అ. క్రి. 1. ఒత్తిగిలు. ఉ. హరి. 5 ఆ.
2. ప్రక్కకొఱగు.
"ఒదికిలి పాన్పుపైఁ బతికి నొయ్యనఁ గేలు తలాపుచేసి."

ఒద్దికసేయు : దే. స. క్రి. సంతరించు, పొసగించు.
"ఊరును బేరునుం దెలిసి యొద్దిక జేయుద మెల్ల కార్యమున్" ఉపావ.

ఒద్దివడు : దే. స. క్రి. త్రోసుపడు. కాశీ.

ఒదుగబాఱు : దే. అ. క్రి. ఒదుగు, తొలఁగు. భార. అను. 3 ఆ.
మంచి బియ్యమైనచో నన్నమధికముగా నగు.
"అన్నము ఒదుగఁ బారినది"

ఒదుగులాడు : ద్వ్య. అ. క్రి. ఒదుగు, ముడుగు. ఆముక్త. 3 ఆ.

ఒదుఁగు. దే. అ. క్రి. 1. ముడుగు. నృసింహ. 3 ఆ.
2. విధేయుడగు. రంగ. రా. అయోధ్య.
3. వెనుకదీయు, తొలఁగు.
భార. భీష్మ. 2 ఆ. శల్య. 2 ఆ.
4. కలసిపోవు. భార. శాంతి. 6 ఆ.
5. దాఁగు. భీమ. 5 ఆ.

ఒదుఁగువడు. ద్వ్య. అ. క్రి. 1. తొలఁగు. నై. 5 ఆ.
2. అణఁగు, నశించు. రాఘ. 4 ఆ.

ఒదుగుడువడు : దే. అ. క్రి. నలుగురితో నొకఁడుగా గలిసి యుండ గలుగు.

ఒదుగు : } ఒదువు : } దే. అ. క్రి. 1. అధికమగు. మార్కం. 2 ఆ.
2. సంగీతమున సంగతులు పలుకు. వాల్మీకి. 3 ఆ.
3. క్రమ్ము.
4. వీలు తప్పినపుడు సర్దుకొను.

ఒనగూడు : దే. అ. క్రి. 1. సిద్ధించు, కలుగు. భార. స్వర్గ.
2 కలియు. కుచేల. 2 ఆ.

ఒనగూర్చు : దే. స. క్రి. (ఒనగూడు ధా. ప్రే.)
1. సిద్ధింపఁజేయు.
2. కలిగించు. ఉ. రా. 4 ఆ.
3. కూడఁబెట్టు, కూర్చు. రాఘన. 2 ఆ. వసు. 6 ఆ.

ఒనరాదు : దే. అ. క్రి. ఒప్పు. అచ్చ. రా. అరణ్య.

ఒనరించు : దే. అ. క్రి. 1. చేయు. భాగ. 5 స్కం.
2. ఇచ్చు. భీమ. 6 ఆ.
3. రచించు. నైష. 1 ఆ.
4. నిర్మించు. భార. కర్ణ. 1 ఆ.
5. నియమించు. భార. సభా. 1 ఆ.

ఒనరు : దే. అ. క్రి. 1. ఉండు, కలుగు. భార. శాంతి.5 ఆ.
2. ఒప్పు. భార. ఆది. 2 ఆ.
3. పొసఁగు. కళా.4 ఆ. రాఘువ.3 ఆ.

ఒనరుచు : దే. స. క్రి. 1. చేయు; సృజించు. భార. ఆశ్ర. 2 ఆ. నైష. 3 ఆ.
2. నియమించు. వాల్మీకి. 3 ఆ.
3. ఇచ్చు. భార. ఉద్యో. 1 ఆ.

ఒనర్చు :
ఒనరుచు : దే. స. క్రి. (ఒనరు ధా. ప్రే.)
1. చేయు. భార. ఆది. 6 ఆ.
2. రచించు. విక్ర. 1 ఆ.
3. నిర్మించు. వసు. 3 ఆ.
4. ఉంచు; పెట్టు. నైష. 2 ఆ.
5. సిద్ధింపఁజేయు. కళా. 5 ఆ.
6. కూర్చు. విక్ర. 5 ఆ.
7. విభజించు. భార. ఉద్యో. 3 ఆ.

ఒనరుపడు : ద్వ. అ. క్రి. పొందుపడు.

ఒనవెట్టు : దే. అ. క్రి. పొంచియుండు.

ఒనవెట్టుకొను : దే. అ. క్రి. (ఒనరు+పెట్టు+కొను)
పొంచియుండు. కాశీ. 4 ఆ.

ఒప్పందము కుదురు : దే. అ. క్రి. 1. అనుకూల్య మేర్పడు.
2. సమయము కుదురు.
3. నిర్ణయముచేయు.
4. కలతలుదేఱు.

ఒప్పగించు : వై. స. క్రి. 1. అప్పగించు, ఇచ్చు. చంద్రా. 2 ఆ.
2. అధీనముచేయు. ఆము. 2 ఆ.
3. కంఠస్థముచేసి అప్పగించు.

ఒప్పగింతలుచేయు: దే. స. క్రి. పెండ్లి అయిన తర్వాత వధువును అత్తవారికి ఒప్పగించు.

ఒప్పగు : దే. అ. క్రి. 1. న్యాయమగు.
2. తగునదియగు.
3. అందమగు.

ఒప్పఁజెప్పు : దే. స. క్రి. 1. అప్పగించు.
2. పాఠము నొప్పచెప్పు.

ఒప్పనచేయు : } ద్వి. స. క్రి. (ఒప్పనము + చేయు.)
ఒప్పనముచేయు : } 1. అర్పించు. ద్వి. 7 ఆ.
2. వశపఱచు. హరిశ్చంద్ర. 5 ఆ.

ఒప్పరగించు : దే. స. క్రి. ఒప్పగించు. ఆం. భా. త్రి.

ఒప్పరికించు : వై. స. క్రి. ఉపేక్షించు. భార. భీష్మ. 2 ఆ.

ఒప్పఱు : దే. అ. క్రి. చలించు. కు. సం. 3 ఆ.

ఒప్పారు : దే. అ. క్రి. ఒప్పు. భార. అర. 4 ఆ.

ఒప్పించు : వై స. క్రి. 1. ఇచ్చు. భాగ. 1 స్కం.
2. అధీనముచేయు.
భార. అను. 4 ఆ. సమీర. 3 ఆ.
3. చేర్చు. చంద్రా. 4 ఆ.
4. సమ్మతింపఁజేయు. సమీర. 3 ఆ.

ఒప్పు : దే. అ. క్రి. 1. యుక్తమగు. భార. ఉద్యో. 2 ఆ.
2. శ్రేష్ఠమగు. భార. ఆది. 7 ఆ.
3. అందమగు. భార. శాంతి. 6 ఆ.

ఒప్పుకుప్పలాడు: దే. అ. క్రి. 1. సరసములాడు.
2. క్రీడా విశేషముచేయు.

ఒప్పుకొను : దే. అ. క్రి. సమ్మతించు. వేం. పంచ. 3 ఆ.
స. క్రి. గ్రహించి పుచ్చుకొను.
భాగ. ఆది. 4 ఆ.

ఒప్పుమిగులు : దే. అ. క్రి. ఒప్పారు, ప్రకాశించు. ఇట్లే, ఒప్పు మీఱు, ఒప్పుమెఱయు, ఒప్పెసఁగు మొ॥

ఒప్పుమెఱయు : దే. అ. క్రి. ప్రకాశించు. ఉ. హరి.

ఒప్పొదవు : దే. అ. క్రి. అందముపొందు. కు. సం.

ఒబ్బిడిచేయు : దే. స. క్రి. జాగ్రత్తపఱచు. ఆ. మ. క. 1 ఆ.

ఒమ్ము : దే. అ. క్రి. ఒప్పు, సరిపడు. శ. ర. ప్రా

ఒమ్ముకొను : దే. అ. క్రి. సరిపడు.

ఒమ్మువచ్చు . దే. అ. క్రి. ఒమ్ము, సరిపడు.
ఒయ్యనఁబోవు : దే. అ. క్రి. మెల్లఁగాబోవు. భార. ఆది.
ఒయ్యాఁకచేయు: దే. స. క్రి. 1. ఆపు, నిలుపు. నైజ. 4 ఆ.
2. వేఱె తీసియుంచు.
3. కట్టుదిట్టముచేయు.
ఒరకొ(గొ)ను : దే. స. క్రి. (ఒర+కొను) పరీక్షించు.
ఒరగంటఁగీయు.
ఒరగఁబెట్టు : దే. స. క్రి. అధికముగా నిచ్చు.
"నాకేమి యొరగఁ బెట్టితివి."
ఒరగావించు : దే. స. క్రి. ఒరగొను. నైష. 8 ఆ.
ఒరగాలగు : దే. అ. క్రి. కుంటికాలగు.
"కప్పకు నొరగాలైనను." సు. శ.
ఒరగు : దే. అ. క్రి. ఒరగుపడు. రూ.
1. వంగు. ఆము. 5 ఆ.
2. వ్రాలు.
భా. రా. కిష్కిం. శ. ర. పా.
3. పడు. అచ్చ. యు.
4. చచ్చు. మొ. రా. సుం.
5. లేకపోవు. కేయూర. 3 ఆ.
6. అధికముగా వచ్చు; లాభించు.
(తెలం.)
ఒరగొను : దే. స. క్రి. (ఒర+కొను) ఒరపెట్టు.
ఒరచు : దే. స. క్రి. నునుపుచేయు (చూ. ఒరచు_బడ్డ)
ఒరపట్టు :
ఒరవచ్చు : } దే. స. క్రి. ఒరపెట్టు, చికిలిపెట్టు.
ఒరపుమీఱు : దే. అ. క్రి. 1. అధికముగా నొప్పు.
2. నాణ్యము పొందు.

ఒరయు : దే. అ. క్రి. 1. మచ్చరించు; పోటీవచ్చు. వరాహ. 6 ఆ.
2. రాచు; తగులు. పారి. 4 ఆ.
3. ఒరపిడి కలిగించు; బాధించు.
స. క్రి. 1. రాచుకొను. భీష్మ. 6 ఆ.
2. పరీక్షించు. కళా. 2 ఆ.
3. గోఁకు. కు. సం. 1 ఆ.
4. ఎదుర్కొను. సా. 1. ఆ.
5. ఒరపెట్టు; ఒరగంటగీయు. ఉ. హరి. 5 ఆ.
6. పొందు. పి. శకుం. 1 ఆ.
7. సమీపించు. కాశీ. 6 ఆ.

ఒరలు : దే. అ. క్రి. 1. దొరలు. ఉ. రా. 8 ఆ.
2. దుఃఖపడు; అఱచు. ప. వీ.

ఒరవచ్చు : దే. అ. క్రి. 1. సమానమగు.
2. మించు.

ఒరవుబుట్టు : దే. స. క్రి. చవులూరు. చా. మ.

ఒరవెట్టు : దే. స. క్రి. ఒరకొను (వా)
బంగారమును పరీక్షించు.

ఒరసికొను : దే. స. క్రి. (ఒరయు ధా.)
తాఁకు; తగులు. హర. 7 ఆ.

ఒరసికొనిపోవు : దే. అ. క్రి. పుండుపడు, నొక్కుడుపడు. (వా)

ఒరిగట్టు : దే. అ. క్రి. 1. పగగొను. కు. సం. 10 ఆ.
2. అడ్డకట్టు. ప. వీ.

ఒరుము : దే. అ. క్రి. 1. చుఱుకగు. భార. 3 ఆ.
2. తీక్ష్ణమగు. ఆము. 4 ఆ.

ఒఱగఁబడు : ద్వ. అ. క్రి. ఒఱగు. ఆము. 1 ఆ.

ఒఱగు : దే. అ. క్రి. 1. వంగు. కు. సం. 7 ఆ.
2. వ్రాలు, పడు. భార. భీష్మ. 1 ఆ.
3. పక్షపాతముచూపు. భార. అను. 1 ఆ.

ఒఱగాయు : దే. అ. క్రి. ఒఱిఁయున్నట్లు కాయు, బాధపడు.

ఒఱగాలనిలుచు : దే. అ. క్రి. ఒంటికాలిమీఁద నిలుచు.

ఒఱగుపోవు :
ఒఱగువోవు : దే. అ. క్రి. (ఒఱగు+పోవు) వంగు, వంగిపోవు; వంకరయగు.

ఒఱగోడ్డెమాడు: దే. స. క్రి. మనసు నొప్పించెడు మాటలాడు.

ఒఱగోడ్డెములాడు: దే. స. క్రి. దెప్పిపొడుచు.

ఒఱపోరు : దే. అ. క్రి. మధురమగు. రాధికా. 2 ఆ.

ఒఱపుమీరు : దే. అ. క్రి. ఒప్పు. కృ. శకుం. 1 ఆ.

ఒఱసు : దే. స. క్రి. ఘర్షించు.

ఒఱలు : దే. అ. క్రి. 1. విలపించు. భార. ఆర. 6 ఆ.
2. అఱచు, ధ్వనిచేయు.
నైష. 8 ఆ. పారి. 5 ఆ.
3. కలఁగు. రామా. 6 ఆ.

ఒఱవఁబడు : దే. అ. క్రి. ఒఱగఁబడు. జై. 6 ఆ.

ఒఱవు : దే. స. క్రి. రూ. ఒఱగు. చూ. ఒఱవఁబడు.

ఒఱుము : దే. అ. క్రి. కలయు, చుఱుకగు.

ఒఱ్ఱాడు : దే. అ. క్రి. 1. శౌర్యము తక్కు.
2. సాగుదల మాటలాడు.
"అఱ్ఱులెత్తుక రాఁగ నటుఁగని యేము
నొఱ్ఱాడి పంచలం దొదిగితి మంత."
చా. చ.

ఒలయించు : దే. స. క్రి. (ఒలయు. ధా. ప్రే.)
1. కూర్చు. భార. శాం. 3 ఆ.
2. విడుచు.
3. నిగుడించు.

ఒలయు : దే. అ. క్రి. 1. ప్రవేశించు. హరి. పూ. 2 ఆ.
2. వ్యాపించు. హంస. 5 ఆ.
3. పేచు. స్వా. 2 ఆ.
4. కలుగు. భార. అను. 4 ఆ.
5. బయలుపడు. చిత్రభా. 3 ఆ.
6. బయటికి వచ్చు.
7. ఇష్టపడు. భార. మహా. 4
8. వ్రాలు, వ్రేలాడు.
ఉ. రా. 6 భార. 1 ఆ.
9. కలియు. భాగ. 10 స్కం.
10. జ్ఞప్తికివచ్చు. భార. ద్రోణ. 4 ఆ.
11. ఒప్పు; అందమిచ్చు. ఉ. హరి.5 ఆ.
స. క్రి. 1. కాంక్షించు. భార. ఆది. 7 ఆ.
2. అంటు. ఉ. రా. 7 ఆ.
3. డగ్గఱు. భార. అర. 2 ఆ.
4. పొందు. మార్కం. 2 ఆ.

ఒలికించు : దే. స. క్రి. (ఒలుకు ధా. ప్రే.)
కారునట్లుచేయు. రా. యు. 1 ఆ.

ఒలిపించు : దే. స. క్రి. (ఒలుచు ధా. ప్రే.)
ఊడఁదీయించు.
విప్పించు. భార. ఉద్యో. 3 ఆ.

ఒలియఁగట్టు : దే. స. క్రి. వెనుకకు విఱిచికట్టు (వస్త్రాదులు)
"నిడుద పెన్నెఱివేణి జడలుగా సవరించి
మలిన జీర్ణాంబరం బొలియఁగట్టి."
మొ. రా. సుందర.

ఒలియు : దే. అ. క్రి. 1. చర్మము ఊడిపోవు.
భార. ఆది. 5 ఆ.
2. సోమరితన మేర్పడు.

ఒలివడు : ద్వ. అ. క్రి. (ఒలి+పడు) దోపుడుపోవు. ఆము. 6 ఆ.
ఒలిపోవు : దే. అ. క్రి. దోపుడుపోవు; ఒలివడు.
ఒలు : దే. స. క్రి. ఒలుచు.
ఒలుకు : దే. అ. క్రి. 1. కాఱు. భార. ఉద్యో. 4 ఆ.
2. ప్రకటమగు. సా. 1 ఆ.
3. కలుగు. ద్వా. 1 ఆ.
4. కలఁగు; చలించు. కకు. 1 ఆ.
5. దగ్ధమగు; హర. 3 ఆ.
6. ప్రోగుపడు. ద్వా. 2 ఆ.
స. క్రి. చల్లు. భార విరా. 5 ఆ.
ఒలుకువారు : దే. అ. క్రి. ఒలుకు, చిందు. వరాహ. 12 ఆ.
ఒలుచు : దే. అ. క్రి. 1. ఊడుచు; ఊడదీయు.
2. పొట్టుతీయు; శుభ్రపఱచు.
3. దోచు; కొల్లవెట్టు. కాశీ. 7 ఆ.
4. పండు మొ॥ వాని తొక్క-తీయు.
ఒల్కు : దే. అ. క్రి. 1. ఒలుకు. భార. ఆది. 2 ఆ.
2. చిందు. దశా. 7 ఆ.
ఒల్చిచ్చు : దే. స. క్రి. తీసియిచ్చు.
ఒల్చు : దే. స. క్రి. ఒలుచు 1. ఊడదీయు. కు. సం. 2 ఆ.
2. కొల్లగొట్టు. భార. మహా.
3. పెఱుకు. మార్క-ం.
ఒల్లఁబడు : దే. అ. క్రి. ఒల్లమినొందు, ఇష్టము లేకుండు.
ఒల్లఁబుచ్చు : దే. స. క్రి. మూర్ఛపుచ్చు. వీర. 4 ఆ.
ఒల్లఁబోవు : దే. అ. క్రి; 1. మూర్ఛిల్లు. నిర్వ. 4 ఆ.
2. నిర్వీణమగు. చంద్రా. 1 ఆ.
3. చేష్టలుడుగు. భార. విరా. 5 ఆ.
4. వాడు. ఆము. 2 ఆ.

ఒల్లమిచూపు : దే. అ. క్రి. అనిష్టమును గనఁబఱచు.
ఒల్లమిచేయు : దే. స. క్రి. అపకృతిచేయు, అంగీకరింపకపోవు.
ఒల్లగిల్లు : దే. అ. క్రి. పాయు, క్షీణించు. హరి. ఉ 3 ఆ.
ఒల్లు : దే. స క్రి. అంగీకరించు, ఇష్టపడు.
ఒల్వఁబడు : దే. అ. క్రి. ఒలువఁబడు.
ఒళ్లుచేయు : దే. అ. క్రి. 1. బలిష్ఠముగ శరీరము పెఱుగు.
"ఆపిల్ల ఒళ్ళు చేసినది."
2 స్థూలత్వముగ శరీరము ఊరు.
3. (బిడ్డ) ఎదుగు.
ఒళ్ళుపెట్టు : దే. అ. క్రి. బలియు. శ. ర.
ఒళ్ళువచ్చు : దే. అ. క్రి. లావగు. "ఆమెకు ఒళ్ళు వచ్చినది."
ఒసంగు : దే. స. క్రి. రూ. ఒసఁగు.
1. ఇచ్చు. స్వా. 4 ఆ.
2. నైవేద్యముపెట్టు. హర. 2 ఆ.
3. కలిగించు. నైష. 5 ఆ.
4. ఒప్పగించు. వసు. 3 ఆ.
5. బహూకరించు. దశా. 4 ఆ.
ఒసవు : దే. స. క్రి. రూ. ఒసఁగు, ఇచ్చు. వి. పు. 2 ఆ.
ఒసులు : దే. అ. క్రి. తప్పుకొను. పండితా. పురా.
ఒవ్వు : దే. అ. క్రి. 1. గిట్టు, పొసఁగు.
2. అనుకూలమగు.
3. ఇష్టమగు.
భార. అశ్వ. 1 ఆ. విరా. 2 ఆ.
4. రూపుచెడు, అందముచెడు,
అందముపోవు. మార్కం. 2 ఆ.

# ఓ

ఓండ్రపెట్టు : దే. అ. క్రి. గాడిద అఱచు. వేం. పంచ. 3 ఆ.

ఓండ్రించు : దే. అ. క్రి. ఓండ్రపెట్టు. శ. ర.

ఓకరించు : దే. అ. క్రి. 1. డోకువచ్చు. శ. ర.
2. రోఁతపడు. శ. ర.
3. డోకు.

ఓకారమువచ్చు : దే. అ. క్రి. వాంతివచ్చు.

ఓకిలించు : వై. అ. క్రి. డోకు. భా. రా. యు.
స. క్రి. అసహ్యించుకొను. కాశీ. 5 ఆ.

ఓగగు : దే. అ. క్రి. వ్యర్థుఁడగు.

ఓగితమగు : వై. అ. క్రి. పాలుపడు; తగు. భో. 5 ఆ.

ఓగులోడుచు : దే. అ. క్రి. దేవురించు;
దైన్యపడు.

ఓజకువచ్చు : దే. అ. క్రి. దారికివచ్చు. భాస్క.

ఓజగొను : దే. అ. క్రి. సానుకూలమగు. కు. సం. 7 ఆ.

ఓజగొల్పు : దే. స. క్రి. (ఓజగొను ప్రే.) నేర్పుచూపు.
కు. సం. 8 ఆ.

ఓజపడు : ద్వా. అ. క్రి. చక్కఁబడు; సిద్ధించు.

ఓజపఱచు :
ఓజించు :
ఓజమాఱు :
ద్వా. స. క్రి. (ఓజపడు ధా. ప్రే.)
1. అలవఱచు, సిద్ధముచేయు. నృసింహ. 4 ఆ.
2. చేయు. విష్ణు. 3 ఆ.

ఓటమిపడు : దే. స. క్రి. ఓడు.

ఓటమిపెట్టు : దే. స. క్రి. ఓడించు.

ఓటమిపొందు : దే. అ. క్రి. అపజయముపొందు.

ఓటము : దే. అ. క్రి. 1. ఓడిపోవు. భార. ద్రో. 2 ఆ.
2. బెదరు. భార. ద్రో. 4 ఆ.
3. దుర్బలమగు. హరి. పూ. 6 ఆ.
కు. సం. 12 ఆ.

ఓటఱు : దే. అ. క్రి. నిస్సత్త్వమగు. రూ. ఓటాఱు.

ఓటాఱుచు : దే. స. క్రి. (ఓటాఱు భా. ప్రే.) ఓటాఱ్చు, ఓడించు.

ఓటిల్లు :
ఓటిలు : } దే. అ. క్రి. బెదరు, దుర్బలమగు.

ఓటుచూపు :
ఓటుపడు : } దే. అ. క్రి. పగులు చూపు.

ఓటుచేయు : దే. స. క్రి. అవమానించు. రసిక. 6 ఆ.

ఓటుపడు : ద్వ. అ. క్రి. 1. ఓడిపోవు. భార. ఆది. 7 ఆ.
2. వివశమగు. భాగ. 3 స్కం.
3. భ్రాంతిపడు, మోసపోవు.
కు. సం. 7 ఆ. వా. పంచ. 4 ఆ.
4. అచ్చెరువడు, నిశ్చేష్టు లగు.
భార. శల్య. 1 ఆ.
స. క్రి. ఓడిపోయి పోఁగొట్టుకొను.
భార సభా. 2 ఆ.

ఓటుపఱుచు : దే. స. క్రి. (ఓటుపడు. భా. ప్రే.)
ఓడించు. రాఘవ 1 ఆ. అచ్చ. రా. అర.

ఓటుపుచ్చు : దే. స. క్రి. ఓడించు. భా. రా. యు.

ఓటుపోవు :
ఒటువోవు : } దే. అ. క్రి. (ఓటు+పోవు) ఓటుపడు,
కోల్పోవు.

ఓటుసేయు : దే. స. క్రి. (ఓటు+చేయు) భంగపఱుచు.
రసి. 6 ఆ.

ఓట్రించు : దే. స. క్రి. 1. అబద్ధపుమాటలను మిక్కిలిగాఁ జెప్పు.
2. వంచించు.
3. వర్ణించు.
"కవు లోట్రింతురుగాక" మల్ల. శృం.
("ప్రతారితమనాః" అని మూలము.
"వంచిత చిత్తః" అని వ్యాఖ్య.

ఓడించు : దే. స. క్రి. (ఓడు ధా. ప్రే.)
ఓర్చు, ఓడునట్లుచేయు.

ఓడికలుకట్టు : దే. అ. క్రి. కాలువలు గట్టు.

ఓడిగిలు : }
ఓడిగిల్లు : } దే. అ. క్రి. 1. ప్రవహించు. హర. 4 ఆ.
2. పరుగెత్తు.
(శ. ర. పా. ఒడ్డగిలఁగ. ముద్రి. పా.)
3. స్రవించు. కాశీ. 6 ఆ.

ఓడు : దే. అ. క్రి. 1. పరాజయమందు. భార. కర్ణ. 3 ఆ.
2. భయపడు. భార. ఆది. 2 ఆ.
3. వెనుదీయు. భాగ. 10 స్కం.
4. శక్తిహీనమగు. భార. అర. 2 ఆ.
5. వశమగు. భార. భీష్మ.
6. పాఱిపోవు.
7. స్రవించు, కాఱు.
స. క్రి. పోఁగొట్టుకొను. కాశీ. 4 ఆ.

ఓడుపడు : ద్వి. అ. క్రి. పగులు.

ఓడుపఱచు : ద్వి. స. క్రి. పగులఁగొట్టు,
చిల్లులు పుచ్చు. ఉ. హరి. 1 ఆ.

ఓడుబాఱు : దే. అ. క్రి. నెఱ్ఱులిచ్చు.

ఓడుసేయు : దే. స. క్రి. చిల్లులు పుచ్చు. ఓడించు.
నిర్వ. 6 ఆ. 7 ఆ.

ఓదారుచు : }
ఓదార్చు . } దే. స. క్రి. ఊరార్చు. రూ. ఓదాకుచు.

ఓదెపడు : దే. అ. క్రి. కుప్పగూలు.

ఓదెలుపడు : దే. అ. క్రి. ఓదెపడు. రామా. 8 ఆ.

ఓదెవేయు : దే. స. క్రి. వరికోసి యాకుటకు మళ్ళుమళ్ళుగా వేయు.

ఓనేయు : దే. స. క్రి. తూఱునట్లుచేయు. ఆం. పా.

ఓపు : దే. అ క్రి. 1. సమర్థుఁడగు. భార. ఆది. 8 ఆ.
2 ఇష్టపడు. భార. విరా. 2 ఆ.
తుమున్నంతమూల కనుప్రయుక్త
మైనపు డిది తద్ధర్మాద్యర్థక మగును.
రానోపు మొ॥
స. క్రి. సహించు. భార. భీష్మ. 2 ఆ.
శక్తిచూపు.

ఓమికొను : దే. అ. క్రి. రక్షించుకొను.

ఓము : దే. స. క్రి. 1. కాపాడు.
2. పోషించు.
భార. అశ్వ. 1 ఆ. స్వా. 2 ఆ.
3. దాఁచు, రహస్యముగా నుంచు.
శుక. 2 ఆ.
4. పురుడుపోయు. కు. సం. 8 ఆ.
5. తాల్చు, పొందు.
అని. 2 ఆ. విజ. 3 ఆ.

ఓముకొను : దే. అ. క్రి. కాపాడుకొను.

ఓయను : దే. అ. క్రి. సిద్ధమగు. భార. విజ.

ఓరకుండు : దే. అ. క్రి. దూరముపడు. రజస్వలయగు. (తెలం)

ఓరగించు : దే. స. క్రి. 1. ప్రక్కకువంచు. బస. 5 ఆ.
2. విడుచు. సానందో. 3 ఆ.

ఓరగిలు : }
ఓరగిల్లు : } దే. అ. క్రి. 1. తొలఁగు. భార. భీష్మ. 1 ఆ.
2. ఒఱగు. శ. ర.
3. తొలఁగు.

ఓరపడు : దే. అ. క్రి. ప్రక్కకొరగు.

ఓరపుచ్చు : }
ఓరవుచ్చు : } దే. స. క్రి. ప్రక్కకుఁద్రిప్పు. నైష. 7 ఆ.

ఓరలవచ్చు : దే. అ. క్రి. అంచుల నంటివచ్చు. కు. సం. 3 ఆ.

ఓరవోవు : }
ఓరపోవు : } దే. అ. క్రి. 1. ఒరగు. భార. శల్య. 2 ఆ.
ఓరల్దిద్దు : } 2. వంగు. చంద్రా. 6 ఆ.

ఓరసించు : వై. స. క్రి. విడిచిపెట్టు,
వైదొలఁగు. ఇందు. 5 ఆ.

ఓరసిలు : }
ఓరసిల్లు : } వై. అ. క్రి. తొలఁగు. రామా. 2 ఆ.

ఓరసేయు : దే. స. క్రి. ప్రక్కకువంచు. రం. రా. ఉ.

ఓరుచు : దే. అ. క్రి. 1. సిద్ధముగు.
2. శక్తి గలిగియుండు.

ఓర్చు : దే. స. క్రి. 1. ఓడఁజేయు.
2. జయించు.
3. సైఁచు.
4. తాళు. నైష. 3 ఆ.

ఓరుతీయు : దే. అ. క్రి. ఇంటి తిన్నెల గోడల యడుగునను మూలలనుఎఱ్ఱమట్టితోఁబట్టితీర్చు. శ.ర.

ఓరుపు : }
ఓర్పు : } దే. అ. క్రి. ఓరుచు. సహించు, తాళు.
ఆం. సం. మాన.

ఓర్పు : దే. అ. క్రి. 1. సిద్ధమగు. భార. ద్రోణ. 5 ఆ.
2. చాలు. ఓపు. భార. ఉద్యో. 4 ఆ.
స. క్రి. సైచు, తట్టుకొను.
భార. ఉద్యో. 4 ఆ. విక్ర. 2 ఆ.

ఓలంబుగొను: దే. అ. క్రి. మరుగు చేసికొను. ప. వీ.

ఓలగముండు: } దే. స. క్రి. 1. కొలుచు, సేవించు. స్వా. 1 ఆ.
ఓలగముంచు : } 2. చుట్టియుండు, పరివేష్టించియుండు. ఆం. పా.
అ. క్రి. 1. సభచేయు.
2. ఒప్పారు. సా. 1 ఆ.

ఓలపెట్టు : దే. అ. క్రి. కేకవేయు. ప. వీ.

ఓలమాసగొను : ద్వ. అ. క్రి. 1. దేహము దాఁచుకొనఁ గోరు
2. వెనుదీయు.
3. పరాఙ్ముఖమగు.
నిర్వ. 4 ఆ. భార. కర్ణ. 2 ఆ. భార. అను. 1 ఆ.
4. మఱుగు ప్రదేశమునం దుండుట కిచ్ఛగించు.
5. శ్రమ తీర్చుకొన నెంచు.

ఓలముచొచ్చు : దే. స. క్రి. మఱుగుచొచ్చు.
ఓలమాసగొను.

ఓలలనాడు : దే. అ. క్రి. ఓలలాడు. ఉ. హరి. 5 ఆ.

ఓలలాడు : దే. అ. క్రి. ఓలాడు. స్వా. 3 ఆ.

ఓలలారుచు : దే. స. క్రి. ఓలార్చు.

ఓలలార్చు : దే. స. క్రి. ఓలలాడించు. భార. భీష్మ. 2 ఆ.

ఓలాకుపడు : ద్వ. అ. క్రి. 1. కలఁతపడు.
క్షోభించు. భార. విరా. 3 ఆ.
2. శ్రమనందు. హరి. పూ. 6 ఆ.

ఓలాడు : దే. అ. క్రి. 1. విహరించు; జలకమాడు. భీమ.5ఆ.
2. నిందు. ఆము. 4 ఆ.
ఓలార్చు : దే. స. క్రి. ఓలాడఁజేయు. పారి. 3 ఆ.
ఓలించు : దే. స. క్రి. పాలించు.
"ఓలించె నేదేవి యురుసపర్యాకృద
బ్జాతజాత మనోంబుజాతతుష్టి" వి.పు. 3-15
ఓలిగొను : దే. స. క్రి. కన్యాశుల్కముగొను.
ఓళ్ళానాచేయు : అన్య. దే. స. క్రి. నిర్బంధములో బెట్టు.
ఓవు : దే. అ. క్రి. సరిపడు. శుక. 1 ఆ.
ఓసడిల్లు : } ఓసరిల్లు : } దే.అ.క్రి. తగ్గు, "నగరిలోనున్న సందడి యోసడిల్లె" క. వ. రా. సుందర.
ఓసరించు : వై. స. క్రి. 1. తొలఁగించు. పాండు. 3 ఆ.
2. విడుచు. పాండు. 1 ఆ.
అ. క్రి. 1. తొలఁగు. పారి. 5 ఆ.
భాగ. 3 స్కం.
2. వంగు. పారి. 2. ఆ.
3. ఇష్టపడకుండు. వసు. 1 ఆ.
ఓసరిల్లు : } ఓసరిలు . } వై. అ. క్రి. ప్రక్కకొఱగు; తూలు.
నైష. 3 ఆ. కు. సం. 6 ఆ.
ఓసరు : వై. అ. క్రి. తొలఁగు; ఓసరిల్లు. ఆము. 4 ఆ.
ఓహటించు : దే. అ. క్రి. 1. వెనుదీయు. భాగ. 7 స్కం.
2. భయపడు. భార. విరా. 2 ఆ.
3. లయమగు. నైష. 7 ఆ.
ఓహటిల్లు : } ఓహటిలు : } దే. అ. క్రి. 1. భయపడు. చంద్రా. 3 ఆ.
2. లయమగు. నైష. 8 ఆ.
3. అలసిపోవు. సా. 3 ఆ.
ఓహోసాహోరియగు: అన్య దే. అ. క్రి. ఎడములేకుండనుండు.

# ఔ

ఔ : దే. అ. క్రి. అవు, అగు.

ఔఁగాదను : దే. స. క్రి. ఆలోచించు, విమర్శించు. ప్రభా. 1 ఆ. రాఘవ.4ఆ.

ఔగాముల నరయు: దే. అ. క్రి. మంచిచెడ్డలను జూడు.

ఔఘళించు : దే. స. క్రి. ఓడించు. క్రిందుపఱచు. రాధికా. 1 ఆ.

అ. క్రి. చలించు.

ఔడుగఱచు : ద్వ. అ. క్రి. 1. పెదవి గఱచు. 2. కోపముచేఁ బెదవి కొఱుకు. ఉ. రా. 3 ఆ. భార. ఆది. 6 ఆ.

ఔడుమాయు : ద్వ. అ. క్రి. పూర్తిగా మాయు. భీమ. 6 ఆ.

ఔదలఁదన్ను : దే. స. క్రి. తలదన్ను, మించు. కళా. 1 ఆ.

ఔదలఁదాల్చు : దే. స. క్రి. తలఁదాల్చు.

ఔదెంచు : దే. అ. క్రి. 1. అగుదెంచు. 2. అగు. హర. వి.

ఔద్ధత్యముచూపు: సం. స. క్రి. గర్వముచూపు. పైకెగుగు. అడఁకువలేకుండు. "అడ్డమాకలేక యౌద్ధత్యమునుజూపు నట్టివారి" మించు.

ఔద్ధత్యముపూను: సం. అ. క్రి. ఉద్ధతిని జూపు.

ఔద్ధత్యమువహించు: సం. స. క్రి. గర్వము ప్రకటించు.

ఔనను : దే. స. క్రి. మెచ్చుకొను.

ఔరుసౌరుపడు : దే. అ. క్రి. క్షీణించు.

ఔలు : దే. అ. క్రి. అగులు, అవులు, ఊడు. శ. ర.

# క

కంకటిల్లు : దే. అ. క్రి. పడ్చిపడ్చి ఎక్కిళ్ళుపాలగు.
కంకణముగట్టు : దే. స. క్రి. దీక్షవహించు.
కంకు : దే. స. క్రి. 1. గద్దించు.
2. తిట్టు.
3. సారము పీల్చు (తెలం.)
కంకులుపెట్టు : దే. స. క్రి. తూఱు.
కంకెవేయు : దే. అ. క్రి. పైరులు ఫలోన్ముఖమగు.
కంగారుపడు : దే. అ. క్రి. తొట్రుపడు.
కంగాళిచేయు : దే. స. క్రి. 1. కలగాపులగముచేయు.
2. అసహ్యముగా చేయు.
కంగించు : దే. స. క్రి. లోతుపాతులు తెలిసికొనప్రయత్నించు (కళింగప్రాంతము.)
కంగు : దే. అ. క్రి. 1. తప్తమగు.
2. కదలు.
కంగొనబాఱు : దే. అ. క్రి. వ్యాపించు.
కంచాలువెట్టు : దే. స. క్రి. వడ్డించు.
కంచుమించగు : దే. అ. క్రి. 1. అదృశ్యమగు.
2. చెల్లాచెదరగు. రంగ.
కంజాయించు : దే. స. క్రి. ఏర్పాటుచేయు.
కంటకమగు : దే. అ. క్రి. 1. సరిపడకుండనుండు,
2. బాధనొందు.
కంటకమాడు : దే. స. క్రి. పరుషములాడు. మను.
కంటకములుపల్కు : దే. స. క్రి. పరుషములాడు.

కంటగించు : దే. అ. క్రి. 1. అనిష్టమునూ ప్ర.
2. మెచ్చు,
3. అసహ్యపడు,
4. గగుర్పొడుచు.
5. విరోధము ఏర్పడు (తెలం.)

కంటగిలు :
కంటగిల్లు : } దే. అ. క్రి. బాధపడు.

కంటతడిపెట్టు : దే. అ. క్రి. జాలిపడు.

కంటఁబడు : దే. అ. క్రి. కనఁబడు.

కంటవడు : దే. అ. క్రి. విరోధించు.

కంటవత్తినిడుకొనియుండు: దే.అ.క్రి. 1. నిద్రించకమేలుకొనియుండు.
2. అతిజాగ్రత్త వహించు.

కంటసంపడు :
కంటసపడు : } దే. అ. క్రి. 1. వ్యథనొందు.
2. చిరాకుపడు.
3. మత్సరించు.

కంటికెక్కు : దే. అ. క్రి. కన్నులకు వచ్చు, నచ్చు.

కంటువెట్టు : దే. స. క్రి. పంతముపట్టు (విషయనిర్ణయమునకు అడ్డంకులు కలిగించు.) (తెలం.)

కంట్లముకట్టు : దే. స. క్రి. మూతికి ఉగ్గమువలె కట్టు. (తెలం.)

కంట్లముపడు : దే. అ. క్రి. 1. ఉరిపడు.
2. ప్రాణాపాయమగు.
3. బాధ సంభవించు. (తెలం.)

కంఠతః పట్టు :
కంఠతోపెట్టు :
కంఠీపట్టించు :
కంఠోపాఠముచేయు: } మి. స. క్రి. కంఠస్థముచేయు.

కంఠస్థముచేయు: మి. స. క్రి. ముఖస్థముచేయు.

కండపెట్టు : దే. అ. క్రి. 1. మదించు.
2. క్రొవ్వెక్కు.
3. బలుపుచూపు.

కండల కేకమగు: దే. అ. క్రి. బద్ధకించు రా. సీ.

కండవడముచుట్టు: దే. స. క్రి. 1. కప్పిపుచ్చు.
2. మఱుగుపఱచు.
—భీతికిఁ గండవడంబు సుట్టి. కు.సం. 4 ఆ.

కండెచుట్టు : దే. స. క్రి. 1. దారముగుండ్రముగాఒకదానికిచుట్టు.
2. ఉండగాచేయు.

కండెవట్టు . దే. అ. క్రి. 1. నొప్పికలుగు.
స. క్రి. 2. లాగు.

కండ్లునెత్తికెక్కు : దే. అ. క్రి. గర్వమెక్కు.

కండ్లుమండు : దే. అ. క్రి. అసూయపడు.

కంతలుగట్టు : దే. స. క్రి. మఱుగుపఱచు.

కంతులుగట్టు : దే. అ. క్రి. గట్టిగా బిళ్ళలు గట్టు.

కందఁబాఱు : దే. అ. క్రి. 1. వివర్ణమగు.
2. ఎఱ్ఱబాఱు.

కంద(డ)కావ్యములు సేయు: దే. స. క్రి. విధవాగర్భముసేయు.(నె.జి.)

కందళించు : దే. అ. క్రి. 1. మొలకెత్తు.
2. సంతసించు.
3. వికసించు.

కందించు : దే. స. క్రి. ఎఱ్ఱబఱచు (వివర్ణముచేయు.)

కందు : దే. అ. క్రి. 1. తప్తమగు.
2. వివర్ణమగు.
3. వాడు.
4. కృశించు.
5. బాధపడు.

కందుచెప్పు : దే. స. క్రి. గుర్తుచెప్పు. (తెలం.)
కందువాఱు : } దే. అ. క్రి. (కందు+పాఱు) 1. మచ్చపడు.
కందువెట్టు : } 2. మరక లేర్పడు.
3. ఎఱుపెక్కు.
4. మలినమగు.
5. వివర్ణత నొందు.
కందువెఱుగు : దే. స. క్రి. (కందువు+ఎఱుగు.)
1. కీలకము నెఱుగు.
2. సమయ సందర్భము లెఱుగు.
3. సన్న తెలిసికొను.
కందెనకడుగు : దే. స. క్రి. చాలరోజులనుండి ఉన్న అపకీర్తిని మాపుకొను. (తెలం.)
కందెనవెటు : దే. స. క్రి. బండిని ఆయత్తపఱచు, తారువేయు. (తెలం.)
కంపగట్టు . దే. స. క్రి. కంచెవేయు. (రూ. కంపగొట్టు)
కంపనబడు : దే. అ. క్రి. కంపటోఁబడు.
కంపరమెత్తు : దే. అ. క్రి. 1. చిరాకుపడు.
2. గగుర్పొడుచు.
కంపలబడు : దే. అ. క్రి. 1. కష్టముల పాలగు.
2. చిక్కులలోపడు.
కంపవెట్టు : దే. స. క్రి. పాడుచేయు, బాధించు.
కంపారు : దే. అ. క్రి. సువాసన వేయు. ప. వీ.
కంపించు : }
కంపిలు : } దే. అ. క్రి. వణఁకు.
కంపిల్లు : }
కంపుకొట్టు : } దే. అ. క్రి. 1. పరిమళించు.
కంపెక్కు : } 2. దుర్వాసనవేయు.

కకపికపడు : దే. అ. క్రి. 1. గర్వించు.
2. మిట్టిపడు.
కకవికచేయు : దే. స. క్రి. కలచు.
కకవికపడు : దే. అ. క్రి. 1. గర్వించు.
2. మిట్టిపడు.
కకావికలగు : దే. అ. క్రి. చెల్లాచెదరగు.
కక్కరించు : దే. అ. క్రి. 1. మొఱుగు.
2. మోటుగా కేకలు వేయు.
కక్కసపడు : దే. అ. క్రి. బాధపడు.
కక్కసపెట్టు : }
కక్కసవెట్టు : } దే. స. క్రి. కక్కసపడు. ధా. ప్రే.
కక్కసాలాడు : దే. అ. క్రి. వాద ప్రతివాదములు చేయు.
(కాక మాతోడను గక్కసాలాడి.)
కక్కసించు : దే. స. క్రి. హింసించు.
కక్కసిల్లు : దే. అ. క్రి. నిబిడమగు.
కక్కించు : దే. స. క్రి. 1. కక్కఁజేయు.
2. వెడలించు.
కక్కు : దే. స. క్రి. 1. ఛోకు.
2. కడుపులోనిది వెలిబుచ్చు.
3. బయటపడు.
4. తప్పకయిచ్చు.
కకుర్తిపడు : }
కకూఱితిపడు: } దే. అ. క్రి. 1. లోభించు.
2. ఆశపడు.
కగ్గించు : దే. స. క్రి. వివర్ణముచేయు.
కగ్గు : }
కగ్గువాఱు : } దే. అ. క్రి. వివర్ణమగు, తగ్గు, ముడిచికొను.
కచరించు : దే. స. క్రి. కచ్చపోసి బట్టకట్టు.

కచ్చకట్టు : } దే. అ. క్రి. పగగొను.
కక్షకట్టు :

కచ్చపట్టు : దే. స. క్రి. పగగట్టు.

కచ్చాపచ్చిగజేయు: దే. స. క్రి. 1. నలిగి నలగకుండ కొట్టు.
2. విషయము న స్తవ్య స్తముగచేయు.

కచ్చించు ; దే. స. క్రి. 1. గవ్వలాటలో కాయలు నడుపు.

కచ్చివెట్టు : దే. స. క్రి. 1. పసిపిల్లలు శత్రుత్వము వెల్లడించు.
2. సరిపెట్టు.
3. గోడలు మొదలగువాని కొలతలు సరిపెట్టు.
4. కచ్చ బిగించు.
5. గర్వించు.

కచ్చు : దే. స. క్రి. చదరంగము మొదలగువానిలో కాయ జరుపు.

కచ్చుకట్టు : దే. అ. క్రి. నియమముగా నుండు. (తెలం.)

కచ్చుకొను : దే. అ. క్రి. 1. పట్టుపట్టు.
స. క్రి. 1. ఢీకొను.
2. హత్తుకొను.

కచ్చులువెట్టు : దే. స. క్రి. 1. గోడలు కట్టునపుడు ఒక్కొక తీరు తీర్చు. (తెలం.)
2. అండలుపెట్టు.

కచ్చువదలు : దే. అ. క్రి. 1. నియమము వదలు.
2. శోభవిడుచు.
3. ఆశ విడుచు.
4. ప్రకాశించు. (తెలం)
5. గర్వము వదలు.

కచ్చువెట్టు : దే. స. క్రి. మిషపెట్టు.

కచ్చేరీసేయు : అన్య. దే. అ. క్రి. కొలువుచేయు.
లక్ష్మణమూర్తి. య. గా.

కచ్చువిచ్చగు : దే. అ. క్రి. పనిచెడు.

కటకటపడు :
కటకటఁబడు :
కటకటలాడు : } దే. అ. క్రి. 1. దుఃఖపడు.
2. ఇబ్బందిపడు.
3. త్రొక్కులాటంపడు.

కటకటపెట్టు : దే. స. క్రి. బాధపెట్టు.

కటాక్షించు : మి. స. క్రి. 1. కడఁగంటఁజూచు.
2. అనుగ్రహించు.

కటాయించు: : అన్య. దే. స. క్రి. ఎగఁబెట్టు. (అప్పులు)

కట్టకట్టు : దే. స. క్రి. 1. అనవసరముగా నాస్తి కట్టబెట్టు.
2. వస్త్రములిచ్చు.

కట్టడచేయు : దే. స. క్రి. 1 ఆజ్ఞాపించు.
2. నియమనముచేయు.
3. ఇచ్చు.

కట్టబెట్టు . దే. స. క్రి. 1. ధరింపజేయు.
2. భార్యగాఇచ్చు.(ఆమెనుకట్టబెట్టిరి.)

కట్టబోయు:
కట్టవేయు : } దే. స. క్రి. అడ్డుబోయు.

కట్టలుతెగు : దే. అ. క్రి. 1. గండిపడు.
2. వశము తప్పు.
3. అధికమగు.
4. పొర్లుకొనివచ్చు.

కట్టాయముసేయు: దే. స. క్రి. 1. నిర్బంధముసేయు. (కు. సం.)
2. సంసిద్ధముచేయు.

కట్టాయితపడు :
కట్టాయిత్తపడు:
కట్టాయితమగు : } దే. అ. క్రి. సన్నద్ధమగు.

కట్టావుఱతెంచు : దే. అ. క్రి. పొగలుక్రమ్ము.

కటికక్రూసతుమ్ము: దే. అ. క్రి. హఠాత్తుగా తుమ్ము.

కట్టించు : దే. స. క్రి. 1. ఆటకట్టించు.
2. నిర్మించునట్లుచేయు.

కట్టిపెట్టు : దే. స. క్రి. 1. నిర్మించు.
2. బంధించు.
3. పొసగించు. (జతకట్టు)
4. మూయు.
5. విధించు.
6. కలిగించు.
7. కూడబెట్టు.
8. ఆరోపించు.
9. పద్యములను కూర్చు.
10. (పశువులు) గర్భము ధరించు.
11. మూటకట్టు.
12. చాలించు.
13. వేషముదాల్చు.

అ. క్రి. 1. ఐపోవు.
2. ఆగిపోవు.
3. అగు.
4. ఏర్పడు.
5. నిబద్ధమగు.

కట్టిల్లు : దే. అ. క్రి. 1. కూడు.
2. సమకూడు.

కటు : దే. స. క్రి. పశువులు గర్భముదాల్చు.

కట్టు : దే. స. క్రి. పలకను శుభ్రపఱచు.

కట్టుకట్టు : దే. స. క్రి. పాదరసమును నిప్పులో నిలుచునట్లు చేయు మంత్రము వేయు. (రా. సీ.)
1. మంత్రముచేత బంధించు.
2. సంక్షోభవించు.
అ. క్రి. 1. నిర్ణయమునకు బద్ధులగు.
2. మందు వేసికట్టు.

కట్టుకొను : దే. స. క్రి. 1. ధరించు.
2. పెండ్లియాడు.
3. పొందు.
4. అన్యాయపు టాస్తిని వేసికొను.

కట్టుగడచేయు : దే. స. క్రి. 1. నిలువచేయు.
2. కూడబెట్టు.

కట్టుచేయు : దే. స. క్రి. బంధించు.

కట్టుతాల్చు : దే. స. క్రి. 1. త్రాడుపేను.
2. ఇనుము కట్టుతాల్చు.

కట్టుపడు : దే. అ. క్రి. 1. లోబడు.
2. మాటమీద నిలబడు.
3. బంధితుడగు.

కట్టుపఱచు :
కట్టువఱచు : } దే. స. క్రి. అడ్డగించు.

కట్టుమీరు : దే. స. క్రి. నియమోల్లంఘనముచేయు.

కడకుఁబోవు : దే. అ. క్రి. 1. బహిష్ఠయగు.
2. దూరముపోవు.

కడకువేయు : దే. స. క్రి. 1. మిగిలించు.
2. కూడబెట్టు.

కడకేగు : దే. అ. క్రి. రజస్వలయగు.

కడకొత్తు : దే. స. క్రి. 1. నిరసించు.
2. చివరకునెట్టు.
3. విభాగించు.

కడగండ్లుపడు : దే. అ. క్రి. బాధ లనుభవించు.

కడగట్టు : దే. స. క్రి. 1. నిర్ణయించు.
2. నియమించు.

కడగను : దే. అ. క్రి. మరణించు.

కడగిట్టు : దే. అ. క్రి. సమీపించు.

కడఁగు : దే. అ. క్రి. పూను.
స. క్రి. కవియు.

కడగొట్టు : దే. అ. క్రి. (కడ+కొట్టు) చచ్చు.
(కెడసెం దుప్పులు,డింక వేసెనెలుగుల్ గిట్టెం బులుల్, సింగముల్, కడ గొట్టెన్) సారంగ. 1 ఆ.

కడఁచు : దే. స. క్రి. కలఁచు.

కడచను : దే. అ. క్రి. తుదిముట్టు. కు. సం. 1 ఆ.
1. గతించు.
2. చచ్చు.
3. ముగియు.
4. మితిమీఱు.

కడచు : దే. అ. క్రి. 1. గతించు.
2. జరుగు.
3. జనఁడాలు.
4. తప్పించుకొను.
5. దాటు.

కడచూచు : దే. అ. క్రి. చివరికెల్ల చూచు.

కడచెడు : దే. అ. క్రి. దిక్కుమాలు.

కడచేరుచు : దే. స. క్రి. కృతార్థునిజేయు.

కడచేయు : దే. స. క్రి. విడచిపెట్టు.

కడతాఁకు : దే. అ. క్రి. తుదిముట్టు.

కడతెంచు : దే. స. క్రి. 1. దాఁటు.
2. అతిక్రమించు.

కడతెగు : దే. అ. క్రి. అవసానమొందు.

కడతేర్చు : దే. స. క్రి. 1. చంపు.
2. నిర్వహించు.
3. రక్షించు.

కడతేఱు : }
కడదాటు : } దే. అ. క్రి. 1. తుదిముట్టు.
2. చచ్చు.

కడద్రొక్కు : దే. స. క్రి. తుదిమూచు,

కడనుంచు : దే. స. క్రి. చివరపెట్టు.

కడనుండు : దే. అ. క్రి. 1. వెలిగానుండు.
2. బహిష్ఠయగు.

కడనూకు : దే. స. క్రి. తొలఁగద్రోయు.
(త్రోడ తోడయుఁ దాక నునుసిగ్గు కడకునూక.) వి. వి.

కడపట్టు : దే. అ. క్రి. 1. ప్రాణములు కంఠగతమగు.
2. మూర్ఛనందు.

కడపలచేరు : దే. అ. క్రి. 1. అంతమునొందు.
2. పోవు.

కడపివుచ్చు : దే. స. క్రి. 1. పంపు.
2. అపాయమునుండి తప్పించిపంపు.
3. (కాలము) వెళ్ళబుచ్చు.
4. మఱుగుపఱచు.

కడపు : దే. స. క్రి. 1. చంపు.
2. పడగొట్టు.

కడపు : 3. ఎక్కించు.
4. జనబాటు.
5. ప్రాప్యము.
6. దాటించు.
7. త్రోలు.
8. నెట్టు.
9. విడుచు.

కడఁబట్టు : దే. అ. క్రి. అవసానదశ నొందు.

కడఁబడు : దే. అ. క్రి. 1. తక్కువగు.
2. రాలు.

కడనుపడు : దే. అ. క్రి. 1. తక్కువయగు.
2. మిగులు.

కడమపఱచు :
కడమపెట్టు : } దే. స. క్రి. 1. తక్కువపఱచు.
2. మిగుల్చు.

కడమీరు : దే. స. క్రి. నియమముదాటు.

కడముట్టు : దే. అ. క్రి. దరిచేరు, పారమునొందు, పూర్తియగు, చచ్చు.

కడముట్టఁబడు : దే. అ. క్రి. 1. పారంగతుఁడగు.
2. అవ్వలియొడ్డుచేరు.
3. దాటనేర్చు.
—సముధికంబైన సంసార జలధియందు, మునుగుచును దేలుచును గడముట్టబడని జనుల కెల్లను మత్పాదసరసిజములు తెప్పయై యుద్ధరించు నిందీవరాక్షి !

కడయెత్తు : దే. అ. క్రి. గృహావిశేషములచుట్టు గోడలయందలి స్తంభములమీఁది దూలము పెట్టు.

కడలుకొను : దే. అ. క్రి. 1. తరంగితమగు.
2. కలుగు.
3. అతిశయించు.

కడలుకొలుపు : దే. స. క్రి. వ్యాపింపజేయు.

కడలుద్రొక్కు : దే. స. క్రి. వ్యభిచరించు.

కడలుపడు : దే. అ. క్రి. గుంపుగట్టు.

నీలమణి సుందరంబగు నిందిరా సుందరీ
దివ్యదేహంబునం బొదలు కాంతి ప్రవా
హంబు సిగ్గున వెలుకబాఱిన పోలికం
జులుకనై మొగులు మొత్తంబులు
దెసలు కడంకడలుపడి తూలన్.

శ్రీ. పు. 1 ఆ.

కడలెత్తు : దే. అ. క్రి. పొంగు.

కడలొత్తు : దే. అ. క్రి. 1. వ్యాపించు
2. పొంగు.

కడవఁద్రోలు : దే. స. క్రి. నిర్వర్తించు;

కడవఁబడు : దే. అ. క్రి. 1. మిగులు.
2. అతిక్రాంతమగు.
3. దాటు.

కడవఁపెట్టు : దే. స. క్రి. కడవంబడు. ప్రే.

కడవఁబెట్టు : దే. స. క్రి. 1. దాటించు.
2. ఆపదనుండి రక్షించు.

కడవడించు: } కళవడించు: } దే. అ. క్రి. 1. కలతనొందు.
2. కళవళించు.

కడవనాడు : దే. స. క్రి. మీఱిపలుకు.

కడవనూకు : దే. స. క్రి. తొలగద్రోయు.

కడవళించు : దే. అ. క్రి. కళవళించు.

కడవెళ్లు : దే. అ. క్రి. 1. సమాప్తమగు. శ. ర.
2. దాటు, తరించు.
కడవోవు : దే. అ. క్రి. ఉడిగిపోవు.
కడసిల్లు : దే. అ. క్రి. దిగంతవ్యాప్తమగు.
కడికండలుచేయు: దే. స. క్రి. ఖండించు.
కడిగొను : దే. స. క్రి. 1. ముద్దగాఁగొను.
2. గ్రమింగు.
కడిమివేయు : దే. స. క్రి. కుప్పద్రొక్కుచు గడ్డిని తాత్కాలికముగా వామివేయు.
కడియెత్తు ; దే. స. క్రి. భుజించు.
కడివోవు : దే. అ. క్రి. 1. వాడు.
2. తగ ఉడుగు.
3. సౌరభ ముడుగు.
4. మాలిన్యము పోవు.
కడుకొను : దే. అ. క్రి. పూనుకొను.
కడుగు (రూ) కడ్గు: దే. స. క్రి. క్షాళనముచేయు.
కడుపంటుకొనిపోవు: దే. అ. క్రి. అన్నములేక ఆకలిచేత పొట్టమీది చర్మము వెన్నునకంటు.
కడుపగు : దే. అ. క్రి. గర్భమగు.
కడుపరయు : దే. స. క్రి. ఆకలి నెఱుగు.
కడుపుకందవిత్తగు: దే. అ. క్రి. 1. కందవిత్తువలె కడుపు మిక్కిలి ఫలించు.
2. వంశవృద్ధి యగు.
కడుపుకట్టుకొను: దే. అ. క్రి. (లోభాదులచే)ఆహారము మానుకొను
కడుపుకాలు : దే. అ. క్రి. సంతానము నశించు.
కడుపుకొట్టు :
కడుపుమీదకొట్టు: } దే. స. క్రి. జీవనోపాధిని భంగము చేయు.

కడుపుకొట్టు : దే. అ. క్రి. నీళ్ళ విరేచనము లగు.
కడుపుచుచు : దే. అ. క్రి. కడుపునుండు.
కడుపుదించుకొను: దే. అ. క్రి. గర్భస్రావము చేసికొను.
కడుపుదిగ్గు : దే. అ. క్రి. గర్భమగు.
కడుపునిండు : దే. అ. క్రి. సంతోషమగు.
కడుపుపండు : దే. అ. క్రి సంతతికలుగు.
కడుపుపోవు : దే. అ. క్రి. గర్భస్రావమగు;
కడుపునకుఁబెట్టు: దే. స. క్రి. 1. పాలిచ్చు.
2. ఉగ్గుపెట్టు.
కడుపుసేయు : దే. స. క్రి. జారత్వముచే గర్భముచేయు.
కడ్డీబాఱు : దే. అ. క్రి. గట్టియగు.
కడెము(కడియము) వేయు: దే. స క్రి. కుప్ప నూర్చుచు గడ్డిని కైవారముగా వాఱివేయు.
కణకణలాడు : దే. అ. క్రి. ఎఱ్ఱబడు.
కణగు : దే. అ. క్రి. 1. చచ్చు.
2. నశించు.
3. పోవు.
4. ముగియు.
5. నెరవేరు.
6. అపారమగు.
7. అతిశయించు.
8. మరణించు.
9. తొలగిపోవు.
10. (మర్యాద) నతిక్రమించు.
11. కడముట్టు.
12. సుఖముగా కాలము గడచు.
13. మనుగడ సుఖముగా సాగు.

కఱగు : 14. హెచ్చగు.
15. మీఱు.
స. క్రి. 1. అతిక్రమించు.
2. తప్పించుకొను.

కఱఁగు : దే. అ. క్రి. కడగు.

కరకతజరుపు : దే. అ. క్రి. ఆర్భాటములేక కొద్దిపాటితో సరి పెట్టుకొను, (తెలం.)

కతపత్రమిచ్చు : దే. అ. క్రి. ప్రమాణపత్ర మిచ్చు.

కతమిచ్చు : దే. స. క్రి. 1. సూచించు.
2. ఆరాయిచ్చు.

కతలవడు : దే. అ. క్రి. వన్నెలుచూపు. (తెలం)

కతలుగట్టు : దే. స. క్రి. ఉన్నవి లేనివి పెంచు.

కతుకు : దే. స. క్రి. 1. వెడవెడఁదిను
2. అనాస్థతో గ్రహించు.
3. అన్యద్రవ్యము లన్యు లెఱుఁగకుండ కక్కుర్తితో వడవేసికొను.
4. లంచము తీసికొను.
5. భుజించు.
6. కుక్కలు లోనగునవి నాలుకతో కొంచెము కొంచెముగా నీళ్ళు మొదలగు వానిని త్రాగు.

కత్తరిగలయు : దే. అ. క్రి. 1. సంకరమగు.
2. కలసిపోవు.

కత్తికట్టు : దే. అ. క్రి. పగఁబూను.

కత్తిగట్టివచ్చు : దే. అ. క్రి. దండెత్తివచ్చు.

కత్తిరించు : దే. స. క్రి. 1. కత్తిరించు.
2. ఖండించు.
3. ఆడించు.

కత్తిరించు : 4. నశింపజేయు.
5. చలింపజేయు.
6. అపహరించు.

కత్తిరిలు :
కత్తిరిల్లు : } దే. అ. క్రి. చలించు.

కత్తిర్లుపుట్టు : దే. అ. క్రి. విభేదము లేర్పడు. (తెలం.)

కత్తిసాముచేయు: దే. అ. క్రి. 1. నిర్బంధ స్థితియందుండు.
2. ప్రాణాపాయకరమైన పనిచేయు.

కథనడుచు : దే. అ. క్రి. వ్యవహారము సాగు.

కథించు : సం. స. క్రి. చెప్పు. (హరి. ఉ. 5 ఆ.)

కదంబించు : సం. స. అ. క్రి. 1. మిళితముచేయు.
2. పరిమళించు.

కదడుకొను : దే. అ. స. క్రి. 1. నెలవుచేసికొను.
2. ప్రారంభించు.
—మెదడునం గదడుకొని రుధిర
పూరంబు ప్రవహింప.
సమీరకుమార విజయము.

కదపాయించు : అన్య. దే. స. క్రి. జామీనుగాపెట్టు. (కళింగ) వా.

కదలఁబారు : దే. అ. క్రి. 1. చలించు.
1. ఆగిపోయినపని మరల ప్రారంభించు.

కదలవేయు : దే. స. క్రి. విషయమును తెలిసికొనుటకు ఎదుటి
వాని దగ్గర ఆ విషయమును పరా
మర్శించు.

కదలాడు : దే. అ. క్రి. చలించు.

కదలించు : దే. స. క్రి. 1. దుర్జనునితో మాటాడు,
ప్రసంగము తెచ్చు.
2. చలింపజేయు.

కదలివచ్చు : దే. అ. క్రి. ప్రయాణమై వచ్చు.

కదలు : దే. అ. క్రి. 1. సిద్ధముగనుండు.
2. చలించు.
3. ప్రయాణమగు.
4. తరలివచ్చు.

కదలుచు: }
కదల్చు : } దే. స. క్రి. కదలు. ప్రే.

కదించు : దే. స. క్రి. 1. బిగించు.
2. అతుకు.
3. ధరించు.
4. మార్చు.
5. చేర్చు.

కదియఁబడు : దే. అ. క్రి. 1. కలియబడు.
2. కలుగు.

కదియించు : దే. స. క్రి. 1. బిగించు.
2. రచించు.
3. ఖచించు.
4. హత్తించు.
5. మర్దించు.
6. చేర్చు.

కదియు : దే. అ. స. క్రి. 1. సమీపించు.
2. సమానమగు.
3. కలుగు.
4. మార్కొను.
5. రమించు.
6. కూడు.
7. అంటు.
8. తగులు.

కదిరించు : దే. స. క్రి. కదురాడు, సమీపింపఁజేయు.
కదుకొను : దే. అ. క్రి. అతిశయించు.
కదుపుగట్టు : దే. అ. క్రి. 1. గుంపుకట్టు.
2. కలసి మెలసియుండు.
కదుపులుగొను : దే. అ. క్రి. మందలుపెట్టు.
కదుము : దే. స. క్రి. ఆక్రమించు.
కదుముగట్టు :
కదుములుగట్టు: } దే. అ. క్రి. దెబ్బతగిలి నెత్తురు గడ్డకట్టు.
కదురాడు : దే. అ. క్రి. రాటము తిరుగు.
కదురు : దే. అ. క్రి. 1. కలుగు;
2. అతిశయించు.
3. వ్యాపించు.
4. విజృంభించు.
5. ఒప్పు.
కదురుకొను : దే. అ. స. క్రి. 1. కవియు.
2. ఎదుర్కొను.
3. మిక్కుటమగు.
కదురులాడు : దే. స. క్రి. మాటలాడు.
కనకనమను : దే. అ. క్రి. మిక్కిలి ప్రజ్వలించు.
కనకనలాడు : దే. అ. క్రి. కనకనమను.
కనకస్నానముచేయు:
కనకాభిషేకమగు : } మి. అ. క్రి. 1. చాల గౌరవమునందు.
2. దీనారటంకాలతో స్నానమగు. (తారా.)
కనఁబడు : దే. అ. క్రి. గోచరమగు.
కనరు : దే. స. క్రి. 1. వెగటుచూపు.
2. అసహ్యించు.
కనరువోవు : దే. అ. క్రి. కాటువాసనవేయు.

కనరెక్కు : } దే. అ. క్రి. 1. కాటుకోవు.
(రూ) కరుణెక్కు: } 2. నెగడెక్కు. (నె. జి.)

కసలించు : దే. స. క్రి. కోపము వచ్చునట్లుచేయు.

కసలు : దే. అ. క్రి. 1. మండు.
2. కోపించు.
3. తప్తమగు.

కసారిలు . దే. అ. క్రి. 1. కోపించు.
2. పరితపించు.

కనికట్టుకట్టు: } దే. స. క్రి. 1. గారడీవాడు ఇంద్రజాలముచేసి వశపఱచుకొను
కనుకట్టుకట్టు: }
2. మంత్రించి కట్టుకట్టు.

కనికరించు : దే. స. క్రి. 1. జాలిదలంచు:
2. కరుణించు.

కనిపించు : } దే. అ. క్రి. 1. కనపడు.
కన్పించు : } 2. పుడుపోయు.

స. క్రి. 1. చూపించు.
2. పొందించు.
3. ప్రసవింపఁజేయు.

కనిపట్టు : } దే. స. క్రి. 1. గుర్తించు.
కనిపెట్టు : } 2. వెదకి పట్టుకొను.

కనిపెట్టుకొను : దే. అ. క్రి. 1. ఎదురుచూచు.
2. వేచు.
3. ఆగు.

కనియు : దే. అ. క్రి. 1. పక్వమగు.
2. విజృంభించు.

కనిసించు : దే. స. క్రి. తెలిసికొను.

కను : దే. స. క్రి. 1. చూచు.
2. ప్రసవించు.
3. తెలియు.
4. పొందు.

కనుకూర్కు : దే. అ. క్రి. నిద్రించు.

కనుగట్టు : దే. స. క్రి. మాయచేయు.

కనుగిట్టు : దే. అ. క్రి. కన్నుగీటు, కు. సం. ఆ. 4.

కనుగలుగు: }
కన్గలుగు : } దే. అ. క్రి. 1. జాగరూకతకలుగు.
2. కనిపెట్టుకొను.
3. కలుగు.
4. చూచు.
5. గడించు.
6. తెలిసికొను.
7. విచారించు.

కనుగిట్టు :
కనుగీటు :
కనుఁగొట్టు: } దే. స. క్రి. 1. కనుగొలుపు.
2. కనుసైగచేయు.

కనుగిలుపు: }
కన్గిలుపు : } దే. స. క్రి. 1. కంటితోదుర్వాంఛలను తెలియజేయు
2. కన్నులు కదలించు.

కనుగిలుపు: }
కన్గిలుపు : } దే. స. క్రి. కంటితో దుర్వాంఛను తెలియజేయు.

కనుఁగొను : దే. స. క్రి. (కను+కొను) 1. చూచు.
(ఈతటినిం గనుఁగొను పుణ్యుడు.)
2. వీక్షించు.
3. తెలిసికొను.

కనుగొలుపు : దే. అ. క్రి. కంటికివచ్చు. (తెలం.)
సైగచేయు.

కనుచాలు :
కనుకట్టు :
కంటికిఆను: } దే. స. క్రి. కంటికి ఉచితముగా కనిపించు.
అ. క్రి. చులకన గాకుండు. (నె. జి.)

కనుచూఱయొసగు: దే. స. క్రి. యథేచ్ఛముగాచూడవీలగునట్లుచేయు

కన్చెదరు : దే. అ. క్రి. (కను+చెదరు) చెల్లాచెదరగు.

–చదిసెం దేరులు పాఱె వారణము
లశ్వమ్ముల్ ధరంగూలె గన్, చెదఱెన్
సైన్యము వ్రాలె బాహువులు.

కువల. 2.

కనుపట్టు(రూ)కన్పట్టు: దే. అ. క్రి. కన్పించు.

కనుపడు:
కన్పడు : } దే. అ. క్రి. కనిపించు.

కనుపు(కొ)గొట్టు: దే.స.క్రి. 1. ఖండించు.ముక్కలుముక్కలుగాగొట్టు.
2. సంహరించు.

కనుపెట్టు: కన్పెట్టు: దే. స. క్రి. కాచు, కన్నుంచు.

కనుబాటుసోకు :
కనుబాటుతొడరు: } దే. అ. క్రి. దృష్టిదోషము తగులు.

కనుబ్రాము : దే. స. క్రి. కన్నుగప్పు, మోసగించు.

కనుమఱుపడు : దే. అ. క్రి. చాటగు.

కనుమారఁబడు : దే. స. క్రి. కొండపైనుండి యురికి క్రిందపడు.

ఉ. హరి.

కనుమూయు : దే. అ. క్రి. 1. చనిపోవు.
2. నిదురపోవు.
3. వంచించు.

కనుమొగుచు : దే. స. క్రి. కన్నుమూయు.

కనుమొఱఁగు:
కన్మొఱగు : } దే. స. క్రి. మోసగించు.

కనుఋచరించు : దే. అ. క్రి. బహుస్త్రీవ్యాలోలమైన దృష్టిని బఱపు
కనుఱ్ఱాల్చు : దే. అ. క్రి. కనువిచ్చు.
కనువిప్పుగలుగు: దే. అ. క్రి. తెలిసివచ్చు.
కనుసన్నచేయు : దే. స. క్రి. కంటితో సంజ్ఞ చేయు.
కనుసన్నమెలగు: దే. అ. క్రి. ఆజ్ఞను విధేయతతో పాలించు.
భార. విరా. 2 ఆ.

కనువడు : దే. స. క్రి. ఎదిర్చు. (ప. పీ.)
కన్నకూతలుకూయు: దే. స. క్రి. నోటికి వచ్చినట్లు తిట్టు. (తెలం).
కన్నడగించు : దే. స. క్రి. ఉపేక్షించు.
కన్నడసేయు : దే. స. క్రి. 1. చులకనసేయు.
2. కించపఱచు. పార్థసారథివిజయము
3. తక్కువపఱచు.
4. గేలిసేయు.

—భరతుండ నీవు నాపదలనొందుదుగ
నిన్నును నన్నును నీ కుమారకుని
కన్నడసేయక కాచి రక్షింప
మదిలోననెయ్యదిమార్గమోచూచి,
అది నడిపించుకొమ్ము.
క. న. రా. అయోధ్య. 630

కన్నడించు : దే.స. క్రి. 1. ఉపేక్షించు.
2. కన్నడములోనికి మార్చు.
(తెలిగించు వంటిది.)
కన్నపెట్టు, కన్నవెట్టు: దే. అ. క్రి. కన్నమువేయు.
స. క్రి. అపహరించు.
కన్నపోవు : దే. అ. క్రి. కన్నము వేయబడినది యగు.
కన్నమిడు : దే. స. క్రి. కన్నమువేయు.
కన్నమ్మకష్టముపడు: దే. అ. క్రి. అధికబాధలు పడు. (తెలం.)

కన్న(శవు సేయు)డగు: దే. స. క్రి. 1. తిరస్కరించు.
2. ఉపేక్షించు.

కన్నాకగు : దే. అ. క్రి. 1. శ్రేష్ఠనుగు.
2. సేన మొగదల రక్షించు.
3. సేనాపతియగు.

కన్నాగు : దే. అ. క్రి. నిద్రించు.

కన్నాఁగు : దే. స. క్రి. మోసగించు.
—రావణుఁ డోడక యతని కన్నాఁగి
జానకిఁ గైకొని తన లంకయందు,
నుద్యానంబులోన నునిచినఁ బోయి
క. వ. రా. కిష్కింధ. 5812.

కన్నారఁజూచు : దే. స. క్రి. తృప్తిగాఁజూచు

కన్నాసయగు : దే. అ. క్రి. కంటికి వాపిరిగాను.
—త్రోవ్వఁ జల్లిన నొప్పారు తోయజాస్త్రి
చికిలి సిద్ధంపుఁగైదువు చెలువుదోప
నూనె మెఱుగున నునుజాయ మేనుదనర
నది విటాళుల కన్నాసయై చెలంగు.
హం. వి. 5 ఆ.

కన్నిచ్చయగు: } దే. అ. స. క్రి. నచ్చు, వాంఛించు.
కన్నిచ్చవడు :

కన్నిడు : దే. అ. స. క్రి. 1. జాగరూకుఁడై యుండు.
2. ప్రేమించు.

కన్నీరుతిరుగు : దే. అ. క్రి. 1. కన్నులం దశ్రువులూరు.

కన్నీరుపెట్టుకొను: దే. అ. క్రి. అశ్రువుల నూరించు.

కన్నుంచు : దే. స. క్రి. 1. కనిపెట్టు.
2. జాగ్రత్తగా చూచు.
3. మనసుంచు.

కన్నుకుట్టు : దే. అ. క్రి. 1. చూపోవలేకపోవు.
2. అసూయపడు.

కన్నుకొట్టు : దే. స. క్రి. కన్నుగీటు.

కన్నుగూఱుకు : దే. అ. క్రి. 1. అప్పుడే నిద్రపట్టు.
2. కాసేపు నిద్రించు. (నె జి.)

కన్నుతనియు . దే. అ. క్రి. కంటగింపగు.

కన్నుతిరుగు . దే. అ. క్రి. పైత్యముచే విభ్రాంతి కలుగు.

కన్నుదెఱచు : దే. అ. క్రి. 1. తెలివినొందు.
2. అనుభవము గడించు.

కన్నుపూఱు : దే. అ. క్రి. 1. అందముసిపించు.
2. నచ్చు.

కన్నుపెట్టు: }
కన్నార్చు : } దే. స. క్రి. కన్నుగీటు.

కన్నుపొందు : దే. అ. క్రి. నిద్రపోవు.

కన్నుపొడుచు : దే. స. క్రి. ప్రతీకారముచేయు.

కన్నుమూయు : దే. అ. క్రి. 1. నిద్రించు.
2. కన్నుమూతపడు.
3. సుఖముగా నిద్రించు.
4. మరణించు.

క. వినవయ్య కర్ణుగర్వం
బని నాత డభేద్యకవచు డగుటయు విలునే
ర్పును నతని బాహువిక్రమ
మును దలచిననాడు గన్నుమూయుదు నాకున్.
భా. ఉద్యో. 1 ఆ.

కన్నుమొగుచు . దే. అ. క్రి. 1. కనుమూయు.
2. మరణించు.

కన్ను(ను)మోడ్చు: దే. అ. క్రి. 1. కన్నుమూయు.
2. మరణించు.
కన్నులకద్దుకొను: దే. స. క్రి. 1. పూజించు.
2. అదియే పదివేలనుకొను.
కన్నులకఱవుతీరు: దే. అ క్రి. 1. కన్నులకు హాయినిచ్చు.
2. నేత్రసాఫల్యము కలుగు.
కన్నులంగట్టు : దే. స. క్రి. మోహగించు.
కన్నులంగప్పుకొను: దే. స. క్రి. 1. కంటికి రెప్పవలెఁ గాచియుండు.
2. మిక్కిలిగా నభిమానించు.
కన్నులపండువగు: దే. అ. క్రి. కన్నులకుఁ దృప్తియగు
కన్నులప్పగించు: దే. అ. క్రి. నిస్సహాయుఁడగు.
కన్నులంబడు : దే. అ. క్రి. కన్పించు,
కన్నులార్చు : దే. స. క్రి. 1. సంజ్ఞ చేయు.
2. ఱెప్ప వేయు.
కన్నులుచల్లనగు: దే. అ. క్రి. 1. సంతోషించు.
2. తృప్తిపొందు.
కన్నులు తిరిగిపోవు: దే. అ. క్రి. 1. దిగ్భ్రాంతి పొందు.
2. చూచిన వస్తువుల సౌందర్యాతిశయముచే నతితృప్తికలుగు.
కన్నులుతిరుగు : దే. అ. క్రి. 1. పొగరెక్కు.
2. వికారమువచ్చు.
కన్నులునెత్తికెక్కు: దే. అ. క్రి. పొగరెక్కు.
కన్నువడు : దే. అ. క్రి. 1. నిద్రపట్టు.
2. ఒకదానియందు దాశ కలుగు.
కన్ను(ను)వేయు: దే. స. క్రి. వాంఛించు.
కన్నువైచు : దే. స. క్రి. వాంఛించు. (స్త్రీని)

కన్నువాఁదు : దే. అ. క్రి. 1. నిద్రపట్టు.
3. కన్నుమూతపడు.
-కడుపునిండఁ గుడువ గానమి కేయెల్లఁ
గన్ను వాఁదకున్న గరము డస్సి.
భార. ఆది. 6 ఆ.

కన్నెచెరవదలు : దే. స. క్రి. పెండ్లిచేయు.

కన్నెదుగు : దే. అ. క్రి. జాడ తెలియు. ప. రా.

కన్నెఱ్ఱచేయు : దే. స. అ. క్రి. 1. కోపగించు.
2. సాటికివచ్చు. (తెలం.)

కన్నెఱ్ఱయగు : దే. అ. క్రి. ఈర్ష్యపడు.

కన్నెఱుగు : దే. స. క్రి. 1. తెలిసికొను.
2. జాడ తెలియు కు. సం. 1 ఆ.
3. ఇంగితమెఱుగు.

కన్నోడు : దే. స. క్రి. వలచిచూచు. నాసి.

కన్మొగుచు : దే. అ. క్రి. కన్నుమూయు.

కపటించు : సం. స. క్రి. కపటముచూపు, మాయచేయు.

కపితముసె(చె)ప్పు: దే. స. క్రి. 1. కపిత్వముచేయు.
2. వెక్కిరించు.
"ఎమి తిని సెపితివి కపితము"

కప్పగంతులువేయు: దే. అ. క్రి. శాఖాచంక్రమణముచేయు.

కప్పతిల్లబడు : దే. అ. క్రి. 1. బోర్లగిలఁబడు.
2. వెలికిలఁబడు.

కప్పదెంచు : దే. స. క్రి. క్రమ్ము.

కప్పములరుచు : దే. అ. క్రి. కప్పములుగొను.

కప్పరపడు : దే. అ. క్రి సంభ్రమమొందు.

కప్పారు : దే. అ. స. క్రి. 1. నల్లపడు.
2. ఆవరించు.

కప్పిడు : దే. స. క్రి. దాచు.

కప్పిపుచ్చు : దే. స. క్రి. దాచియుంచు.

కప్పు : దే. స. క్రి. 1. పరివేష్టించు.
2. బంధించు.
3. వ్యాపించు.
4. ఆచ్ఛాదకముగా జేయు.

కప్పుకొను : దే. అ. క్రి. 1. పర్వు.
2. క్రమ్ము.
3. ఆచ్ఛాదనము చేసికొను.

కప్పువడు : దే. అ. క్రి. ఆచ్ఛాదితమగు.

కప్పెక్కు : దే. అ. క్రి. నలుపెక్కు.

కబళించు : సం. స. క్రి. 1. మ్రింగు.
2. పట్టుకొను.

కబురుపెట్టు : దే. స. క్రి. వార్తపెట్టు.

కమరు : దే. అ. క్రి. 1. కాలు.
2. వెంట్రుకలు కాలిన వాసనకొట్టు.

కమరుచు : } కమరించు: } దే. స. క్రి. కాల్చు.

కమరులువోవు : దే. అ. క్రి. ఎండు.

కమలించు : దే. స. క్రి. 1. కాల్చు.
2. కందించు.
3. వివర్ణముచేయు.

కమలు : దే. అ. క్రి. 1. నిప్పునకు వాడిపోవు.
2. కందు.
3. దుఃఖించు.
4. కాలు.

కమలుచు : దే. స. క్రి. కమలజేయు.

కమియాఱు : దే. స. క్రి. 1. జోలినించునట్లుపెట్టు.
2. ఆవరించు.

కమియు : దే. స. అ. క్రి. 1. కవియు.
2. పైబడు.
3. మాఁగు.
4. పూర్ణమగు.
5. త్రాగు.
6. కొఱుకు.
7. తిను.
8. క్రమ్ము.
9. అతిశయించు.

కముచు : దే. స. క్రి. 1. పట్టుకొను.
2. కొఱుకు.
3. ఊడబెఱుకు.
4. మ్రింగు.
5. తిను.
6. రుచిచూచు.
7. ఆక్రమించు.
8. ఆకర్షించు.
9. అదుము.

కమ్మగట్టు : దే. స. క్రి. పనికట్టుకొని ఒకరిని వెటకారముచేయు.

కమ్మగప్పు : దే. స. క్రి. గుడిసెకు ఆకుకప్పు. (తెలం)

కమ్మవలచు : దే. అ. క్రి. పరిమళించు.

కమ్మానుకొను : దే. అ. క్రి. తియ్యనగు.

కమ్మించు : దే. స. క్రి. 1. తీఁగతీయు.
2. కమ్మితీయు.

కమ్మితీయు : దే. అ. క్రి. 1. సన్నగిల్లు.
2. చెప్పకుండపోవు. (నె. జి.)

కమ్మిదీయు:
కమ్మచ్చునదీయు:
కమ్మెచ్చులదీయు : } దే. స. క్రి. (కమ్మి+అచ్చు)
1. కమ్మచ్చునదీయు.
2. స్వర్ణాదులను పోగరుతో తీగగా సాగఁదీయు.

కమ్మినూకు : దే. స. క్రి. తీగగా కొట్టు.
-కమ్మినూకిన నూత్నకలధౌతమును బోలె. భ. మ. 4

కమ్మిరించు : దే. స. క్రి. 1. మూతపెట్టు,
2. దాచియుంచు.

కమ్మీచేయు : దే. స. క్రి. (నేరమును) కప్పిపుచ్చు.

కమ్ము : దే. స. క్రి. కమ్మిగా సాఁగఁగొట్టు.

కమ్ముకొను :
క్రమ్ముకొను: } దే. స. క్రి. 1. ఆవరించు.
2. చుట్టుముట్టు.

కమ్ములుపిండు :
కమ్ములువార్చు : } దే. స. క్రి. చాకలి వస్త్రములను తెలుపుచేయు.

కయికూడు : దే. అ. క్రి. 1. చేయికలుపు.
2. స్నేహముచేయు.

కయికొను : దే. స. క్రి. 1. పొందు.
2. సరకుగొను.

కయితగట్టు : దే. స. క్రి. పద్యములల్లు.

కయిపడు:
కయివడు:
కైవడు : } దే. అ. క్రి. 1. కైవాలు.
2. క్రిందికొరఁగు.

కయిముట్టు ; దే. స. క్రి. లోఁగొను.

కయి(కై)వీఁగు : దే. అ. క్రి. పనిమాను.

కయివా(వ్రా)లు: దే. అ. క్రి. చేయిజారిపోవు, ఒక ప్రక్కకువ్రాలు.

కయివాలుచు: } దే. స. క్రి. చేయిజాచు, ఒకప్రక్కకు వంచు.
కైవాలుచు :

కయిసడలు, కైసడలు: దే. అ. క్రి. 1. ఒఱగు.
2. వంగు.

కయిసేయు–కైసేయు: దే. స. క్రి. అలంకరించు.

కయ్యమిచ్చు : దే. స క్రి. పోరాడు.

కయ్యముపొడుచు: దే. అ. క్రి. పోట్లాడు.
(అధిపతనయుండ కయ్యంబు పొడుచు
బ్రా. భీ. 1

కయ్యముసేయు : దే. అ. క్రి. యుద్ధముచేయు.

కయ్యాలాడు : దే. అ. క్రి. పోట్లాడు.

కరఁగించు : దే. స. క్రి. కరఁగజేయు.

కరఁగు : దే. అ. క్రి. 1. స్వేదపడు.
2. నీరగు.
3. ద్రవమగు.
4. ప్రేమాదులచే పరవశమగు.
స. క్రి. 1. ద్రవింపజేయు.

కరగపడు, కరగవడు: దే. అ. క్రి. క్షీణించు.

కరఁచు : } దే స. క్రి. కరగించు. ప్రే.
కరఁగజేయు :

కరకరపడు : } దే. అ. క్రి. మండిపడు.
కరకరలాడు:

కరకరించు : దే. స. క్రి. పగఁబూను.

కరకరిపడు : దే. స. క్రి. పగగొను.

కరగట్టు : దే. స. క్రి. కంబళ్ళకు దారముతో అంచుకట్టు.

కరగ్రహణమొనర్చు: సం. స. క్రి. పెండ్లియాడు.

కరగ్రహణముచేయు: సం. స. క్రి. కరగ్రహణమొనర్చు,
పెండ్లియాడు.

కరచుకొను : దే. అ. క్రి. గట్టిగా అంటుకొను.

కరడుగట్టు : దే. అ. క్రి. 1. పేరుకొను.
2. ముద్దగట్టు.
3. గట్టిపాఱు.

కరమిచ్చు : దే. స. క్రి. అభయమిచ్చు.

కరముపట్టు : దే. స. క్రి. మైత్రిని స్థిరము చేసికొను.

కరమొప్పు : దే. అ. క్రి. మిక్కిలి ప్రకాశించు.

కరవగు : దే. అ. క్రి. లోపించు.

కరాబుచేయు : అన్య. దే స. క్రి. పాడుచేయు.

కరారావడిచేయు: దే. స. క్రి. నాశనముచేయు.

కరారుచేయు : అన్య. దే. స. క్రి. 1. కట్టడిచేయు.
2. మాటనిశ్చయముచేసికొను.
3. నిర్ణయించు.
4. ఏర్పాటుచేయు.

కరాళించు : దే. అ. క్రి. 1. సాటియగు.
2. బొబ్బలుపెట్టు.
3. సకిలించు.
4. మొఱుఁగు.
5. మండిపడు.
స. క్రి. 1. నిందించు.
2. తిరస్కరించు.

కరిక్రొను : దే. స. క్రి. సాక్ష్యముగైకొను.

కరిసించు : వై. స. క్రి. 1. ప్రతిఘటించు.
2. ఘర్షించు.
3. అతికించు.

కరుడుకట్టు(రూ)కఱడుగట్టు: దే. అ. క్రి. 1. ముద్దగట్టు.
2. పుంజీభవించు.

కరుణగలుగు :
కరుణముపుట్టు : } సం. అ. క్రి. 1. కరుణ గలదియగు.
2. కరుణ గలవాడగు.
3. దయకలుగు.

కరుణించు : సం. స. క్రి. జాలిదలచు.
అ. క్రి. కరుణ కలవాడగు.

కరువటిల్లు : దే. అ. క్రి. 1. తడఁబడు.
2. వణఁకు.

కరువుగట్టు :
కరువునబోయు : } దే. స. క్రి. అచ్చునఁబోయు.

కర్తనమొనర్చు : సం. స. క్రి. 1. చీల్చు.
2. కత్తిరించు. దశ. 7 ఆ.

కర్దమమాడు : సం. అ. క్రి. బురదలోపొర్లు. కు. సం.

కర్మ(ము)కాలు: సం. అ. క్రి. దురదృష్టవశమగు.

కర్సెనముచేయు : దే. స. క్రి. వ్యవసాయముచేయు.
రూ. కరిసెనముచేయు.

కఱకఱించు : దే. అ. క్రి. 1. పొగరెక్కు.
2. విరోధము పాటించు.
—గజపతికిఁ గొండెముల్ చెప్పి కఱకరించు,
జూటుకూటువ రాజుల చుక్కవాల.
వె. వం. 139

కఱకఱిఁబెట్టు : దే. స. క్రి. హింసించు.

కఱకుగిలు(ల్లు) : దే. అ. క్రి. బిరుసగు.

కఱకుదేఱు : దే. అ. క్రి. గడిదేఱు, గడుసగు.

కఱుకెక్కు(రూ)గఱుకెక్కు :
కఱకెత్తు . } దే. అ. క్రి. 1. వాడియగు.
2. గండుమిగులు.
3. గరుకగు.
4. పులకరించు. ప. పి.

కఱ(ర)గట్టు: / కఱపడు : దే. అ. క్రి. మచ్చపోవు.

కఱగొను : దే. అ. క్రి. స్థిరపడు.

కఱచు : దే. స. క్రి. 1. అభ్యసించు.
2. కాటువేయు.
3. నాటుకొను.
4. తెలియు.
5. కొఱుకు.
6. నాటు.
7. ఖండించు.
8. తిను.
9. పండ్లు మొ॥గు వానితో పట్టుకొను.

కఱదలుచెప్పు . దే. స. క్రి. బుద్ధులు చెప్పు.

కఱదలెఱుఁగు : దే. అ. క్రి. బుద్ధులునేర్చు.

కఱపడు : దే. అ. క్రి. లోపించు.

కఱపించు : దే. స. క్రి. నేర్పించు.

కఱపు : దే. స. క్రి. (కఱచు ధా. ప్రే.) బోధించు.

కఱవువచ్చు : దే. అ. క్రి. కొఱత కలుగు.

కఱిగొను : దే. అ. క్రి. 1. అంటుకొను.
2. అంటునడు.
3. నల్లనగు.

కఱుకు : దే. స. క్రి. రాచు.

—కఱకు టంప్రుల నిఱికించి గజ్జెకదల,
గఱికి నెఱినెఱేఁ గోలెముకయు విఱుగ
విడిచె వడఁగ్రొజ్జు నొకపెద్ద వేసడంబు.
మను. చ. 4. ఆ.

కఱుకెక్కు :<br>రూ. గఱుకెక్కు:<br>కఱుకెత్తు : } దే. అ. క్రి. 1. వాడియగు.
2. గండుమిగులు.
3. గఱుకగు.
4. పులకరించు. (ప పీ.)

కఱ్ఱువట్టు : దే. అ. క్రి. కళంకితమగు.

కలఁదేఱు : దే. అ. క్రి. ప్రసన్నమగు.

కలఁకఁబాఱు : దే. అ. క్రి. 1. కలఁతపడు.
2. కలుషితమగు.
3. క్షోభించు.
4. బెణుకులు మెత్తబడి బాధించు.

కలకఁబడు : దే. అ. క్రి. వ్యాకులపడు.

కలకవేయు : దే. అ. క్రి. 1. చేపలు ఒక్కొక్కటిగా అక్కడక్కడ పైకి లేచిపడు.
2. అక్కడక్కడకు పోయి జాడఁదీయు.
3. ప్రాతవ్యాధి లక్షణము మఱల కనుపించి బాధపడు.

కలఁకు : దే. అ. క్రి. జంకు.

కలఁ(త)గఁబడు : దే. అ. క్రి. 1. చెదఱు.
2. తారుమారగు.

కలఁగఁబాఱు : దే. అ. క్రి. కలఁగు.

కలఁగించు : దే. స. క్రి. కలఁచు.

కలఁగు : దే. అ. క్రి. 1. చెల్లాచెదరగు.
2. చలించు.
3. పంకిలమగు.
4. క్షోభించు.
5. భయపడు.

కలఁచియాడు : దే. స. క్రి. సంక్షోభింపఁజేయు.

కలఁచు : దే. స. క్రి. 1. (నీటిని) క్రిందుమీఁదుచేయు.
2. మనోవైకల్యము కలిగించు.

కలఁతపడు : దే. అ. క్రి. సంక్షోభించు.

కలఁబడు : దే. అ. క్రి. 1. కలియఁబడు.
స. క్రి. డీకొను.

కలకలలాడు : దే. అ. క్రి. వికాసముకలది యగు.

కలకొను . దే. అ. క్రి. కలగొను

కలగరపెట్టు : దే. స. క్రి. విత్తనాలు దమ్ములో చల్లిన తర్వాత నేల ఆరిన వెంటనే మొదటి తడిపెట్టు. (నె. జి.)

కలగాపులగముచేయు: దే. స. క్రి. 1. భిన్నవస్తుస్థితి పరిమితులు తెలియకుండ నంగిరి సంగిరిగాఁగలుపు.
2. భిన్న విషయములను గలుపు.

కలగుంఁడగు : దే. అ. క్రి. క్షోభపడు.

కలగుండుకొను : దే. అ. క్రి. కలఁగు. భా. ద్రో. 1 ఆ.

కలగుండుప(వ)డు: దే. అ. క్రి. 1. క్షోభకలుగు.
2. కలతనొందు.

కలగుండుపెట్టు : దే. స. క్రి. క్షోభింప జేయు.

కలఁగొనబాఱు : దే. అ. క్రి. కలతనొందు.

కలగొను : దే. అ. క్రి. 1. వ్యాకులపడు.
2. సంకులమగు.
3. క్రమ్ముకొను.
4. వ్యాపించు.

కలచు : దే. స. క్రి. దంపతుల సంయోగింపఁజేయు.

కలతగొట్టగు : దే. అ. క్రి. లోపించు.

కలనువాఁడుచు : దే. అ. క్రి. కయ్యముపాడుచు
—చిక్కెఁ గోటుబంటు కలనువాఁడువ. కకుత్.2
స. క్రి. 1. కలియు.
2. కూడు.

కలనుసెప్పు : దే. అ. క్రి. యుద్ధమును ప్రకటించు కు. సం.
కలపనసేయు : దే. స. క్రి. కలుపు.
కలపముసేయు : దే. స. క్రి. కలుపు.
కలపు : దే. స. క్రి. కలియునట్లుచేయు.
కలమరించు : దే. అ. క్రి. వికారపెట్టు.
కలముపెట్టు : దే. స. క్రి. ఒకచెట్టుకొమ్మకు మఱియొకకొమ్మను కలిపికట్టు. (అంటుద్రొక్కుట వంటిది.)
కలయఁజూచు : దే. స. క్రి. పాఱఁజూచు.
కలయఁబడు : దే. అ. క్రి. 1. ఏకమగు. 2. సంకీర్ణమగు.
కలయఁబర్వు : దే. స. క్రి. అంతటను వ్యాపించు. కు. సం. 9 ఆ.
కలయమొత్తుచు: దే. అ. క్రి. అంతటను మునిగిపోవు. కు. సం.
కలయు : దే. స. క్రి. 1. చేరు.
2. కూడు.
3. రమించు.
4. రతిసేయు.
కలవడు : దే. స. క్రి. కలయు.
కలవరపడు : దే. అ. క్రి. కలఁతపడు.
కలవరపోవు : దే. అ. క్రి. కలవరపడు.
కలవరించు : దే. అ. క్రి. స్వప్నమోహజ్వరాదులచే మైమఱచి పలుకు.
కలవరింతలగు : దే. స. క్రి. కలవరించు.
కలశమిడు : సం. స. క్రి. కలశమెత్తు. పూజకై దేవతనుప్రతిష్ఠించు
కలశములెత్తు : సం. స. క్రి. దేవాలయ గోపురము పూర్తిచేయు.
కళవళించు : దే. అ. క్రి. ఉద్వేగముపడు.
కలసివచ్చు : దే. అ. క్రి. లాభముకలుగు.
కలహించు : సం. స. క్రి. పోట్లాడు.
కలాపించు: సం. స. క్రి. పింఛమువిప్పు.

కలిగించు : దే. స. క్రి. 1. ప్రతిష్ఠించు.
2. సృజించు.

కల్గించు : దే. స. క్రి. కలుగునట్లుచేయు.

కలిగియుండు : దే. స. క్రి. పొందు (వాడు దానినికలిగియుండెను)

కలిపికొను : }
కల్పికొను : } దే. అ. క్రి. చేర్చుకొను.

కలిమిడిపడు : దే. అ. క్రి. కలయికపొందు.

కలియఁబడు : దే. స. క్రి. దెబ్బలాటకు సిద్ధపడు, మీదికివచ్చు.

కలియు : దే. స. క్రి. 1. చేరు.
2. ఏకమగు.
3. సంగమించు.
అ. క్రి. బంధుత్వాదులచే చేరు.

కలుగజేసికొను: దే. స. క్రి. వ్యవహారమునం దనవసరముగ జోక్యము కల్గించుకొను.

కలుగు }
కలుంగు } దే. అ. క్రి. 1. కనులుకలుగు,
2. కనులలో పటలమేర్పడు.

కలుగు(రూ)కలుంగు: దే. అ. క్రి. ఉండు.

కలు(వు)గు : దే. అ. క్రి. ఉండు.

కలుగుకొను : దే. అ. క్రి. 1. కలుగు.
2. కలిగియుండు.

కల్గు : దే. అ. క్రి. 1. పుట్టు. సీతా. సం. భాగ. 1 స్కం.
2. అగు.
3. నిల్చు.
4. ఓపు.
5. కలకయగు.

కలుగు(సంపద): దే. అ. క్రి. 1. కలదియగు.
2. కలవాడగు.
3. సంభవించు.

కలుగు : 4. తగు.
5. లభించు.
6. కడచు.
స. క్రి. పొందు.
కలుచపడు : దే. అ. క్రి. 1. క్రోధపడు.
2. నిందపడు.
కలుచు : దే. స. క్రి. 1. వలచు.
2. ప్రేమించు.
కలుపు-కల్పు : దే. స. క్రి. 1. చేర్చు.
2. కూర్చు.
కలుపుతీయు : దే. స. క్రి. పైరులో అన్యజాతులను పెఱికివేయు.
కలుషించు : సం. స. క్రి. 1. కోపించు.
2. కలఁగఁబాఱు.
3. విరోధించు.
కల్తీచేయు : అన్య. దే. స. క్రి. సంకరముచేయు.
కలెగలుపుచేయు: దే. స. క్రి. స్నేహముచేయు. (తెలం.)
కలెబడు : దే. స. క్రి. 1. పట్లుపట్టు.
2. కలయఁబడు.
కల్పించు : సం. స. క్రి. 1. రచించు.
2. నిర్మించు.
3. కల్పనచేయు.
కల్లముచేయు : } దే. స. క్రి. 1. అల్లరిచేయు.
కళ్ళముచేయు : } 2. వెదజల్లు.
3. ధాన్యమును నూర్చుకొనుటకు తగినరీతిగా భూమిని బాగుచేయు.
కల్లముదొక్కు : దే. స. క్రి. నలగత్రొక్కు.
కల్లవడు : దే. అ. క్రి. కలతనొందు. కు. సం.

కలవెల్లియగు : దే. అ. క్రి. చెల్లాచెదరగు.
కల్లసేయు : దే. స. క్రి. మోసగించు.
కల్లువడు : దే. అ. క్రి. జూపడు.
కల్లువఱుచు : దే. స. క్రి. శిలగాచేయు.
కల్యాణమగు : సం. అ. క్రి. 1. వివాహమగు.
2. క్షౌరమగు. (గ్రా)
కల్యాణములందు: సం. స. క్రి. శుభములనందు.
కల్యాణముసే(చే)యు: సం. స. క్రి. 1. పెండ్లిచేయు.
2. క్షౌరముచేయు.
3. నాశనముచేయు.
కవకవనవ్వు : దే. స. క్రి. హేళనచేయు.
కవగూడు : దే. స. క్రి. 1. జతకట్టు.
2. రతికిఁగూడు.
కవగూర్చు : దే. స. క్రి. జతకూర్చు.
కవగొను : దే. స. క్రి. కూడు
కవయు : దే. స. క్రి. 1. రతిచేయు.
2. ఎదిరించు
కవలుకొను : దే. అ. క్రి. కవలుపోవు.
కవలుపోవు : దే. అ. క్రి. వేదపాఠక్రమము తప్పు.
కవవాయు : దే. అ. క్రి. 1. జతవిడుచు.
2. వియోగమందు.
కవళించు : దే. స. క్రి. కబళించు.
కవాతుతిరుగు: } అన్య. దే. అ. క్రి. సైనికులు వ్యాయామముసేయు.
కవాతుసేయు: }
కవించు : దే. స. క్రి. 1. కవియించు.
2. పైకొలుపు.
కవిగొను : దే. స. క్రి. 1. కవియు.
2. విస్తరించు.

కవిచేయు : దే. స. క్రి. 1. వెంటఁబోవు.
2. సహగమనముచేయు.
3. కవిత్వముగట్టు.

కవితఁజెప్పు : సం. స. క్రి. కవిత్వముచేయు. (ఆంధ్ర)

కవితలుజెప్పు : సం. స. క్రి. కవిత్వముచెప్పు.
(కవితలే చెప్పుట పాడనేర్చుట.) చాటువు.

కవియించు :
కవ్వించు : } దే. స. క్రి. 1. ప్రయోగించు.
2. పైకొల్పు,
3. పడవైచు.

కళపట్టు : దే. అ. క్రి. మూర్ఛిల్లు.

కళలంటు : దే. స. క్రి. కళాస్థానములు స్పృశించు.

కళవళపడు : దే. అ. క్రి. క్షోభపడు.

కళవళమగు : దే. అ. క్రి. సంక్షోభించు.

కళవళము కరవగు: దే. అ. క్రి. 1. కలత విస్పష్టమగు.
2. కలత అచ్చుపడు

కళవళించు : దే. అ. క్రి. 1. కలతపడు.
2. తొట్రుపాటునందు.
3. కలతపడి అఱచు.

కళవారు : దే. అ. క్రి. ఆశపడు,
—మొగమాట యుడిగి సొమ్ములమీఁదఁ గళవాఱి
వదలక యార్జించువారి జూచి. విప్ర. 4.

కళాసించు : దే. అ. క్రి. 1. నృత్యము ముగించు.
2. డయ్యు.

కసుకుట్టు : దే. అ. క్రి. ఈర్ష్యపడు.

కస్లగట్టు : దే. అ. క్రి. అన్నము ముద్దలుసేయు.

కళ్ళుమూసికొను: దే.అ.క్రి. 1. చచ్చిపోవు.
2. ఓపికపట్టు.
-నాల్గురోజులు కళ్ళు మూసికొనుము.
3. గుర్తింపవలసినదానినిగుర్తింపకుండు.

కళ్ళువిచ్చు : దే. అ. క్రి. పక్వమగు.
(సీతాఫలము కళ్ళు విచ్చినది)
జ్ఞానోదయమగు.

కళ్లెము వేయు : దే. స. క్రి. 1. నిర్బంధించు
2. నియమించు.
3. (గుఱ్ఱమునకు) కళ్ళెము తగిలించు.

కహాకహానవ్వు : దే. అ. క్రి. పెద్దగా నవ్వు. (ధ్వన్యనుకరణము)

# కాం

కాంక్షలూఱు : సం. అ. క్రి. 1. కోరికపుట్టు.
2. ఆశకలుగు.

కాంక్షస(చ)ను : సం. అ. క్రి. 1. కోరికతీఱు.
2. ఆశఫలించు. భీమ. 1 ఆ.

కాంక్ష(సే)చేయు : సం. స. క్రి. 1. కోరు.
2. ఆశపడు. నృసిం. 1 ఆ.

కాంక్షించు : సం. స. క్రి. కోరు.

కాంచు . దే. స. క్రి. చూచు.

కాంక్రించు : దే. అ. క్రి. గొంతులో కఫమును కదలించు.
కాంక్రుమని ధ్వనిచేయు.

కాంతాలపడు : దే. అ. క్రి. అసూయపడు.

కాంతాళపడు : దే. అ. క్రి. 1. అధైర్యపడు.
2 బాధపడు.

కాంతాళించు : దే. అ. క్రి. కోపించు.

కాంతిలు :
కాంతిల్లు : } సం. అ. క్రి. ప్రకాశించు.

కాఁకతగిలించు : దే. స. క్రి. 1. పౌరుషము గఱపు.
2. వేడిచూపు.

కాఁకఁదేఱు :
కాఁకలనుదేరు : } దే. అ. క్రి. 1. తప్తమగు.
2. గడిదేఱు.
3. గడుసుమీఱు.

కాఁకపడు : దే. అ. క్రి. 1. తప్తమగు.
2. కోపించు.

కాఁకయతీరు : దే. అ. క్రి. 1. కష్టములు భరించు.
2. అనుభవము గడించు.
3. నేప్పును సంపాదించు.
4. ఆరితేరు.

కాఁగు : దే. అ. క్రి. 1. క్రాఁగు.
2. బాధపడు.
3. ఉడుకు.
4. పరితపించు.
5. వేడియెక్కు.

కాఁగువేయు: } కావేయు : } దే. స. క్రి. మామిడికాయలు మొదలగునవి పండుటకు గడ్డి మొదలగువానితో కప్పచేయు.

కాఁచు : దే. స. క్రి. 1. తపింపజేయు.
2. చలికాఁచుకొను.
(చలిపోగొట్టుకొను)
3. కాల్చు.

కాఁజేయు : దే. స. క్రి. 1. అక్రమముగాఁ బొందు.
2. కావించు.
3. దొంగిలించు.
4. ముగించు.
5. పూర్తి చేయు.
6. తినివేయు.

కాడఁగొను : దే. స. క్రి. నాటుకొనిపోవు. కు. సం. 5 ఆ.

కాఁడు : దే. అ. క్రి. 1. నాటుకొను.
2. పగులు.
3. గ్రుచ్చుకొను.
4. క్రమ్ము.
5. స్థిరపడు.

కాఁపించు : దే. స. క్రి. కాయునట్లుచేయు.

కాపుండు : దే. అ. క్రి. 1. నివసించు.
2. రక్షణ సేయు.

కాఁపురించు : దే. అ. క్రి. 1. నివసించు.
2. కాపురముచేయు.

కాఁపువచ్చు : దే. అ. క్రి. నివసింపవచ్చు.

కాఁపువోవు : దే. అ. క్రి. వలసపోవు.

కాఁపువెట్టు : దే. స. క్రి. రక్షణపెట్టు.
2. నొప్పులు మొదలగువానిమీద వేడి వస్తువులతో అద్దుచుండు.

కాఁబట్టు : దే. అ. క్రి. (కాన్ + పట్టు) కావలసియుండు. అవసరమగు. (అది నాకు కాఁబట్టను.)

కాఁబడు : దే. అ. క్రి. 1. అగు.
2. అవసరమగు.

కాకచేయు : దే. అ. క్రి. 1. శరీరములో వేడిచేయు.
స. క్రి. 2. వెచ్చగచేయు (కాపుపెట్టు)
3. వేడికల్గించు.
4. మోహము కల్గించు.
(కనుసన్న నొకనిని కాకసేసి)
స. న. క. ని. 2

కాకతగులు : దే. అ. క్రి. వేడెక్కు.

కాకాలుగుణించు: దే. స. క్రి. కాగుణింతము వ్రాయు. (చా. ప.)

కాకిఎంగిలిచేయు: దే. స. క్రి. పిల్లలు ఫలాదులను మఱియొకరి కిచ్చుటకు గుడ్డ అడ్డముపెట్టి కొఱికి ఇచ్చు.

కాకిగోలగాఉండు: దే. అ. క్రి. దయనీయస్థితిలో నుండి అత్యధికముగా దుఃఖించు.

కాకిగోలచేయు దే. అ. క్రి. అర్థములేని సందడిచేయు.

కాకిచూపుజూచు: దే. అ. క్రి. అనుమానాస్పదముగా తల అడ్డము త్రిప్పి చూచు.
2. కొల్లకంటి చూపు పెట్టు.

కాకుచేయు : దే. స. క్రి. 1. అణచు.
2. వ్యర్థపుచ్చు.
3. నిందించు.
4. తిరస్కరించు.
5. జయించు.
6. ఈసడించు.
7. అలజడిపెట్టు.

కాకుపడు ; దే. అ. క్రి. క్షోభపడు.

కాకుపఱచు : దే. స. క్రి. 1. లోఁబఱచుకొను.
2. వంచించు.

కాఁగబెట్టు : దే. స. క్రి. నీళ్ళు మొ॥వి వేడిచేయు.

కాఁచిపోయు : దే. స. క్రి. 1. మూలముట్టుగ పరిశోధించు.
2. భోజనము మొ॥వి వండిపెట్టు.

కాఁచు : దే. స. క్రి. 1. వేచియుండు.
2. కాయలుకాచు.
3. రక్షించు.
4. క్షమించు.
5. నిగ్రహించికొను.
6. ఆపు.
7. వేడిచేయు.
అ. క్రి. 1. ఫలించు.(చెట్టు కాయలు కాచెను)
2. కిణములేర్పడు.
(చేతులు కాయలు కాచెను)
3. ఎండ, వెన్నెల ప్రసరించు.
(అడవి గాఁచిన వెన్నెల)

కాఁచు : 4. దెబ్బలకోర్చు.
5. మీఁదకేలు.

కాచుకొను-కాచికొను: దే. స. క్రి. 1. ప్రతీక్షించు.
2. రక్షించు.

కాటందుకొను : దే. స. క్రి. కాటువేయు.

కాటికికాళ్ళుచాచు: దే. అ. క్రి. చావునకు సిద్ధపడు.

కాటుకపట్టు : దే. స. క్రి. 1. కాటుకవేయు.
2. అంజనము తయారుచేయు.
అ. క్రి. 3. వరి పొట్టమీఁద నున్నప్పుడు లోని గింజలు నల్లబడిపోవు. (ఒకవ్యాధి)

కాటుకవేయు : దే. అ. క్రి. 1. వరిపంటకు తెగులు తగులు.
స. క్రి 2. మోసగించు.
(అంజనము వేయుట మీఁదనుండి వచ్చినది.)

కాటులాడు : దే. అ. క్రి. కలహించు.

కాటువడు : దే. అ క్రి. 1. గాయపడు.
2. అడవిలోఁ ద్రోవతప్పు.

కాటువో(పో)వు : దే. అ. క్రి. కాటువాసన కలదగు.

కాడగొను : దే. స. క్రి. నాటచేయు. కు. సం.

కాడుచేయు : దే. స. క్రి. 1. క్షోభపెట్టు.
2. అడవి యొనరించు.
3. వల్లకాడుచేయు.

కాడుపడు(యా)కాడ్పడు: దే. అ. క్రి. 1. మఱుగుపడు.
2. దారితప్పు.
3. నశించు.
4. చెడిపోవు.
5. దిగ్భ్రమచెందు.

కాడుపఱచు : } దే. స. క్రి. 1. నాశముచేయు.
(రూ) కాడువెట్టు: }
2. చిక్కులంబెట్టు.
3. శ్రమపఱచు.
4. చంపు.

కాడొనరించు : దే. స. క్రి. పాడుచేయు.

కాతప్పఱచు : దే. స. క్రి. 1. అతిక్రమించు.
2. అవమానించు.
3. చెఱచు.

కాణాచియగు : దే. అ. క్రి. నివాసము చేసికొను

కాతరచేయు : దే. స. క్రి. లక్ష్యపెట్టు.

కాతరపడు : దే. అ. క్రి. వ్యథపడు.

కాతరిల్లు : దే. అ. క్రి. 1. ఆతురపడు.
2. సిద్ధపడు.
3. ఉత్సహించు.
4. భయవిహ్వలమగు.

కాతరుచేయు : } హిం. స. క్రి. 1. ఆదరముచేయు.
కాతీరుచేయు : }
2. లెక్కచేయు.

కాతాళించు : దే. స. క్రి. కోపించు.

కాదను : దే. స. క్రి. వ్యతిరేకించు.

కానఁబట్టు : దే స. క్రి. (కానన్ + పట్టు)
1. అడవియందు ప్రవేశించు.
2. తెలియజేయు.
అ. క్రి. కనబడు.

కాన(గ)బడు : దే. అ. క్రి. కన్పడు.

కానవగు : }
కానవచ్చు: } దే. అ. క్రి. కన్పించు.

కాన్పించు : దే. స. క్రి. కనఁజేయు. (కను ధా. ప్రే.)
అ. క్రి. 1. ప్రత్యక్షమగు. 2. కనిపించు.

కానఁబడయు : దే. అ. క్రి. చూడగలుగు.

కానఁబడు :
కానంబట్టు :
కాన(న)గు : దే. అ. క్రి. కనబడు.

కానవచ్చు : దే. అ. క్రి. గోచరమగు. భాగ. 1 పు.

కానికిఁగొను : దే. అ. క్రి. లక్ష్యపెట్టు.
(దీనికి వ్యతిరేకార్థముననే ప్రయోగము)

కానిచ్చు : దే. అ. క్రి. జరుగనిచ్చు.

కానిపించు : దే. అ. క్రి. కన్పించు.

కాన్పించు : దే. అ. క్రి. దర్శనము కలుగఁ జేసికొను.

కానుకలందు :
కానుకలెత్తు : దే. స. క్రి. బహుమతులందు.

కానుకలిచ్చు:
కానుక వెట్టు :
కానుక సేయు :
కాన్కవెట్టు : దే. స. క్రి. కానుకలు ఇచ్చు.

కానుచు :
కాన్చు . దే. అ. క్రి. చూచు.

కానుపించు :
కానిపించుకొను: దే. స. క్రి. కనఁబడజేయు.

కానోపు : దే. అ. క్రి. అగుటకు సమర్థమగు.

కాన్పుకెక్కు : దే. అ. క్రి. కనఁబడు.

కాఁపాడు : దే. అ. క్రి. (కాపు + ఆడు)
1. బాధను తొలగించు.
2. రక్షించు.

కాపించు : దే. స. క్రి. 1. కావఁజేయు,
2. అభిలషించు.

కాపిడు : దే. స. క్రి. కాపుపెట్టు. బ. స.

కాపుంచు : దే. అ. క్రి. రక్షణచేయు.

కాపుండు : దే. అ. క్రి. కాపురముండు.

కాపుకూటివేళగు: దే. స. క్రి. కృషికులు మొదటిసారి భుజించు వేళయగు. (రమారమి ఉదయము 9 గం.)

కాపుచేయు : దే. స. క్రి. నిరోధించు.

కాపుదిగు : దే. అ. క్రి. 1. కాపునకువచ్చు.
2. కాయలుగాయు.

కాపుపుచ్చు ; దే. స. క్రి. కాపురముండఁబంచు.

కాపుసేయు : దే. స. క్రి. రక్షణసేయు.

కామన(సే)చేయు: సం. స. క్రి. 1. ప్రేమించు.
2. నలచు. నైష. 4 ఆ.

కామాటకముచేయు: దే. అ. క్రి. పటాటోపముచేయు.

కామించు : సం. స. క్రి. వలచు. మార్క. 5 ఆ.

కాయగాయు . దే. అ. క్రి. 1. ఫలించు.
2. సంతానము కలుగు.

కాయజవాలు చెప్పు: దే. స. క్రి. కలపిరానివార్త చెప్పు.
(ఓబడ గరుడాచల య॥గా.)

కాయు : దే. అ. క్రి. 1. (ఎండ మొ॥వి) ప్రసరించు.
2. ఉద్భవించు.
3. కాపాడు.
4. కాయలుకాచు.

కారముచల్లు : దే. స. క్రి. వంచించు.

కారమెత్తు : దే. అ. క్రి. (మిరప) కారముతగులు, తాటిదోనెత్తో నీళ్ళుత్తోడు.

కారవెట్టు : దే. స. క్రి. 1. బంధించు. 2. పట్టుకొను.

కారాకూరములు చేయు: దే. స. క్రి. 1. బలవంతపెట్టు.
2. కలతపడచేయు.

కారాడించు: దే. స. క్రి. తిరుగఁజేయు.

కారాడు: దే. అ. క్రి. 1. వెంపరలాడు.
స. క్రి. 2. నడుపు.
3. విజృంభింపఁజేయు.

కారాకుమిరియాలునూరు. దే. అ. క్రి. కోపముతో రుసరుసలాడు.
స. క్రి. 1. కసరు.
2. కోపముతో తిట్టు.
3. కేకలువేయు.

కారించు: దే. స. క్రి. 1. బాధించు.
2. అవమానించు.
3. చంపు.

కారుకొను: } కార్కొను: } దే. అ. క్రి. 1. అతిశయించు.
2. నల్లనగు.
3. వ్యాపించు.
4. క్రమ్ముకొను.

కారుక్రమ్ము: దే. అ. క్రి. 1. దట్టముగా నావరించు.
2. నల్లనగు.

కారుజల్లు: దే. స. క్రి. రెండవమారు పైరుజల్లు.

కారుపట్టు: దే. అ. క్రి. మదమెక్కు.

కారుబారుచేయు } కారుబార్లుచేయు } దే. స. క్రి. 1. ద్రోహముచేయు.
2. మాత్సర్యము ప్రకటించు.
—తానెత్తి పెంచగాఁదగు నిశాపతి
మీఁద నడినెల బలుకారుబారు చేసి
గోపాల దేవునిపై కోపించెనదియెట్లు
రా. సా. 1 ఆ.

కారుచు : } దే. స. క్రి. 1. కారించు. (కారు ధా. ప్రే.)
కార్చు : 2. కాఱఁజేయు.
3. స్రవింపఁజేయు.

కాలిక్రింద కన్నము వేయు: దే. అ. క్రి. దుశ్శకమైనదానిని గూడ నేర్పుగా అపహరించు.

కార్యకర్మమునడపు: సం. స. క్రి. పనులు నెఱవేర్చు.
భార. శాం. 1 ఆ.

కార్యభారముతలచు: సం. స. క్రి. బాధ్యతను తెలిసికొను.
శుక. 1 ఆ.

కార్యమగు : సం. అ. క్రి. గర్భాధానమగు
కార్యమరయు : సం. స. క్రి. పనిచూచు. శుక. 1 ఆ.
కార్యముచేయు ; సం. స. క్రి. పునస్సంధానముచేయు.
కార్యముతప్పు : సం. అ. క్రి. పనిచెడు. కళా. 6 ఆ.
కార్యముతెగు : సం. అ. క్రి. పనిముగియు. విజయవి. 1 ఆ.
కాఱియవ(ప)డు: దే. అ. క్రి. 1. బాధపడు.
2. యాతనపడు.

కాఱియవెట్టు . } దే. స. క్రి. 1. బాధపెట్టు.
కాఱియపెట్టు: 2. శిక్షించు.
కాఱు : దే. అ. క్రి. 1. స్రవించు.
2. జాలువాఱు.
(బిందువులు కాఱుచున్నవి)

కాఱుకొను : దే. అ. క్రి. (కార్కొను) మబ్బులు, చీకట్లు, ఆపదలు మొదలైనవి దట్టమగు.
కాఱుచు : దే. స. క్రి. కాఱఁజేయు. (కాఱు ధా. ప్రే.)
కాఱుదూఱుపడు: దే. అ. క్రి. మిక్కిలి నిండపడు.

-శశిముఖదర్శనంబు తమ సారు
గ్రహింపగ జీవనంబులున్, వశపడ
కాఱుదూఱువడి. యా. ది. వి. 2

కాలక్షేపము సే(చే)యు: సం. స. క్రి. కాలము వెళ్ళబుచ్చు.

కాలక్షేపమేపారు: సం. అ. క్రి. కాలక్షేపమగు.

కాలకృత్యములుదీర్చు: దే. అ. క్రి. వేకువ కాలమున కృత్యములు జరుపు.

కాలగోచరుడగు: సం. స. క్రి. మృతినొందు.

కాలదన్ను(రూ)కాలదున్ను: } దే. స. క్రి. 1. కాలితో తన్ను.
కాలఁదాచు : } 2. తృణీకరించు.

కాలదోషముపట్టు: సం. స. క్రి. నియమిత కాలము దాటిపోవు. (నోటుకు కాలదోషముపట్టినది)

కాలధర్మముచెందు: సం. స. క్రి. మృతిచెందు.

కాల్నడలగు : దే. స. క్రి. కాళ్ళతో నడుచుటకు వీలగు. –కాల్నడ లయి యోటులింకె. జాహ్నవి. 2 ఆ

కాలనీటతీయు : దే. స. క్రి. పసుపునీళ్లు మొ॥ వానితో దృష్టితీయు. (అన్నదానం వెంకటాంబ రామాయణ యక్ష. గా॥)

కాలముగడుచు : దే. అ. క్రి. కాలము తరలు.

కాలముచేయు : దే. అ. క్రి. మరణించు.

కాలముత్రోయు : దే. అ. క్రి. కాలము వెళ్ళబుచ్చు.

కాలముమించు : దే. అ. క్రి. కాలము గడచు.

కాలయాపనచేయు: దే. అ. క్రి. కాలము వ్యర్థముచేయు.

కాలవేయు : దే. స. క్రి. 1. అగ్గిలో వేఁగు.
2. కాల్చు.

కాలహరణమగు: దే. అ. క్రి. కాలము జరిగిపోవు, వ్యర్థమగు

కాలాఁగు : దే. అ. క్రి. 1. కాటూడు.
2. కొంతకాలమాఁగు.

కాలాడు : దే. స. క్రి. నడచు. (వ్యతి.)

కాలాతీతమగు : సం. అ. క్రి. 1. కాలముమించు.
2. ఆలస్యమగు.

కాలానుగుణమగు: సం. అ. క్రి. వేళకు ప్రయుక్తమగు.

కాలానుసరణమగు. సం. అ. క్రి. కాలము ననుసరించు.

కాలికిబుద్ధిచెప్పు: దే. అ. క్రి. పాఱిపోవు.

కాలిడు : దే అ. క్రి. 1. అడుగుపెట్టు.
2. చొచ్చు.
3. ప్రవేశించు.

కాలు : దే. అ. క్రి. దగ్ధమగు.

కాలుదువ్వు : }
కాలుద్రవ్వు : }
కాల్ద్రివ్వు : } దే. అ. క్రి. 1. సిద్ధపడు.
2. చిక్కకొను.
3. కయ్యమున కుత్సహించు.

కాలుపట్టు : దే. స. క్రి. (వృషభాదులకు) ముష్కమర్దనము చేయు.

కాలుమడుచు : }
కాలుముడుచు: }
కాల్మడుచు : } దే. అ. క్రి. 1. మూత్రము విడుచు.
2. అకారణముగా సిద్ధపడు.

కాలువలుగట్టు : దే. అ. క్రి. ఎడతెగక ప్రసరించు.
–సాయకంబులు కాలువలుగట్టి మైనుఱువులు ఉ. హ. 1 ఆ.

కాలుకొను(రూ)కాల్కొను: దే. అ. క్రి. 1. కాలుమోపు.
2. నడచు.
3. వ్యాపించు.
4. నిలుచు. ప. పీ.

కాలుకొల్పు-కాలుచు: }
కాల్చు : } దే. స. క్రి. 1. నడపించు.
2. విజృంభింపజేయు.

కాలుసాచు: }
కాలాను : } దే. అ. క్రి. 1. ప్రయాణమగు.
2. ప్రయత్నించు,

కాలూఁదు : } దే. అ. క్రి. 1. ఆశ్రయము లభించు.
కాలూను : }
2. కాలు నిలువద్రొక్కుకొను.
3. కాలుమోపు.
4. స్థిరపడు.
5. ప్రవేశించు.
6. కయ్యమున హెచ్చరించునట్లు ప్రవర్తించు.
7. కయ్యమునకు సిద్ధమగు.

కాల్గొను : దే. అ. క్రి. బయలుదేరు.

కాలుదన్ను : } దే. అ. క్రి. 1. నిలుచు.
కాల్దన్ను : }
2. నిలకడగు. భాగ. 3 స్కం.

కాలుద్రొక్కు : దే.స. క్రి. 1. పెండ్లియాడు.
2. వెంబడించు.
అ. క్రి. 1. స్థిరపడు.
2. కదియు.
3. కూర్చున్న చోట భద్రముగానుండుటకు కాలిని గట్టిగా మఱొకదాని కానించిపెట్టు.

కాల్ద్రొక్కు : దే. స. క్రి. 1. వివాహమాడు.
2. వెంబడించు.
3. అభిముఖునగు.

కాల్పట్టు : దే. స. క్రి. నమస్కారముచేయు. పండి.

కాల్పడు : దే. అ. క్రి. 1. కాలుపడు.
2. చిక్కుకొను.

కాల్పువడు : దే. అ. క్రి కాలు.

కాళ్ళకడ్డముపడు: దే. స. క్రి. పసిపిల్లలు తలిదండ్రులు పనిచేయునపుడు అవరోధము కల్గించు.

కాళ్ళపడు : దే. స. క్రి. 1. అడ్డముతగులు.
2. నిర్బంధించు.
కాళ్ళావేళ్ళఁబడు: దే. స. క్రి. మిక్కిలి బతిమాలు.
కాళ్ళుబాఱచాపు : దే. అ. క్రి. పనిచేయలేని స్థితికివచ్చు.
(గ్రా) కాళ్లారజాపు
కాళ్లెత్తిత్తివేయు: దే. అ. క్రి. 1. క్రొత్తగా ఆచారమును మొదలు పెట్టినవారు అతిగాపోవు.
2. అతికోపమును ప్రదర్శించు.
కావగు : } దే. అ. క్రి. ఎఱ్ఱనగు.
కామియగు : }
కావచ్చు : దే. అ. క్రి. 1. పూర్తికాబోవు.
2. సంభవమై యుండనగు.
కావడించు : దే. స. క్రి. కావడిగా కట్టు.
కావను : దే. స. క్రి. రక్షింపవేడు.
కావరించు : దే. అ. క్రి. 1. గర్వించు.
2. పొగరెక్కు.
కావలచు : దే. అ. క్రి. కావలయు.
కావలిపెట్టు : దే. స. క్రి. రక్షణచేయు. యయా. 4 ఆ.
కావలియగు : దే. అ. క్రి. రక్షకుడగు. భార. భీష్మ. 1 ఆ.
కావలయు : దే. అ. క్రి. 1. అవసరమగు.
2. సంభవమై యుండనగు.
కావలియుండు : దే. స. క్రి. రక్షకత్వము వహించు. మై. 2 ఆ.
కావలియొసగు : దే. స. క్రి. రక్షణనిచ్చు.
కావలుడగు : దే. అ. క్రి. 1. దుష్టుడగు.
2. చెడిపోవు. భార. విరా. 2 ఆ.
కావలులుపెట్టు : దే. స. క్రి. రక్షకులుగానుంచు
కావాతిరుగు : హిం. అ. క్రి. గుఱ్ఱములు మండలాకారముగ తిరుగు

కావించు : దే. స. క్రి. చేయు.
కావిగొను : దే. అ. క్రి. ఎఱ్ఱనగు.
కావిరికప్పు : దే. స. క్రి. నల్లనగు. భార. ఆర. 1 ఆ.
కావిరికవియు : దే. స. క్రి. నల్లదనమునిండు. విష్ణుపు.
కావిరికురియు : దే. స. క్రి. నల్లదనమగు. సమీర. 2 ఆ.
కావిరిపర్వు : దే. అ. క్రి. నలుపగు.
కావిరివిరియు : దే. అ. క్రి. నల్లదనము వ్యాపించు. ద్వి. పరమ. 2 ఆ.
కావిలించుకొను : దే. స. క్రి. కౌఁగిలించుకొను.
కావుడించు : దే. స. క్రి. మామిడిపండ్లు మొ॥వి కావునుండితీయు
కావుదిగు : దే. అ. క్రి. కడుపుబ్బు.
కావుననేడ్చు : దే. అ. క్రి. ఎలుగెత్తియేడ్చు. నేం. పంచ. 4 ఆ.
కావునించు : దే. స. క్రి. బొట్టుపెట్టు.
కావుపట్టు : దే. స. క్రి. మిక్కిలి బాధించు.
కావుపెట్టు : దే. స. క్రి. పక్వముచేయు.
కావురనియేడ్చు : దే. స. క్రి. రోదనముచేయు. హరి. పూ. 5 ఆ.
కావువచ్చు : దే. అ. క్రి. 1. కావువేయుటచే పండు.
2. ముగ్గు.
3. పండునకు రావలసిన రంగువచ్చు.
కావువేయు : దే. స. క్రి. ముదురు కాయలపై గడ్డి మొ॥ కప్పి ముగ్గఁబెట్టు.
కావ్యముచెప్పు : దే. అ. క్రి. కృతిరచించు. భీమ. 1 ఆ.
కావ్యమొనరించు: సం. అ. క్రి. ప్రబంధముచేయు. రుక్మాం. 1 ఆ.
కాశ్మీరుఁడగు : సం. అ. క్రి. కుసుంభరాగము గలవాఁడగు. కు. సం. 7 ఆ.
కాషాయమగు : సం. అ. క్రి. ఎఱ్ఱనగు. ఆం. భా. 1 ఆ
కాసరకూసరచేయు: దే. స. క్రి. చెల్లాచెదరుగాచేయు.

కాసించు : దే. స. క్రి. కాసెగా ధరించు.

కాసుకుఁగొను : దే. స. క్రి. లక్ష్యముచేయు, ద్వి. హరిశ్చ. పూ.
[వ్యతిరేకమందు ప్రయోగము హెచ్చు.]

కాసుచేయు . దే. అ. క్రి. [వ్యతి] గ్రుడ్డిగవ్వచేయదువలె నిరర్థక మగు.
-తల గిల్లితే కాసుచేయదు.
-దమ్మిడీకి అయిదు కాసులులెక్క.

కాసెబిగించు: దే. అ. క్రి. 1. నడుముకట్టు.
2. ఆయత్తపడు.

కాసెలుకట్టు : దే. అ. క్రి. కాసెలు ధరించు.

కాసెల్లడుల్లు : దే. అ. క్రి, డబ్బంతయుపోవు. నిరం. 2 ఆ.

కాసెవోయు : దే. అ. క్రి. వస్త్రమునుగోచివలె వెనుకకుఁదీసి కట్టు.

# కి

కింకటచేయు : దే. స. క్రి. బాధపెట్టు.

"కోకిలము కొమ్మల తియ్యని మావి
మోవి మో, హానరుచిఁ బాసి వందు
పథికావళి కింకటచేసె నయ్యోడన్"

కింకపట్టు : దే. అ. క్రి. 1. కసిపట్టు.

కింకపెట్టు : దే. అ. క్రి. మారాముచేయు.

2. పగంబట్టు.

కింకిరిచేయు : దే. అ. క్రి. విఘ్నించు.

కింకిరిపడు : దే. అ. క్రి. 1. సంకోచించు.

2. కోపించు.

3. రోతపడు.

4. అసూయపడు.

కింకిరివోవు : దే. అ. క్రి. మాలిన్యముపోవు.

కింగాణముసేయు; దే. స. క్రి. పరిహాసముసేయు.

కించపఱుచు : దే. స. క్రి. 1. న్యూనపఱచు.

2. చులకనసేయు.

3. తక్కువసేయు.

4. అసడ్డచేయు.

కిందగు :
కిందవు : } దే. అ. క్రి. 1. ఓడు.

2. తగ్గు.

కిందుపెట్టు : దే. స. క్రి. భూశయనము చేయించు.

కింకురించు : దే. స. క్రి. 1. మోసగించు.

2. పోగొట్టు.

3. ఓడించు.

4. ఎలయించితీరుగు.

కిచురుపొడుచు : దే. స. క్రి. త్రోయు.

కిచురువెట్టు :
కిచ్చురువెట్టు : } దే. స. క్రి. 1. మోసగించు.
2. త్రోసిపుచ్చు.

కిచురువొడుచు : దే. స. క్రి. 1. మోసగించు.
2. త్రోయు.

కిక్కరించు :
కిక్కరించుకొను: } దే. అ. క్రి. దట్టమగు. రా. సీ.

కిచ్చరించు : దే. స. క్రి. కిచురించు.

కిచ్చురుమను : దే. అ. క్రి. ధ్వనిచేయు.

కిచకొట్టు :
కిచకిచలాడు: } దే. అ. క్రి. 1. చక్కలిగింత కలుగు.
2. పక్షులు, కోతులు మొ॥ వానివలె ధ్వనిచేయు.
3. పింపిళ్ళుకూయు.

కిచ్చాటుగానుండు: దే. అ. క్రి. 1. కొంచెము బాధగానుండు.
కాళింగ. వా.
2. ఒత్తిడిగానుండు.

కిటకిటమను :
కిటకిటలాడు: } దే. అ. క్రి. జనసమర్దము ఎక్కువగు.
(ధ్వన్యనుకరణము)

కిటుకగు : దే. అ. క్రి. 1. పగయగు.
2. మఱుగుకల్గు.
3. మోసమగు.
–వాడిందులో నేదియో కిటుకుపెట్టెను.
–తమలో కిటుకై – కిటికై పోరాడిరి.
కాళహస్తి. 4.

కిట్టించు : దే. స. క్రి. 1. (కిట్టు ధా. ప్రే.) కిటుకుపెట్టు, తాకునట్లుచేయు.
2. గిట్టించు.

కిట్టు : దే. అ. క్రి. 1. అనుకూలమగు.
2. సమీపించు.
3. నష్టమురాకుండ సరిపోవు.
స. క్రి. 1. తాకు.
2. చంపు.
3. కోపించు.

కిట్టుకొను : దే. అ. క్రి. చేర్చుకొను, తాకికొను.
(కుఱుమూకలు కూడఁ గిట్టుకొని తమలోన్.) దశకు. 6.

కిదుకు : దే. అ. క్రి. మారాముపట్టు.

కినగినపడు : దే. అ. క్రి. మిక్కిలి కోపించు.
"కినగినబడి యించుక మీ
తనయుని విన్నపము వినఁగఁదగదని బాల్యం
బున గదిరిన చాపలమున
మనమునదోఁచినటులాడు మాటలుసుండీ."
నృసింహపురా. 4 ఆ.

కినియు : దే. స. క్రి. 1. కోపించు.
2. సమీపించు.

కినువడు-కిన్వడు: దే. స. క్రి. కోపించు.

కిమ్మను : సం. అ. క్రి. సద్దుచేయు.
(కిమ్మనకుండు = బదులు చెప్పకుండు. సంస్కృతమున "కిం" ఏమి.)

కిరకిరలాడు : దే. అ. క్రి. కిరకిర యని శబ్దముచేయు.

కిరికిరిచేయు :
కిరికిరిపెట్టు: } దే. స. క్రి. 1. గొడవపెంచు.
2. ఇబ్బందిపెట్టు.
3. అడ్డుతగులు.

కిఱవుంచు : దే. స. క్రి. కుదువయుంచు. ఆము. 2. ఆ.

కిఱుకుపొడుచు : దే. అ. క్రి. తిరుగు. భా. ద. స్కం. పూ.

కిఱుపు : దే. స. క్రి. 1. కన్నుకొట్టు.
2. కనుసైగచేయు.

కిఱ్ఱువెట్టు :
కిఱ్ఱెక్కించు : } దే. అ. క్రి. ఒకపనియందు దుష్టబుద్ధితో పితలాటము పెట్టు

కిఱ్ఱుసాగు : దే. అ. క్రి. శుభకార్యము జరుగు.

కిలకిలనవ్వు :
కిలకిలమను :
కిలకిలలాడు :
కిలకొట్టు : } దే. అ. క్రి. కిలకిల ధ్వనిచేయు. (సంతోషమున)

కిలారించు:
కిలార్చు :
కిలారుచు : } దే. అ. క్రి. 1. బొబ్బరించు. (కోతులు మొ॥నవి)
2. సింహనాదముచేయు.
3. కష్టమునొందు.

కిలించు : దే. స. క్రి. కీలించు.

కివ్వు : దే. అ. క్రి. మడియు.

కిసరగు : దే. అ. క్రి. పసిపిల్లలకు జలుబువంటి ఒకానొక జబ్బుచేయు. "పిల్లకు కిసరైనది." గ్రా.

కిసరుపడు : దే. అ. క్రి. అసూయపడు. రా. సీ.

కిసలయించు : సం. అ. క్రి. చిగుర్చు.

కిసించు : వై. అ. క్రి. కృషిచేయు.

కీచంటపడు : దే. అ. క్రి. తల్లి చనుబాల కెడపడి చిక్కిపోవు. (గంగా పార్వతీ సంవాదము)

కీచల్లాడు : దే. అ. క్రి. (కీచు+ఆటలు+ఆడు) కలహించు.

కీచుమను : దే. అ. క్రి. కోతులు మొదలగునవి ధ్వనిచేయు.

కీచులాడు : దే. అ. క్రి. 1. దెబ్బలాడు, వాదులాడు.
2. ప్రతిచిన్నపనికి తగాదాపడు.

కీటడగించు : } దే. స. క్రి. మదమణంచు.
కీటడఁగు : }

కీటువేయు : దే. స. క్రి. 1. గోడలుకట్టునపుడుకీటులతోపెంచు.
2. తెగతిండి తిను.

కీడాడు : దే. స. క్రి. నిందించు.

కీడుపడు: } దే. అ. క్రి. 1. కష్టపడు.
కీడ్పడు : } 2. తక్కువయగు.
3. శిథిలమగు.

కీడుపఱచు : దే. అ. క్రి. డయ్యు.

కీడుబాపు : దే. స. క్రి. దుష్టనక్షత్రమున రజస్వలయైన కన్యను పతి సమాగమమునకు ముందు వేఱొకనితో (సాధారణముగ నొక విప్రవటువుతో) గలుపు. (కళింగ ప్రాంతము లోఁ గొన్ని కులములలో నిదియొక యాచారము.)

కీడువఱచు . } దే. స. క్రి. కీడుపడు ప్రే.
కీడువెట్టు : }

కీడ్వడు :
కీడ్పడు : } దే. అ. క్రి. 1. అజ్ఞాతముగనుండు.
2. క్రుంగిపోవు.
3. దైన్యపడు.
4. ఓడిపోవు.
5. లోఁబడు.
6. చెడు.

కీడ్పరించు :
కీడ్పఱచు :
కీడ్వఱచు : } దే. స. క్రి. కీడ్పడఁజేయు.

కీడ్వొట్టు : దే. స. క్రి. కీడు కలుగఁజేయు.

కీనువగొట్టు : దే. స. క్రి. శంకించు.

"ఇంతవట్టు వాద మీఁ కాకి యొక్కటి
యొక్కరాతి రిచట నున్న మాత్రఁ
గీడుసేరు ననుచుఁ గీనువ గొట్టుట
యిద్ది వెఱవుగాక యెఱుకయగునె."
కే. చ. 3 ఆ.

కీయు : దే. స. క్రి. 1. చీరు.
2. చెక్కు.
"కీసిన వెదురు సలాకల
నేసిన యిరుదల శిఖండి నిశితుంచముఁనం
దోసరిలి." క్రీడా. రా.

కీర్తనకెక్కు : సం. అ. క్రి. 1. పొగడ్తకెక్కు
2. స్తుతిపాత్రమగు. దశ.

కీర్తనసేయు : సం. స. క్రి. కీర్తించు.

కీరించు : దే. అ. క్రి. కీలించు.

కీర్తించు : సం. స. క్రి. స్తుతించు.

కీర్తినందు : సం. అ. క్రి. కీర్తిగలవాఁడగు.

కీర్తిశేషుఁడగు : సం. అ. క్రి. మరణించు.
కీర్తిసేయు : సం. స. క్రి. కీర్తించు. పండి. పురా.
కీర్తించు : దే. స. క్రి. 1. తగులు్చ.
2. పట్టుకొను.
3. కదియించు.
4. నాటించు.
కీలు : దే. అ. క్రి. స్రవించు.
కీలుకొను : దే. అ. క్రి. 1. అంటుకొను,
2. నాటుకొను.
3. అదురు.
కీలుకొలుపు : దే. స. క్రి. కీలుకొను ప్రే.
కీలుచు : దే. స. క్రి. ధరించు.
కీలుచూపు : దే. స. క్రి. మర్మము నిర్దేశించు.
కీలుపడు : దే. అ. క్రి. 1. అనుకూలించు.
2. అదుకుపెట్టు.
కీలుపఱచు : దే. స. క్రి. అనుకూలపఱచు.
కీల్పు : దే. స. క్రి. ధరింపజేయు.
కీలుమలఁగు : దే. అ. క్రి. వెన్కకుఁదిరుగు.
కీలెఱుఁగు : దే. అ. క్రి. మర్మమెఱుఁగు.
కీలెఱిఁగివాతపెట్టు: దే. స. క్రి. తగినశిక్షచేయు.
కీలొ్కను : దే. అ. క్రి. 1. అదుకుకొను.
2. ముడిపడు.
కీలొ్కలుపు : } దే. స. క్రి. 1. నిలుపు.
కీలొ్కల్పు : } 2. ధరించు.
3. ఘటించు.
కీల్చు : దే. స. క్రి. కీలుచు.

# కు

కుంగు : }
క్రుంగు: } దే. అ. క్రి. 1. వంగు.
2. తగ్గు,

కుంచు : దే. స. క్రి. 1. క్రుంచు. క్రుంగు. ధా. ప్రే.
2. క్రుంగఁజేయు.
3. కొంచెపఱచు.
4. తగ్గించు.

కుంచెడు మానెఁడగు: దే. అ. క్రి. రెట్టింపగు. (తెలం.)

కుంటగించు : దే. అ. క్రి. 1. ఆగు.
2. నిలుచు.

కుంటు : దే. అ. క్రి. 1. పాదవికలతచే నేలమోపియానక నడచు.
2. నశించు.

కుంటుగించు : దే. అ. క్రి. 1. కుంటువడు.
2. వ్యవహారము అడ్డుపడు.

కుంటుచూపు : దే. అ. క్రి. 1. గమనమందు మాంద్యము చూపు.
2. విఘాతమునొందు.
3. త్వరగా సాగకపోవు. ధార.
4. నొక్కులువడు.

కుంటుపట్టు : దే. అ. క్రి. వాసనపట్టు.
స. క్రి. జుల్మానా వేయు. రా. సీ.

కుంటుపఱచు : దే. స. క్రి. కుంటుపడు ప్రే.

కుంటువాఱు : దే. అ. క్రి. కుంటుపడు.

కుంటెననడచు : దే. అ. క్రి. స్త్రీ పురుషుల నడుమ దౌత్యము నడచు.

కుంటెనపంపు : దే. స. క్రి. కుంటెనగాఁ బంపు.

కుంటెనపోవు : దే. అ. క్రి. కుంటెననడుపు.

కుండగడుగు : దే. అ. క్రి. 1. పూర్తిగ శోధించు.
2. పూర్తిగ వ్యయముసేయు.

కుండమార్చు : దే. అ. క్రి. 1. ఒకటియిచ్చి మరొకటిమార్చు,
2. పెండ్లికి ఒకపిల్లనిచ్చి యాయింటి నుండి మఱొకపిల్లను తీసికొను.

కుండపగులఁగొట్టు: దే. అ. క్రి. 1. వైశ్వదేవముచేయు.
2. కుండ పగులగొట్టినట్లుమాట్లాడు.
3. అనిష్టమైన సత్యమును చెప్పు.

కుండలలో గుఱ్ఱాలుతోలు: దే. అ. క్రి. పనిలేక యింటిలో ఊని కూర్చుండు.

కుండవేఱగు : దే. అ. క్రి. 1. వేఱుపడు.
2. విభాగపడు.

కుండలించు : సం. స. క్రి. 1. కుండలీకరించు.
2. సున్నచుట్టు,
3. వలయాకారముగ వంచు.

కుండుగట్టు : దే. అ. క్రి. గుండ్రముగా గుంటకట్టు.

కుందించు : దే. స. క్రి. కుందు ప్రే.

కుందిల్లు :
కుందుపడు :
కుందువడు : } దే. అ. క్రి. దుఃఖపడు.
స్వా. కుందుకొను.

కుందు : దే. అ. క్రి. 1. కుందు.
2. క్రుంగు.
3. బాధపడు.
4. దుఃఖించు.

కుంపటెత్తుకొను: దే. అ. క్రి. ఇబ్బంది తెచ్చుకొను.

కుంపించు : దే. స. క్రి. బాధించు.
కుంభవర్షములగు: సం. అ. క్రి. అధికవర్షములగు.
కుంభించు : సం. స. క్రి. 1. బిగఁబట్టు.
2. పూరించు.
3. ప్రాణాయామమునందు కుంభక క్రియను జేయు.
కుక్కిపడు : } దే. అ. క్రి. మంచము కుక్కిపడు,
కుక్కివడు : } (మిక్కిలి వదులగు.)
కుక్కు : దే. స. క్రి. 1. బలవంతముగా దూర్చు.
2. పేలుచంపు.
కుచ్చికుచ్చియడుగు: దే. స. క్రి. 1. తఱచి తఱచి యడుగు.
2. రహస్యమురాఁబట్టుటకై శోధించు
కుచ్చెతీయు : దే. స. క్రి. పిడకలు మొ॥ ఒక వరుసలో పేర్చు.
కుచ్చెపెట్టు : దే. స. క్రి. కుచ్చెతీయు. పిడకలు మొ॥ వానిపైదేనింటెని ఒక వరుసగా పేర్చు.
కుచ్ఛించు : దే. స. క్రి. 1. తగ్గించు.
అ. క్రి. 2. సరిపోలు.
"కోకనదద్యుతిఁ గుచ్ఛించు కనుచూపు
గములకు విస్ఫులింగములఁ బోల."
వి. పు. 1 ఆ.
కుటిలపడు : సం. అ. క్రి. చెడు.
కుటిలపఱచు : సం. స. క్రి. నశింపఁజేయు.
కుట్టిచూచు : దే. స. క్రి. చీల్చిచూచు.
కుట్టు : దే. స. క్రి. 1. వి స్తరి మొ॥ వానిని కుట్టు.
2. తేలు కాటువేయు.
3. గ్రుచ్చు.
కుట్టుపోయు : దే. స. క్రి. కుట్టు.

కుట్రసేయు : దే. అ. క్రి. ద్రోహబుద్ధితో రహస్యముగ మాయలు పన్ను.
కుడిచికూర్చుండు: దే. అ. క్రి. నిర్వ్యాపారముగ నుండు.
కుడుకిలు : దే. అ. క్రి. ముడుచుకొను.
"కుఱుచలై మూపులఁ గుడికిలియున్న యఱుతకు నే నిత్తు నర్ఘహారంబు."
కుడుచు : దే. అ. క్రి. రూ. కుడ్చు.
1. భుజించు.
2. త్రావు.
3. అనుభవించు.
కుడుపు : దే. స. క్రి. 1. తినిపింపఁజేయు.
2. అనుభవింపఁజేయు.
కుడువఁబెట్టు : దే. స. క్రి. 1. తిన్పించు.
2. విందుసేయు.
కుడువనిచ్చు : దే. స. క్రి. తిననిచ్చు.
కుడువవచ్చు : దే. అ. క్రి. భోజనమునకు వచ్చు.
కుడ్చు : దే. అ. క్రి. తిను.
కుడ్పు : దే. స. క్రి. తినిపించు.
కుతకుతలాడు : దే. అ. క్రి. 1. అన్నాదు లుడుకు.
2. ధ్వనిచేయు.
కుతికినపడు : దే. స. క్రి. అడ్డగించు (గొంతునపడు) సంకటమగు
కుతికిలపడు : దే. అ. క్రి. కూలఁబడు.
కుతికిలు : దే. అ. క్రి. కూలఁబడు.
కుతిదీరు : దే అ. క్రి. 1. దాహముతీరు.
2. తృప్తియగు.
కుతిలకుడుచు :
కుతిలగొను : } దే. అ. క్రి. దుఃఖపడు.
కుతిలపడు :

కుతిలపఱచు : }
కుతిలపెట్టు : } దే. స. క్రి. కుతిలపడు ప్రే.
కుతిలవెట్టు : }

కుత్తుకబంటి మెసవు: దే. స. క్రి. నిండుగా భుజించు.

కుత్తుకబంటివచ్చు: దే. అ. క్రి. 1. అధికకోపమువచ్చు.
2. కంఠదఘ్నమగు.

కుత్సించు : దే. స. క్రి. 1. ఏవగించు
2 నిందించు.
3. రోతపడు.

కుదపగట్టు : దే. అ. క్రి. కండ్లలో కాయగాయు.

కుదపచేయు : దే. స. క్రి. రొంపి దుక్కిచేయు, దమ్ముచేయు

కుదలు : దే. అ. క్రి. చరించు.

కుద్దాలించు : }
కుద్దలించు : } దే. స. క్రి. భూమిని త్రవ్వు.

కుందించు : దే. స. క్రి. 1. దట్టమగునట్లుచేయు.
2. క్లృప్తీకరించు.
3. తగ్గించు.

కుదించు : దే. స. క్రి. 1. తగ్గించు.
2. సర్దుకొనునట్లుచేయు.
"బస్తాలలో ధాన్యము కుదించు."

కుదికిలఁబడు : దే. అ. క్రి. 1. జారిపడు,
3. కుతికిలపడు.

కుదికిలు : దే. అ. క్రి. 1. జారు.
2. కూలు.

కుదియు : దే. అ. క్రి. 1. తగ్గు. ప్రే. కుదియించు.
తగ్గించు, కుదించు.

కుదియఁబడు :
కుదియవడు : } దే. అ. క్రి. తగ్గు.

కుదియఁబెట్టు :
కుదియఁబట్టు : } దే. స. క్రి. 1. తగ్గించు.
2. తగ్గునట్లు చేయు.

కుదిలపఱచు :
కుదిలించు : } దే. స. క్రి. 1. తగ్గించు.
2. బాగుగ కదలించు.

కుదుచు : దే. స. క్రి. 1. కుదిలించు.
2. సడలింపునకై కదలించు.

కుదుచుకొను :
కుదుటవేయు : } దే. అ. క్రి. కదలు.

కుదుటపడు : దే. అ. క్రి. 1. స్వస్థతపొందు.
2. నిశ్చింతనొందు.
3. కుదురుకొను.

కుదుపు : దే. స. క్రి. కదలుచు.

కుదురు : దే. అ. క్రి. 1. నెలకొను.
2. రోగము నయమగు.
3. సంభవించు.
4. లెస్సగా సరిపోవు.
5. ఉద్యోగమున జేరు.
ప్రే. కుదురుచు

కుదురుకొను : దే. అ. క్రి. 1. నిలుకడ కలుగు.
2. కదురు, జరుగు.
3. లభించు.
4. స్వస్థమగు.

కుదురుకొలుపు : దే. స. క్రి. (కుదురుపడు ప్రే.) కుదురుపఱచు,
కుదురులెత్తు.

కుదురుకొండు : దే. అ. క్రి 1. వ్యాపించవలసిన చోటంతయు వ్యాపించు.
2. పంచారించు.

కుదురుపడు : ద్వ. అ. క్రి. 1. నెలకొను.
2. స్థిరపడు.
రూ. కుదుర్పడు.
ప్రే. కుదురుపఱచు.

కుదురువెట్టు : దే. స. క్రి. 1. గింజలు చిట్లకుండ కుందెనపెట్టు.
2. రక్షణపెట్టు.

కుదురు సేయు: }
కుదురొందు : } దే. స. క్రి. (కుదుర్చు(ప్రే.)కుదుర్పడు, కుదుర్పఱచు.
కుదురుపెట్టు : } ప్రే. కుదురంజేయు= చెట్లకు బాదు సేయు.
గుండ్రని పాత్రలుంచుటకు క్రింద అడుగు ఏర్పఱచు.

కుదులు: దే. అ. క్రి. కదలు, కుదులుచు. కుదులుకొను (స్వా.)

కుద్పలించు : దే. స. క్రి. త్రవ్వు.

కునికిలవ్రేయు : దే. స. క్రి. క్రుంగవేయు.

కునుకు : దే. అ. క్రి. 1. నిద్రపోవు.
2. దీపము లారిపోవుస్థితిలో నుండు.
3. అర్ధనిద్రపోవు.

కునుకుపట్టు : దే. అ. క్రి. 1. నిద్ర(పోవు) వచ్చు.
2. వ్యవహారము మందగించు.

కుప్పకోలుగొను: దే. అ. క్రి. ప్రోగునడు.

కుప్పగించు : }
కునిసియాడు: } దే. అ. క్రి. ఊఁగాడు.

కుప్పగూరు : }
కుప్పలుగూరు. } దే. అ. క్రి. ప్రోగువడు.

కుప్పగూలు : దే. అ. క్రి. కుప్పవలెఁ బడిపోవు.

కుప్పగూల్చు : దే. స. క్రి. (కుప్పగూలు ప్రే.)

కుప్పగొను :
కుప్పగోలుగొను: } దే. అ. క్రి. అతిశయించు.

కుప్పటమెగయు: దే. అ. క్రి. ఆనందించు.

"అయ్యా ! పట్టపుదేవి వచ్చుచున్నది
అనగానే రాజు కుప్పటమెగసెను."
కు. రా.

కుప్పతించు : దే. అ. క్రి. 1. కురియు.
2. గ్రుడ్లనుఉంచు.
రూ. కుప్పళించు. కప్పటించు.

కుప్పతిలు :
కుప్పతిలంబడు: } దే. అ. క్రి. కుప్పదిల్లు,
బోర్లబొక్కలుగాపడు.

కుప్పసగూరు : దే. అ. క్రి. గుంపుగూడు.

కుప్పనూర్చు :
కుప్పలుగొట్టు: } దే. స. క్రి. ధాన్యాదులను గడ్డినుంచి
వేర్పఱచు.

కుప్పలుగొను:
కుప్పలుకు :
కుప్పపడు : } దే. అ. క్రి. అతిశయించు.

కుప్పవడు :
కుప్పలువడు: } దే. అ. క్రి. ప్రోగుపడు.

కుప్పవేయు : దే. స. క్రి. కోసినపైరు మేటగావేయు.

కుప్పించు : దే. అ. క్రి. 1. ఎగురుటకు ప్రయత్నించు,
2. దూకుటకు యత్నించు.
3. ఎగురు.
4. ఉసితీసికొను.

కుప్పిగంతుగొను: దే. అ. క్రి. చిన్నగంతు వేయు.

కుప్పత్రోయు : దే. అ. క్రి. కుప్పల చెదుగుడిలో కుప్ప ముట్టు కొనుటకై పరుగెత్తు.

కుమారిలు : దే. అ. క్రి. 1. దుఃఖపడు.
2. అసూయపడు.

కుమిలించు : దే. స. క్రి. దుఃఖపెట్టు.

కుముటు : దే. అ. క్రి. కంఠబిలమున వికారమెత్తు.

కుములు : దే. అ. క్రి. 1. దుఃఖపడు.
2. నిప్పుమంట బయటపడకుండ లోపల నే రగులు.

కుమ్మక్కు చేయు: దే. స. క్రి. (నీచార్థమున) ప్రోత్సహించు.

కుమ్మరించు :
క్రుమ్మరించు: } దే. స. క్రి. ఒలికించు.

కుమ్మరిలు :
కుమ్మలించు: } దే. స. క్రి. క్రుమ్మరించు.

కుమ్మరు :
క్రుమ్మరు: } దే. అ. క్రి. సంచరించు.

కుమ్ము : దే. స. క్రి. 1. గొడ్లు క్రుమ్ము.
2. వడ్లు క్రుమ్ము.

కుమ్ముకాచు : దే. అ. క్రి. కుమ్ములాడు.

కుమ్ముకొను : దే. అ. క్రి. కుమ్ములాడు.

కుమ్ముదుమ్ముగు: దే. అ. క్రి. వినోదపడు.

కుమ్ముపెట్టు : దే. స. క్రి. కుమ్ములోఁబెట్టు.

కుమ్ములాడు :
క్రుమ్ములాడు: } దే. అ. క్రి. పోరాడు.

కుమ్ములోపెట్టు : దే. స. క్రి. వేడి బూడిదలోబెట్టు.

కుమ్ముసేయు : దే. స. క్రి. పాడుచేయు.

కుమ్మెలుపోవు :} దే. అ. క్రి. 1. గంట్లుపడు.
కుమ్మెలువోవు :} 2. అఱవుళ్ళుపడు.

కుయిపోవు ; దే. అ. క్రి. కుయిపెట్టు.

కుయ్యాడు :}
కుయ్యిడు :} దే. స. క్రి. 1. మొఱపెట్టు.
కూయిడు :} 2. పిలుచు.
కుయిపెట్టు:}

కుయ్యాలించు : దే. స. క్రి. మొఱ విను.

కురించు :}
కురియించు:} దే. స. క్రి కురిపించు.

కురియు:} దే. స. క్రి. కురిపించు, సమృద్ధిగా జనింపఁజేయు.
కుర్యు :} అ. క్రి. వర్షించు, వాత్సల్యమును ప్రసాదించు.

కుఱుగొను :} దే. అ. క్రి. త్వరపడు.
కుఱుక్రొను :} కలుపు, కలిపించు.

కుఱుచకావించు : దే. స. క్రి. 1. తగ్గించు.
2. హీనపఱచు.

కుఱుచపడు : దే. అ. క్రి. తగ్గు.

కుఱుచపఱచు : దే. స. క్రి. కుఱచపడఁజేయు.

కుఱుకులుగటు : దే. అ. క్రి. ప్రోవగు.

కుఱుకులుగొను : దే. అ. క్రి. ప్రోవులగు.

కుఱుచయుద్రొక్కు : దే. అ. క్రి. 1. నర్తించు.
2. మిక్కిలి చలించు.

కుఱుచపేయు : దే. స. క్రి. వ్యర్థపుచ్చు.

కుఱ్ఱు : దే. స. క్రి. 1. కూయు.
2. అఱచు.
3. నిందించు.

కుఱ్ఱువడు : దే. అ. క్రి. చిట్టడవి యేర్పడు. (నె. జి.)

కులకులలాడు : దే. అ. క్రి. (పురుగులు) మెదలు.
కులదీపకుఁడగు : సం. అ. క్రి. వంశమును ప్రకాశింపఁజేయు.
కులముచెడు : సం. స. క్రి. జాతిభ్రష్టమగు.
కులముద్ధరించు : సం. అ. క్రి. వంశము నుద్ధరించు,
కులమునిలుపు : మి. అ. క్రి. వంశము నిలఁబెట్టు. భార. ఆది. 5 ఆ.
కులికించు :
కుల్కించు: } దే. స. క్రి. కులుకునట్లుచేయు. ప్రే.
కులిరుగొను : దే. అ. క్రి. చల్లనగు.
కులుకు : దే. స. క్రి. 1. మిళితముసేయు:

"గొజ్జంగి పూనీరు కులికి మేదించిన"
కాశీ. 3 ఆ.

2. పూయు.
3. దట్టముగా లోనికి జొనుపు. కాశీ.
4. వెదజల్లు.
5. ప్రకటించు.
6. పోయు.
7. వేయు.
8. కదలించు.
9. పూయు.
10. రంగరించు.
11. తాకించు.

రూ. కుల్కు.

అ. క్రి. 1. శృంగారముగాఁ గదలు.
2. కదలు.
3. మురియు.
4. ప్రకటమగు.
5. అల్ప సంతోషము పొందు.

కులుకరించు :
కులకరించు : } దే. అ. క్రి. సోనలువాఱు.

కుళ్ళగించు : దే. స. క్రి. 1. భూమిత్రవ్వి పైకిఁదీయు.
2. చాటు వ్యవహారము బయటపెట్టు.
3. పాదులకుఁ బాళెము త్రవ్వుటకై యటు నిటు మట్టిని కదలించు.

కుళ్ళు :
క్రుళ్ళు : } దే. అ. క్రి. 1. చెడిపోవు.
2. కుములు. రూ. కుల్లు.
3. అసూయపడు.

కుళ్ళుకొను :
కుళ్ళికొను : } దే. అ. క్రి. 1. పాడైపోవు.
2. దుఃఖపడు.
3. కపటము నవలంబించు.

కుళ్ళుపోవు : దే. అ. క్రి. అసూయపడు.

కువలుపడు : దే. అ. క్రి. కుప్పకూలు.

కువాళించు : దే. స. క్రి. వశీకరించుకొను.

కుసించు : దే. అ. క్రి. కృశించు.

కుసివించు : దే. అ. క్రి. అతృప్తిచే దుఃఖపడు.

కుసుమంబారు : దే. అ. క్రి. కుసుంభ వర్ణము నాపాదించు.

కుసుమవెట్టు : దే. అ. క్రి. కుసుంభ వర్ణము నాపాదించు.

కుసుమించు : సం. అ. క్రి. పుష్పించు.

కుసురుకొను : దే. స. క్రి. ఉపేక్షనహించు.

కుసులు :
కుసిలించు: } దే. అ. క్రి. 1. అతృప్తిచే ఖేదపడు.
2. మనోవ్యాకులతనొందు. శ.ర.బ్రౌ.

కుస్తరించు : దే. స. క్రి. 1. బుజ్జగించు. 2. లాలించు.

కుళ్ళు :
కుళ్ళుకొను. } దే. అ. క్రి. 1. చెడిపోవు.
2. లోన ఈసున దుఃఖించు.
3. అసూయపడు.

# కూ

కూఁకరించు :
కూఁకలిడు :
కూఁకలు వేయు: దే. స. క్రి. చీవాట్లుపెట్టు
రూ. కేకలు వేయు.

కూఁక వేయు:
కూఁక వెట్టు : దే. స. క్రి. పిలుచు.

కూఁకు : దే. అ. క్రి. రూ. క్రుంకు, అస్తమించు.

కూకుండు :
కూకుడుండు: దే. అ. క్రి. కూర్చుండు. (గ్రామ్యరూపము)

కూకులువత్తులగు: దే. అ. క్రి. మిక్కిలి కలవరమొందు.

కూచికావించు:
కూచి సేయు : దే. స. క్రి. దండెత్తు.
(నై. జి.) మొనవాడిచేయు (రా.సీ.)

కూచీలగు : దే. స. క్రి. యుద్ధమునకు సిద్ధపడుఁడని హెచ్చరిక సేయు.

కూచీ సేయు : దే. స. క్రి. దండెత్తు.

కూటపడు : దే. అ. క్రి. జతగలియు.

కూటఁబడయు : దే. స. క్రి. పొందు. కు. సం. 6 ఆ.

కూటువలుగొను. దే. అ. క్రి. గుమికూడు.

కూడఁదీసికొను : దే. స. క్రి. 1. నలుగురిని వశపఱచుకొను.
2. కాలు చెయ్యి కూడఁదీసికొను.

కూడఁబడు :
కూడఁబాఱు: దే. అ. క్రి. కలయఁబడు.

కూడఁబలుకుకొను: దే. అ. క్రి. కలిసి యాలోచించు.

కూడఁబెట్టు : దే. స. క్రి. 1. కూడఁదీసికొను.
2. కూడఁదెచ్చికొను.
3. నిలువఁజేయు.

కూడఁబెట్టు అ. క్రి. 1. కూడఁబడు.
2. కూడఁబాఱు.

కూడముట్టు : దే. స. క్రి. 1. కూడఁగట్టుకొను.
2. వెనుదవులు.
3. ప్రోగుచేసికొను.
4. తేరికొను.
5. కూడఁదీసికొను.

కూడమెట్టు : దే. అ. క్రి. అనుకూలముగ ప్రాయించు.

కూడికొను : } దే. అ. క్రి. 1. కలసివచ్చు.
కూడు : } 2. సంక్షోభవించు.
కూడుకవచ్చు: } 3. సమర్థమగు.
4. సాధ్యమగు.
5. సంబంధించు.
స. క్రి. చేరు.

కూడిమాడు : దే. అ. క్రి. 1. కలసిమెలసి వర్తించు.
2. కూడివచ్చు.

కూడియుండు : దే. అ. క్రి. కలసియుండు.

కూడివచ్చు : దే. స. క్రి. 1. సంభోగించు.
అ. క్రి. 1. తగు.
2. కలసివచ్చు.

కూఁతపెటు : దే. స. క్రి. వార్తనంపు.

కూఁతలిడు : దే. అ. క్రి. కూయు.

కూత్తాడు : అన్య. దే. అ. క్రి. (కూత్తు+ఆడు)నాట్యము సేయు.
(తంజాపురాన్నదానమహా నాటకము)

కూపీతీయు : అన్య. దే. అ. క్రి. ఆరాతీయు.

కూపెట్టు, కూయిడు: దే. అ. క్రి. 1. మొఱపెట్టు.
2. అఱచు.
స. క్రి. బిగ్గఱగా బిలుచు. స్తుత్యాదులు బిగ్గరగా చేయు.

కూయిపోవు : దే. అ. క్రి. వార్తవెంట వెళ్ళు.

కూయు : దే. అ. క్రి. 1. అఱచు.
2. ఆక్రోశించు.
3. మాటాడు. (నిందార్థములో)
4. తిట్టు.
5. పిలుచు.

కూరాపసేయు : దే. స. క్రి. చంపు. సారంగ. 1 ఆ.

కూరు : దే. అ. క్రి. 1. కలుగు.
2. మునుగు.
3. క్రుంగు.
4. నిద్రించు.
అ. క్రి. 1. పొందు. (కుక్కు)
2. మూతి సన్నమైన పాత్రల పిండి నింపు.
3. అన్నము బాగుగ ఎక్కించు. (నిందార్థమున)
4. దొచ్చు.

కూరుకిడు: } కూరుకు : } కూర్కు : } దే. అ. క్రి. నిద్రించు.

కూరుకొను : దే. అ. క్రి. 1. కలుగు.
2. దిగఁబడు.
స. క్రి. క్రుక్కు.

కూరుచు: } దే. స. క్రి. 1. సంఘటించు.
కూర్పు : }
2. మైత్రిచేఁ గలుపు.
3. అంటించు.
4. (వింట) సంధించు.
5. అలంకారముగా పెట్టు.
6. నిలువచేయు.
7. ఒడఁగూర్చు.
8. రచించు.
9. (వస్త్రాదులు) కట్టు.

అ. క్రి. 1. ఇష్టుఁడగు.
2. ప్రియపడు.
3. కూడికగావించు.

కూర్చించు : దే. స. క్రి. (కూర్చు ధా. ప్రే.) ప్రేమించునట్లు చేయు. కు. సం. 6 ఆ.

కూర్చుండఁబడు: } దే. అ. క్రి. 1. ఆసీనుఁడగు.
కూరుచుండు . }
కూర్చుండు : } 2. ఒకచో నిల్కడగనుండు.

కూరుచుకొను : దే. స. క్రి. తన పక్షమువానినిగాని, డబ్బునుగాని సామగ్రినిగాని సేకరించు.

కూరిఁగడు : దే. అ. క్రి. నిద్రించు.

కూరుఁగ : దే. అ. క్రి. నిద్రించు.
రోగముతో తీసికొను. (తెలం)

కూరొఁగను, కూర్చు: దే. స. క్రి. గ్రుచ్చుకొను.

కూర్పనపడు : దే. అ. క్రి. గుమిగూడు.

కూర్పించు : దే. స. క్రి. సంధానపెట్టు.

కూలఁబడు : దే. అ. క్రి. నిస్సహాయుఁడై కూర్చుండు.

కూలార్చు : దే. స. క్రి. 1. కూల్చు.
2. చంపు.
3. ఎట్లో అసంతృప్తిగ పూర్తిచేయు.

కూలించు : దే. స. క్రి. 1. కూల్చు.
2. దుల్చు.
3. రాల్చు.

కూలు : దే. అ. క్రి. 1. చచ్చు.
2. పడిపోవు.
3. అధోగతినొందు.

కూలుచు :
కూల్చు : దే. స. క్రి. చంపు, పడగొట్టు, అధోగతి నొందించు.

కూసియగు : దే. అ. క్రి. 1. కూలబడు.
2. వాడియగు. (కూచియగు.) నె. జి.

# కృ

కృత్తముచేయు : సం. స. క్రి. ఛేదించు.
కృతకృత్యుఁడగు: సం. స. క్రి. కార్యము నెఱవేర్చినవాఁడగు.
కృతపడు :
కృతపఱచు: } సం. స. క్రి. 1. కడచు.
2. గతించు. సాం॰యో॰. 1 ఆ.
3. మరణించు, వేఱగు.
కృతలక్షణుఁడగు: సం. అ. క్రి. గుణములచేఁ బ్రసిద్ధుఁడగు.
విజ. వి. 1 ఆ.
కృపగోరు : సం. స. క్రి. దయనర్థించు. దశ. 9 ఆ.
కృపచూపు:
కృపచేయు: } సం. స. క్రి. 1. అనుగ్రహించు.
2. దయతోనిచ్చు. ఆము. 5 ఆ.
కృపఁజూచు : సం. స. క్రి. దయతోఁజూచు.
కృపఁదలఁచు : సం. స. క్రి. దయతలఁచు. నైష. 2 ఆ.
కృపఁబ్రోచు : సం. స. క్రి. దయతోరక్షించు.
కృపయుట్టిపడు: సం. అ. క్రి. కృపగలుగు.
కృపావనుఁడగు: సం. అ. క్రి. దయగలవాఁడగు.
కృపాసమేతుఁడగు: సం. స. క్రి. దయగలవాఁడగు. దశ. 3 ఆ.
కృశించు :
కృశియించు: } సం. అ. క్రి. 1. చిక్కు.
2. సన్నగిల్లు. ఉ. రా. 1 ఆ.
3. క్షీణించు. ఉ. రా. 5 ఆ.
కృష్ణార్పణమగు: సం. అ. క్రి. తనదికాకుండఁ బోవు.
కృషిచేయు : సం. అ. క్రి. 1. శ్రమించు.
2. సేద్యముసేయు.

## కౢ

కౢప్తమగు : సం. అ. క్రి. సంగ్రహమగు.

కౢప్తిచేయు : సం. స. క్రి. సంగ్రహించు. భార. ఆది. 8 ఆ.

కౢప్తీకరించు : సం. స. క్రి. సంగ్రహముగ వ్రాయు.

## కె

కెంపాఱు :
కెంపెక్కు:
ంపుగడలు : } దే. అ. క్రి. ఎఱ్ఱనగు.

కరించు :
క్కరించు: } దే. అ. క్రి. పెనఁగులాడు.
(కోళ్ళు) మట్టి నెగఁజిమ్ము.

కు కెక్కుమను :
క్కురు కెక్కురుమను: } దే. స. క్రి. 1. పరిహసించు.
2. పరిహాసముగ కేకలువేయు

డగూడు : దే. స. క్రి. 1. కూడనుండు.
2. రమించు.

డపు : దే. స. క్రి. 1. పడఁగొట్టు.
2. త్రోయు.
3. కూల్చు.
4. పోఁగొట్టు.

ఁబాయు : దే. స. క్రి. విడిచిపెట్టు.

కెడమాలు : దే. అ. క్రి. విడిపడు.

కెడయాడు : దే. అ. క్రి. నడయాడు.

కెడయు : దే. అ. క్రి. 1. పడు.
2 కూలు.

కెరగొట్టు : దే. అ. క్రి. కిలకిల పలుకు. (ఆంధ్రభాషార్ణవము)

కెరటములువైచు: దే. అ. క్రి. ఉత్సాహాతిశయమును వ్యక్తపఱచు.
—ఆ సభ యంతయు భావస్రవంతిగా కెరటములు వైచుచుండెను.

కెరలించు : దే. స. క్రి. 1. కవ్వించు.
2. ఉద్దీపింపఁజేయు.

కెరలిపడు : దే. అ. క్రి. 1. త్రుళ్ళిపడు.
2. ఉప్పొంగు.

కెరలియాడు : దే. అ. క్రి. ఉప్పొంగు.

కెరలు :
కెరలుకొను, కెరలుచు:
కెరలుపొడుచు, కెరలెత్తు:
కెరల్చు, కెర్లు :
కెర్లుకొను :
కెర్లికొను :
దే. అ. క్రి.
1. అతిశయించు.
2. కోపపడు.
3. తత్తరపడు.
4. ఎగురు.
5. తిరుగు. హాం.విం.

కెరలుచు :
కెరలించు :
కెరలఁజేయు:
దే. స. క్రి. 1. ఎగయఁజేయు.
2. వ్యాపింపఁజేయు.
3. ఉత్సాహపెట్టు.
4. తమకింపఁజేయు.
5. కోపింపఁజేయు.

కెరలువొడుచు : దే. అ. క్రి. విజృంభించు.

కెలకరించు : దే. అ. క్రి. కోళ్ళు ముక్కుతో కెదకు.

కెలకు : దే. అ. స. క్రి. కుళ్ళగించు. రూ. గెలకు.

కెలయు : దే. అ. క్రి. 1. ఉత్సహించు.
2. గర్వించు.

కెలసంబు సేయు : దే. అ. క్రి. పనిచేయు.

కెలుకు : దే. స. క్రి. వస్తుస్థితి చెడకుండ నటునిటు తిరుగ వేయు, పొనుగువడియున్న వ్యాపార మును బయటపెట్టు.

కెల్లగించు : దే. స. క్రి. పెళ్ళగించు.

కెల్లు మలఁగు : దే. అ. క్రి. మార్గ్గము పెట్టు.

కెళ్ళించు : దే. స. క్రి. క్రిందిది పైకిఁ జేయు.

కెళ్ళు . దే. స. క్రి. తిను.

కెళ్ళుకొను : దే. స. క్రి. నోటవైచుకొను.

# కే

కేకరించు : దే. అ. క్రి. 1. గొంతు సరిచేసికొను-చప్పుడు ధ్వనిచేయు.
2. కేకలుపెట్టు.
స. క్రి. గద్దించు.

కేకవేయు : దే. స. క్రి. పిలుచు.

కేకించు : సం. అ. క్రి. నెమలికూయు.

కేకిసలాడు : } దే. అ. క్రి. 1. జయోక్తులు పలుకు.
కేకిసలుగొట్టు: } 2. ఉత్సాహము నెఱపు.
3. కేరింతలుకొట్టు.

కేగరించు : దే. స. క్రి. సమీపించు.

కేటాయించు : దే. స. క్రి. 1. ప్రత్యేకించు.
2. వేర్పఱచు.

కేడమాడు : } దే. స. క్రి. కేరడము సేయు
కేడువాఱు : }

కేడించు : దే. అ. క్రి. 1. (యుద్ధమునుండి) తొలఁగు.
2. అపసరిల్లు.
3. అనాదరము సేయు.
స. క్రి. 1. తొలఁగించు
2. సరకుగొనకుండు
3. విజృంభించు
(స్వార్థ) కేడించుకొను

కేడిపడు : దే. అ. క్రి. కేడిగింజపడు, (ధాన్యములో నొకజాతి నిస్సారమైన గింజ కలియు)

కేడు : దే. అ. క్రి. చచ్చు

కేరడములాడు : దే. స. క్రి. పరిహసించు
కేరడించు . దే. స. క్రి. పరిహసించు.
కేరించు : దే. అ. క్రి. నవ్వు.
కేరింతలుకొట్టు : } దే. అ. క్రి. నవ్వు.
కేరింతలాడు :
కేరు : దే. అ. క్రి. 1. తిరస్కరించు.
2. ఉత్సహించు.
3. పరిహసించు.
4. ఉల్లాసముతోఁబలుకు.
5. చెలరేగు.
స. క్రి. 1. ఎగతాళిచేయు.
2. నిందించు.
3. లాఘవపఱచు.
4. కోడి గ్రుడ్డుపెట్టుటకుముందు అఱచు
కేరుకొను: } దే. అ. క్రి. (స్వార్థ) అతిశయించు.
కేరికొను :
కేరుచు: } దే. అ. క్రి. ఉత్సహించు.
కేరు :
కేలుచూపు : దే. స. క్రి. నిర్దేశించు.
కేలుమొగుచు: } దే. స. క్రి. నమస్కరించు.
కేలుమోడ్పు :
కేల్మోడుచు :
కేల్మోడ్చు .
కేలువట్టు : దే. స. క్రి. పెండ్లియాడు.
కేలువిడుచు : దే. స. క్రి. ఆజ్ఞాపించు.
కేలుసాచు : దే. స. క్రి. 1. అడిగికొను.
2. బిచ్చమెత్తు.

కేలొసఁగు : దే. స. క్రి. నమస్కరించు.
అ. క్రి. సహాయపడు.

కేలలుపు : దే. అ. క్రి. చేతులుకలుపు.

కేవడించు : దే. స. క్రి. నశింపఁజేయు.

కేళ్ళదాటు :
కేళ్ళురుకు :
కేళ్ళవారు : దే. అ. క్రి. 1. గంతులువేయు.
2. ఉఱుకు.

## కై

కైకూడు : దే. అ. క్రి. సమకూడు.

కైకొను : దే. స. క్రి. 1. ఆధారముగఁగొను.
2. అంగీకరించు.
3. పొందు.
4. ధరించు.
5. స్వీకరించు.
6. గ్రహించు.
7. పెండ్లియాడు.
8. ఎంచు.
9. ధ్యానించు.
10. పాటించు.
11. సరకుగొను.
12. ఆక్రమించు.
13. పూను.
14. అనుభవించు
15. తిను.
16. పట్టు.
17. అనుసరించు.
అ. క్రి. 1. పూను. 2. కలుగు

కైకూలిగట్టు : దే. అ. క్రి. కూలియిచ్చు.

కైకిలిపోవు : దే. అ. క్రి. కూలిపోవు. (తెలం)

కైకొలుపు :
కయికొలుపు: } దే. స. క్రి. కైకొనఁజేయు

కైచాపు :
కైచెఱయిచ్చు: } దే. స. క్రి. 1. నమస్కరించు.
2. చేయిచాచి యాచించు.
అ. క్రి. తనంతటఁదాను లోఁబడు.

కైజాచేయు : దే. స. క్రి. గుఱ్ఱము నోటికళ్లెమునకుఁ దగుల్చు పగ్గమును బిగించు.

కైజాఱు : దే. అ. క్రి. ఒఱగు. రూ. కయిజాఱు. భాను. 3 ఆ.

కైదండగొను :
కైదండవట్టు : } దే. స. క్రి. చేయూతనొసగు

కైపడు :
కయిపడు: } దే. అ. క్రి. స్వాధీనపడు.

కైపుమిగులు:
కైపెక్కు : } దే. అ. క్రి. మత్తెక్కు.

కైబజారుకట్టు : దే. స. క్రి. అంగడియందు సుంకముకట్టు. (తెలం)

కైమోడుచు :
కైలాగువట్టు: } దే. స. క్రి. 1. చేయూదికొను
2. నమస్కరించు.
అ. క్రి. వ్రాలిపోవు

కైలాగొనఁగు : దే. స. క్రి. చేదండనిచ్చు. క. వ. రా. అయోధ్య.

కైలాటములువెట్టు :
కైలాటములుసేయు: } దే. స. క్రి. జగడములు కల్పించు.

కైవసమగు : దే. అ. క్రి. పూర్తిగ లోఁబడు.

కైవారించు : దే. స. క్రి. పొగడు, కైవారములుసేయు.

కైవీఁగు : దే. అ. క్రి. 1. అలయు.
2. చేయివాల్చు
3. యుద్ధకృత్యములు విరమించు.
కు. సం. 11 ఆ.

కైవెక్కు : దే. అ. క్రి. మత్తిలు. రూ. కైపెక్కు.

కైవ్రాలు : దే. అ. క్రి. 1. చేతినుండిజాఱు.
2. ఒఱగు.
3. పక్షులు మొ॥ క్రిందికి దిగు.
4. పడు.

కైవ్రాలుచు : దే. స. క్రి. కైవ్రాలఁజేయు. రూ. కైవ్రాల్చు.

కైసడలు : దే. అ. క్రి. 1. ఒఱగు.
2. వంగు.
3. చేజారు.

కైసేయు : దే. స. క్రి. అలంకరించు.

# కొ

కొంకరవోవు :
కొంకరలుపోవు: } దే. అ. క్రి. శైత్యాదులచే (వ్రేళ్ళు) వంకరయగు.

కొంకరవంకరలుపోవు: దే. అ. క్రి. కొంకరలుపోవు.

కొంకు : దే. అ. క్రి. 1. సంశయించు.
2. వెనుదీయు.
3. జంకు.
4. సిగ్గుపడు.

కొంకికొను :
కొంకుకొను: } దే. అ. క్రి. కొంకు (స్వార్థ)

కొంకుపడు, కొఁకువడు: దే. అ. క్రి. జంకుపడు.

కొంకు(లు)వోవు: దే. అ. క్రి. కొంకరపోవు.
కొంగునముడివేసికొను: దే. అ. క్రి. అనుజ్ఞలలో పెట్టు.
"ఆమె తన భర్తను కొంగున ముడివేసుకొన్నది"
కొంగుపట్టు : } దే. స. క్రి. స్త్రీని బలవంతముచేయు.
కొంగులాగు: }
కొంగుపఱచు : దే. స. క్రి. 1. సిద్ధనుగు.
2. సంభోగ మిచ్చు.
కొంగుబంగారమగు: దే. అ. క్రి. 1. స్వాధీనమగు.
2. అత్యంతోపయోగకారి యగు.
కొంగుమాయు : దే. అ. క్రి. వెలుపల చేరు.
కొంగుముడివేయు: దే. అ. క్రి. నిశ్చయించు.
స. క్రి. పెండ్లిసేయు.
కొంగుముడుచు : దే. అ. స. క్రి. నిశ్చయించు, పెండ్లిచేయు.
కొంగొంగురను : దే. అ. క్రి. కొంగలు ధ్వనిచేయు.
కొంగొడు : దే. అ. క్రి. కొంగుపఱచు.
కొంగోడు(ప)వడు : దే. అ. క్రి. 1. ఒఱగు. 2. ఒడిగిలు
కొంగోడువోవు : దే. అ. క్రి. ఒరగినకోడు కలదగు
కొంచ(చె)దనముసేయు : దే స. క్రి. తక్కువపఱచు, కే.చ. 4 ఆ.
కొంచించు : దే. అ. క్రి. 1. తగ్గు, 2. సంశయించు
కొంచు : దే. అ. క్రి. 1. సంకోచించు
2. భయపడు.
3. తీసికొను
కొంచెపడు : దే. అ. క్రి. 1. న్యూనమగు.
2. వెలితిపడు.
కొంచెపఱచు : } దే. స. క్రి. 1. అవమానించు
కొంచెముసేయు : } 2. చెఱచు
3. తక్కువచేయు

కొంచెపాటు : దే. అ. క్రి. కొంచెనుగు

కొంజు : దే. అ. క్రి. (వ్యతిరేకార్థములోనే) కొంచు, -కొంజక.

కొండంతసేయు : }
కొండచేయు : } దే. స. క్రి. గొప్పసేయు.
కొండలుచేయు : }

కొండతాను : దే. అ. క్రి. 1. అధికసంతోషమును పొందు.
2 ఉన్నతిని పొందు.

కొండపట్టు : దే. అ. క్రి. కొండలలోనికి పాఱిపోవు

కొండయెక్కు : } దే. అ. క్రి. 1. మిన్నందు,
కొండెక్కు : } 2. దీపమూరు.
3. సంతోషపడు
4. గర్వముచే బిఱ్ఱబిగియు.
5. ఉన్నతస్థితికి వచ్చు.
6. మిఱ్ఱెక్కు.

కొండాడు : దే. స. క్రి. స్తుతించు.

కొండాటమాడు : దే. స. క్రి. 1. జగడమాడు.
2. కోరాడు.
3. దుమ్మురేగఁజేయు.
(ఆంధ్రభాషార్ణవము)

కొండ్రచేయు : దే. అ. క్రి. వ్యవసాయముచేయు

కొండ్రవేయు : దే. స. క్రి. దున్నునపుడు చాలుపులుగా చాళ్ళువెట్టు.

కొండ్రవేలపండు : దే. అ. క్రి. పొలము ఎక్కువగా ఫలించు.

కొందలపడు : దే. అ. క్రి. 1. దుఃఖించు.
2. క్షోభించు.
ప్రే. కొందలపఱచు. కొందలపెట్టు.

కొందలించు :
కొందలమందు: } దే అ. క్రి. కలఁగు.

కొందు : దే. స. క్రి. పొడుచు. ఉ. రా. 7 ఆ.

కొంపగూలు : దే. అ. క్రి. 1. ఇంటివ్యవహారము చెడు.
2. ఇల్లు కూలిపోవు.

కొంపతీయు : దే. స. క్రి. నాశముఁచేయు.

కొంపపోవు : దే. అ. క్రి. నాశనమొందు, ఆపద ఘటిల్లు.

కొంపమునుగు : దే. అ క్రి. నాశమునొందు, ఆపదఘటిల్లు.

కొంపలార్చు : దే. అ. క్రి. నాశముచేయు, జిత్తులమారియగు.

కొంపోవు : దే. స. క్రి. తీసికొనిపోవు.

కొక్కరించు : దే. స. క్రి. వెక్కిరించు
రూ. కొక్కిరించు, కొప్పరించు.

కొటుకులాడు : దే. అ. క్రి. గుండెకొట్టుకొను.

కొట్టవచ్చినట్లుండు:
కొట్టవచ్చుచుండు : } దే. అ. క్రి. 1. విషయము దృగ్గోచరమగు.
2. కంటికి నదరుగా కన్పడు
ఉదా. కనులందు కొట్టవచ్చుచుండెను.

కొట్లాడు : దే. అ. క్రి. 1. జగడమాడు;
2. కదలు
3. బాధపడు.

కొట్టించు :
కొట్టిపోయు : } దే. అ. క్రి. మాటలు, పాటలు, పద్యములు
అధికముగఁ జెప్పు.

కొట్టివేయు : దే. స. క్రి. రద్దుచేయు.

కొట్టు : దే. స. క్రి. 1. దోచుకొను.
(దారులుకొట్టు, దేశములుకొట్టు.)
2. కొట్టిచంపు,
3. వాయించు.
4. కూల్చు.

5. కొయ్యకి వేయు.
6. ఛేదించు.
7. రాల్చు.

అ. క్రి. 1. తగులు.
2. తాకు.
3. ఎక్కువగఁగల్గు

కొట్టుకలాడు : దే. అ. క్రి. బాధలో నుండు.

కొట్టుకాడు : దే. అ. క్రి. 1. చలించు. 2. తన్నుకొను.

కొట్టుకుపాఱదిను ; దే. అ. క్రి. 1. పెట్టెడివారి కిష్టములేక పోయినను ఏదో విధముగఁ బొట్ట నింపుకొను.
2. తృప్తిగా భుజించు.

కొట్టుకొను : దే. అ. క్రి. 1. సంచలించు.
కొట్టుమిట్టాడు:
2. ఆందోళించు
3. శ్రమపడి పనిచేయు
4. బాధపడు.
5. ప్రాణాదులు బహిర్గమించుటకు, లేదా, స్తిమితపడుటకు ముందు కలత నొందు, లేక, సంకటపడు

కొట్టుకొనివచ్చు : దే అ. క్రి. 1. ప్రవాహమునఁ బడి వచ్చు. తేరగాఁ గొనివచ్చు.

కొట్టుపడు(వడు) : దే. అ. క్రి. తాడిత మగు.

కొటుమిట్టాడు : దే. అ. క్రి. అతిశయించు.

కొట్టుమిట్టిపడు : దే. అ. క్రి. త్రుళ్ళిపడు.

కొట్లాడు :}
కొట్టులాడు:} దే. స. క్రి. 1. పోరు.
2. కలహించు.

కొడవటిపూజ్యమగు ; దే. అ. క్రి. పైరుకోయుటకు అవసరము లేకుండ ఫలించకపోవు

కొడికట్టు : దే. అ. క్రి. 1. దీపము కాంతిహీన మగు.
2. వత్తికాలి చివర బొగ్గుగా ఏర్పడు.
3. తిరునాళ్ళలో ధ్వజారోహణము సేయు
(నె. జి)

కొడిమెలాడు : దే. స. క్రి. నిందించు

కొడిమెఱుగట్టు : దే. అ. క్రి. 1. పాపము గట్టికొను.
2. నిందలువైచు.

కొడీవడు : దే. అ. క్రి. 1. చలించు.
2. వడఁకు.

కొఱుగు : దే. అ. క్రి. గొఱుగు

కొడుగురువోవు : } దే. అ. క్రి. కొంకరవోవు.
కొఱుగురువోవు : }

కొఱుజెక్కు : దే. అ. క్రి. బుడ్డపుంజులుపట్టు. (పసువులకు)

కొతుకు : } దే. అ. క్రి. 1. జంకు.
కొతుకుపడు: } 2. తక్కువగు.
3. నీళ్ళునములు.

కొత్తపడు : దే. అ. క్రి. బట్ట మొ॥ చిల్లులుపడు

కొదగొను : దే. అ. క్రి. విశ్వాసము నొందు.

కొదదీరు : దే. అ. క్రి. లోపముపోవు.

కొదరించు : } దే. స. క్రి. 1. కుదించు.
కొదలించు : } 2. తగ్గించు.

కొదరు : దే. అ. క్రి. అతిశయించు.

కొదలు : దే. అ. క్రి. తక్కువగు.

కొదలుపడు, కొదల్పడు : }
కొదలువడు. కొదల్వడు : } దే. అ. క్రి. తక్కువగు.
కొదవడు, కొదవపడు : }

కొదవచేయు : దే. స. క్రి. తక్కువచేయు.

కొదలుపెట్టు : దే. స. క్రి. తక్కువచేయు.

కొదవపఱచు:
కొదవచేయు: దే. స. క్రి. తక్కువచేయు.

కొద్దిపడు : దే. అ. క్రి. కొంచెపడు.

కొద్దిపఱచు : దే. స. క్రి. తక్కువచేయు.

కొద్దిమీఱు : దే. అ. క్రి. సమృద్ధమగు.

కొదుకు : దే. అ. క్రి. భయపడు.

కొదుకుకొను :
కొదుకుడువడు: దే. అ. క్రి. భయపడు.

కొదుగురపోవు : దే. అ. క్రి. ముడిపడు.

కొదువు : దే. అ. క్రి. 1. మ్రింగక నములు.
2. ఊరించు.

కొనకొను : దే. అ. క్రి. 1. స్థిరపడు.
2. మొదలుపెట్టు.

కొనమునిగించు: దే. స. క్రి. పూర్తిగ ముంచు.

కొనమునుగు : దే. అ. క్రి. పూర్తిగ మునుగు.

కొనలకెక్కు :
కొనలిడు : దే. అ. క్రి. వర్ధిల్లు

కొనలునిగుడు:
కొనలొత్తు : దే. అ. క్రి. 1. వర్ధిల్లు
2. అతిశయించు.

కొనలువాఱు
కొనలుసాగు
కొనలెత్తు
కొనలొత్తు
కొనసాగు దే. స. క్రి. 1. వృద్ధిపొందు.
2. వర్ధిల్లు రా. బా. కాం.

కొనసాగించు : దే. స. క్రి. చెల్లించు. నెఱవేర్చు.

కొనసాగు : దే. అ. క్రి. 1. చెల్లు.
2. నెఱవేఱు. భాగ. 1. స్కం

కొనితెచ్చు : దే. స. క్రి. తీసికొనివచ్చు.

కొనిపించు: దే. స. క్రి. కొనఁజేయు.

కొనిపెట్టు : దే. స. క్రి. విలిచి యిచ్చు,

కొంపోవు :
కొంపోవు : } దే. స. క్రి. తీసికొనిపోవు.

కొనియాడు : దే. స. క్రి. 1. ప్రశంసించు
2. గౌరవించు.
3. కొలుచు.

కొనివచ్చు : దే. స. క్రి. 1. తీసికొనివచ్చు.
2. విలిచి తెచ్చు.

కొను: దే. స. క్రి. 1. గ్రహించు.
2. తీసికొనిపోవు.
3. (ధనాదులు) ప్రతిగ్రహించు.
4. లోఁగొను.
5. చేయు.
6. పొందు.
7. లక్ష్యముగాఁజేయు
8. ఆధారముగాఁజేయు.
9. స్వాధీనము చేసికొను.
(ఇది ధాతువులకు స్వార్థమున అనుప్రయుక్తమగును.)
10. పొందు. (పెక్కుచోట్ల విశేష్యముల కనుప్రయుక్తమై ఈ అర్థముతో శబ్దపల్లవక్రియగా నేర్పడుచున్నది.)
ఉదా:- తెవులుగొను. మరులుగొను

11. అనుసరించు.
12. సరకుసేయు.
13. ఆక్రమించు.
14. తాల్చు.
15. పూను.
16. చేరు.
17. ఎంచు.
18. తెచ్చుకొను.
19. తెచ్చిపెట్టుకొను.
20. చేరనిచ్చు
21. నృత్తాదులను ప్రయోగించు.
22. తిను.
23. విలుచు.
24. త్రాగు.
25. నటించు.
26. వ్రేయు.
27. నాటు

అ. క్రి. 1. నెలకొను.
2. ఉండు.
3. చెల్లు.
4. పనికివచ్చు.
5. సాగు.
6. అతిశయించు.
7. వ్యాపించు.
8. ఆగు.
9. ఏర్పడు.

కొనుకొను : దే. అ. క్రి. వెలకుఁ గైకొను.

కొప్పరించు : దే. అ. క్రి. 1. అతిశయించు.
2. వెక్కిరించు.
3. విజృంభించు
4. కోపాదులచే రోమాంచము కలదగు
5. పండ్లిగిలించు.
స. క్రి. 1. నిండుగాపోయు.
2. వెక్కిరించు.
కొప్పించు : దే. అ. క్రి. కొప్పరించు. హంస విం. శుక. 1 ఆ.
కొమరారు :
కొమరొప్పు :
కొమరొందు :
కొమరుమిగులు: } దే. అ. క్రి. అందగించు.
కొమ్మ(మ్ము)లుచూపు: దే.అ.క్రి. 1. కొమ్ములువేయు.
2. పొడువవచ్చు.
3. అలక్ష్యముచూపు. కు.సం.5ఆ.
కొమ్మలుపోవు : దే. అ. క్రి. అతిశయిల్లు. నిర్వ. రా. 8 ఆ.
కొమ్ములువచ్చు: దే. అ. క్రి. ఆధిక్యముపొందు.
-ఆయనకేమి కొమ్ములు వచ్చినవా?
కొయ్యగొట్టు : దే. అ. క్రి. కోసినదంట్లు కాలికిఁగొట్టి గాయమగు.
కొయ్యబారు : దే. అ. క్రి. 1. మొద్దుబారు.
2. చేష్టలుదక్కు.
కొయ్యలుమేపు : దే. స. క్రి. వరికోసిన తర్వాత చిగిరించు వరిని మేపు.
(నాము దినిపించు)
కొరుకు : దే. స. క్రి. దంశించు.
కొఱకాసువెట్టు : దే. స. క్రి. 1. మండించు.
2. వేధించు.
3. ఉద్వేగపఱచు.

కొఱచక్కులాడు: దే. అ. క్రి. చిన్నచిన్న ముక్కలుసేయు.

కొఱఁత నుఱుకు : దే. అ. క్రి. అకార్యము చేయు.

కొఱఁతపడు, కొఱఁతపఱచు:
కొఱఁతవడు, కొఱఁతవఱచు:
కొఱఁతవోవు, కొఱఁతవెట్టు : దే. అ. స. క్రి. తక్కువపడు, తక్కువపఱచు, కొఱఁతనపడు దోషారోపము పొందు.

కొఱఁతపడు :
కొఱవాటునొందు : దే. స. క్రి. 1. కొఱఁతనఁబడు. 2. కొఱఁత వేయఁబడు.

కొఱకొఱలాడు : దే. అ. క్రి. కోపించు.

కొఱడుపాఱు : దే. అ. క్రి. కొయ్యవాఱు.

కొఱడువడు : దే. అ. క్రి. మ్రాన్పడు.

కొఱమాలు : దే. అ. క్రి. పనికిమాలు.

కొఱయు : దే. అ. క్రి. కొలకమాఱు.

కొఱలు : దే. అ. క్రి. 1. వ్యాపించు.
2. ఆనందించు.
3. ప్రవహించు.
4. కోపించు.
5. నశించు.
6. వెలుఁగు.
7. మించు.
8. ఒప్పు.
9. పూర్ణమగు.
స. క్రి. 1. కామించు.
2. అభిలషించు.
3. పొందు.
4. పడయు.
5. కోరు.

కొఱలుకొను : దే. అ. క్రి. శోభించు.

కొఱవిపెట్టు : దే. అ. క్రి. చితికి నిప్పు ముట్టించు.
కొఱవోవు : దే. అ. క్రి. కొలకమాఱు.
కొఱుకు : దే. స. క్రి. 1. కఱచు.
2. దంశనముచేయు.
3. బాధించు.
కొఱువాటునొందు: దే. అ. క్రి. తగ్గిపోవు.
-"పోనంబోవ నుప్పరంబున నెండ వేంద్రంబు తరతరంబు కొఱువాటు నొంది యున్న దని గ్రంథంబుల నక్కాణించి యున్నారు." నీ.యా.
కొఱ్ఱడచు : దే. స. క్రి. అతిగా బాధించు.
కొఱ్ఱపెట్టు : దే. స. క్రి. చితికి నిప్పు ముట్టించు. (వా)
కొఱ్ఱులబెట్టు : దే. స. క్రి. హింసించు.
కొలకొలమాఱు : దే. అ. క్రి. భోజనము సేయునపుడు ద్రవము ముక్కులోనికివచ్చు.
కొలగట్టుకొను : దే. స. క్రి. జోక్యము కలిగించుకొను. పగదీర్చు.
కొలచేయు : దే. స. క్రి. 1. స్త్రీల చెఱచు.
2. హానిచేయు.
3. కొలుచు.
కొలతపెట్టు : దే. స. క్రి. పోల్చిచూచు.
కొలదాకు : దే. అ. క్రి. హానికలుగు.
కొలదిపడు : దే. అ. క్రి. తగ్గిపోవు
కొలదియిడు : దే. స. క్రి. గణించు. (రూ) కొలదివెట్టు.
కొలదులఁబడు : దే. అ. క్రి. పరిమితమగు.
కొలనాడు : దే. అ. క్రి. తీర్థమాడు.
కొలపెట్టు : దే. స. క్రి. కొలుచు

కొలమాఱు : దే. అ. క్రి. కొలకమాఱు.

కొలయీగు : దే. అ. క్రి. పగదీర్చు.

కొలిపించు : } దే. స. క్రి. 1. కొలువఁజేయు. (ధాన్యాదులు)
కొల్పించు : } 2. సేవింపజేయు.

అ. క్రి. నాట్యయోగ్య "తద్ధిత్తాది" శబ్దంబు లుచ్చరించు.

కొలుచు: }
కొల్చు : } దే. స. క్రి. 1. కొలతవేయు. 2. సేవించు.

కొలిపించుకొను : దే. అ. క్రి. సేవింపఁజేసికొను.

కొలుపు : } దే. స. క్రి. 1. ప్రయోగించు. 2. సమ్మతించు.
కొల్పు : } అ. క్రి. జాతరలలోవలె గోలచేయు.

2. ఇష్టమగు.
3. పనికివచ్చు.
4. చెల్లు.
5. నాట్యయోగ్యతద్ధిత్తాదులుచ్చరించు.

కొల్పుపెట్టు : దే. స. క్రి. 1. దేవతలకు నమస్కరించు, సేవించు.

కొల్పులుగొల్చు : దే. అ. క్రి. 1. జాతరలు చేయు.
2. చేసినపనిని గూర్చి మఱిమఱి చెప్పు.

కొలువగు : దే. అ. క్రి. సభచేయు, విడియు.

కొలువిచ్చు : దే. అ. క్రి. 1. దర్శనమిచ్చు.
2. ఓలగించు.

స. క్రి. 1. ధ్యానించు.
2. నమస్కరించు.

కొలువుకుదురు : దే. అ. క్రి. నౌకరిలో చేరు.

కొలువుగొను దే. స. క్రి. సేవకునిగ బరిగ్రహించు. భా.వి. 1 ఆ.

కొలువుదీరు : దే. అ. క్రి. ఓలగము దీఱు.
2. నవరాత్రములలో బొమ్మలుపెట్టు.

కొలువువిడియు దే. అ. క్రి. 1. ఓలగముదీఱు.
2. నవరాత్రులలో బొమ్మలుపెట్టు
కొలువుసింగారించు: దే. స. క్రి. 1. సభ నలంకరించు.
అ. క్రి. కొలువున కేగుటకు సింగారించుకొను.
కొలువుసేయు : దే. అ. క్రి. ఉద్యోగముచేయు.
కొల్లగు : దే. అ. క్రి. నీటితో నిండిపోవు.
ఉదా:- ఇక్కడ ఒక జల్లు వచ్చినచో
హాతర కొల్లగును.
కొల్లగొట్టు:
కొల్లగొను:
కొల్లపెట్టు : } దే. స. క్రి. 1. దోచుకొను.
2. అపహరించు.
కొల్లపడు : దే. అ. క్రి. కొల్లపోవు.
కొల్లపోవు : దే. అ. క్రి. దోపిడియగు,
కొల్లలుకొమ్మలుపోవు : దే. అ. క్రి. అత్యధికమగు.
కొల్లవిడు : దే. స. క్రి. కొల్లగొట్టు.
కొల్లవిడుచు : దే. స. క్రి. చూఱయిచ్చు.
కొల్లవెట్టు : దే స. క్రి. దోచు, దోచుకొను.
కొల్లవోవు: కొల్లపడు:
కొల్లకొట్టు: కొల్లగొను:
కొల్లపఱచు: కొల్లపుచ్చు:
కొల్లపెట్టు: కొల్లపోవు: } దే. అ. స. క్రి.
దోపిడియగు, చూఱవిడుచు.
కొల్లాడు :
కొల్లలాడు : } దే. స. క్రి. దోచు.
కొళ్ళు : దే. అ. క్రి. ఎడతెగక దగ్గు.
కొసకరించు : దే. స. క్రి. చివరకు కొనితెచ్చు.
ఉదా. కంటిలోని నలుసును కొసకరించు

కొసరు : దే. అ. క్రి. 1. చెలరేగికొను.
2. విజృంభించు.
3. జంకు.
4. కొసరడుగు.
5. వేడు.
స. క్రి. 1. కోరు.
2. ప్రార్థించు.

# కో

కోఁగు : దే. స. క్రి. ముండనముసేయు.
కోఁచవాఱు : దే. అ. క్రి. 1. భయపడు.
2. తగు.
3. పిఱికిబాఱు.
కోఁడు : దే. స. క్రి. బియ్యము మొ॥ చేటలో పోసి చెఱుగు.
కోఁతపట్టు : దే. అ. క్రి. కోఁత యారంభించు
కోఁతపడు : దే. అ. క్రి. 1. ఖండితమగు.
2. హింస నొందు. (కసిడికోఁత)
కోకటించు : దే. అ. క్రి. కో యను
కోచించు : దే. అ. క్రి. సంకోచించు. హం. వి.
కోటరించు : దే. అ. క్రి. కోరాడు.
కోటలో పాగావేయు: దే. అ. క్రి. ముఖ్యమైనచోటు గడుసుగ స్వాతంత్ర్యము సంపాదించు.
కోటాడు : దే. అ. క్రి. 1. చలించు.
కోడెరువేయు : దే. అ. క్రి. నాగలిని సంకుచితపఱచు.
కోతిసేయు : దే. స. క్రి. కోతివలె నాడించు. భాగ. 6 స్కం.
కోదండముతీయు : దే. స. క్రి. బాలురను దూలమునకు త్రాడుకట్టి వ్రేలాడదీయు (పూర్వపుబడులలోశిక్ష)

కోదువాఱు ; దే. అ. క్రి. వరి యెక్కువయెండి గింజలు రాలిపోవు.

కోపగాఁడగు ; దే. అ. క్రి. కోపించినవాఁడగు.

కోపగించు: }
కోపగిలు : } దే. అ. క్రి. కోపించు.

కోపమాఱు : సం. అ. క్రి. కోపము శమించు.

కోపము తె(దె)చ్చుకొను: సం. అ. క్రి. కోపగించు.

కోపముపుట్టు : సం. స. క్రి. కోపము కలుగు.

కోపము సే(చే)యు : సం. అ. క్రి. కినియు.

కోప మెత్తు : సం. స. క్రి. కోపముకలుగు.

కోపించు : సం. అ. క్రి. రోషపడు.

కోపించుకొను : సం. అ. క్రి. కోపమొందు.

కోపులెత్తు : దే. స. క్రి. దండెత్తు.

కోపువాఱు: దే. అ. క్రి. అందగించు.

కోయనియార్చు: దే. స. క్రి. యుద్ధమునందు సింహనాదము సేయు.

కోయు : దే. స. క్రి. 1. ఖండించు.
2. పూలుకోయు.
3. ఒడ్లుకోయు.
4. ప్రగల్భములాడు.
5. లేత సొరకాయలు కోయు.

కోరకించు : దే. అ. క్రి. 1. మొగ్గతొడుగు.
2. డంబాలుకొట్టు.

కోరగించు : దే. అ. క్రి. 1. మొగ్గతొడుగు.
2. ఎఱ్ఱపడు.
3. చెదరు.
4. మారాముచేయు.

కోరగొను : దే. అ. క్రి. కొంకరపోవు.

కోర(లు)సూపు : దే. అ. క్రి. కోపముతో పండ్లు చూపు.

కోరవాలు ; దే. అ. క్రి. ఎట్టబాలు.

కోరవోవు : దే. అ. క్రి. 1. కొంకరబోవు.
(పక్షవాతము మొ. వానిచే)
2. పడిపోవు.

కోరాడు ; దే. అ. క్రి. 1. కుమ్ము. (ఏనుఁగు, ఆఁబోతు
2. ఒడ్డులు క్రుమ్మియాడు.
3. దుమ్ము రేపు.
4. పంది మొ॥ నేలను పెల్లగించు

కోరిక లిగురెత్తు. దే. అ. క్రి. కోరికలుపుట్టు.

కోరిక లీఁకలెత్తు: దే. అ. క్రి. కోరికలు కలుగు.

కోరికలు గంతులువేయు : దే. అ. క్రి. కోరికలు హెచ్చుగు.

కోరికలు ఫలించు: దే. అ. క్రి. కోరిక లీడేరు

కోరికిపడు : దే. అ. క్రి. 1. అభిలషించు.
2. మనసుపడు.

కోరి చెండాడు : దే. అ. క్రి. పంది మొ॥ నేలను పెల్లగించు.
"తోరంపుఁగొమ్ములఁ గోరి చెండాడు
గడిఁది చిచ్చునుద్రోచి కాల్చు చోట"
నృ. పు. 6

కోరు : దే. స. క్రి. 1. వాంఛించు.
2. ఎదురుచూచు.
3. కొబ్బరికోరు.
4. గీఱు (కొమ్ములతోఁగోరు; కోరా

కోర్కెలందఁగను: దే. అ. క్రి. కోర్కెలు సిద్ధించు;

కోరువెట్టు : దే. స. క్రి. బలియిడు.

కోఱడమాడు
కోఱడములాడు } దే. స. క్రి. 1. పరిహాసమాడు.
2. వేళాకోళము సేయు.

కోలుకొను : దే. అ. క్రి. 1. తేలుకొను.
2. ప్రాణముకోలుకొను.
3. వృద్ధినొందు.

కోల్కొను : దే. అ. క్రి. 1. ఉత్సహించు.
2. అతిశయించు.

కోలుకొలుపు : దే. స. క్రి. 1. ప్రోత్సహించు.
2. అంగీకరింపఁజేయు.

కోలుగగ్గెరద్రోయు :
కోలుకొక్కెరత్రోయు: } దే. స. క్రి. మూటకట్టుగాఁబడఁద్రోయు.

కోలాసచేయు : దే. స. క్రి. 1. మిక్కిలియాశించు.

కోలుతలచేయు :
కోల్తలుచేయు : } దే. అ. క్రి. 1. పాలుసైన్యము నదలించి యుద్ధమునకుఁ బ్రోత్సహించు.
2. సేనలను నడుపు

కోలుపడు :
కోల్పడు : } దే. స క్రి. 1. నష్టపడు.
2. పోఁగొట్టుకొను.

కోల్పడిపోవు: అ. క్రి. 1. దొంగిలింపబడు,
2. తగు.
3. ఓడిపోవు.

కోలుపుచ్చు:
కోల్పుచ్చు: } దే. స. క్రి. 1. పోఁగొట్టు. 2. మోసపోవు,
3. చంపు. 4. చెఱచు.

కోలుపోవు:
కోల్పోవు : } దే. అ. క్రి. 1. చెడు. 2. మోసపోవు.
స. క్రి. పోగొట్టుకొను.

కోలుమసగు:
కోల్మసగు : } దే. అ. క్రి. 1. మిక్కిలి విజృంభించు.
2. అతిశయించు,
స. క్రి. చంపు.

కోవఁగట్టు :
కోవలువడద్రాయు: } దే. స. క్రి. పూసగ్రుచ్చినట్లు లిఖించు.
అ. క్రి. గనిమలు వేయు.

కోవలుపడు : దే. అ. క్రి. 1. ముత్యముకోవవలె నుండు.
2. విస్పష్టమగు.
–"కోవలుపడవ్రాసి చిత్రగుప్తుండు దాచెన్"
పాండు. 5ఆ.

## కౌ

కౌఁగలించు
కౌఁగిలించు :
కౌఁగిటఁబట్టు . } దే. అ. క్రి. 1. పరిష్వంగముసేయు.
2. ఆదరించు. 3. ఆవరించు.
రూ. కవుఁగిలించు.

కౌడుపెట్టు : దే. స. క్రి. 1. మోసగించు.
2. కపటముసేయు.

కౌతూహలమగు : సం. అ. క్రి. ఇష్టమైన ఊహకలుగు. భాగ. 10.

కౌలిచ్చు : అన్య. దే. స. క్రి. పొల మమరకమున కిచ్చు.

## క్ర

క్రంగు : దే. అ. క్రి. మ్రోగు. (మ్రోగుటయందగుధ్వన్యనుకృతి.)

క్రందగు:
క్రందాఱు : } దే. అ. క్రి. క్రందుకొను.

క్రందిల్లు : దే. అ. క్రి. 1. మ్రోగు.
2. సింహనాదముసేయు.

క్రందు : దే. అ. క్రి. 1. ధ్వనిచేయు.
2. ఒప్పాఱు. (క్రందుగ)

క్రందుకొను : దే. అ. క్రి. 1. సందడించు.
2. అతిశయించు.
3. పూర్ణమగు.
4. క్రమ్ముకొను. భాగ. 2 స్కం.

క్రందుకొలుపు : దే. స. క్రి. అతిశయింపఁజేయు.
క్రందుపడు : దే. అ. క్రి. 1. గుమికూడు.
2. సమ్మర్దమగు
3. సంకీర్ణమగు.
క్రందుపఱచు : దే. స. క్రి. గుమికూర్చు. ప్రే.
క్రందువాయు : } దే. అ. క్రి. ధ్వనిసేయు.
క్రందుసేయు : } "పణిహారులు ముందటఁ గ్రందుసేయ"
భాగ. 10 స్కం.
క్రక్కసపడు : } దే. అ. క్రి. క్రౌర్యమువహించు.
క్రక్కసించు : }
క్రక్కించు : దే. స. క్రి. అన్యాయముగ సంపాదించిన దానిని నిర్బంధపెట్టి తిరిగి యిచ్చునట్లు చేయు.
రూ. కక్కించు.
తిరిగి యిచ్చునట్లు చేయు.
క్రక్కు : దే. స క్రి. వమనముచేయు, వెడలఁజేయు.
క్రక్కుపడు : దే. అ. క్రి. బయటపడు. (బలవంతముగ)
క్రచ్చఱించు : దే. స. క్రి. మిగులజేయు.
క్రచ్చఱు : దే. అ. క్రి. అతిశయించు.
క్రచ్చు : దే. అ. క్రి. హత్తుకొను.
క్రచ్చుకొను : దే. అ. క్రి. 1. సమీపించు.
2. చుట్టుకొను.
క్రమముఁదోచు : సం. అ. క్రి. 1. ఒకరీతినుండు.
2. ఒకపద్ధతినుండు.
క్రమముతప్పు : సం. అ. క్రి. 1. పద్ధతి లేకపోవు.
2. వేదపాఠమున స్వరక్రమము తప్పు.
క్రమమెఱుఁగు : మి. అ. క్రి. విధానము తెలియు.

క్రమించు : సం. స. క్రి. 1. కడచు.
2. దాటు.
3. అతిక్రమించు.

క్రమియించు : సం. స. క్రి. అతిక్రమించు.

క్రమ్మఱించు : దే. స. క్రి. క్రమ్మఱుచు ప్రే.

క్రమ్మఱు : దే. అ. క్రి మఱలు.

క్రమ్మఱిల్లు :
క్రమ్మఱు :
క్రమ్మఱుచు
క్రమ్మించు:
} దే. అ. క్రి. మఱలు.

క్రమ్మఱుదెంచు : దే. అ. క్రి. 1. మఱలు.
2. మఱలివచ్చు.

క్రమ్ము : దే. అ. క్రి. 1. ముసురుకొను.
2. ప్రసరించు. (కన్నీరు గ్రమ్మ)
3. ప్రవహించు. (నెత్తురు టేరులు గ్రమ్మ)
స. క్రి. 1. కవియు.
2. కలయు.
3. చుట్టుకొను.
4. ఆవరించు.

క్రమ్ముకొను : దే. స. క్రి. ముసురుకొనజేయు. ప్రే.

క్రమ్ముదెంచు : దే. అ. క్రి. వ్యాపించు. (స్వార్థమున)
బయలువెడలు.

క్రమ్ములించు : దే. స. క్రి. క్రమ్మించు. ప్రే.

క్రమ్ముపడు : దే. అ. క్రి. 1. పూడు.
2. మూతపడు.

క్రమ్మెక్కు : దే. అ. క్రి. పాఱు.

క్రయపెట్టు : మి. అ. క్రి. అమ్ముటకు ప్రకటించు.

క్రయించు : మి. అ. క్రి. వెలయిచ్చికొను.

క్రయ్యఁబడు : దే. స. క్రి. 1. కలసియుండు.
2. బలాత్కరించు.
3. తగిలియుండు.

క్రయ్యఁబాఱు : దే. అ. క్రి. కలయఁబాఱు.

క్రయ్యు : దే. స. క్రి. కవియు.

క్రల్లవడు : దే. అ. క్రి. బూడిదయగు.

# క్రా

క్రాఁగు : } దే. అ. క్రి. 1. సలసలలాడు.
క్రాఁగిపోవు : } 2. తపించు.
3. ప్రజ్వలించు.
4. కాలు.
5. దుఃఖించు.
6. బాధపడు.
7. దగ్ధమగు.

క్రాఁచు : } దే. స. క్రి. 1. కాల్చు.
క్రాఁచివుచ్చు : } 2. పీడించు.
3. క్రాఁగఁజేయు.

క్రాయు: } దే. స. క్రి. 1. కొంగ్రించి యుమియు
క్రాచు : } 2. వెలిగ్రక్కు

క్రాలు : దే. అ. క్రి. 1. ప్రకాశించు.
2. సంచరించు.
3. ఒప్పు.

క్రాలుకొను : దే. అ. క్రి. క్రాలు.

# క్రి

క్రింగొడఖ్యారుచు: దే. అ. క్రి. మేను కుంచించు  పండి.పర్వ.
క్రిందమీదపెట్టు : దే. స. క్రి. ఏవిధముననైన తగవులాడు,
క్రిందంటు : దే. అ. క్రి. నేలపాలగు. నశించు.
క్రిందుపడు : దే. అ. క్రి. 1. తగ్గు. 2. వశమగు. 3. ఓడు.
క్రిందుపఱచు : దే. స. క్రి. తక్కువసేయు
క్రిందుమీదగు. దే. అ. క్రి. తలక్రిందు లగు.  హం. 4 ఆ.
క్రిందుసేయు : దే. స. క్రి. అధఃకరించు.
క్రిక్కటిల్లు(లు) : దే. అ. క్రి. 1. కంపించు. 2. వణఁకు.
క్రిక్కిరియు :
క్రిక్కిఱియు: } దే. అ. క్రి. నిండు.
క్రిక్కిరించు : దే. స. క్రి. 1. నిండించు.
2. ముడుగఁజేయు.
3. కికురించు
క్రిక్కిఱియు:
క్రిక్కిఱు : } దే. అ. క్రి. 1. దట్టమగు. 2. ఎడములేక వ్యాపించు
3. ఇఱుకగు.
క్రిక్కు :
క్రిక్కొను: } దే. అ. క్రి. నిండు, దట్టముగ నుండు.
క్రియగొను : దే. అ. క్రి. 1. ఏర్పడు.
2. పూను.
3. ఫలితమనుభవించు.
క్రియ తులుకాడు: దే. అ. క్రి. క్రియగొను.
క్రియ్యు :
క్రీబడు : } దే. అ. క్రి. క్రిందఁబడు
క్రీడించు : సం. అ. క్రి. 1. వినోదించు.
2. సంగమించు. భాగ. 1. స్కం.

# క్రు

క్రుంకించు : దే. స. క్రి. 1. అస్తమింపఁజేయు.
2. స్నానముచేయించు.

క్రుంకిడు : దే. అ. క్రి. స్నానముచేయు.

క్రుంకు : దే. అ. క్రి. 1. అస్తమించు
2. స్నానముచేయు.
3. నాటుకొను.

క్రుంకులువెట్టు:
క్రుంకువెట్టు:
క్రుంకులిడు: } దే. అ. క్రి. స్నానముచేయు.

క్రుంగగొట్టు : దే. స. క్రి. కారము మొ. వానిని జల్లింపనవసరము లేకుండ మెత్తగా దంచు.

క్రుంగఁబడు : దే. అ. క్రి. మెత్తఁబడు.

క్రుంగఁబాఱు : దే. అ. క్రి. మెత్తనగు.

క్రుంగిపోవు :
క్రుంగిలు :
క్రుంగిల్లు : } దే. అ. క్రి. నీరసపడు.

క్రుంగు :
క్రుంగిలబడు: } దే. అ. క్రి. 1. అణఁగు.
2. తగ్గు.
3. దిగబడు.
4. నశించు.
5. ముడుచుకొను.

క్రుక్కించు : దే. స. క్రి. అణఁగించు.

క్రుక్కిదమగు దే. అ. క్రి. పూర్తిగ నిండినదగు. కు. సం. 1ఆ.

క్రుక్కు : దే. స. క్రి. 1. ఊళ్లుక్రుక్కు
2. దట్టించు.
3. అణచు.

క్రుక్కుమిక్కను : దే. అ. క్రి. ఊపిరియాడు. శబ్దమొదవించు.

క్రుచ్చు : దే. స. క్రి. గ్రుచ్చు. కుట్టు.

క్రుమ్మరించు : దే. స. క్రి. 1. కడవ మొ॥ వానితోఁ గ్రుమ్మరించు
2. వర్షించు

క్రుమ్మరిల్లు(లు): } దే. అ. క్రి. తిరుగు
క్రుమ్మరు :

క్రుమ్ము : } దే. స. క్రి. 1. పొడుచు.
క్రుమ్మడగించు: 2. బాగుగా మర్దించు.

క్రుమ్ముడువడు : దే. అ. క్రి. పోటువడు.

క్రుమ్ములాడు : దే. అ. క్రి. 1. పోరు.
2. కుమ్ముకొను.

క్రుమ్మెసలాడు : దే. అ. క్రి. పోరు.

క్రుయ్యాబారు : } దే. అ. క్రి. ధ్వనిచేయుచుఁ బరువెత్తు.
క్రుయ్యఁగఁబారు : నృ. పు. 3 ఆ.

క్రుయ్యు : దే. అ. క్రి. 1. కృశించు.
2. వెనుదీయు.
3. శ్రమమందు.

క్రుళ్ళగించు : దే. అ. క్రి. వెలికిఁదెచ్చుకొని దుఃఖించు
స. క్రి. పెళ్ళగించు.

క్రుళ్ళు : దే. అ. క్రి. 1. పాసిపోవు.
2. దుఃఖాదులచేఁ గ్రుళ్లు.
3. పగులు.

క్రువ్వు : దే. స. క్రి. గ్రుచ్చు.

# క్రై

క్రైకొక్కనిపర్వు : దే. అ. క్రి. మండలాకారరేఖ యేర్పడ వ్యాపించు.
కు. సం. 10.ఆ.

# క్రే

| | |
|---|---|
| క్రేంకారమిచ్చు : <br> క్రేకటించు : <br> క్రేకరించు : | మి. అ. క్రి. నెమిలి కూఁతకూయు. |
| క్రేఁటు : | దే. అ. క్రి. 1. గొంతుసవరించుకొను. <br> 2. తొట్రుపడు. <br> 3. వెక్కు. |
| క్రేఁటుకొను : | దే. అ. క్రి. గొంతు సవరించుకొనుటకై యొక విధమగు శబ్దముచేయు. |
| క్రేఁదొట్టు : | దే. అ. క్రి. గట్టొరయు. |
| క్రేడించు : <br> క్రేణించు : | దే. అ. క్రి. 1. తొలఁగు. 2. అనాదరముసేయు. <br> 3. ఉపేక్షించు. 4. అలక్ష్యముసేయు. |
| క్రేడిసేయు : <br> క్రేణిసేయు : | దే. స. క్రి. పరిహసించు. జై. 5 ఆ. <br> 2. సరివచ్చు. <br> 3. అనుకరించు. <br> 4. పరిహరించు. |
| క్రేళ్ళుగదాఁటు : <br> క్రేళ్ళుదోలు : | దే. అ. క్రి. లంఘించు. |
| క్రేళ్ళుచూచు : | దే. అ. క్రి. చంచలముగాఁజూచు |

క్రేళ్ళుత్రుళ్ళు, క్రేళ్ళుదాటు : దే. అ. క్రి. 1. గంతులిడు.
2. లంఘించు.

క్రేళ్ళుదోలు, క్రేళ్ళుత్రిప్పు : దే. స. క్రి. పరుగులెత్తించు.

క్రేళ్ళుబ్బు : దే. అ. క్రి. అతిశయించు.

క్రేళ్ళుమలఁగు : దే. అ. క్రి. 1. వెనుదీయు.
2. నిరాకరించు.

క్రేళ్ళుమసలు : దే. అ. క్రి. సంచలించు.

క్రేళ్ళువాఱు, క్రేళ్ళుసను, క్రేళ్ళెగయు : దే. అ. క్రి. 1. విజృంభించు.
2. గంతులిడు.
3. చెదరిపోవు.

క్రొత్తచేయు : దే. అ. క్రి. 1. సరిపడకపోవు.
"నాకీయూరినీళ్లు క్రొత్త చేసినవి."
2. నవీకరించు.

క్రొత్తపడు : దే. అ. క్రి. క్రొత్తయగు.

క్రొత్తపఱచు, క్రొత్తవఱచు : దే. స. క్రి. ప్రకాశింపఁజేయు.

క్రొత్తలుపుట్టించు : దే. స. క్రి. నూతనరీతులు సృష్టించు. వి|క. 1 ఆ.

క్రొత్తలుసేయు : దే. స. క్రి. నూతన కార్యములుసేయు.

క్రొయిపెట్టు : దే. అ. క్రి. 1. కై పెట్టు.
2. వదలు.

క్రొవ్వు : దే. అ. క్రి. 1. మదించు.
2. బలియు.

క్రొవ్వడగించు, క్రొవ్వణగించు, క్రొవ్వడఁచు, క్రొవ్వణఁచు : దే. స. క్రి. మదముతగ్గించు.
నీరసపఱచు.

క్రొవ్వారు : దే. అ. క్రి. మదించు.
క్రొవ్వు : దే. అ. క్రి. 1. మదించు. 2. బలియు.
క్రొవ్వుగొను : దే. అ. క్రి. మదించు.
క్రొవ్వుదిగు : దే. అ. క్రి. పొగరడఁగు.
క్రొవ్వుపట్టు : దే. అ. క్రి. పొగరెక్కు.
క్రొవ్వుపలుకు (వలుకు): దే. స. క్రి. 1. పొగరుమాటలాడు.
2. గొప్పలుచెప్పు. కు. సం. 7 ఆ.
క్రొవ్వెక్కు : } దే. అ. క్రి. మదించు.
క్రొవ్వెత్తు : }
క్రొవ్వెరపో(వో)వు : దే. అ. క్రి. కొంకరలుపోవు. కు. సం. 6 ఆ.

# క్రో

క్రోడాడు : దే. స. క్రి. 1. కోరాడు.
2. నేల పెళ్ళగించు.
3. ఏనుగు మొ॥ వప్రక్రీడసేయు.
క్రోడించు: సం. స. క్రి. తఱుచు.
క్రోడీకరించు : సం. స. క్రి. సంగ్రహించు.
క్రోధించు : } సం. అ. క్రి. కోపగించు
క్రోధిల్లు : }
క్రోయు : దే. అ. క్రి. నాలుకలు చాచు (పాము)
క్రోలు : దే. స. క్రి. 1. త్రాగు.
2. ఆస్వాదించు.
క్రోలించు : దే. స. క్రి. (క్రోలు ధా. ప్రే.) త్రావించు.
క్రోలుచు } దే. అ. క్రి. 1. కూయు.
క్రోల్చు } 2. అభ్యసించు
3. కోకిల మున్నగు పక్షులు కూయు.
స. క్రి. 1. క్రోలఁజేయు.
క్లేశపడు : సం. అ. క్రి. 1. బాధపడు. 2. దుఃఖపడు.

# క్ష

క్షణముగొను : సం. అ. క్రి. నిమంత్రితుఁడగు. (బ్రాహ్మణార్థమునకు)

క్షణముపట్టు : సం. అ. క్రి. 1. కొలఁది కాలమే సరిపోవు.
2. బ్రాహ్మణార్థమున కంగీకరించు.

క్షణమేకగు : మి. అ. క్రి. కాలము త్వరగా సాగకపోవు.

క్షణియించు :
క్షణించు : } సం. స. క్రి. 1. అర్చించు. ప్రభా. 4 ఆ. పండి. దీక్షా.
2. ఆలస్యముచేయు.
3. భోజనార్థము వరించు.
4. నిమంత్రించు

క్షమియించు :
క్షమించు : } సం. స. క్రి. 1. తప్పుసైచు.
2. ఓర్చు.
3. ఉపశమిల్లఁజేయు.

క్షయించు : సం. అ. క్రి. 1. క్షీణించు.
2. నశించు.

క్షరియించు :
క్షరించు : } సం. స. క్రి. 1. స్రవించు. 2. కాఱు.
3. నశించు

క్షీణించు : సం. అ. క్రి. 1. తగ్గు

క్షుత్తుశమించు : సం. స. క్రి. ఆఁకలిదీఱు.

క్షోభపడు : సం. అ. క్రి. కలతపడు.

క్షోభపెట్టు :
క్షోభించు : } సం. స. క్రి. కలఁతపఱచు.

క్షౌరమగు : సం. అ. క్రి. చెడిపోవు. (కార్యము)

క్షౌరముచేయు : సం. స. క్రి. 1. ముండనముచేయు.
2. ఇతరులధనము నపహరించు

## ఖ

ఖంగుమను : దే. అ. క్రి. కంచు మొ॥ వానివలె మ్రోగు.

ఖండించు : సం. స. క్రి. 1. ముక్కలుసేయు.
2. వాదమును ఖండించు.

ఖచియించు :
ఖచించు : } మి. స. క్రి. 1. చెక్కు.
2. పొదుగు.

ఖడేరావను : అన్య. దే. స. క్రి. "ఆగు" మని హెచ్చరికసేయు
సుకు. పరి.

ఖద్దించు : అన్య. దే. స. క్రి. 1. ఉత్సహించు.
2. తక్కువసేయు.
3. గద్దించు.

ఖరాబు సేయు : అన్య. దే. స. క్రి. పాడుసేయు.

ఖరారు సేయు : అన్య. దే. స. క్రి. బేరము వ్యవహారము మొ.
పరిష్కరించు.

ఖయాలీపుట్టు : హిం. అ. క్రి. బుద్ధి వెఱ్ఱితలలు వేయు.

ఖరీదు సేయు : హిం. అ. క్రి. కొను.

ఖరుచు చేయు : హిం. అ. క్రి. వ్యయించు.

ఖలీభవించు : సం. అ. క్రి. పాడుపడు.

## ఖా

ఖాతరు సేయు :
ఖాతురు సేయు: } హిం. స. క్రి. కావలియుంచు. కు. రా.
లెక్కసేయు.

ఖానూనుమాపు : ఉర్దు. స. క్రి. బాధపెట్టు.

ఖాయమగు : హిం. అ. క్రి. ఉద్యోగము స్థిరపడు.

ఖాయిదాచేయించు: హిం. స. క్రి. కట్టడిచేయు,
—"అక్కడికి మగవారెవ్వరు పోకుండ ఖాయిదా చేయించి ముగ్గురు దాదులను కావలియుంచి". కు. రా.

ఖాయిలాపడు : హిం. అ. క్రి. జబ్బుపడు,

ఖాళీచేయు : హిం. అ. క్రి. ఉత్తరిచేయు, విడిచిపెట్టు.

## ఖి

ఖిలీభవించు : సం. అ. క్రి. చెడు. కాశీ. 5 ఆ.

## ఖే

ఖేటాయించు : అన్య. దే. స. క్రి. కేటాయించు, రూ.

ఖేటించు : సం. అ. క్రి. దెబ్బ యొడ్డుకొను (డాలుతో)

ఖేదపడు :
ఖేదించు :
ఖేదిల్లు : } సం. అ. క్రి. దుఃఖపడు.

## ఖై

ఖైదీలగు : హిం. అ. క్రి. చెఱసాలలో నుంచబడినవారగు.

ఖైదుసేయు : హిం. స. క్రి. చెఱసాలలో నుంచు.

## గ

గంగపాలుసేయు: దే. స. క్రి. 1. చెడఁగొట్టు.
2. సర్వనాశనము చేయు.

గంగవెఱ్ఱులెత్తు : దే. అ. క్రి. 1. మిక్కిలి పిచ్చిగా మాటాడు.
2. ప్రక్కమొలకలు పెట్టు. (నె. జి.)

గంజికావడిపట్టు: దే. స. క్రి. 1. ఇద్దఱు వ్యక్తులుచేరి తమ చేతులు కలిపి బాలురను వినోదార్థము మోసికొనిపోవు.
2. ఒక యిద్దఱు చేరి మఱియొకని వ్యవహారము పరిష్కృతముకాక మునుపే తదవకాశముల నంత మొందించు.

గంటకట్టు : దే. అ. క్రి. వరి మొ॥ దుబ్బుచేయు.

గంటగొట్టు : దే. అ. క్రి. చచ్చు. (తెలం)

గంటవాయించు : దే. అ. క్రి. చనిపోవు. (వ్యవ.) దేవార్చనముచేయు.

గంటిపడు : దే. అ. క్రి. గాయపడు.

గంటిపఱుచు : దే. స. క్రి. గంటిపడఁజేయు.

గంటివెట్టు :
గంటి సేయు: } దే. స. క్రి. గాయపెట్టు.

గంటు : దే. స. క్రి. గాయపఱచు. రూ. కంటు.

గంటుగూరు : దే. అ. క్రి. ధనము సమకూరు (తెలం)

గంటుపోవు : దే. అ. క్రి. నష్టమగు.

గంటువెట్టు : దే. అ. క్రి. 1. మొగము గంటుపెట్టుకొను.
2. కనుబొమముడివేయు.
3. జడముడివేయు.

గంటువెట్టుకొను: దే. అ. క్రి. కోపాదులచే మొగము ముడుచుకొను.

గంటు సేయు : దే. అ. క్రి. డబ్బునిలువసేయు.

గంట్లువెట్టు : దే. స. క్రి. కత్తితో వాతలేర్పడునట్లు నఱకు.

గంటెకలుపు దే. అ. క్రి. వంటచేయు

గండకత్తెరలోవేయు : దే. స. క్రి. మిక్కిలిబాధలోపెట్టు.

గండకత్తెరవేయు : దే. స. క్రి. మరణశిక్షవేయు.

గండడఁగు :
గండణఁగు : } దే. అ. క్రి. మద మణఁగు.

గండడంచు : దే. స. క్రి. 1. మదమణంచు. ప్రే.
గండడగించు : దే. స. క్రి. 1. మదమణంచు.
2. నశింపజేయు.
గండదీపము మోయు : } దే. అ. క్రి. 1. గండముగడచినతర్వాత ఒక పళ్లెమునందు మధ్య పెద్ద కత్తి పెట్టి, చుట్టు చిన్నవత్తులు వెలిగించి, దానిని మోసికొని యింటినుండి దేవుని గుడిశిఖరమునకు వెళ్ళి, యందలి దీపపు ప్రమిదలో ఈ నూనె వత్తులు వేసి వెలిగించి నచ్చు.
గండచిలుకమోయు : }
2. మ్రొక్కుబడి చెల్లించు.
గండదొంగించు : దే. స. క్రి. మదమణచు.
గండముగడచు : దే. అ. క్రి. ఆపదతీరు.
గండరించు ధే. అ. క్రి. 1. తాలు తొలిచి రూపమేర్పఱచు.
2. ఉబ్బరించు.
3. పొగరెక్కు.
4. కోపభయాదులచే వికృతముగు
5. పుట్టు
గండరించు : తెలం. 1. దృఢపడు.
2. విజృంభించు.
3. విషమించు.
4. ఆవిర్భవించు.
5. కందిపోవు.
6. మదించు.
గండ్రలు చేయు : దే. స. క్రి. ఖండించు.
గండ్రించు : దే. స. క్రి. 1. ఖండించు
2. అతిశయించు.

గండాడు : దే. స. క్రి. 1. రమించు
2. పుంస్త్రీయ నెఱపు.
గండిగొట్టు : దే. స. క్రి. దొంగిలించు (రా. సీ)
గండిచేయు : దే. స. క్రి. రంధ్రముచేయు.
గండిపడు : దే. అ. క్రి. గట్లుతెగు (నదులు మొ.)
గండుదేరు : దే. అ. క్రి. 1. బలియు
2. గర్వించు (తెలం)
గడుబెండపడు : దే. అ. క్రి. నీరసించు (తెలం)
గండుమిగులు : దే. అ. క్రి. పరాక్రమించు.
గండుమీఱు : } దే. అ. క్రి. అతిశయించు
గండుమెఱయు : } రూ. గండుమిగులు.
గండువారు : దే. అ. క్రి. వాపెక్కు. (తెలం)
గండువోవు : దే. అ. క్రి. 1. వాయు. (తెలం)
2. ఉబ్బు.
గండ్లుపడు : దే. అ క్రి. పుండ్లు రంధ్రములు పడు. (తెలం)
గండూషించు : సం. స. క్రి. పుక్కిలించు.
గండెక్కు : దే. అ. క్రి. మదించు.
గండ్రించు : దే. అ. క్రి. ఖండించు.
గంతగట్టు : దే. స. క్రి. 1. మోసముచేయు.
2. పిల్లఆటలలో కండ్లకు గుడ్డ కట్టు.
3. గిత్తలకు కాడికి కట్టునపుడు కండ్లు మూతలు గట్టు.
గంతమోయు : దే. స. క్రి. బరువుమోయు.
"త్రుళ్ళు నెద్దె గంతమోయు." ముద్దుపళని.
గంతాడు : దే. అ. క్రి. ఎగురు.
గంతుగొను : దే. అ. క్రి. చచ్చు.

చెట్టుపట్టు : దే. అ. క్రి. చెట్లపాలగు. ఆము. 3 ఆ.
చెడగొట్టు : దే. స. క్రి. పాడుచేయు.
చెడనాడు : దే. స. క్రి. నిందించు.
చెడవిఱుగు : దే. అ. క్రి. విశ్లథమగు.
చెడామడా తిట్టు : దే. స. క్రి. మిక్కిలి నిందించు.
చెడిపోవు : దే. అ. క్రి. నాశనమగు.
చెడు : దే. అ. క్రి. వ్యర్థమగు, ప్రతికూలమగు, పేదవడు. నశించు, పోవు, తగ్గు, కాకపోవు.
చెడుగాడు : దే. స. క్రి. నిందించు.
చెడ్డు : దే. స. క్రి. తొడచఱచు; నిందించు.
చెదరఁగనాడు : దే. స. క్రి. తూలనాడు.
చెదరఁబడు : దే. అ. క్రి. వికీర్ణమగు.
చెదరఁబాఱు : దే. అ. క్రి. వ్యాపించు.
చెదరించు : దే. స. క్రి. చెదరఁజేయు; చెడఁగొట్టు, చిందగొట్టు.
చెదరు : దే అ. క్రి. ఇటునటుపడు, పాడగు, పాఱిపోవు కన్నుచెదరు, సడలు.
చెదలుపట్టు : దే. అ. క్రి. 1. నాశనమగు.
2. విస్మరించు.
3. చెదపురుగు సోకు.
చెదవ(ప)ట్టు : దే. అ. క్రి. చెదలుపట్టు.
చెదురు : దే. అ. క్రి. చెదరు.
చెనకియాడు : దే. అ. క్రి. రేఁగియాడు.
చెనకు (న్కు) : దే. స. క్రి. తడుము, రమించు, ఎదుర్కొను, కవ్వించు, స్పృశించు. (చూ. చెణకు)
చెనయు : దే. అ. స. క్రి. ఒప్పు; తాఁకు, సరిపోలు, ఎదుర్కొను.
చెన్నఁటిపో(వో)వు : దే. అ. క్రి. వ్యర్థమగు.
చెన్నలరు : దే. అ. క్రి. అందగించు.

చెన్నారు : దే. అ. క్రి. అందమగు.
చెన్నుపడు : దే. అ. క్రి. ఒప్పు.
చెన్నుపఱచు : దే. స. క్రి. అందగింపఁజేయు

చెన్నుమిగులు :
చెన్నుమీఱు :
చెన్నుమెఱయు:
చెన్నెసలారు :
} దే. అ. క్రి. అంద మతిశయించు.

చెప్పించు : దే. స. క్రి. సిఫారసు చేయించు.
చెప్పిచూచు : దే. అ. క్రి. ప్రయత్నించు.
చెప్పు : దే. స. క్రి. వచించు; కవిత చెప్పు, ఆజ్ఞాపించు. (చెప్పుచేతలు)
చెప్పుకుపోవు : దే. అ. క్రి. వినువారి యిష్టానిష్టములు గమనింపక వచించు.
చెమటపట్టు : దే. అ. క్రి. చెమటపోయు
చెమటపోయు : దే. అ. క్రి. స్వేదముపట్టు.
చెమటయోడ్చు : దే. అ. క్రి. కష్టించు. గూ. చెమటూడ్చు.
చెమడా లెక్కదీయు: దే. స. క్రి. చితుకగొట్టు.
చెమరించు : దే. అ. క్రి. చెమటపోయు
చెమరు : దే. అ. క్రి. చెమ్మగిల్లు.
చెమరు(ర్చు)చు : దే. అ. క్రి. చెమరించు,
చెమరునెత్తురగు: దే. స. క్రి. అధిక ప్రేమ నెఱపు.
చెమ్మగించు : దే. స. క్రి. చెమ్మగిల్లఁజేయు.
చెమ్మగిలు(ల్లు) : దే. అ. క్రి. తడిగలది యగు, చెమటపోయు.
చెమ్మచెక్కలాడు: దే. అ. క్రి. చప్పట్లుకొట్టుచు ఆడు. (ఆడపిల్లలు.)
చెమ్మదిగిద్దెలాడు: దే. అ. క్రి. చెడుగుడి యాడు.
చెమ్మయుఱుకు : దే. అ. క్రి. చెమ్మగిల్లు.
చెమ్మరించు : దే. అ. క్రి. చెమరించు.

చెమ్మరు : దే. అ. క్రి. చెమరు.
చెయిచాచు : దే. స. క్రి. యాచించు.
చెయిదాఁటు :
చెయిమాఱు : } దే. అ. క్రి. వశముతప్పు.
చెయిమీఱు : దే. స. క్రి. చేతితోఁగొట్టు.
చెయ్యాగు : దే. స. క్రి. అడ్డగించు.
చెయ్యాడు : దే. అ. క్రి. తీరికగలుగు, డబ్బు మెసలు.
చెయ్యిచేసికొను : దే. స. క్రి. కొట్టు, జోక్యము కలిగించుకొను.
చెయ్యిచ్చు : దే. స. క్రి. సాయపడు, మోసగించు. [తెలం]
చెయ్యూదికొను : దే. స. క్రి. చెయ్యిచ్చు, తోడ్పడు, సాయముచేయు.
చెరచెరనడచు : దే. అ. క్రి. తొందరగాసాగు.
చెరమివేయు : దే. స. క్రి. ఖండించు. క. న. రా. యు.
చెరలాడు :
చెరలు : } దే. అ. క్రి. ఉత్సహించు.
చెరలుకొట్టు :
చెరలువాడుచు: } దే. అ. క్రి. మిక్కిలి యుత్సహించు.
చెరలువెట్టికొను: దే. స. క్రి. లోఁబఱచుకొను. క్రీడా.
చెరియించు : దే. అ. క్రి. చరించు.
చెరుగు : దే. స. క్రి. తూలించు; చేటతో చెఱుగు.
చెరువు : దే. స. క్రి. పొదుగు, (పూలు మొదలైనవి) కొప్పున దూర్చు, దువ్వు.
చెఱగిపోయు : దే. స. క్రి. జల్లించు.
చెఱఁగుమాయు : దే. అ. క్రి. వెలుపల నుండు.
చెఱగొను : దే. స. క్రి. బందిపెట్టు.
చెఱచు : దే. స. క్రి. చెడగొట్టు, మానభంగముచేయు. చెడఁజేయు.
చెఱదెచ్చు : దే. స. క్రి. బందిగా తీసికొని వచ్చు.
చెఱపట్టు : దే. స. క్రి. చెఱగొను.

చెఱపడు : దే. అ. క్రి. బంధనము నొందు.
చెఱపు : దే. స. క్రి. ప్రే. నశింపఁజేయు.
చెఱపోవు : దే. అ. క్రి. నిర్బంధముచే పట్టుబడు.
చెఱమివేయు: దే. స. క్రి. తఱిమివేయు.
చెఱయిచ్చు: దే. స. క్రి. స్త్రీని (చెఱగా) మఱియొకని కిచ్చు.
చెఱలిచ్చు దే. స. క్రి. చెఱపట్టు.
చెఱుఁగొట్టు : దే. అ. క్రి. కిలకిలలాడు.
చెఱుఁగొను : దే. స. క్రి. చెఱయిచ్చు.
చెఱుదెచ్చు : దే. స. క్రి. ఖైదీలుగా దెచ్చు.
చెఱలుపట్టు : దే. స. క్రి. చెఱలుదెచ్చు.
చెఱలుపోవు : దే. అ. క్రి. బందిగా పోవు.
చెఱవడు : దే. అ. క్రి. బందీయగు.
చెఱవెట్టుకొను : దే. అ. క్రి. స్వాధీనము చేసికొను. ద. చ.
చెఱుచు : దే. స. క్రి. గూ. చెఱచు, చెడఁజేయు.
చెఱుపు : దే. స. క్రి. చెడఁగొట్టు.
చెఱుము : దే. స. క్రి. పూయు. (పూలు) పెట్టు.
చెలగించు : దే. స. క్రి. చెలఁగు. ప్రే.
చెలఁగు : దే. అ. క్రి. (గూ. చెల్గు) ఉత్సహించు,వికసించు, వ్యాపించు, ధ్వనించు, ఒప్పు. సంతసించు, ఉండు.
చెలగు : దే. స. అ. క్రి. ఖండించు, అతిశయించు, వర్ధిల్లు.
చెలయు : దే. అ. క్రి. విజృంభించు.
స. క్రి. చిమ్ము. గూ. సెలయు.
చెలరాఁచు : దే. అ. క్రి. చెలయు.
చెలరుచు : దే. అ. క్రి. గూ. చెలఁచు, విజృంభించు.
చెలరేఁగు : దే. అ. క్రి. మిక్కిలి విజృంభించు.
చెలవు : దే. స. క్రి. ఖండించు, అతిశయించు.
అ. క్రి. వర్ధిల్లు.

చెలాకీపడు : అన్య. దే. అ. క్రి. ఉత్సాహపడు. సంతసిల్లు.
చెలామణియగు : అన్య. దే. అ. క్రి. చెల్లు.
చెలాయించు: అన్య. దే స. క్రి. 1. అతిశయముగా జరిగించు.
(సుకుమారీపరిణయము.)
చెలిగిపారవేయు: దే. స. క్రి. రూ. చెరిగి పారవేయు.
1. ఇతరుల దోషములను గాలించివేయు
2. తనకు గల సర్వపాండిత్యమును ప్రదర్శించు.
చెలిగిపోయు : దే. అ. క్రి. ఎక్కువగా మాట్లాడు.
చెలిమిసేయు : దే. అ. క్రి. స్నేహముచేయు.
చెఱకు : దే. స. క్రి. పెఱుకు.
చెలుగు : దే. స. క్రి. 1. కత్తితో కంప మొ॥ వానిని నఱకు.
2. కాడిగట్లు పాఱతో చెక్కు.
చెలుపు : దే. స. క్రి పూయు.
చెలువాఱు : } దే. అ. క్రి. (రూ. చెల్వారు) ఒప్పు,
చెలువొందు : } కొండెములు చెప్పు.
చెల్లఁబెట్టు : దే. స. క్రి. వ్యయపెట్టు; అప్పు తీర్చు.
చెల్లవిడుచు : దే. స. క్రి. చూరవిడుచు.
చెల్లాడు : దే. అ. క్రి. క్రీడించు.
చెల్లించు : దే. స. క్రి. జరిగించు, తీర్చు.
చెల్లిపోవు : దే. అ. క్రి. తీరిపోవు, సాగు.
చెల్లియుండు : దే. అ. క్రి. పడియుండు.
చెల్లు : దే. అ. క్రి. తగ్గు, నెగ్గు, నెఱవేరు, సమర్థమగు
తీఱు, నశించు, చెలామణియగు.
అయిపోవు, కడచు, కొనసాగు, చచ్చు.
చెల్లుబెట్టు : దే. స. క్రి. 1. ఖాతాకొట్టివేయు (ఇంతవఱకున్న
అప్పు తీసివేయు.)
2. రూపాయి చెల్లునట్లుగాచేయు(తెలం.)

చెల్లిసేయు : దే. స. క్రి. సున్నజుట్టు.

చెవిఁగొను : దే. అ. క్రి. చెవియొగ్గు.

చెవిఁగొఱుకు : దే. స. క్రి. రహస్యము చెప్పు (కుత్సార్థమునందు.)

చెవికోసికొను : దే. అ. క్రి. ఒకవిషయమును వినుటయందధికమైన ఆసక్తిగొను.

చెవిచేఁదగు : దే. అ. క్రి. చెవికి చేర్పరాని దగు, అహితమగు.

చెవినిల్లుగట్టు : దే. అ క్రి. పదేపదే చెప్పు.

చెవిఁబెట్టు : దే. అ. క్రి. (రూ. చెవినిఁబెట్టు.)
1. సావధానముగ విను.
2 పట్టించుకొను.

చెవియొగ్గు : దే. స. క్రి. అంగీకరించు; శ్రద్ధతో విను.

చెవియోజించు ; దే. స. క్రి. చెవిలో ఉపదేశించు.

చెవుడుకొను : దే. అ. క్రి. బధిరీకృత మగు.

చెవుడుపడు : దే. అ. క్రి. (రూ చెవుడ్పడు.) బధిరమగు.

చెవుడుపఱచు : దే. స. క్రి. చెవుడుపడు ప్రే.

చెవులు నులిపికొను: దే. అ. క్రి. మిక్కిలి విచారించు.

చెవులుపించు : దే. స. క్రి. బలవంతముచేయు (ధనము వసూలు చేయు. మొ. వానిలో)

# చే

చేఁదు : దే. స. క్రి. తోడు, ఉద్ధరించు.
చేఁదుగుఱియు : దే. అ. క్రి. విషము గ్రక్కు.
చేకుఱు (ఱు) : } దే. అ. క్రి. లభించు, ఒనగూడు.
చేకూడు :
చేకూరు :
చేకూరుచు : } దే. స. క్రి. చేకూరు ప్రే.
చేకూర్చు :
చేకొను : దే. స. క్రి. స్వీకరించు, పెండ్లాడు, ఆశ్రయమిచ్చు, కైకొను, తాల్చు.
చేఁచు : దే. స. క్రి. యాచించు, ఆశించు, సిద్ధమగు.
చేచేఁపు : దే. స. క్రి. ఎక్కువగా చేపు.
చేటుమణుగు : } దే. అ. క్రి. 1. నశించు.
చేటుమణచు : 2. ఆపద సంభవించు.
చేటుమునుగు : 3. నశింపఁజేయు.
చేటుమూడు :
చేడ్పడు : దే. అ. క్రి. 1. ఖిన్నమగు;
2. నిశ్చేష్టమగు.
చేతడియూరు : దే. అ. క్రి. పని జరిగినతరువాత నాలస్యముకలుగు.
"ఆజ్ఞవెట్టించి చేతడి యూఱ దిపుడు
దీని కెబ్భంగి మోహానం బైన వేణి
గలిగె" కాళ. మ. 1 ఆ.
చేతడుపు : దే. స. క్రి. 1. కొద్దిగా నీళ్ళతో చేయితడుపు.
2. లంచముపెట్టు.
చేతనగు : దే. అ. క్రి. శక్తమగు.

చేతసవడు :
చేతనించు : } సం. అ. క్రి. చైతన్యము నొందు.

చేతపట్టు  దే. స. క్రి. 1. పూనుకొను.
2 సంగ్రహించు.
3. రక్షణకు ఒడంబడు.

చేతప్పుగొను :  దే. అ. క్రి. చేసినదోష మంగీకరించు.
"కొంకు కొసరును చేతప్పు గొనక
యుండు.  పాండు. 1. ఆ.

చేతరించు :  దే. అ. క్రి. మూర్ఛదేఱు.  వ. వి.

చేరవులు :  దే. స. క్రి. వెంటతగులు.

చేతించు :  సం. అ. క్రి. చైతన్యముకలుగు.

చేతికిఁదగులు :  దే. అ. క్రి. నష్టపోవు.

చేతులు తడియగు :  దే. అ. క్రి. లంచము లభించు.

చేతులు నెత్తికివచ్చు :  దే. అ. క్రి. పరమదరిద్రు డగు.

చేతులు పచ్చఁబడు :  దే. అ. క్రి. లంచము లభించు.

చేతులు పిసికికొను :  దే. అ. క్రి వశముతప్పు.

చేఁదప్పు :  దే. అ. క్రి. వశము తప్పు.

చేదించు :  దే. స. క్రి. చేదునట్లుగాచేయు.
అ. క్రి. 1. కలుషుగా నగు
2. ఇష్టము గాకపోవు.

చేదోడువడు :  దే. స. క్రి. సాయపడు.

చేఁదు :  దే. స. క్రి. నీళ్ళుతోడు (బావినుండి)

చేఁపు :  దే. అ. క్రి. పాలు స్రావోన్ముఖమగు

చేఁపురించు :  దే. స. క్రి. చేఁపఁజేయు.

చేనుద్రొక్కించు :  దే. స. క్రి. పశువులను జేలలోఁ ద్రొక్కించు.

చేపట్టు :  దే. స. క్రి. స్వీకరించు, పెండ్లాడు, ఆశ్రయించు
కైకొను.

చేపట్టుచేయు : దే. స. క్రి. శుద్ధిచేయు. హంస. వి. 2 ఆ.
చేపడు : దే. అ. క్రి. లభించు, వశమగు.
చేబదులిచ్చు : దే. స. క్రి. వడ్డీకి బదులిచ్చు.
చేమఱచు : దే. స. క్రి. మఱచు.
చేమిరిపడు : దే. అ. క్రి. విఱుగుపగు (పాలు విఱుగుటకు తోడుబెట్టు.)
చేమొగుచు :
చేమోడుచు :
చేమోడ్చు : } దే. స. క్రి. నమస్కరించు.
చేయఁబట్టు : దే. స. క్రి. చేయించు.
చేయాడు : దే. అ క్రి. వీలుకలుగు, వ్యయపెట్టుటకు డబ్బు కలుగు.
చేయించు : దే. అ. క్రి. చేయు ప్రే.
చేయికాచు : దే. స. క్రి. వదలిపెట్టు, ఆదుకొను, రక్షించు.
చేయికాల్చుకొను: దే. స. క్రి. వండు,
చేయిచేసికొను : దే. స. క్రి. తాడించు, పనిచేయుటకు ప్రారంభించు.
చేయిపచ్చనగు ; దే. అ. క్రి. సంపద కలిగియుండు.
చేయిమిగులు : దే. అ. క్రి అధికమగు.
చేయివిదల్చు : దే. స. క్రి. దానముచేయు.
చేయిచ్చు : దే. స. క్రి. 1. కేలూఁతయిచ్చు.
2. సహాయపడు.
చేయు : దే. స. క్రి. 1. ఒనర్చు. 2. సృజించు.
చేరఁదీయు : దే. స. క్రి. దగ్గఱకుఁ దీయు.
చేరఁబడు . దే. అ. క్రి. సమీపించు; కలియు.
చేరకట్టు : దే. అ. స. క్రి. సమీపించు, వచ్చు, ప్రవేశించు, కూడు, పొందు.
చేరగిలఁబడు : దే అ. క్రి. డస్సిపోయి దేనినో ఆధారముగా చేసికొని కూర్చుండు.

చేరదీయు : దే. స. క్రి. ఆశ్రయమిచ్చు.
చేరవేయు : దే. స. క్రి. కొనిపోవు; కూడఁబెట్టు.
చేసుకట్టు : దే. స. క్రి. చేరకట్టు.
చేసుకొను : దే. అ. క్రి. కూడికొను.
చేసుద్రావు : దే. స. క్రి. పశువులు లింగమును చుంబించుకొనుచు మూత్రపానము చేయు.
చేరుచు (ర్చు) : దే. స. క్రి. చేరు ప్రే.
చేయుపడు : దే. స. క్రి. చేరు.
చేరువలుచు : దే. స. క్రి. చేరునట్లు చేయు.
చేర్లుకొట్టు : దే. స. క్రి. (పశువులకు) ముష్కమర్దనము చేయు.
చేలించు : దే. అ. క్రి. చలించు.
చేవదలు : } దే. స. క్రి. విడిచిపెట్టు.
చేవిడుచు : }
చేవ్రాలుచేయు: } దే. స. క్రి. సంతకము చేయు.
చేవ్రాలుపెటు : }
చేవిచ్చు : దే. స. క్రి. నమస్కరించు.
చేవీచు : దే. స. క్రి. చెయ్యివీచు.
చేవెలవాపు : దే. స. క్రి. లజ్జవాపు.
చేష్టించు : దే. స. క్రి. బ్రతుకుజేయు.
చేసడలు : దే. అ. క్రి. జాఱు.

# చ

చంకలబంటిగా మెసవు : దే. స. క్రి. సమృద్ధిగాఁ దిను.
చంకలుకొట్టు :
చంకలుతట్టు : } దే. అ. క్రి. ఉత్సహించు.
చంకలువైచుకొను : దే. అ. క్రి. సంతోషపడు.
చంగలించు : దే. అ. క్రి. చలించు.
చండించు : దే. స. క్రి. నుచ్చరించు.
చండివడు : దే. అ. క్రి. మొండికెత్తు.
చందగు : దే. అ క్రి. హితనగు. నిర్వ. 4 ఆ.
చందమగు : దే. అ. క్రి. న్యాయమగు. ఇంద. 3 ఆ.
చందముగొనివచ్చు : దే. స. క్రి. ఒకరీతిగాచేయు. భార.విరా.2 ఆ.
చందమైపొసగు : దే. అ. క్రి సిందూరమై యొప్పు ఆము. 1ఆ.
చందమొందు : దే. స. క్రి. స్థితినందు భార.శాం.1ఆ.
చందుమీఱు : దే. అ. క్రి. శోభిల్లు.
చంపు : దే. స. క్రి. వధించు.
చంపుకుతిను : దే. స. క్రి. వేధించు.
చకణ్ణముపడు : దే. అ. క్రి. ఎక్కసెక్కములాడఁబడు.
చక్కఁగఁజేయు: దే. స. క్రి. నిర్మూలముచేయు.
భార. ఉద్యో. 2 ఆ.
చక్కఁగటు : దే. స. క్రి. బాగుగా బిగించికట్టు.
చక్కఁజూచు : దే. స. క్రి. బాగుగాచూచు. (రూ. చక్కంజూచు)
చక్కజేయు : దే. స. క్రి. చంపు, పరిష్కరించు, పూర్తిఁజేయు, సరిచేయు.
చక్కఁబడు : దే. అ. క్రి. కుదురు, పొసగు, తిన్ననగు, తనియు, బాగుపడు.

చక్కఁబెట్టు  దే. స. క్రి. దోచుకొనిపోవు. (దొంగలు ఇల్లు చక్కబెట్టిరి.)
చక్కఁబోవు : దే. అ. క్రి. ఏమాట లాడకుండ పోవు.
చక్కటికిఁదెచ్చు:
చక్కటికిదిద్దు : } దే. స. క్రి. సమర్థించుకొను.
చక్కటికివచ్చు : దే. అ. క్రి. దగ్గఱకు వచ్చు, సమీపించు.
చక్కటిచెప్పు : దే. అ. క్రి. న్యాయముచెప్పు. భా. రా. యు.
చక్కటియెఱుఁగు: దే. అ. క్రి. న్యాయము తెలియు.
చక్కటులు దీర్చు: దే. అ. క్రి. తగవులు తీర్చు.
చక్కట్లు దిద్దు : దే. స. క్రి. చక్కఁబఱచు; చక్కఁబెట్టు.
చక్కడఁగు : దే. అ. క్రి. చచ్చు.
చక్కడఁచు . దే. స. క్రి. ప్రే. చంపు.
చక్కడుచు : దే. స. క్రి. 1. చంపు. 2. ఖండించు.
చక్కదమగు : దే. అ. క్రి. అందమగు.
చక్కనగు : దే. అ. క్రి. తిన్ననగు, సిద్ధమగు, న్యాయమగు.
చక్కాడు : దే. స. క్రి. ఖండించు,
చక్కాబోవు : దే. అ. క్రి. చక్కఁబోవు.
చక్కిఁజిక్కు : దే. అ. క్రి. ఒకప్రదేశమున నిముడు. కు. సం. 6 ఆ.
చక్కినిక్కు : దే. అ. క్రి. ఒకప్రదేశమున పైకిపొడుచుకొను.
చక్కిలిగింతలుగొను: దే. అ. క్రి. చక్కిలిగింతలుపోవు.
స. క్రి. చక్కిలిగింతలు పెట్టు.
చకుక్కగావించు : దే. స. క్రి. చకు్కచేయు.
చకుక్కచక్కను : దే. అ. క్రి. ఆడుటయందు ధ్వనిచేయు.
చకు్క చీరికసేయు: దే. స. క్రి. ముక్కలు గావించు.

"గీ. పాపకర్మల రాక్షసభటులఁ బట్టి
చకు్కచీరిక సేయుచు చనుఁడుమీఱు."

వి. పు. 4 ఆ

చక్కచేయు : దే. స. క్రి. ఖండించు.
చక్కాసు : దే. అ. క్రి. సరియగు.
చక్కాలుపు : దే. స. క్రి. సరిచేయు.
చచ్చినట్లుచేయు: దే. అ. క్రి. ఎదురుచెప్పక చేయు.
చచ్చు : దే. అ. క్రి. మరణించు.
చచ్చు(ప)వడు : దే. అ. క్రి. సత్తువపోవు.
చటాలున లేచు : దే. అ. క్రి. హఠాత్తుగా లేచు.
(చూ. తటాలున లేచు.)
చట్టలుచఱచు : దే. అ. క్రి. 1 చేతులతో రేఖగా చఱచు.
హరి. పూ. 9 ఆ.
2. ఊరు భుజాస్ఫాలనము చేయు.
చట్టలుచీరు : దే. స. క్రి. తొక్కలు ఖండించు, వధించు.
చట్టలుదూయు :
చట్టలుద్రుంచు: } దే. స. క్రి. చంపు.
చట్టలువాపు :
చట్టుప(వ)డు : దే. అ. క్రి. స్తబ్ధమగు, కూపఖననాదికమున శిలా ప్రదేశము తగులు.
చట్టుబండలగు : దే. అ. క్రి. వ్యర్థమగు; నాశనమగు.
చట్టుమోపు : దే. స. క్రి. శిక్షగా రాలు మోపించు.
చతాలించు : దే. అ. క్రి. విజృంభించు.
చతికిలపడు : దే. అ. క్రి. కూలఁబడు.
చతికిలు : దే. అ. క్రి. పిట్టలు నేల సొచ్చు.
చత్వారమొదవు : దే. అ. క్రి. దృష్టిమాంద్యమగు. చం. 2 ఆ.
చదరంగమాడు : దే. అ. క్రి. చదరంగపుటాట యాడు.
చదరమగు : దే. అ. క్రి. చతురశ్రమగు; నాల్గువైపుల సరిగా నుండు.
చదపడాడు : దే. స. క్రి. చమత్కరించు. క. వ. రా. సుం.

చదికిలపడు :
చదికిలు ; } దే. అ. క్రి. కుప్పగాఁగూలు.

చదియబడు : దే. అ. క్రి. (స్వార్థమున) నలగు, అణగు, నశించు

చదియించు : దే. స. క్రి. చదియు ప్రే.

చదియు : దే. అ. క్రి. నలఁగు, అణఁగు, నశించు.

చదివించు : దే. స. క్రి. చదువు ప్రే. కట్నమునిచ్చు, పెట్టు.

చదుకఁబడు : దే. అ. క్రి. చతికిలఁబడు.

చదుగుబ్ళలాగించు: దే. స. క్రి. చక్రములు లేని బండ్లను లాగించు.

చదుపు : దే. స. క్రి. నలఁగగొట్టు.

చదుము : దే. స. క్రి. నలఁగఁగొట్టు, పిసుకు, రాచు.

చదురత్తచు : దే. స. క్రి. పరిహాసమాడు.

చదురాలగు : దే. అ. క్రి. చాతుర్యము గలదియగు. కు.సం. 9 ఆ.

చదుపడిగ్గు : దే. అ. క్రి. సింహాసనము దిగు. రసిక. 1.

చదురులుపల్కు : దే. అ. క్రి. చతురోక్తులు పలుకు.

చదుపవేయు : దే. అ. క్రి. పెండ్లిలో నేజువాణి జరుపు. వ్యవ.

చదువఁబెట్టు : దే. స. క్రి. చదువవేయు, పోగొట్టు.

చదువవేయు : దే. స. క్రి. అక్షరాభ్యాసముచేయు,

చదువు:
చద్వు : } దే. స. క్రి. పఠించు, అభ్యసించు, వ్యర్థముగా ప్రసంగించు.

చదువుదఁగులు : దే. అ. క్రి. చదివినదానియందనురక్తమగు.

చనవిచ్చు : దే. అ. క్రి. 1. మఱియొకఁడు పరిచయాధిక్యమును ప్రకటించుటకు వీలుగా ప్రవర్తించు.
2. చొరవిచ్చు.

చనవుచెల్లించు : దే. అ. క్రి. చనవిచ్చు. కోరికచెల్లించు

చనవుసూపు : దే. అ. క్రి. చనవిచ్చు

చనవెఱుఁగు : దే. స. క్రి. అర్హత తెలియు, కు. సం. 10 ఆ.

చను : దే. స. క్రి పోవు. చెల్లు, ప్రసిద్ధముగు, మరణించు, ఒప్పు, నడచు.

చనుదెంచు : దే. అ. క్రి. (గ్రా. చద్దెంచు) వచ్చు, పోవు.
చనుమానమందు: దే. అ. క్రి. స్నేహముతోనుండు.
చనువాఁడగు : దే. అ. క్రి. దక్షుఁడగు.
చన్నవియు : దే. అ. క్రి. ఆవులు పుష్కలముగా పాలిచ్చు
చపచపసేయు ; దే. స. క్రి. తక్కువసేయు. క. న. రా. యుద్ధ
చప్పటగొట్టు : దే. స. క్రి. 1. దిమ్మెసతో అడఁగగొట్టు.
2. సరిచేయు.
చప్పటలగు : దే. అ. క్రి. అణఁగిపోవు.
చప్పటలిడు :
చప్పటలుఁగొట్టు : } దే. అ. క్రి. చప్పటలు చఱచు.
చప్పటించు : దే. స. క్రి. అణఁగఁగొట్టు.
చప్పటులుపెట్టు : దే. అ. క్రి. చప్పటులు వేయు.
చప్పడించు : దే. స. క్రి. అణఁగఁగొట్టు.
చప్పపడు : దే. అ. క్రి. 1. వస్తువు నిలువయుండుటచే
రుచి మారు.
2. నీరసపడు.
చప్పరించు : దే. స క్రి. 1. నాలుకతో నాస్వాదించు; చులకన
చేయు, నమలు, నిరసించు, తట్టు,
చఱచు.
2. ఇతరధనమును హరించు.
చప్పలించు : దే. స. క్రి. చప్పరించు.
చప్పు : దే. స. క్రి. నమలు, చప్పరించు.
చప్పుడించు : దే. అ. క్రి. ధ్వనిచేయు.
చబుకుసేయు : దే. స. క్రి. చబుకుతోఁగొట్టు.
చమరు : దే. స. క్రి. రాచు, చంపు, అణఁచు, పూయు.
మర్దించు.
చముదు : దే. స. క్రి. చమరు.

చరచు : దే. స. క్రి. ఆస్ఫాలించు, పందెమునొడ్డు. కొట్టు, ప్రే. చరపించు.

చరము : దే. స. క్రి. రుద్దు. "జాలెత్తి జేగురుల్ చరముక పాఱుసెలయేఱులన. క.వ.రా.కిష్కింం.

చరలాటమాడు : దే. అ. క్రి. క్రీడించు.

చరలాడు : దే. అ. క్రి. చెర్లాడు.

చర్లాడు : దే. అ. క్రి. క్రీడించు.

చఱుము : దే. స. క్రి. నిముఱు, వాద్యముచఱచు.

చఱుముకొను : దే. అ. క్రి. వ్యాపించుకొను.

చఱచు : దే. స. క్రి. చేతితోతట్టు, వాయించు.

చఱిగొను : దే. అ. క్రి. ఱాయ అగు. ద్వి. భా. 1 ఆ.

చలపకారమొందు: దే. అ. క్రి. పట్టుదల కలుగు. కాశీ. 7 ఆ.

చలపట్టు :
చలపొడుచు :
చలపోరు :
చలముకొను :
} దే. అ. క్రి. పట్టు పట్టు, మచ్చరము వహించు.

చలాచలిఁబొందు: దే. అ. క్రి. మిక్కిలి కదలు. కు. సం. 4 ఆ.

చలిదికట్టించిత్రిప్పు: దే. స. క్రి. ఒకచోటనైనను నిలువ వీలులేకుండు నట్లు త్రిప్పు.

చలిదిబాఱు : దే. అ. క్రి. నెత్తురు చెడు. (నె.జి)

చలిదీఱు : దే. అ. క్రి. భయ ముడుగు.

చలిపట్టు : దే. అ. క్రి. చలిచే బాధపడు; శీతఋతువు మొదలుపెట్టు.

చలిపాపు : దే. స. క్రి. చలిపోగొట్టు.

చలిపిసోకు : దే. స. క్రి. ఆటలమ్మవంటి వ్యాధితో గుడ్లుగుడ్లుగా పొటమరించు.

చలివదల్చు : దే. స. క్రి. 1. పొగరు దింపు.
2. సంకోచము వదల్చు.

చలివాపు : దే. స. క్రి. ఓదార్చు; భయమును దీర్చి బుజ్జగించు.
చలివిడుచు : దే. అ. క్రి. జంకు తీఱు, తెగించు.
చలుపు(ల్పు) : దే. స. క్రి. చేయు, కడపు, బాధించు.
చలువచేయు : దే. స. క్రి. 1. వస్త్రములను తెలుపుచేయు.
2. శైత్యము క్రమ్ము.
3. మేలుచేయు.
చలువదీర్చు : దే. అ. క్రి. జలుబు పుట్టు.
చలువపట్టు : దే. అ. క్రి. జలుబుచేయు.
చలువమందులు(త్రె)దెచ్చు : దే.స.క్రి. శిశిరోపచారములుచేయు. (మిం)
చల్లచే(సే)యు : దే. స. క్రి. 1. పజ్జిగచేయు.
2. సుఖపెట్టు.
3. శాంతింపఁజేయు.
చల్లపడు : దే. అ. క్రి. శాంతించు, కాళ్ళు చల్లపడు. (వ్యవ.)
చల్లనారు : దే. అ. క్రి. చల్లనగు.
చల్లరించు : దే. స. క్రి. చల్లపడఁజేయు.
చల్లారించు : దే, స. క్రి. చల్లరించు.
చల్లాడు : దే. అ. క్రి. జలక్రీడలాడు.
చల్లారు : దే. అ. క్రి. 1. వేడితగ్గు.
2. ఉపశమించు.
3. నిప్పు ఆఱు.
4. కోపము తగ్గు.
చల్లారు(ర్చు)చు: దే. స. క్రి. చల్లారు ప్రే.
చల్లించు : దే. స. క్రి. నీరు మొదలైనవి చల్లునట్లుచేయు.
చల్లు : దే. స. క్రి. నీళ్లుమొదలైనవి చిమ్ము, విత్తులు చల్లు.
చల్లుకొను : దే. స. క్రి. (స్వార్థమున) చిమ్ము.
చల్లుపోరాడు :
చల్లులాడు : } దే. అ. క్రి. జలక్రీడ చేయు.

చవటబాఱు : దే. అ. క్రి. మొద్దుబాఱు, సారముగోలుపోవు.
చవిగొను :
చవిచూచు : } దే. స. క్రి. రుచిచూచు
చవిలెపోవు : దే. అ. క్రి. సన్నగిల్లు.
చవుకగు : దే. అ. క్రి (రూ. చౌకగు.) చులకనగు.
చవుకపడు : దే. అ. క్రి. (రూ. చౌకపడు) హీనపడు, తేలికపడు, వెలతగ్గు.
చవుకపఱచు : దే. స. క్రి. (రూ. చౌకపఱచు.) క్రే. చవుకచేయు చులకనచేయు.
చవుకళించు : దే. అ. క్రి. (రూ. చౌకళించు.) 1. కదలించు. 2. దూడలు మొ॥నవి ఎగిరిగంతులిడు. 3. ప్రకాశించు.
చవుకసేయు : దే. స. క్రి. (రూ. చౌకసేయు) తేలికచేయు.
చవుప : దే. స. క్రి. చేతితో నిమురు.
చవుఱుపుట్టు :
చవులూరు : } దే. అ. క్రి. రుచిపుట్టు.

# చా

చాఁగఁబడు ; దే, అ. క్రి. సాష్టాంగపడు,
చాఁగఱఁగొట్టు : దే. స. క్రి. (చాగఱ+కొట్టు)చంపు. ఉ.హరి.3 ఆ.
చాఁగఱగొను :
చాఁగఱలాడు : } దే. స. క్రి. చావఁగొట్టు, ఖండించు.
చాఁగిలఁబడు;
చాఁగిలు(ల్లు) : } దే. అ. క్రి. సాష్టాంగపడు.
చాఁగు : దే. అ. క్రి. నిగుడు.
చాఁగొట్టు . దే. స. క్రి. చావఁగొట్టు.

చాచు : దే. స. క్రి. పొడిగించు, విప్పు, సాఁగజేయు, ప్రసరింపఁజేయు.

చాఁదు : } దే. స. క్రి. 1. అలము; పూయు.
చాఁదుకొను: } 2. దంచుచు ధాన్యము ప్రోవుసేయు.

చాఁపకట్టు : దే. స. క్రి. మడచివేయు.

చాఁపకట్టువడు : దే. అ. క్రి. చాపపఱచినట్లగు.

చాఁపు : దే. స. క్రి. చాచు ప్రే.

చాకట్టుపెట్టు : దే. స. క్రి. చక్కట్టుపెట్టు. చేతికి నగలుపెట్టు, అలంకరించు.

చాఁకిరీచేయు : దే. స. క్రి. హీనదాస్యముచేయు.

చాకు : దే. స. క్రి. పోషించు.

చాఁగించు : దే. స. క్రి. పోనిచ్చు

చాఁగు : దే. అ. క్రి. పోవు, ప్రవహించు, తిరుగు, జరుగు, ఏర్పడు, (బంతిసాగు) మొదలుపెట్టు.

చాటించు : దే. స. క్రి. చాటు ప్రే.

చాటు : } దే. స. క్రి. ప్రకటించు.
చాటుగొను: }

చాఁటునప(వ)డు: దే అ. క్రి. మఱుఁగునపడు.

చాటుసేయు : దే. స. క్రి. మఱుఁగుసేయు

చాణీలుపడు : దే. అ. క్రి. ఎకసెక్కములాడినఁబడు.

చాతు(త్తు) : దే. స. క్రి. శిఖాయజ్ఞోపవీతములు ధరించు.

చాపటిబోయు : దే. అ. క్రి. దోసెబోయు.

చాపుసేయు : దే. స. క్రి. వెడల్పుగాఁజేయు; పెద్దగా చేయు.

చాయువాఱు : దే. అ. క్రి. పొడకట్టు.

చాప : దే. స. క్రి. పారకకట్టలడుగుతో నూఱిచినకళ్ళము నూర్చు.

చాలించు : దే. స. క్రి. నిలుపు, విరమింపఁజేయు, తగినట్లు చేయు.

చాలు : దే. అ. క్రి. సమర్థమగు.
చాలుకొను : దే. అ. క్రి. శ్రేణి కట్టు.
చాలుపట్టు : దే. స. క్రి. దున్ను
చాలుపడు : దే. అ క్రి. శ్రేణికట్టు.
చాలువారు : దే. అ. క్రి. సమృద్ధమగు; శ్రేణిగా నేర్పడు.
చాలుసేయు : దే. స. క్రి. మాను, విరమించు. భాగ. 6 స్కం.
చాలెత్తు : దే. అ. క్రి. చాలుదున్ను,
చాల్పడు : దే. అ. క్రి. చాల్పడు.
చావఁగొట్టు :
చావమోదు : } దే. స. క్రి. ఎక్కువ దెబ్బలుకొట్టు.
చావఁజూచు : దే. స. క్రి. చంపు. భార. శాం. 1 ఆ.
చావు : దే. అ. క్రి. 1. మరణించు.
2. బాధపడు.
3. సత్త్వహీనుఁడగు.
4. ఓడిపోవు.

# చు

చుంచుదువ్వు : దే. స. క్రి. కూకటి పుడికి బుజ్జగించు.
చుండించు : దే. స. క్రి. చుండు ప్రే.
చుండు : దే. అ. క్రి. ఆకులు లోనగునవి యెండు.
చుక్కపొడుచు : దే. అ. క్రి. 1. శుక్రోదయమగు.
2. ఒడలిమీఁదచుక్కపొడిపించుకొను
3. గుడ్డలమీఁద చుక్కలుగా వచ్చు (అట్టి వస్త్రము నాచారపరులు ధరింపరు.)
4. ఉత్తమజాతి మామిడిపండ్లపై పక్వదశను తెలుపు చుక్క లేర్పడు.

చుచ్చుకొట్టు : దే. అ. క్రి. సంతాపముచే చూత్కరించు. (నాలుకచివరచే 'చ్' అని ధ్వనిచేయు.)

చుట్టంబెట్టు :
చుట్టబెట్టుకొను: } దే. స. క్రి. 1. చుట్టుకొను; ఆక్రమముగా కైవసము చేసికొను.
2. పూర్తిచేయు.
3. ప్రదక్షిణించు.

చుట్టలుగొను : దే. అ. క్రి. చుట్టుకొను.

చుట్టలువెట్టు : దే. స. క్రి. చుట్టుతిరుగు, బాధించు.

చుట్టివచ్చు : దే. స. క్రి. పరివేష్టించి వచ్చు, ప్రదక్షిణించు, తిరిగివచ్చు.

చుట్టు : దే. స. క్రి. తిరుగు, మూండు, మూంగు, పరివేష్టించు ప్రదక్షిణించు.

చుట్టుకొను : దే. స. క్రి. ఆవరించు.

చుట్టుకొలుపు : దే. స. క్రి. చుట్టుకొను ప్రే.

చుట్టుపడు : దే. స. క్రి. పెనంగొను.

చుట్టుముట్టు : దే. స. క్రి. ముట్టడించు.

చుట్టువాఱు : దే. స. క్రి. మూంగు.

చుట్టువిడియు : దే. స. క్రి. చుట్టుముట్టు.

చుట్టంబెట్టు : దే, స. క్రి. పూర్తిచేయు, ప్రదక్షిణించు.

చుట్టువెట్టు : దే. స. క్రి. ప్రదక్షిణించు, బాధించు.

చునాయించు : దే. స. క్రి నుడతవెట్టు; అన్నిటిని పరిశీలించి ఒకటి తీసికొను, ఏరుకొను, వెదకు.

చుబ్బనచూఱలాడు: దే. స. క్రి. మిక్కిలి కొల్లగొను.

చుమ్మలుచుట్టు:
చుమ్మలువాఱు: } దే. అ. క్రి. మిక్కిలి బాధనొందు.

చుయికొట్టు : దే. అ. క్రి. చుయ్యిమను.

చురచురలాడు : దే. అ. క్రి. తీవ్రకోపము ప్రదర్శించు; చురచుర మను శబ్దముతో మండు.

చురచురవోవు : దే. అ. క్రి. మండు.
చుఱపు(వు)చ్చు: దే. స. క్రి. దహించు; బాధపెట్టు.
చుఱ్ఱడఁచు : దే. స. క్రి. బాధకల్గించు.
చుఱ్ఱను : దే. అ. క్రి. 1. చుఱుక్కుమను.
2. మనసులో బాధపడు.
చుఱుక్కను : దే. అ. క్రి. చుఱుకుగా కాలు.
చుఱ్ఱుకొను : దే. స. క్రి. కాల్చు. హంసవిం. 2 భా.
చుఱ్ఱుమను : దే. అ. క్రి. చుఱుక్కను.
చులకఁజూచు : దే. స. క్రి. నిరసించు, తేలికపఱచు.
చులుకఁజేయు : దే. స. క్రి. నిరసించు, తేలికపఱచు.
రూ. చుల్కఁజేయు.
చులుకపడు : దే. అ. క్రి. తేలికపడు.
చులుకసేయు :
చుల్కలుసేయు: } దే. స. క్రి. నిరసించు, తేలికపఱచు.
చుల్లరపెట్టు : దే. స. క్రి. బాధపెట్టు.

# చూ

చూఁడించు : దే. స. క్రి. తగులఁబెట్టు.
చూఁడు : దే. స. క్రి. వాతపెట్టు, కాల్చు.
చూకురుపడు : దే. అ. క్రి. దుఃఖించు.
చూచిపెట్టు : దే. స. క్రి. వ్యవహారము చేసిపెట్టు.
చూచివాడుకొను: దే. స. క్రి. జాగ్రత్తగా వాడుకొను.
చూఁచు : దే. స. క్రి. దర్శనక్రియఁ జేయు.
చూచుకొను : దే. స. క్రి. ఏరుకొను.
ఉ. తగిన భార్యను చూచుకొనెను.
చూతఁడు (చూతండు): దే. అ. క్రి. చూతము. (ఉభయ ప్రార్థనార్థకములో.) బస. పండి.

చూపించు : దే. స. క్రి. చూచు ప్రే.

చూపట్టు :
చూపడు : } దే. అ. క్రి. కనఁబడు.

చూపిడు : దే. స. క్రి. లక్ష్యముంచు.

చూపుండు : దే. స. క్రి. ఆసక్తియుండు, దృష్టి కలిగియుండు.

చూపు : దే. స. క్రి. చూచు ప్రే.

చూపెట్టు : దే. స. క్రి. చూపించు, కనిపెట్టు.

చూపెట్టుకొని యుండు : దే. అ. క్రి. కనిపెట్టికొనియుండు.

చూపెట్టుకొనిగడుపు: దే. స. క్రి. జాగ్రత్తగా నున్న సొమ్మును వాడి కాలక్షేపము చేయు.

చూపోవు : దే. స. క్రి. సహించు.

చూరు : దే. స. క్రి. పొగచూరుపట్టు.

చూఱఁగొను :
చూఱఁదెచ్చు :
చూఱకొను :
చూఱకోలుకొను :
చూఱలుపె(వె)ట్టు: } దే. స. క్రి. కొల్లగొను.

చూఱపో(వో)వు : దే. అ. క్రి. కొల్లపోవు.

చూఱయిచ్చు : దే. స. క్రి. కొల్లగొను.

చూఱలాడు : దే. స. క్రి. దొంగిలించు. శుక.

విస్తారముగా తిరుగు.

చూఱలిచ్చు :
చూఱలుకొను :
చూఱఁదెచ్చు :
చూఱలుప(వ)ట్టు :
చూఱలుపు(వు)చ్చు :
చూఱలుసేయు : } దే. స. క్రి. కొల్లగొను.

చూఱవిడుచు : దే. స. క్రి. కొల్లగొననిచ్చు.
చూఱాడు: దే. స. క్రి. కొల్లగొను.
చూలుకొను : } దే. అ. క్రి. గర్భము ధరించు
చూలువడు : }

# చొ

చొక్కమగు . దే. అ. క్రి. అందమగు.
చొక్కించు : దే. స. క్రి. పరవశింపఁ జేయు.
చొక్కిడు : దే. స. క్రి. చొక్కుమందు పెట్టు.
చొక్కిపడు : దే. అ. క్రి. సోలిపడు, ఆశ్చర్యపడు.
చొక్కిలు(ల్లు) : దే. అ. క్రి. వ్యామోహపడు, శోషపోవు
చొక్కెఁపృపోవు : దే. అ. క్రి. (స్వార్థమున) సొమ్ములు గుంటలువడు.
సొట్టలు పడు.
చొక్కు : దే. అ. క్రి. శోషపోవు, పరవశమగు.
తృప్తినొందు.
చొక్కుపెట్టు : దే. స. క్రి. మత్తుమందు పెట్టు.
చొక్కుమణఁగు : } దే. అ. క్రి. వివశత్వము నందు
చొక్కెక్కు : }
చొచ్చిలు(ల్లు) : దే. స. క్రి. ప్రవేశించు.
చొచ్చివచ్చు : దే. అ. క్రి. మీఁదికి త్రోసికొనివచ్చు.
చొచ్చు : }
చొచ్చుకొను : } దే. అ. క్రి. ప్రవేశించు, దూరు.
చొత్తెంచు : }
చొనుపు : దే. స. క్రి. ప్రవేశపెట్టు, నాఁటు, తూర్చు.
చొప్పడు : దే. అ. క్రి. కలుగు, ఒదవు, సరిపడు.
చొప్పించు : దే. స. క్రి. చొనుపు.

చొప్పరించు : దే. స. క్రి. చొప్పడు ప్రే.
చొప్పరికించు : దే. స. క్రి. దర్శించు, పరికించు.
చొప్పఱచు : దే. స. క్రి. చొప్పడఁజేయు.
చొప్పిల్లు : దే. అ. క్రి. చొప్పడు.
చొప్పుడించు : దే. స. క్రి. పాడుచేయు.
చొఱఁబడు : } దే. స. క్రి. ప్రవేశించు.
చొఱఁబాఱు : }
చొఱఁబెట్టు : దే. స. క్రి. ప్రవేశపెట్టు.
చొఱవలుసేయు: దే. అ. క్రి. సాహసము చేయు.
చొఱవేయు : దే. స. క్రి. ప్రవేశించు.
చొలయు : దే. అ. క్రి. జంకు, వెనుదీయు.

## చో

చోకు : దే. స. క్రి. గ్రహములు సోఁకు.
చోడుముట్టు : దే. స. క్రి. నసాళమునంటు; అంతయు వ్యాపించు.
చోద్యపడు : సం. అ. క్రి. ఆశ్చర్యపడు.
చోపానమగు : దే. అ. క్రి. డస్సిపోవు; నెమ్మదిగానడచు.
క. వ. రా. యుద్ధ.
చోపిడు : దే. స. క్రి. పెడకు ద్రోలు.
చోపు : దే. స. క్రి. వేత్రహస్తులు బెత్తములతో పెడకుఁ ద్రోలు.
చోపుపెట్టు : దే. స. క్రి. పైకివచ్చుటకై వేఁటకాండ్రు దాఁగి యున్న మృగాదులను కలచు; పరవఁ ద్రోలు.
చౌకపడు : దే. అ. క్రి. తేలికపడు.
చౌకపఱచు : దే. స. క్రి. చౌకపడు ప్రే.

చౌకళించు : దే. అ. క్రి. గంతులు వేయు.
చౌకసేయు : దే. స. క్రి. తేలికచేయు.
చౌకీయుండు : అన్య దే. అ. క్రి. రక్షణగా నుండు.

ఛ

ఛటాయించు : దే. స. క్రి. వదలు, వదలించు, ఎదురుతిరుగు.
అ. క్రి. కాంతిల్లు.
ఛటాలునలేచు : దే. అ. క్రి. హఠాత్తుగా లేచు.
ఛడాయించు : దే అ. క్రి. ఎత్తువేయు. (వ్యాస)
ఛడేలుమనిపించు: దే. స. క్రి. మ్రోతకలుగునట్లు తాడించు.
ఛరాలుమనిలేచు; దే. అ. క్రి. చిరాలున లేచు, కోపాదులచే హఠాత్తుగా లేచిపోవు.
ఛేదించు : దే. స. క్రి. నఱకు.
ఛేదిల్లు : దే. అ. క్రి. తెగు.

## జ

జంభాలుకొట్టు ·
జంభాలుపలుకు: } దే. అ. క్రి. డాబులుకొట్టు.
జక్షించు : సం. స. క్రి. భక్షించు.
జగడించు : దే. అ. క్రి. పోరాడు.
జడగట్టు : దే. స. క్రి. పూరియింటి కప్పు వెన్నుగాడిపైని అల్లకముచేయు.
జడనుపడు : దే. అ. క్రి. కాంతిహీన మగు.
జడలుకట్టు : దే. అ. క్రి. శిరోజములు జడలు జడలుగా పెనగొనిపోవు.
జత్తాయితంబగు : దే. అ. క్రి. సిద్ధపడు: హేమాబ్జ.
జని(యి)ంచు : సం. అ. క్రి. పుట్టు.
జన్మించు : సం. అ. క్రి. పుట్టు.

జపముచే(సే)యు: సం. స. క్రి. జపించు.

జపముజరుపు : సం. స. క్రి. జపముసేయు. చిత్ర. భా. 3 ఆ.

జపి(యి)ంచు : సం. స. క్రి. మంత్రమును పలుమా రుచ్చరించు.

జప్తుచేయు : అన్య. దే. స. క్రి. ఆస్తిని న్యాయస్థానము స్వాధీనము చేసికొను.

జబరుదస్తీచేయు: అన్య. దే. స. క్రి. 1. అన్యాయముగా బలమును ప్రయోగించు.
2. ఆడంబరముచూపు
రూ. బబర్దస్తీచేయు.

జబ్బ(లు)చఱచు: దే. అ. క్రి. భుజాస్ఫాలనముసేయు, అహంకరించు, అహమహమిక చూపు.

జమాయించు : అన్య. దే. అ. క్రి. 1. ఆడంబరముగా నుండు.
2. త్రిప్పవేయు.
స. క్రి. 1. అనుచు.
2. సమీకరించు.
(సుకుమారీ పరిణయము)

జయచూళిచేకొను: మి. అ. క్రి. 1. సేనాసమూహము దీర్చు. కు. సం.
2. వందిమాగధుల స్తోత్ర పాఠమును స్వీకరించు.

జయజయపెట్టు:
జయపెట్టు : } మి. స. క్రి. జయజయధ్వనిచేయు.

జయించు : సం. స. క్రి గెలుచు.

జరజరనడచు : దే. అ. క్రి. తొందరగాపోవు.

జలకమాడు : సం అ. క్రి. స్నానముచేయు.

జలకమార్చు దే. స. క్రి. అభిషేకింపఁజేయు.

జలగడుగు : దే. స. క్రి. 1. సంపూర్ణముగా ప్రక్షాళనము సేయు
2. ఎదుటివాని సర్వవిషయములను వక్కాణించు, జల్లను కడుగు.
క. ప. రా. అర.
3. ధనము పూర్తిగా పాడుచేయు.
(న్యా.)

జలజలలాడు : దే. అ. క్రి. జలజల స్రవించు.

జలమాడు : సం. అ. క్రి. స్నానముచేయు.

జల్లగడుగు : దే. స. క్రి. 1. కంసాలి కుంపటి బూడిదను శోధించి కడిగి బంగారము కోసము వెదకు.
2, సంపూర్ణముగా ధననాశము సేయు.

## జా

జాగరించు : సం అ. క్రి. జాగరము సేయు.

జాత్రవచ్చు : వై. అ. క్రి. యాత్రార్థమై వచ్చు.

జాపరమేశ్వరాయను : మి. అ. క్రి. పాఱిపోవు.

జాప్యము సేయు : దే. అ. క్రి. ఆలస్యము చేయు.

## జి

జిగజిగలాడు : దే. అ. క్రి. జిగిదేఱు.

జిగురుకొను : దే. అ. క్రి. జిగురెక్కు.

జిగురుసాగు : దే. అ. క్రి. జిగురుపొందు.

జిగేలుమను : దే. అ. క్రి. మిఱుమిట్లుగొను.

జిడ్డుగొను :
జిడ్డుదేఱు :
జిడ్డుపడు : } దే. అ. క్రి. జిడ్డుపట్టు.

జిడ్డుపఱచు : దే. స. క్రి. జిడ్డుపడు ప్రే.

జిడ్డువదలు : దే. స. క్రి. పోగొట్టుకొను. (ధనాదికము.)

జిద్దుగొను ; దే. అ. క్రి. ఎదుర్కొను.
జినుగుప(వ)ట్టు: దే. అ. క్రి. 1. వృద్ధి కాకపోవు.
2. నీటితంపి (చిచ్చు) హెచ్చు కాగా ఎదుగకపోవు. (వృక్షాదికము)
జిబ్బయిపోవు : దే. అ. క్రి. స్తంభించిపోవు. క. వ. రా. బాల.
జినుజిమలాడు : దే. అ. క్రి చినుచినులాడు.
జిమ్మ్మ : దే. స. క్రి. చిమ్మ.
జిమ్మనలాగు : దే. అ. క్రి. జివ్వుమనునట్లు లాగు.
జిఱకొట్టు : దే. అ. క్రి. (ధ్వన్యనుకరణము) గుఱ్ఱుమను.
జిఱ్ఱతిరుగు : దే. అ. క్రి. అవశమై తిరుగు; దిమ్మెక్కి తిరుగు.
జిఱ్ఱవోవు : దే. అ. క్రి. చెవులు దిబ్బెడపడు.
జిలజిలలాడు : దే. అ. క్రి. దురదపెట్టు.
జిలిబిలివోవు : దే, అ. క్రి. అందగించు.
జిల్లాయిపెట్టు : దే. స. క్రి. పిల్లలాడుకొనుచు నడిమిబ్రేలిమీఁద చూపుడుప్రేలెక్కించి, యాతలి వాడు తాఁపినచో దొంగ కాకుండ నానపెట్టు.
జిల్లుమను : దే. అ. క్రి. 1. నెత్తురు మొ. వెలికుబుకు.
2. ఒక ఆశ్చర్యవార్త వినికాని,మిక్కిలి చల్లనివస్తువు తాఁకికాని, ఒడలుకదలు. వికారము పొందు.
జివ్వనలాఁగు : దే. అ. క్రి. జివ్వుమనునట్లు లాఁగు.
జివ్వాడు : దే. అ. క్రి. కదలు.
జివ్వుమను : దే. అ. క్రి ఒక ఆశ్చర్యకరమైన వార్త వినికాని, మిక్కిలి చల్లని వస్తువు తాకికాని వికారము పొందు.

# జీ

జీడప(వ)ట్టు : దే. అ. క్రి. చీడపట్టు.
1. తెవులువచ్చి చెట్లు వర్ధిల్లకపోవు.
2. పీడ తగులు.

జీడిపట్టుపట్టు : దే. అ. క్రి. ఇచ్చేడివరకును గట్టిగా పట్టు.

జీడిపె(వె)ట్టు : దే. స. క్రి. 1. అపకారము చేయు.
2. నల్లజీడి కాల్చి యంటించు.

జీతమిచ్చు : దే. స. క్రి. జీతమొసఁగు.

జీతముగను : దే. అ. క్రి. జీతము తీసికొను.

జీతము చేయు : దే. స. క్రి. ఉద్యోగమిచ్చు.

జీతమొసఁగు : దే. స. క్రి. నెలభృతి యిచ్చు.

జీబుకొను : దే అ. క్రి. దట్టమగు.

జీరమునుఱుపు : సం. అ. క్రి. జీలకఱ్ఱనుచేయు. కు. సం. 9 ఆ.

జీరాడు :
జీరుకాడు : } దే. అ. క్రి. వ్రేలాడు (జీరాడు దుప్పటి.)

జీరు : దే. స. క్రి. జేలకు రాయు. (గూ. గీఱు)

జీరుకువాఱు : దే. అ. క్రి. జాఱు.

జీరులాడు :
జీరువాఱు :
జీరులువారు: } దే. అ. క్రి. వ్రేలాడు.

జీర్ణించు : సం అ. క్రి. అఱుగు, ముదియు, ఒంటఁబట్టు.

జీర్ణోద్ధారముచే(సే)యు: సం. స. క్రి. పాడుపడిన దేవాలయాదుల నుద్ధరించు.

జీర్వాపు : దే. అ. క్రి. వ్యాపించు.

జీవచ్ఛవంబగు : సం. అ. క్రి. బ్రతికియు చచ్చినట్లుండు.

జీవనముచే(సే)యు: సం. అ. క్రి. బ్రతుకు.
జీవనాధారమగు : సం. అ. క్రి. జీవించుట కాధారమగు.
జీవములు పోవు: సం. అ. క్రి. ప్రాణముపోవు.
జీవమువచ్చు : సం. అ. క్రి. ప్రాణము వచ్చు.
జీవశ్రాద్ధముపెట్టు: సం. స. క్రి. బ్రతికియుండగానే శ్రాద్ధము పెట్టు.
జీవించు : సం. అ. క్రి. బ్రదుకు.
జీవితమిచ్చు : సం. స. క్రి. బ్రతుకుతెరువు చూపు.
జీవితముచే(సే)యు: సం. స. క్రి. పని కల్పించు.

## జృ

జృంభించు : సం. అ. క్రి. ఆవులించు, చెలరేగు, వికసించు.

## జె

జెఱుగు : దే. అ. క్రి. దాగు.
జెల్లకొట్టు : దే. అ. క్రి. మెడమీద చేతితో కొట్టు.

## జే

జేగురించు :
జేగుడించు: } దే. అ. క్రి. ఎఱ్ఱనగు.
జేజేపె(వె)ట్టు : వై. అ. క్రి. జయజయధ్వని చేయు.
జేపెట్టు : వై. స. క్రి. స్తుతించు.
జేబునింపుకొను: అన్య. దే. అ. క్రి. అన్యాయముగా ధనము బాగుగా సంపాదించు.
జేవురించు : దే. అ. క్రి. జేగురించు.

## జ్వ

జ్వరముప(వ)డు: సం. అ. క్రి. జ్వరమువచ్చు.
జ్వరి(యి)ంచు: సం. అ. క్రి. మండు.

## జై

జైత్రయాత్ర వెడలు: సం. అ. క్రి. దిగ్విజయమునకు బయలుదేఱు.

## జొ

జంకించు : దే. స. క్రి. బెదరించు.

జంకుకొను :
జంకు : } దే. అ. క్రి. భయపడు, సందేహపడు.

జంకెయొనర్చు :
జంకెనచేయు: } దే. స. క్రి. బెదరించు

జంగగొను : దే. అ. క్రి. దాఁటు.

జంగిటిదోలు : అన్య. దే. స క్రి. పశువులమందల తోలు.

జంగిలికొను : అన్య. దే. అ. క్రి. జంగిలిసేయు.

జంజాటించు : దే. అ. క్రి. రొదసేయు.

జంజాటకపడు : దే. అ. క్రి. తగుల్కొను, (సంసారాదులలో.)

జంజాటములుసాగు : దే. అ. క్రి. గడబిడలు సాగు.

జంటించు : దే. స. క్రి. కూర్చు.

జంతతోలు :
జంతపడు : } దే. స. క్రి. కలుపుతెగి చక్కగా పండుటకై పంట చేని నడుమ దున్ను.

జంపారు : దే. అ. క్రి. జవ్వాడు, ఊగు, మందమగు.

జక్కలించు : దే. స. క్రి. గేలిసేయు.

జక్కించు : దే. స. అ. క్రి. 1. కట్టుపడు
2. కట్టుపఱచు.

జక్కిణిగొను : దే. అ క్రి. నృత్యముసేయు.

జకొ్కను : దే. అ. క్రి. దొరకు.

జకొ్కలుపు(ల్పు): దే. స. క్రి. ప్రే. దొరకునట్లుచేయు.

జగడమాడు :
జగడములాడు: } దే. స. క్రి. కలహించు.
జగడించు :

జజ్జుకొను : దే. అ. క్రి. బలహీనత పొందు.

జజ్జుజజ్జగు : దే. అ. క్రి మిక్కిలి నలఁగిపోవు.

జట్టిగొను : దే. అ. క్రి. మొత్తముగా విలుచు, వశపఱచుకొను.

జట్టిదప్పు : దే. అ. క్రి. అమ్ముడువోవు

జట్టియాడు : దే. అ. క్రి. బేరమాడు.

జట్టియిచ్చు :
జట్టియీడు : } దే. అ. క్రి. జట్టిబేరమిచ్చు.

జట్టుకట్టు : దే. అ. క్రి. పక్షమును సిద్ధముచేయు.

జడగట్టు :
జడగొను : } దే. అ. క్రి. జుట్టు జడగట్టు.

జడనుప(వ)డు : దే. అ. క్రి. మందగించు.

జడించు :
జడిపించు : } దే. స. క్రి. భయపెట్టు.
జడియించు :

జడిగొను : దే. అ. క్రి. వర్షించు, ముమ్మరమగు, ఎడతెగకుండ గుంపుగూడు.

జడిగొలుపు : దే. స. క్రి. ప్రే. ఎక్కువగా వర్షించునట్లు చేయు.

జడిప(వ)ట్టు : దే. అ. క్రి. ముసురుపట్టు; మొండిపట్టు పట్టు.

జడిపెట్టు : దే. స. క్రి. బాధపెట్టు, కాలక్షేపముచేయు, వర్షించు.

జడియు : దే. అ. క్రి. భయపడు, కదలు, త్రోలు, నూకు, రాలు, మ్రోయు.

జడ్డుప(వ)డు : దే. అ. క్రి. జడతనొందు, బరువుపడు, మాంద్యము భజించు.

జతకట్టు : దే. స. క్రి. సరిచేయు, జతగా చేయు.
స్నేహముచేయు.
జతకూడు : దే. అ. క్రి. ఇద్దరు కలిసికొను.
స. క్రి. స్నేహముచేయు, సంగమించు.
జతగావించు : దే. స. క్రి. సరిచేయు, జతగా చేయు.
జతనపడు : దే. అ. క్రి. యత్నించు; సమకూడు.
జతనపఱచు : దే. స. క్రి. సమకూర్చు ప్రే.
జతనుపడు : దే. అ. క్రి. పదిలముగా నుండు.
జతపడు : దే. అ. క్రి. పొసగు;
జతపఱచు : దే. స. క్రి. పొసగించు ప్రే.
జతవచ్చు : దే అ. క్రి. సమానమగు.
జతులుపె(వె)ట్టు: దే. అ క్రి. గానముసేయు.
జద్దుపడు : దే. అ. క్రి. పరవశత నొందు.
జన్నిపట్టు : దే. అ. క్రి జన్నిరోగము సోకు.
జన్నియప(వ)ట్టు: దే. అ. క్రి. మీదుకట్టు.
జన్ని(న్నె)యవిడుచు: దే. స. క్రి. అచ్చుపోసిన ఆబోతువలె విడుచు.
జబురుకొట్టు : దే. స. క్రి. ప్రమింగు. ఆము. 2 ఆ
జబురుకొను : } దే. స. క్రి. ప్రమింగు, కశాఘాతము చేయు.
జబులుకొను :
జబ్బుగా నుండు: దే. అ. క్రి. వ్యాధి కలుగు; వదులుగా నుండు.
జబ్బుచేయు : దే. అ. క్రి. రోగము వచ్చు.
స. క్రి. మందగింపఁజేయు.
జబ్బుపడు : దే. అ. క్రి. మందగిల్లు, వ్యాధిగ్రస్తుఁడగు, చెడు, డీలుపడు.
జబ్బువదులు : దే. అ. క్రి. విశ్లథమగు, పొగరు దిగు.
స. క్రి. బిగువు సడలించు.
జమకట్టు : అన్య. దే. స. క్రి. లెక్కగట్టు.

జమలించు ; దే. స. క్రి. జోడించు.

జమిడించు : } దే. స. క్రి. రెండు ఒకటిగా కలుపు.
జమిలించు :

జరగించు : దే. స. క్రి. సాగించు.

జరగు : దే. అ క్రి. నడచు, సాగు, కదలు.

జరపు ; దే. స. క్రి. సాగించు. ప్రే.

జరిగొను : దే. అ. క్రి. చిక్కనడు.

జరుగు : దే. అ. క్రి. జరగు.

జరుపు : దే. స. క్రి. జరుగునట్లుచేయు. ప్రే.

జరువురుచే(సే)యు: } అన్య. దే. స. క్రి. తొందరపెట్టు.
జరూరుచేయు : (లక్ష్మీనారాయణ విలాస యక్షగానము.)

జలగడుగు : దే. స. క్రి. 1. నీటిలో పోసి గాలించు.
2. బాగుగా కడుగు.
3. దోషము లన్ని యేకరుపెట్టి తిట్టు.

జలదరించు : దే. అ. క్రి. చలించు, కంపము నొందు, గగుర్పాటుచు, భయపడు.

జలపరించు : దే. అ. క్రి. జలదరించు.
రూ. జల్లను, జల్లుమను.

జలుబుచేయు : దే. అ. క్రి. శైత్యముచేయు.

జలుబునీళ్ళకారు : } దే. అ. క్రి. పొగరు దిగు.
జలుబువదలిపోవు:

జల్లించు : దే. స. క్రి. పరీక్షించు, శోధించు. చంపు, ధాన్యాదులలో మంటిగడ్డలు మొ॥నవి తీసివేయు.
అ. క్రి. స్రవించు, విడిపడు.

జల్లీవేయించు : అన్య. దే. స. క్రి. 1. లెక్కలుగా కట్టు.
– గుజ్జాలు సరికి గుజ్జాల తోకలు బల్లేలకు జల్లీ వేయించె. బా.క.

జల్లెడపట్టు : దే. స. క్రి. 1. నిగ్గుతేల్చు
2. జల్లెడతో జల్లించు.
జల్లుకొను : దే. అ. క్రి. మూఁగు.
జళికించు : దే. స క్రి. అదలించు.
జళిపించు : దే. స. క్రి. కత్తి జళిపించు, ఆడించు.
జళుకారు : దే. అ. క్రి. మిలమిలలాడు, మించు.
జవకట్టు : దే. అ. క్రి. జతనడు.
జవజవలాడు: దే. అ. క్రి. కంపించు.
జవదాఁటు : దే. స. క్రి. ఉల్లంఘించు.
జవరనేయు : దే. స. క్రి. చక్కగా నేయు.
జవుకు : దే. అ. క్రి. మెత్తగిల్లు, క్రుంగు, భయపడు,
సారహీనమగు, చివుకు.
జవురు : దే. స. క్రి. కొట్టు, తొలగించు, తిరస్కరించు.
రుద్దు.
జవురుసేయు : దే. స. క్రి. ఎవరికి దక్కనది వారు సంగ్రహించు.
జవ్వాడు : దే. అ. క్రి. నడుము ఊఁగాడు,

# జా

జాఁదరాఁడు :
జాఁదరలాడు : } దే. అ. క్రి. గంధపుబొడి ఒకరి మీఁద నొకరు
చల్లుకొను, వసంతములాడు.
జాఁడుకొను : దే. అ. క్రి. చక్కనగు.
జాగిలు : దే. అ. క్రి. జాగుచేయు, జాగునెట్టు.
జాజువాఱు : దే. అ. క్రి. ఎఱ్ఱపడు. (చెక్కలి.)
జాజుసేయు : దే. స. క్రి. ఎఱ్ఱరంగువేయు.
జాడించు : దే. స. క్రి. [సూ. జాళించు.] 1. గుడ్డను నీళ్ళలో
కదలించు

జాడించు
2. బంధువులుగాని స్నేహితులుగాని తన యెడ చేసిన దోషములను వారి మొగముమీాద చెప్పివేయు.

జాడతీయు : దే. స. క్రి. 1. కూపీలు లాగు.
2. ఆచూకీ తీయు.
3. గుట్టు తెలిసికొను.

జాడప(వ)డు :
జాడలుప(వ)డు : } దే. అ. క్రి. మార్గమేర్పడు.

జాడాచే[సే]యు : అన్య దే. స. క్రి. ముగించు.

జాడా మైపోవు : అన్య దే. అ. క్రి. పూర్తియగు,

జాతరసేయు : దే. అ. క్రి. గోలసేయు.
స. క్రి. కొట్టు, హింసించు, దండించు.

జాదుకొను : దే. అ. క్రి. ఉద్భవించు.

జానఱు : దే. అ. క్రి. అందము చెడు.

జానువడు : దే. అ. క్రి. 1. అందమగు.
2. నేర్పుమీాఱు.

జానువాఱు : దే. అ. క్రి. స్పష్టమగు.

జానొందు : దే. అ. క్రి. అందగించు.

జారించు : దే. స. క్రి. జారఁజేయు.

జారవిడుచు : దే. స. క్రి. విడుచు, అవకాశము పోగొట్టుకొను.

జాఱిపోవు : దే. అ. క్రి. 1. చేతిలోనుండి తనకు తెలియకుండ పడు.
2. వ్యవహారము వశము తప్పు.

జారీచేయు : అన్య దే. స. క్రి. 1. అమలుచేయు.
2. ప్రకటించు.
3. వెలువరించు.
4. మంజూరుచేయు,
(ఉత్తరువులు మొ॥ నవి.)

జారు : దే. అ. క్రి. 1. క్రిందపడు.
2. కదలు.
3. భ్రంశముపొందు.
4. చ్యుతమగు.

జారుచు(ర్చు) : దే. స. క్రి. జారునట్లుచేయు ప్రే.

జారువారు : దే. అ. క్రి. స్రవించు.

జారువోవు : దే. అ. క్రి. తొలఁగు.

జాఱు : దే. అ. క్రి. 1. జరగు. (కాలుజాఱి పడ్డాడు.)
2. ఊఱుకు.
3. తప్పించుకొని పాఱిపోవు.
4. వదలు.
5. స్రవించు.
ప్రే. జాఱుచు; జార్చు.

జాఱువాఱు : దే. అ. క్రి. జాఱు.

జాలించు : దే. స. అ. క్రి. 1. దైన్యమునొందు.
2. భయపడు.
3. జలిపించు.
4. విదుల్చు.
5. దులుపు.

జాలిఁబడు : దే. అ. క్రి. 1. పరులదుఃఖమునకు మనసు మెత్తపడు.
2. తానే దుఃఖపడు.

జాలిఁబెట్టు : దే. స. క్రి. ఇతరుని శ్రమపెట్టు.

జాలికు(గు)డుచు : దే. అ. క్రి. దైన్యమునొందు, భయపడు.

జాలిగొను : దే. అ. క్రి. తానే దుఃఖపడు.

జాలిపొందు : దే. అ. క్రి. దైన్యమునొందు. భయపడు.

జాలు(గొ)కొను: దే. అ. క్రి. 1. ప్రవహించు.
2. వరిల్లు.
3. వ్యాపించు.

జాలువాఱు : దే. అ. క్రి. 1. ప్రవహించు.
1. మెల్లగా స్రవించు.

జాలెత్తు : దే. అ. క్రి. జాలుకొను.

జాల్గొను : దే. అ. క్రి. జాలుగొను.

జాల్వారు : దే. అ. క్రి. ప్రవహించు.

జావడమగు : దే. అ. క్రి. 1. అధైర్యపడు.
2. ఓపికలేకపోవు.

## జు

జుంజురించు : దే. అ. క్రి. చెదరు.

జుకాయించు : దే. స. క్రి. బాధపెట్టు, దండించు.

జుజురుకొను : దే. అ. క్రి. గుబురుకొను, చిక్కనగు.

జుట్టనవ్రేలఁజూపు: దే. స. క్రి. 1. చూపుడువ్రేలితో చూపు.
2. భయపెట్టు.

జుట్టుజుట్టుపట్టుకొను: దే. అ. క్రి. పోరాడు

జుట్లుపట్టుకొను : దే. అ. క్రి. పోరాడు.
రూ. జుట్లపందెమగు.

జుడుఁగు : దే. అ. క్రి. 1. భయాదులచే నొదుగు.
2. దాఁగు.
3. వెనుదీయు. (రూ. జుణుఁగు.)

జుణుఁగు : దే. అ. క్రి. తప్పుకొను, వెనుదీయు.

జునుపు : దే. స. క్రి. 1. అపసరిల్లఁజేయు.
2. చోఁపు.

జుబురుకొను : దే. అ. క్రి. గుబురుకొను.

జుబ్బనచూఱలాడు: దే. స. క్రి. మిక్కిలిగా నాస్వాదించు.

జుమాయించు : దే. స. క్రి. కళ్ళెము లాగిపట్టు.

జుఱ్ఱఁజూచు : దే. స. క్రి. 1. జుఱ్ఱుకొనఁజూచు.
2. త్రింగఁజూచు.

జుఱ్ఱు : దే. స. క్రి. మజ్జిగ తోడియన్నము, పరమాన్నము మొదలైనవి, ధ్వని సహితముగ నోటి లోనికిఁ బీల్చు.

జుఱ్ఱుకొను : దే. స. క్రి. 1. చేతితో కలిపి త్రాగు.
2. విశేషము అనుభవించు.

జులుము సేయు: } అన్య. దే. స. క్రి. 1. బలవంతపెట్టు.
జుల్మి సేయు : } 2. అధికారగర్వము చూపు.

జువ్వరించు : దే. అ. క్రి. విజృంభించు.

జువ్వాడు ; దే. అ. క్రి. జూదమాడు.

## జూ

జూఁకించు : దే. అ. క్రి. తత్తరపడు.

జూటాడు : దే. స. క్రి. మోసముచేయు,

## జొ

జొంపములుగొను : దే. అ. క్రి. దట్టమగు, చిగురించు.

జొంపిలు(ల్లు) : దే. స. క్రి. పొడియగు, జొంపముకట్టు.

జొకాయించు : దే. స. క్రి. ఒత్తిడిచేయు. [సుకుమారీపరిణయము]

జొత్తిలు[ల్లు] : దే. అ. క్రి. 1. ఎఱ్ఱనగు.
2. స్రవించు.
3. రంజిల్లు.

జొబ్బటిలు(ల్లు): } దే. అ. క్రి. స్రవించు.
జొబ్బిలు(ల్లు) : }

# జో

జోఁగు : దే. అ. క్రి. నిద్రపోవు.
జోకపడు : దే. అ. క్రి. జతపడు.
జోకపఱచు : దే. స. క్రి 1. అనువుపఱచు.
2. అనుకూ(?), సమానముచేయు.
క. వ. రా. అయో.
జోకలుకట్టు : దే. అ. క్రి. మొత్తములగు.
జోకసేయు : దే. అ. క్రి. ఉపమింపనగు.
జోకు :
జోకుపె(వె)ట్టు : } దే. స. క్రి. తిట్టు, తూఁచు
జోకొట్టు : దే. స. క్రి. 1. [పిల్లలను నిద్రపుచ్చుటకు] వీపుమీఁద మెల్లగా చఱచు.
2. బుజ్జగించు.
జోక్యముకల్గించుకొను:
జోక్యముపెట్టుకొను : } దే. అ. క్రి. కల్పించుకొను.
జోచఱచు : దే. స.క్రి. జోకొట్టు
జోడగించు : దే. స. క్రి. గుఱ్ఱమును ధారితకముచేత నడిపించు.
జోడించు : దే. స. క్రి. జతసేయు.
జోడుకట్టు : దే. అ. క్రి. మైత్రిసేయు.
జోడుకూడు :
జోడుకూర్చు :
జోడుదవియు: } దే. అ. స. క్రి. సరిచేయు, పెండ్లిసేయు.
జోడుబట్టు :
జోడెక్కు : } దే. అ. క్రి. నేల నీళ్ళచే చితచితలాడు. (నె. జి.)
జోతలుపె(వె)ట్టు: దే. స. క్రి. నమస్కరించు.

జోపు : దే. స. క్రి. అవతలికి పాఱఁద్రోలు.
జోరుచేయు : దే. అ. క్రి. 1. విజృంభించు.
2. ఆధిక్యముచూపు.
3. వేగము హెచ్చించు.
స. క్రి. పలుచనచేయు.
జోరుమణఁగు : దే. అ. క్రి. 1. అల్లరి తగ్గు.
2. అతిశయము తగ్గు.
జోలిచెప్పు : దే. అ. క్రి. ఇతరుల విషయము చెప్పు.
జోలివెట్టు : దే. అ. క్రి. ముచ్చటవెట్టు, సంభాషించు.
జోహారుచే(సే)యు: } అన్య. దే. స. క్రి. 1. నతిసేయు.
జోహారువను : } 2. నమస్కరించు.
జోహారొనరించు : }
జోహుకుముచేయు: అన్య. దే. స. క్రి. 1. ప్రభువును ఆజ్ఞాపించుమని వేడు.
2. బానిసవలె ప్రవర్తించు.

## ఝ

ఝంకరించు : } దే. అ. క్రి. తుమ్మెద మొ॥ జుమ్మని ధ్వనిసేయు,
ఝాంకరించు: } సింహనాదముచేయు, ఝంకారము చేయు.
ఝంకించు : దే. స. క్రి. రూ. ఝంకారించు, బెదరించు.
ఝణఝణలాడు: దే. అ. క్రి. ఝణఝణధ్వని చేయు.
ఝళిపించు : దే. స. క్రి. జడిపించు.
ఝల్లుమను : దే. అ. క్రి. 1. గుండెలో గుబుక్కుమను.
2. భయాదులచే నొడలు కంపించు

# జ్ఞ

జ్ఞాపకమగు : సం. అ. క్రి. తలపునకు తగులు.
జ్ఞాపకముసేయు : సం. స. క్రి. విషయము స్మరణకుఁదెచ్చు.
జ్ఞప్తియందుంచు: సం. అ. క్రి. జ్ఞాపకము పెట్టుకొను.

# ట

టంకరించు : దే. స. క్రి. ధనురాదులనారిని టం అని ధ్వనింపజేయు. భాగ. 8. స్కం. 334.
టంగుతెగు : అన్య. దే. అ. క్రి. శక్తి ఉడుగు.
టకకటమాను : దే. అ. క్రి. చలనము లేకయుండు. భా. శ.
టకటకలాడించు : దే. అ. క్రి. కార్యమును నిర్వహించుటలో నెక్కువ చురుకుదనము చూపు.
టకటకలాడు : దే. అ. క్రి. చలించు, నడచునప్పుడు టకటకమని ధ్వని చేయు. (వ్యవహారము)
టకాయించిపుచ్చుకొను : దే. స. క్రి. బిత్తెక్కి మఱు మాటలాడకుండగ వెంటనే నిలబెట్టి పుచ్చుకొను.
టక్కరిచేయు : దే. స. క్రి. మోసగించు.
టక్కుఁబెట్టు : దే. అ. క్రి. మాయ కలదగు. వేం. పంచ 1. ఆ. 246
టక్కులువేయు :
టక్కులుపెట్టు : } దే. స. క్రి. 1. వంచనసేయు.
2. తప్పు కప్పిపుచ్చు.
3. లంగాలు మొ॥ వానికి నడుమ మడతలు వేసి కుట్టు.
టపటపలాడు : దే. అ. క్రి. పేలునపుడు టపటప యని ధ్వనిసేయు. ఆందోళితమగు.

టముకు వేయు . దే. స. క్రి. డప్పుకొట్టుచుఁ బ్రకటించు, చాటించు.
టంపు తెగు : దే. అ. క్రి. అల్లెత్రాడు తెగు, గర్వభంగమగు. జోరు తగ్గు.
టలాయించు : అన్య దే. అ. క్రి. పనిచేయక తప్పుకొని తిరుగు.
టాకించు : దే. అ. క్రి. కత్తి మొ॥ ఒకదానితో నొకటి తాకించు. (బే)
టాకీయించు : దే. స. క్రి. ఢీ కొట్టు.
టాటాలుగుణియించు : దే. అ. క్రి. డాబులు పలుకు (గూ) టాటాల్గుణించు.
టాటోటువడు : దే. అ. క్రి. మోసపోవు.
టాసాలుబందగు: దే. అ. క్రి. మిక్కిలి భయపడు.
టింగుటింగని మీటు: దే. అ. క్రి వీణాదివాద్యములు ధ్వనిచేయు.
టింగురంగాయనికూర్చొను : దే. అ. క్రి. చేయవలసిన పనిని మఱచి చీకు చింత లేక విశ్రాంతిగా కూర్చుండు.

## టూ

టూకించు : దే. స. క్రి. సంగ్రహించు. శే. ర.
టెంకికట్టు : దే. అ. క్రి. టెంకాయ మొ॥ వి. చిప్పగట్టు.
టెంకివెట్టుకొను: దే. అ. క్రి. కాపురముండు, నివసించు. కాశీ. 3 ఆ. 46
టెక్కువలఁదగులు : దే. స. క్రి. విలాసముల కనురక్తుఁడగు.
టెక్కెమెగురగొట్టు : దే. అ. క్రి. చచ్చు. వెంక. మాన. 56
స. క్రి. పరాభవించు.
టొంకుగలుగు : దే. అ. క్రి. వంకర గలుగు. వర. 3 ఆ.
టొంపగట్టు : దే. అ. క్రి. పశువులకు గుదికఱ్ఱగట్టు. కళింగ. వా.
టొకాయించు : దే. స. క్రి. వెఱపించు.
టోకరించు : దే. స. క్రి. వంచించు.

టోకరాకొట్టు : దే. స. క్రి. 1. మోసముచేయు.
2. టోపీవేయు,
3. వంచనసేయు.
టోకరాతిను : దే. అ. క్రి. వంచింపబడు.
టోపీపెట్టు : దే. స. క్రి. వంచించు. (రూ.) టోపీవేయు,
టోపీ తొడుగు.
టోకించు : దే. స. క్రి. ప్రయోగించు.

శా. బీటల్ వారెను దిక్తటంబు నగముల్ బెట్టూగె నంభోనిధుల్
తేటం బాసెను మింటఁ జందరవిదీ పిన్ మాసెఁబోనీ, డమా
మీా టోకించిన శాత్రవుల్ చెదర కేమిా నిల్తురే యాజి వె
ల్గోటీ చెన్నృపాలు వేంకటపతి! లోకైకరమ్యాకృతీ!
వె. వం.

టోకిచ్చు : దే. స. క్రి. తాఁకు. చంద్ర. 4 ఆ.
టోకుబేరమాడు: దే. స. క్రి. గుత్తబేరముచేయు.
టోపీపెట్టు : దే. స. క్రి. వంచించు, రూ. టోపీవేయు.

# ఠ

ఠలాయించు : దే. అ. క్రి. తప్పించుకొను.
ఠవణించు : దే. స. క్రి. 1. రచించు, పాండు. 1. ఆ 18.
2. చేయు. భాగ. 6.స్కం.369
3. పోలు. శ్రీరం. 1. ఆ. 167.
4. నడవఁజేయు. ప్రవర్తింపఁజేయు.
భాగ. 3 స్కం. 189.
5. స్తోత్రముచేయు.
ఠవణిల్లు : దే. అ. క్రి. 1. ప్రకాశించు. కాశీ. 5 ఆ. 96
2. ఒప్పు. కాశీ. 2 ఆ. 11.
3. ఉచితమగు. 3. భాగ. స్కం. 855

తవతవదెచ్చు : దే. స. క్రి. వేగముగా తెచ్చు. వాల్మీకి. 3.
తవతవపడు: దే. అ. క్రి. అలాయపడు, సంతాపపడు,
అలసటనొందు.
తవతవయగు : దే అ. క్రి. శ్రమపడు.
తవశీవిద్యచూపు : దే. స. క్రి. మోసముచేయు. ప్రబంధ.
తాణలిడు : దే. స. క్రి. పట్టుపట్టు. భాగ. 10 స్కం. 1345.
తాయముచేయు . దే. స. క్రి. స్వరస్థాయిగా పాడుటకు మొదలిడు.
భాగ. 10. స్కం.
తాయములొదవు : దే. అ. క్రి. స్వరస్థాయి వచ్చు.
తాయించు : దే. స. క్రి. స్థిరపఱచు. (ప్రాణాలు తాయించుటకై)
రంగా. 3 ఆ. 278.
తారెత్తు : దే. అ. క్రి. మిక్కిలి భయపడు.
తాలాతోలీసేయు: దే. స. క్రి. నిర్లక్ష్యముసేయు, మాయచేయు.
తావుకొను : వై. అ. క్రి. నెలకొను. సమీర. 4 ఆ.
తీవిచెదరు : దే. అ. క్రి. సొగసుచెడు.
తీవిమెఱయు . దే. స. క్రి. వైభవముతో నొప్పు.
తీవినొడవు ; దే. అ. క్రి. వైభవము కలుగు.
తీవులుచను : దే. అ. క్రి. పోకడలు పోవు.
–మదము తీవులు చనునే. కళా. 3 ఆ.
తేవచూపు : దే. అ. క్రి. అశ్వగతిభేదము చూపు.
తేవయగు : దే. అ. క్రి. స్థానమగు, కాణాచియగు. చిత్ర. భా.
తేవమెక్కు : దే. అ. క్రి. ఆర్ద్రమగు. తేమ యగు.
తేవిణీవేయు : వై. అ. క్రి. తిష్ఠవేయు.

# డ

డంగు : దే. అ. క్రి. బియ్యము మున్నగునవి పొట్టుపోవునట్లు శుభ్రముగా నలఁగు.

డంగుబోవు : దే. అ. క్రి. బిత్తరపోవు.

డంగైపోవు : దే. అ. క్రి. ఆశ్చర్యపోవు.

డంచు : దే. స. క్రి. (డంగు ధా. ప్రే.)
1. ధాన్యము మొదలగునవి రోకళ్ళతో నలఁగఁగొట్టు.
2. చిమకగొట్టు, నుగ్గుసేయు. కాశీ. 7. ఆ.

డంబుసూ(చూ)పు: దే. అ. క్రి. దర్పము చూపు. శుక.

డక్కగొను : దే. స. క్రి. వశపఱచుకొను. విజ. 2 ఆ.

డక్కించుకొను . దే. స. క్రి. (పోకుండ) కాపాడుకొను.

డక్కీగొను : దే. అ. క్రి. దెబ్బతగులు.

డక్కు : దే. అ. క్రి. 1. చేతికిఁజిక్కు. భార. ఉద్యో. 2 ఆ.
2. లభించు. అచ్చ. బాల.
3. నిలుచు. భా. ద్రో. 2 ఆ.

డకొక్కను : దే. స. క్రి. దకొక్కను. శ. ర.

డగ్గఱిందు : దే. అ. క్రి. దగ్గఱకు వచ్చు. ఉ. రా. 3 ఆ.
స. క్రి. దగ్గఱకు వచ్చునట్లు చేయు.

డగ్గఱిల్లు(లు) : దే. అ. క్రి. ఏర్పడఁబోవు. ప్రబోధ. 3 ఆ.

డగ్గఱు : దే. అ. క్రి. సమీపించు. భార. భీష్మ. 2 ఆ.

డగ్గు : దే. అ. క్రి. దగ్గు.

డగ్గుత్తికయిడు : దే. అ. క్రి. గద్గదస్వరముకలది యగు.

డగ్గుత్తికవడు : దే. అ. క్రి. గాద్గద్యము కలదగు. కాళింది. 3 ఆ.

డగ్గుత్తికవెట్టు : దే. స. క్రి. గాద్గద్యమును గలిగించు.
డగ్గువడు : ద్వ. అ. క్రి. (డగ్గు+పడు) గాద్గద్యమునొందు.
(శృ)రం, 2 ఆ.

డచ్చీలుకొట్టు : దే. అ. క్రి. డాబులు కొట్టు.
డప్పికుందు_డప్పిగందు: దే. అ. క్రి. దాహముచే శ్రమపడు.
డప్పిగొను : దే. అ. క్రి. దాహమందు. నై. 8 ఆ.
డప్పిచెందు-డప్పిజెందు: దే. అ. క్రి. కృశించు, క్షీణించు.
భార. శాం.
డప్పిజనించు : దే. అ. క్రి. దాహము పుట్టు భార. విరా.
డప్పితీ(దీ)ర్చు : దే. అ. స. క్రి. ఆయాసము తీర్చుకొను,
దాహముపోగొట్టు. భార. విరా.
డప్పిదట్టమగు : దే. అ. క్రి. అలసట హెచ్చగు, త్రాణలేకపోవు.
డంబగు : దే. అ. క్రి. అధికమగు. 'డంబయ్యె నంబుదంబు.'
కృ. శకుం.
డంబారు : దే. అ. క్రి. కాంతి వహించు. నీలా. 3 ఆ.
డబడబల్ గట్టువడు; దే. అ. క్రి. గర్వము తగ్గు.
డబడబలాడు : దే. అ. క్రి. (అనవసరముగా) ఆర్భాటము సేయు.
డబాయించు : దే. స. క్రి. లేని దున్నట్లు చెప్పి ముఖపిధానము
సేయు.
డబ్బులుపల్కు : దే. అ. క్రి. అసత్యము చెప్పు.
డబ్బాకొట్టు :
డబ్బాలుకొట్టు:
డబ్బాదంచు :
దే. స. క్రి. 1. స్తుతిచేయు.
2. కోతలుకోయు.
3. అనవసరమైన దీర్ఘప్రసంగములను
వినుగెత్తునట్లు చేయు.
డబ్బు : దే. అ. క్రి. బొంకాడు.
డబ్బు నొల్లువపోవు: దే. స. క్రి. డబ్బు ప్రోగుచేసికొనిపోవు.

డమ్మను : దే. అ. క్రి. 1. తప్పుగాఁ బలుకు. శుక. 2 ఆ.
2. చచ్చు. శ. ర. బ్రా.
డయ్యంబాఱు . దే అ. క్రి. అలయు. వి. పు. 5 ఆ.
డయ్యించు . దే స. క్రి. (డయ్యు ధా. ప్రే.) చిక్కునట్లుచేయు. హర. 4. ఆ.
డయ్యు : దే. అ. క్రి. 1. అలయు. భార. భీష్మ. 3 ఆ.
2. బలహీనపడు. కాశీ. 6 ఆ.
3. చిక్కిపోవు. భార. సభా. 2 ఆ.
4. అణగు, తగ్గు. ఆం. భా. తృ. 88
5. చెడిపోవు. ఉ. రా. 1 ఆ.

## డా

డాఁకొను : దే. అ. క్రి. డాఁగు, దాఁగు, మఱుగున నుండు. అచ్చ. బాల.
డాఁగికొను : దే. అ. క్రి. కాలయాపనముసేయు. (శ్రీ)రాధా. 3 ఆ.
డాఁగు : దే. అ. క్రి. దాఁగు. కు. సం. 5 ఆ.
డాఁగురించు : దే. అ. క్రి. దాఁగు. ఆం. భా. తృ.
స. క్రి. 1. దాఁచు. భార. సౌ. 1 ఆ.
2. మోసపుచ్చు. హరి. 4ఆ. భాగ. 8స్కం.
డాఁగురుమూఁతలాడు: దే. అ. క్రి. దాగురుమూతలాడు.
డాఁచు : దే. స. క్రి. దాఁచు.
డాఁపు : దే. స. క్రి. దాఁపు, దాచునట్లుచేయు.
డాకురు : దే. అ. క్రి. డగ్గఱికాళ్ళు తేలగిలవేయు. శ. ర.
డాకొను : దే. అ. క్రి. 1. సిద్ధపడు. బ్రా.
2. ఉండు. వరాహ. 7ఆ.
3. గుర్తుగా నంటు. రసిక. 6 ఆ.
స. క్రి. 1. పట్టుకొను. అచ్చ. బాల.
2. సమీపించు. నీలా. 2 ఆ.

డాకొలుపు : } దే. స. క్రి. దగ్గఱకు రప్పించు.
డాకొల్పు : } దే. స. క్రి. 1. దగ్గరకు రప్పించు. హరిశ్చ. 2 ఆ.
2. ప్రతిష్ఠించు, నిలుపు. భాను. 3
డాగుధరించు: మి. స. క్రి. లాంఛనము ధరించు. (వ్యాఘ్రచర్మ మను మీానెఱడాగు ధరించి.) శుక.
డాగుపడు : దే. అ. క్రి. మచ్చపడు, మఱక యగు.
"డాగులు వడ్డ మనః పటంబులన్"
డాగులువేయు : దే. స. క్రి. వాతలువేయు. చంద్రా.
డాగులువైచు : దే స. క్రి, గుఱుతులుంచు, చిహ్నములుంచు.
"మరుని డాగులు వైచిన మాడ్కి" చంద్రా.
డాచేయు : దే. స. క్రి. ఆధారము చేసికొను. పాండు. 3 ఆ.
డాపలించు : దే. స. క్రి. ఎడమప్రక్కగా నుంచు.
భార. విరా. 4 ఆ.
డాబుచేయు : ద్వ. స. క్రి. 1. మోసగించు. వేమన.
2. ఆర్భాటముచేయు.
డాబులుకొట్టు : దే. స. క్రి. ప్రగల్భములు పలుకు.
డాయఁబుట్టు-డాయవచ్చు: దే. స. క్రి. సమీాపించు.
డాయించు : దే. స. క్రి. 1. డాయఁజేయు. శుక. 1 ఆ.
2. సోకించు. పరమ. 3 ఆ.
డాయు : దే. అ. క్రి. 1. ప్రవేశించు. ఇందు. 2 ఆ.
2. పొందు. పాండు. 5 ఆ.
3. తగులు. భా. రా. యు.
స. క్రి. సమీాపించు. భార. ఆది.
డాలించు : దే. అ. క్రి. కేడెముపట్టు. శ. ర.
స. క్రి. 1. పట్టించు. ద్వి. పరమ. 3 ఆ.
2. కూర్చు. ద్వి. పరమ. 3 ఆ.
3. ప్రకాశించు. ద్వి. పరమ. 4 ఆ.
డాలుకొను : దే. స. క్రి. రంజించు, రంగువేయు.

డిం

డింకవేయు : దే. అ. క్రి. మరణించు. సా. 1 ఆ.

డింకకొట్టు : దే. అ. క్రి. 1. (పడవ మొ.) మునుగు.

డింకాకొట్టు : దే. అ. క్రి. డింకవేయు.
2. పరీక్షతప్పు.

డింపు : దే. అ. క్రి. 1. చచ్చు. శేర. బ్రా.
2. అణఁగు.

డించు : దే. స. క్రి. 1. విడుచు. భార. విరా. 5 ఆ.
2. తగ్గించు. ఆము. 5 ఆ.
3. క్రిందికిఁ జేర్చు. భా. రా. యు.

డిందఁజేయు : దే. స. క్రి. క్షీణింపఁజేయు.

డిందించు : దే. స. క్రి. 1. నశింపఁజేయు. భాగ. 10 స్కం.
2. ముంచు. హరి. పూ. 1 ఆ.
3. క్షీణింపఁజేయు.

డిందు : దే. అ. క్రి. 1. తగ్గిపోవు. మార్క. 1 ఆ.
ఆం. భా. తృ.
2. అడగు, మఱుగుపడు.
భార. ఆర. 6 ఆ.
3. క్రొమ్మొగ్గు. భార. ఆర, 3 ఆ.
4. తొట్రుపడు. పాండు. 2 ఆ.
5. మరణించు. ఉ. రా. 1 ఆ.
6. ఆరిపోవు. ఆము. 4 ఆ.
7. నశించు. వాసి. 4 ఆ.
8. మునుగు. దశ. 2 ఆ.

డిందుపడు : ద్వ. అ. క్రి. 1. తగ్గు. భార. విరా. 1 ఆ.
2. సమాధానపడు. రామా. 7 ఆ.
3. మత్తెక్కు. ఆం. భా. తృ.

డిందుపఱచు : ద్వ. స. క్రి. (డిందువడు ధా. ప్రే.) భార. విరా. 4 ఆ.

డిగద్రావు : దే. స. క్రి. 1. అణచివేయు. వేం. పంచ. 1 ఆ.
2. విడిచిపెట్టు. హర. 6 ఆ.
3. తృప్తిగా త్రాగు. (నె. జి)

డిగనాడు : దే. స. క్రి. వదలిపెట్టు.
అ. క్రి. నేలపైఁగూలు. ఉ. హరి. 4 ఆ.

డిగనుఱుకు : దే. అ. క్రి. క్రిందికి దూఁకు.

డిగఁబడు : దే. అ. క్రి. వ్రేలాడు. భాగ. 10 స్కం. పూ.

డిగవిడుచు : దే. స. క్రి. వదలిపెట్టు.

డిగించు : దే. స. క్రి. క్రిందకుఁజేర్చు.

డిగు : దే. అ. క్రి. 1. అవతరించు. భార. విరా. 5 ఆ.
2. క్రిందికి అణగిపోవు. దశా. 1 ఆ.
3. తగ్గిపోవు. వసు. 6 ఆ.
4. బసచేయు, కువల. 2 ఆ.
5. జాలువాఱు. ఆము. 4 ఆ.
స. క్రి. అవరోహణము చేయు.
భార. ద్రో. 3 ఆ.

డిగుచు : దే. స. క్రి. క్రిందికి లాగు, లాగు.

డిగువడు : దే. అ. క్రి. ఉపశమిల్లు.

డిగ్గజాఱు : దే. అ. క్రి. క్రిందికి జాఱు. హరి. ఉ. 9 ఆ.

డిగ్గదాఁటు : దే. స. క్రి. క్రిందికి దుముకు. భార. భీష్మ. 2 ఆ.

డిగ్గద్రోవు : } దే. స. క్రి. 1. అణచివేయు. ఉ. రా. 4 ఆ.
డిగ్గద్రోవు : } 2. పరిత్యజించు. భార. కర్ణ. 1 ఆ.

డిగ్గనాడు : దే. స. క్రి. కించపఱచు.

డిగ్గనుఱుకు : దే. అ. క్రి. క్రిందికి దూకు.
డిగ్గఁబడు : దే. అ. క్రి. దిగఁబడు, నిలిచిపోవు.
డిగ్గవిడుచు : దే. స. క్రి. దిగవిడుచు.
డిగ్గించు : దే. స. క్రి. దింపు. భాగ. స్కా.2 ఆ.
డిగ్గు : దే. అ. క్రి. 1. క్రిందికివచ్చు. కళ.3 ఆ.
2. అవరోహించు. నైష. 2 ఆ.
3. పతితమగు, రాలు. ఆము.4 ఆ
4. దిగబడు. ఆము. 5. ఆ.
5. సన్నద్ధముగు. భా. రా యు.
6. ఉపశమించు. వరాహ. 1 ఆ.
7. తగ్గిపోవు. క్రీడా.
8. దిగుమతియగు. ఆము. 2 ఆ.
స. క్రి. 1. అవరోహించు. భాగ. 10 స్కం.ఉ.
2. పైనుండి క్రిందికి దిగు.
కేయూర. కాశీ. 2 ఆ.
డిగ్గువడు : ద్వి. అ. క్రి. న్యూనమగు, తక్కువయగు. య.4 ఆ.
డిల్లగుడుచు : దే. అ. క్రి. అధైర్యపడు. కాళిందీ. 2 ఆ.
డిల్లచెడు : దే. అ. క్రి. ధైర్యముపోవు. ఇందు. 4 ఆ.
డిల్లపడు : ద్వి. అ. క్రి. 1. భయపడుటచే బలహీనమగు.
భార. విరా. 2 ఆ.
2. నలత నొందు. నీలా. 3 ఆ.
3. భయపడు. హరి. పూ. 6 ఆ.
డిల్లపోవు : దే. అ. క్రి. అధైర్యపడు. సాంబో. 1 ఆ.
డిల్లు : దే. అ. క్రి. అధైర్యపడు.

దురస్తుచేయు : అన్య. దే. స. క్రి. బాగుచేయు, మరమ్మతుచేయు, శాస్తిచేయు.

దురాయిపెట్టు : దే. స. క్రి. ఒట్టుపెట్టు. (రా.సీ)

దురాయికట్టు : దే. అ. క్రి. గ్రహాదినివారణముకొఱకు మంత్రించిన రక్షరేకు మొదలైనవి కట్టు.

దురాయిపెట్టు : దే. అ. క్రి. ఒట్టుపెట్టు. రా. సీ.

దురావెట్టు : దే. స. క్రి. శాసించు శశాం. 3 ఆ. 48

దుసపాడు : దే. స. క్రి. తిట్టు.

దులదులనగు : దే. అ. క్రి. పొడిపొడి యగు. కాళ. 3 ఆ. 58.

దులపరించు : దే. స. క్రి. దులుపు.

దులపరించుకొనితిరుగు : దే. అ. క్రి. అవమానాదులను లక్ష్యపెట్టకుండ జీవించు.

దులు-దుల్లు : దే. అ. క్రి. రాలు, పడు.

దులుచు : దే. స. క్రి. దులుపు. బ్రౌ.

దులుపు : దే. స. క్రి. 1. రాల్చు, ఊడిపడఁజేయు,
2. విదలించు,
3. మేల్కొనఁజేయు. పి.శకుం.2ఆ.114
4. నిందావాక్యములు పలుకు.

దులుము : దే. స. క్రి. సంఘటించు, కూర్చు.

దువాళించు-దువాడించు: దే. అ. క్రి 1. ప్రసరించు. హంస.1ఆ.67.
2. వేగమునందు

స. క్రి. 1. అశ్వాదులనుప్లుతగతితోనడిపించు. దురాళముచేయించు.
2. ప్రసరింపఁజేయు.

దువాళిదోలు : దే. స. క్రి. అశ్వాదులను ప్లుతగతితోఁదోలు.

దువాళిసేయు : దే. స. క్రి. పరుగెత్తించు, తఱుము.

దువ్వు : దే. స. క్రి. 1. లోఁగొనుటకు దగ్గఱకు తీయు,
2. జుట్టు చిక్కుదీయు.
3. వాత్సల్యముతో నిమురు.
4. వలపుచే స్పృశించు.
5. బుజ్జగించు.

దుష్కార్యముచేయు : సం. అ. క్రి. 1. దుస్సాధమును సుసాధము చేయు.
2. చెడుపని చేయు.

దుసికిలబడు : దే. అ. క్రి. జారు.

దుసికిలబారు : దే. అ. క్రి. జారిపోవు, నశించు.

దుసికిలు-దుసికిల్లాడు : దే. అ. క్రి. జారు, (ప్రే. దుసికిలించు)

దుసురులువాఱు : దే. అ. క్రి. క్రేళ్ళుఱుకు, అతిశయించు.

# దూ

దూఁచు : దే. అ. క్రి. ఊఱుకు, గంతువేయు.

దూఁకొను : దే. అ. క్రి. 1. కలుగు.
2. అతిశయించు.
3. సంకల్పించు.
4. లోనికిఁజొచ్చు.
స. క్రి. 1. పొందు.
2. ఆవరించు.
3. స్వీకరించు.

దూఁటిపుచ్చు : దే. స. క్రి. తిరస్కరించు.

దూఁటు . దే. అ. క్రి. 1. చొచ్చు.
2. తప్పించుకొను.
స. క్రి. 1. పొడుచు.
2. దాటు.

దూటుకట్టు : దే. అ. క్రి. నిండు, వ్యాప్తమగు.
దూటుకొను : దే. అ. క్రి. ఎగురు, వ్యాపించు.
దూదుకొను : దే. అ. క్రి. క్రమ్ముకొను.
పొంగారి దట్టంపుఁ బొగలు దూదుకొనంగఁ
బర్విన నెంతయు బ్రమసిపడక. నృ.పు.2-14
దూపకుజెప్పు : దే. అ. క్రి. కల్లుత్రాగుటకు పైసలుఇచ్చు. (తెలం)
దూపగొను : దే. అ. క్రి. దప్పిగొను, (రా. సీ.) (తెలం )
దూపటించు : దే. అ. క్రి. దూపటిల్లు.
దూపటిలు : } దే. అ. క్రి. 1. దప్పిగొను.
దూపటిల్లు : } 2. శ్రమపడు.
3. పరితపించు.
దూపట్టు . దే. అ. క్రి. అలయు.
దూపమువేయు : దే. స. క్రి. దూపించు, ప్రోత్సాహపఱచు,
పురియెక్కించు.
దూపాడు : దే. స. క్రి. తాటించు.
దూపారు : దే. అ. క్రి. దాహముతీర్చు. (తెలం.)
దూపించు : దే. అ. క్రి. అలయు.
దూపిడు : దే. స. క్రి. అలయించు.
దూపిలు_దూపిల్లు: దే. అ. క్రి. దప్పిగొను, అలయు, పరితపించు.
దూపుకొను : దే. అ. క్రి. దూపించు.
దూబరచేయు : దే. అ. క్రి. అధికవ్యయము చేయు.
దూముడివేయు : } దే. అ. క్రి. ముడి తొందరగావచ్చునట్లు వేయు.
దుసుముడివేయు: }
దూయబట్టు : దే. స. క్రి. నిలిపి దూషించు.
దూయించు : దే. స. క్రి. దూయఁజేయు.
దూయు : దే. అ. క్రి. 1. రంధ్రముపడు.
2. చొచ్చు.

దూయు : 3. వెళ్ళు.
4. బాణము మొ. నాటి వెడలు.
5. రాచుకొనిపోవు.
6. చాప మొ. అల్లు.
7. గుప్పిలితో కోయు.

దూరనాడు : దే. స. క్రి. నిందించు.
దూరించు : దే. స. క్రి. దూరముగాఁజేయు, దూర్చు. (నె.జి)
దూరు : దే. స. క్రి. చొచ్చు.
దూఱు : దే. స. క్రి. నిందించు.
దూఱుచెప్పు : దే. అ. క్రి. తగవుపెట్టు.
దూఱుచేయు : దే. అ. క్రి. తగవుపెట్టు, నిందమోపు, దూఱువెట్టు.
దూఱువడు : దే. అ. క్రి. నిందపొందు.
దూఱెక్కు : దే. అ. క్రి. నిందనొందు, అపకీర్తినొందు.
దూలగొను : దే. స. క్రి. దురదపెట్టు.
దూషించు : సం. అ. క్రి. 1. నిందించు.
2. వీడు,త్యజించు, భార.సభా.2ఆ.199
దృఢీకరించు : సం. స. క్రి. దృఢపఱచు, నిశ్చయించు.
దృశించు : సం. అ. క్రి. కనబడు. ప్రత్యక్షమగు.
దృష్టాంతీకరించు: సం. స. క్రి. ఉదాహరించు.
దృష్టించు : సం. స. క్రి. చూచు. పరిశీలించు.
దృష్టితీయు : వై. స. క్రి. దృష్టిదోషపరిహారార్థము దీపము మొదలగునవి చుట్టు త్రిప్పు.
దృష్టిపట్టు : వై. అ. క్రి. కన్పట్టు.
దెంగు : దే. స. క్రి. సంభోగించు, గట్టిగాత్రోయు.
దెప్పరించు : దే. స. క్రి. ఆపద నొందించు, చంపు.
దెప్పరిలు : దే. అ. క్రి. బాధనొందు. (రూ) దెప్పరిల్లు
దెప్పిచెప్పు : దే. స. క్రి. తప్పును బయటపెట్టి నిందాపూర్వకముగాఁ బలుకు.

దెప్పిపొడుచు: దే. స. క్రి. నిర్విరామముగ నిందావాక్యము లాడు.
దెప్పు : దే. స. క్రి. 1. నిందించు.
2. ఎత్తి పొడుచు.
దెబ్బగొను : దే. స. క్రి. దెబ్బపడు.
దెబ్బడించు, దెబ్బటించు : దే. స. క్రి. కొట్టు.
దెబ్బతీయు : దే. స. క్రి. సాధించు, సంహరించు.
—ఈ వారవధూశిరోమణిని వంతులు
వేయక దెబ్బతీయుడీ!
దెబ్బదీయు : దే. స. క్రి. అపకారముచేయు.
అ. క్రి. వ్యాధిపడి లేచు.
దెబ్బలాడు : దే. అ. క్రి. యుద్ధముచేయు, పోరు, కలహించు.
దెర్లించు : దే. స. క్రి. నీళ్ళు చల్లపఱచు,
దెల్లించు (రూ) తెల్లించు : దే. అ. క్రి. శోకువచ్చు.
దెసచెడు : దే. అ. క్రి. గతిలేకుండు.
దెసపడు : దే. అ. క్రి. 1. దుస్థితినొందు.
2. బాధపడు.

## దే

దేకు : దే. అ. క్రి. పిఱుదులతో జరుగు,
గుడ్డలు బాగుగా మాపివేసికొను.

దేవమార్గముజూపు: దే. అ. క్రి. ముడ్డిచూపు.

దేవిజేయు : దే. స. క్రి. పెండ్లాడు.

దేవిడీమన్నాచెప్పు: దే. స. క్రి. ఉద్యోగమునుండి తీసివేయు.

దేవు : దే. స. క్రి. 1. వెదకు.
2. నీళ్ళు, పాలు, మొ॥ వానినుండి తడవి తీయు.

దేవుకొనితిను : దే. స. క్రి. ఆశతో అడుగంట కాఁజేయు.

దేవురించు : దే. అ. క్రి. దైన్యమునొందు, విలపించు.
స. క్రి. హీనముగా యాచించు.
(రూ) 1. దేబిరించు. 2. దేవిరించు.

దేవులాడు : దే. అ. క్రి. వెదకులాడు, (వ్యర్థముగా.) లాలసపడు.
స. క్రి. దేహశుద్ధిచేయు.
సం. అ. క్రి. ఒడలు నలుగునట్లు దెబ్బలు తిను.

దేవుళ్ళాడు : దే. అ. క్రి. వెంపరలాడు.

## దై

దైన్యపడు : దే. అ. క్రి. విచారపడు.

దైవారించు : దే. స. క్రి. పొంగి పొరలఁజేయు.
భాస్క. రా. యు. 2336

దైవాఱు : దే. అ. క్రి. 1. అతిశయించు.
2. ఒప్పు.
3. పొంగి పొరలు, దొంగిలించు.

దొద్దలుసేయు : దే. స. క్రి. అంతయు నిచ్చు.
దొద్దసేయు : దే. స. క్రి. పెద్దచేయు.
దొనదొనమను : దే. అ. క్రి. దొనదొనమని కూయు ఆము. 6 ఆ.
దొన్నెకట్టు : దే. అ. క్రి. దొప్పలుకట్టు.
దొప్పకొట్టు-దొప్పలుకొట్టు : దే. అ. క్రి. బ్రాహ్మణార్థము చేయు.
దొప్పతోగు : దే. అ. క్రి. మునుకలాడు.
దొప్పలుగట్టు : దే. అ. క్రి. మడుగులుకట్టు, ఆకులలో ద్రవపదార్థము నిల్చునట్లుచేయు.
దొబ్బు : దే. స. క్రి. 1. సంభోగముచేయు.
2. దొంగిలించు.
3. ముందరికి త్రోయు.
దొబ్బలుపెట్టు : దే. స. క్రి. నిందించి బుద్ధిచెప్పు.
దొమ్మరోగముపుట్టు : దే. అ. క్రి. పశువుల దొబ్బలకు (ఊపిరి తిత్తులకు) రోగమువచ్చు.
దొమ్మలువడు: దే. అ. క్రి. 1. వేగముగ పరుగెత్తుటవలనగాని బరువులుమోసి క్రిందికి దిగుటవలనగాని ఎద్దులకు ఎదలపై భారముపడు. (తెలం)
2. శక్తి నశించు.
3. దొబ్బలు నీరసించు.
దొమ్మిగూడు : దే. అ. క్రి. కలియు, దొమ్మిచేయు.
దొమ్మిరేగు : దే. అ. క్రి. కల్లోలముపెరుగు.
దొమ్ములాడు : దే. అ. క్రి. 1. దొమ్మియుద్ధముచేయు.
2. పెనగులాడు, కలహించు.
దొరకొను : దే. అ. క్రి. 1. యత్నించు.
2. సిద్ధపడు.
స. క్రి. 1. ప్రారంభించు.
2. పొందు.

దొరకించు : దే. స. క్రి. లభింపఁజేయు.

దొరకించుకొను : దే. అ. క్రి. 1. పట్టుకొను.
2. సంపాదించు.

దొరకు : దే. అ. క్రి. 1. చిక్కు.
2. కలుగు.
3. వీలగు.
4. పట్టువడు.

దొరకువడు . దే. అ. క్రి. చిక్కు, వశమగు, (దొరకుపడు)

దొరకొను . దే. అ. క్రి. 1. లభించు,
2. సంభవించు.
3. సాధ్యమగు.
4. నెఱవేరు.
5. దోచు.
6. సిద్ధపడు, లొంగు.
(రూ) దొరకొ్కను.

దొరకొల్పు : దే. స. క్రి. దొరకొనఁజేయు, సంపాదించు.

దొరపు : దే. స. క్రి. 1. కలుగజేయు.
2. ఉంచు.

దొరయించు : దే. స. క్రి. 1. కలిగించు.
2. ఉంచు.

దొరయు . దే. అ. క్రి. 1. తగులు.
2. సమానమగు.
3. కలుగు.
4. జరుగు.
5. ఒప్పు.
6. చిక్కుకొను.
7. తగు.

దొరయు 8. ఉండు.

9. వచ్చు.

స. క్రి. 1. పోలు.

2. స్పృశించు.

3. ముక్కుతో పొడుచు.

4. చొచ్చు.

దొరలకయుండు : దే. అ. క్రి. ఉదాసీనుడగు.

దొరల(గ)నాడు . దే. స. క్రి. తిరస్కరించు, నిరాకరించు.

దొరలించు : దే. అ. క్రి. 1. రాలు, పడు.

2. తిరుగు.

3. సంభవించు.

4. కలియు,

5. అతిశయించు,దొరలునట్లుచేయు.

రూ.దొర్లించు.

దొరలు . దే. అ. క్రి. పరిభ్రమించు, దొల్లు.

దొరల్చు : దే. స. క్రి. 1. కలుపు,

2. మార్చు.

దొరవచ్చు : దే. అ. క్రి. సాటియగు.

దొఱకు : దే. అ. క్రి. ఊడు, తెగు. ప.వీ.

దొఱయు : దే. అ. క్రి. కలియు, కూడు.

స. క్రి. 1. ప్రాపించు.

2. రమించు.

దొఱచు : దే. స. క్రి. దొరలించు.

దొల్చు : దే. స. క్రి. పొడుచు, రంధ్రముచేయు.

దొఱపు : దే. స. క్రి. దొరలించు.

దొల్లు : దే. అ. క్రి. దొరలు.

దొసఁగులపెట్టు: దే. స. క్రి. తప్పులెన్ను [రూ] దొసఁగులెన్ను.

# దో

దోఁకు : దే. అ. క్రి. ఇంకు, తగ్గు.

దోకు :<br>డోకు : } దే. అ. క్రి. భూమిలో గడ్డిపీయు, గోలీల ఆటలలో ఓడినవాడు మోచేతఁదోకు.

స. క్రి. క్రకు—.

దోగాడు : దే. అ. క్రి. బిడ్డలు నేలపైఁ జేతులాని మోకాళ్ళతో నడచు, ప్రాకు.

దోగియాడు : దే. అ. క్రి. ప్రాకు.

దోఁగు : దే. స. క్రి. మేనితోలొలియు, ప్రాకు,

దోఁచు : దే. స. క్రి. 1. కొల్లగొట్టు.

2. దొంగిలించు.

3. అధికముగా మోసగించు.

4. లాగు.

5. అపహరించు.

స. క్రి. దోచియిచ్చు, ఇంటిలోనివారిని మోసగించి యిచ్చు.

దోటు : దే. స. క్రి. ఇచ్చు. (వ్యావ)

దోనిగట్టు : దే. అ. క్రి. కాలువకట్టు,

దోపు : దే. స. క్రి. పుష్పాదులను దలలో పెట్టుకొను, దూర్చు.

దోపుడుపడు : దే. అ. క్రి. కొల్లగొట్టఁబడు.

దోఁపువోవు : దే. అ. క్రి. నులివడు.

దోబూచులాడు : దే. అ. క్రి. దాగుడుమూతలాడు.

దోముబట్టు :<br>దోముపట్టు : } దే. అ. క్రి. శరీరమునకు స్పర్శ తెలియక ఉండు. (తెలం)

దోయికట్టు : దే. అ. క్రి. రెండుభాగములుగా చీలు.
హరి. పూ. 7 ఆ. 92

దోయిలించు : దే. అ. క్రి. దోసిలిపట్టుకొను.

దోయిలిత్రిప్పు : దే. స. క్రి. నమస్కరించు.

దోరగలువడు : దే. స. క్రి. ఒడ్డగెడవగు.

దోరగల్లువడు : దే. అ. క్రి. దోరగలువడు.

దోరగించు : దే. స. క్రి. దోరగిల్ల జేయు. శ. ర.

దోరగిలబాఱు : దే. అ. క్రి. పండబాఱు.

దోరగిలు : }
దోరగిల్లు : } దే. అ. క్రి. ఎఱ్ఱబాఱు, పండుటకు అనువుగా ముదురు.

దోరవాఱు : దే, అ. క్రి, ఎఱ్ఱవడు.

దోరు : దే. అ. క్రి. 1. చచ్చు.
2. వ్రాలు.

దోర్చనేర్చు : దే. స. క్రి. పడగొట్టు. కు. సం.

దోర్చు(రుచు) : దే. స. క్రి ఇటునటు కదల్చు, పంపించు.

దోషించు : సం. అ. క్రి. దోషము తగులు.

దోసిలించు : } దే. అ. క్రి. దోయిలించు.
దోసిలొగ్గు : } స. క్రి. దీనముగా యాచించు.

దోస్తీచేయు : హిం. అ. క్రి. స్నేహముచేయు.

దౌడుతీయు : హిం. అ. క్రి. పరుగెత్తు.

ద్యోతించు : సం. అ. క్రి. ప్రకాశించు.

ద్రవించు : సం. అ. క్రి కారు, (నీరు) కరఁగు.

ద్రిమ్మరించు : దే. స. క్రి. ఎక్కువగ పోయు.

ద్రెక్కొను : దే. అ. క్రి. లేచు.
స. క్రి. కలఁచు.

ద్రెవ్వు : దే. అ. క్రి. చీల్చు.

ద్రొబ్బించు : దే. స. క్రి. పడఁద్రోయించు.

ద్రొబ్బిలు : దే. స. క్రి. పగులఁగొట్టు.
ద్రొబ్బు : దే. స. క్రి. 1. పడద్రోయు, పడగొట్టు.
2. వెడలఁగొట్టు.
3. త్రోయు, గెంటు.
ద్రొబ్బులాడు : దే. అ. క్రి. త్రోపులాడు, బూతులు తిట్టుకొను.
(చూ) దొబ్బులాడు.
ద్వేషపడు : సం. అ. క్రి. అసహ్యపడు.
ద్వేషించు : సం. స. క్రి. విరోధించు, అసహ్యించుకొను.

## ధ

ధక్కాతగులు : హిం. అ. క్రి. దెబ్బతగులు, నష్టమగు.
ధక్కాముక్కలుతిను : హిం. అ. క్రి. గట్టి అనుభవమును పొందు.
ధట్టించు : వై. స. క్రి. యత్నించు, అదలించు, జాడించు, క్రుక్కు, గదమాయించు.
ధణధణమోగు : వై. అ. క్రి. ధణధణయను శబ్దముతో ధ్వనించు.
ధనించు : దే. అ. క్రి. వృద్ధిపొందు.
శ్రీవత్సవక్షు మెచ్చించె శ్రీ నరసింహ
మూర్తియే కారణమున ధనించె. నృ. పు.
ధర్మదారవట్టించు : మి. అ. క్రి. యుద్ధము ఆపుచేయుటకు శంఖము ఊదు. ద.సే.
ధరించు : సం. స. క్రి. 1. తాల్చు, కట్టు.
2. గ్రహించు, పట్టుకొను.
ధరియించు : సం. స. క్రి. 1. భరించు.
2. ఓర్చు, సహించు.
3. తాల్చు.
4. పరించు.
ధవళించు : వై. అ. క్రి. తెల్లపడు.
ధర్షించు : సం. స. క్రి. బెదరించు.

## ధా

ధారగొను : మి. స. క్రి. ధారాపూర్వకముగా దానము పుచ్చుకొను.

ధారణగలుగు : మి. అ. క్రి. ధర యగు. ఉః "ప్రాలేదు మానికలకుం దైలము మానెడు పురంబు ధారణ గలుగన్" కేయూర.

ధారనిలుపు : మి. స. క్రి. ప్రస్తుతి కెక్కునట్లు చేయు.
ఉః- పదునువ్వరు గడంగను ధారనిల్పె కటకములోనన్.

ధారలుపట్టించు(బంపు: మి. స. క్రి. జొక్కా లూదుటకు నియోగించు. కు. సం.

ధారవోయించు : వై. స. క్రి. ధారాపూర్వకముగా దానముచేయించు

ధారవోయు : వై. స. క్రి. ఉదకధారాపూర్వకముగా దానము చేయు.

ధావంతపడు : వై. అ. క్రి. త్వరపడు, "ధావంతపడి నీవు దవ్వుపోవలదు." ఉ. ప. 2 ఆ.

ధావించు : సం. అ. క్రి. పరుగెత్తు.

## ధి

ధిక్కరించు : దే. స. క్రి. 1. ఎదిరించు, ప్రతిఘటించు.
2. నిందించు.
3. తిరస్కరించు, అగౌరవపఱచు.

ధికాకరించు : వై. స. క్రి. బెదరించు, భయపెట్టు.

ధూపటమగు : వై. అ. క్రి. పొగ యంతటను వ్యాపించు.

ధూముచేయు : } దే. స. క్రి. అల్లరిచేయు.

ధూము ధాములు చేయు: } అ. క్రి. హంగముచేయు.
బాగుగా కోపమును వ్యక్తముచేయు.

ఘూళించు : సం. స. క్రి. చిలుకు, స్రవించు. సాంబో. 1 ఆ. 181
"ననతేనియలన్ ఘూళించు పుష్పగుచ్ఛము."
ఘూళిగలియు : దే. అ. క్రి. నశించు.
ఘూళిగలుపు : దే. స. క్రి. నాశనముచేయు, మట్టిలోఁగలుపు.
ధ్యానించు : దే. స. క్రి. ధ్యానముచేయు, తలపోయు.
ధ్రువీకరించు : సం. స. క్రి. స్థిరపఱచు.
ధ్వజమెత్తు : మి. అ. క్రి, కత్తిగట్టు, పోరాటము సాగించు,
ధ్వనించు : దే. అ. క్రి. శబ్దించు, మ్రోయు.

# న

నంకు : దే. అ. క్రి. 1. నేలను గోరాడు.
2. ముక్కుతో మాట్లాడు.
నంగిరియోడు : దే. అ. క్రి. నంగిమాటలు మాటలాడు.
నంగు : దే. అ. క్రి. 1. జంకు.
2. ముక్కుతో మాటాడు.
నంచు : దే. స. క్రి. నంజు.
నంచుకొను : దే. స. క్రి. నంజికొను.
నంజలిపడు : దే. అ. క్రి. వ్యథపడు, తెలియనిబాధపడు (నె.జి.)
నంజిలిపడు : దే. అ. క్రి. సంకోచించు, బాధపడు.
నంజు : దే. స. క్రి. భక్షించు, నంచుకొను.
నంజుకొను : దే. స. క్రి. 1. కూరలులోనగు వ్యంజనముల నుపదంశములుగా నుపయోగించు,
ఆస్వాదించు.
2. భుజించు.
నంజుడగు : దే. అ. క్రి. మాంసపుముద్ద యగు. (దెబ్బలతో.)

నందించు : సం. అ. క్రి. సంతోషించు.
స. క్రి. 1. స్తుతించు, పొగడు.
2. కటాక్షించు, కరుణించు.

నకనకపడు : దే. అ. క్రి. ఆకలిచే బాధనొందు, కృశించు.

నకనకలాడు : దే. అ. క్రి. నకనకపడు, చలించు.
"లేతనడుములు నవ్వుల నకనకలాడ"
క.న.రా.అరణ్య.2752.

నకనకలుగుడుచు : దే. అ. క్రి. అలసటనొందు.

నకఁదీయు : దే. అ. క్రి. మఱియొకప్రతి దీయు.

నక్కిచిక్కపడు : దే. అ. క్రి. దవుడకెక్కి కదలకుండు, నిరుత్తరుడగు,

నక్కిచిక్కవట్టు : దే. అ. క్రి. చలికి మాట్లాడరాకపోవు.

నక్కు : దే, అ. క్రి. దాగికొను, ఒదుగు.

నక్కెత్తుకొను : దే. స. క్రి. విసుగుకొను. (పండి)

నగవులఁబోవు : దే. అ. క్రి. పరిహాసముపాలగు.

నగవులాడు : దే. అ. క్రి. నవ్వు.
స. క్రి. పరిహసించు.

నగించు : దే. స. క్రి. నవ్వించు, పరిహసింపఁజేయు.

నగియించు : దే. స. క్రి. నగించు.

నగు : దే. అ. క్రి. నవ్వు.
స. క్రి. పరిహసించు.

నగు(గి)పించు: దే. స క్రి. నవ్వించు.

నగుబాటుపాలగు: దే. అ. క్రి. పరిహాసాస్పదమగు.

నగుబాటుపాలుచేయు: దే. స. క్రి. అవమానముపాలుచేయు.

నగుబాట్లాడు : దే. స. క్రి. పరాచికములాడు.

నగుసేయు : దే. స. క్రి. పరిహసించు.

నగ్గు : దే. అ. క్రి. చూర్ణమగు. బ.స.పు.1-209
(స్రగ్గ-పాఠాంతరము-ప్రయోగాంతరములేదు.)

నచాయించు : దే. స. క్రి. నశన ర్తిగాచేయు, ఆడించు.

నచ్చు : దే. అ. క్రి. ప్రియమగు, నమ్మకము కలుగు, లగ్నమగు.

స. క్రి. 1. నమ్మ.

2. పీడించు. వరాహ. 2.48.

3. ఎఱుగు.

నచ్చుచేయు : } దే. అ. క్రి. ఆలస్యముచేయు. నె.జి.
నజ్జుచేయు :

నచ్చుపెట్టు : దే. స. క్రి. తొందరపెట్టు, బాధించు.

నజరుపెట్టు : హిం. అ. క్రి. కానుక పెట్టు.

నజ్జుచేయు : దే. స. క్రి. నలగగొట్టు.

పడిసెముపట్టు. (తూ. గో.)

నటనమిగులు : వై. అ. క్రి. విలసిల్లు, అతిశయించు.

నటించు : సం. అ. క్రి. 1. నాట్యముచేయు, నర్తించు.

2. కపటముగా ప్రవర్తించు.

3. నర్తించు

4 తోచు.

స. క్రి. అభినయించు, నిజముగా లజ్జాదిక మున్నట్లు కనబఱచు,

2. అనుసరించు.

నటియించు : సం. అ. క్రి. నటించు, నర్తించు, ఆడు.

నట్టగు : దే. అ. క్రి. అభ్యంతరము కలుగు, పని మొ॥వి పూర్తికాక యాగిపోవు, తిన్నగా రాక పోవు. వ్యవ. పాఠము నట్టయ్యె.

నట్టాడు : దే. అ. క్రి. 1. నాట్యముచేయు, నర్తించు.

2. చలించు,

3. ఇటునటుదిరుగు.

నట్టించు : దే. అ. క్రి. నటించు, ఆడు.
నట్టు : దే. అ. క్రి. అడ్డు, ఆగు.
నట్టుకొట్టు : దే. అ. క్రి. 1. ఆలసించు.
2. సంకోచించు.
స. క్రి. ఆటంకపఱచు.
నట్టుకొను : దే. అ. క్రి. నివసించు, నెలకొను.
నట్టుగట్టు : దే. స. క్రి. ఒక్కొక్కగుట్టగ వేయు.
నట్టుపడు : దే. అ. క్రి. అడ్డుపడు.
నట్టుపఱచు : దే. స. క్రి. ఆటంకపఱచు.
నట్టువడు : దే. అ. క్రి. నడుమ నడుమ ఆగు.
నట్టువద్రొక్కు : దే. అ. క్రి. నాట్యముసేయు.
నట్టువేయు: దే స. క్రి. 1. ఒక్కొక్క గుట్టగా వేయు. నె.జి.
నట్టేటద్రోయు : దే. స. క్రి. నాశనముచేయు.
నడంకు : దే. అ. క్రి. చలించు.
నడగొట్టు : దే. అ. క్రి. నిలుచు, ఆగు.
నడచియాడు : దే. అ. క్రి. ప్రవర్తించు, ఉండు.
నడచు : దే. అ. క్రి. 1. చరించు.
2. ప్రవర్తించు.
3. వెడలు.
4. చెల్లు.
5. నెఱవేరు.
6. జరుగు.
7. గ్రాసము కడచు.
8. ఉండు.
స. క్రి. కవియు.
నడతెంచు : దే. అ. క్రి. 1. వచ్చు.
2. పోవు.
3. తిరుగు.

నడతెగు : దే. అ. క్రి. 1. నడక తెగినదగు, అలసిపోవు.

నడపాడు : దే. అ. క్రి. నడచు, తిరుగు.

నడపించు : దే. స. క్రి. 1. నడువజేయు, చలింపజేయు.
2. ప్రవర్తిల్లఁజేయు.

నడపు : దే. స. క్రి. 1. గమనింపఁజేయు.
2. ప్రవర్తిల్లఁజేయు.
3. జరుపు, సాగించు.
4. ఆచరించు.
5. పోషించు.
6. సమకూర్చు,

నడపుకొను : దే. స. క్రి. పోషించు, పెంచుకొను, దత్తుగొను. తెలం.

నడయాడు : దే. అ. క్రి. 1. సంచరించు.
2. వీచు.
3. ఉండు, నివసించు.
4. చలించు.

నడికించు : దే. స. క్రి. భయపెట్టు.

నడిపించు : దే. స. క్రి. 1. గమనింపఁజేయు.
2. జరిగించు, సాగించు.
3. త్రోలు.

నడినీలు : దే. అ. క్రి. బాగుగా అలసిపోవు.

నడివిఱుగు : దే. అ. క్రి. పొగరడగు.

నడుకబడు : దే. అ. క్రి. నశించు.

నడుకు : దే. అ. క్రి. 1. ఒదుగు, వంగు.
2. లోబడు.
3. వడకు, కంపించు.
4. భయపడు, వెనుదీయు.
5. నశించు.
6. బాధపడు.

నడుకొత్తు : దే. అ. క్రి. భయములేకుండు.
నడుగు : దే. అ. క్రి. వడకు, ఉడుగు.
నడుచు : దే. అ. క్రి. 1. సంచరించు.
2. వెడలు.
3. ప్రవర్తించు, నడచుకొను.
4. కలుగు, పుట్టు.
5. అనుభూతమగు.
6. అనుకూలించు.
7. ఉండు, జరుగు.
నడునడునడుంగు: దే. స. క్రి. మిక్కిలి చలించుచు నడచు. భార.
నడుపాడు : దే. అ. క్రి. నడచు, సంచరించు.
నడుపు : దే. స. క్రి. 1. ప్రవర్తింపఁజేయు.
2. ఆచరించు.
3. పోషించు.
4. త్రోలు.
నడుపుకొను : దే. స. క్రి. పోషించు, ప్రవర్తింపఁజేసికొను.
నడుముకట్టు : దే. అ. క్రి. సిద్ధపడు, నడుముకట్టుకొను.
నడుముకొను : దే. స. క్రి. పూనుకొను.
నడుముదాఁకు: దే. స. క్రి. ఎదుర్కొను, ఎదిరించు.
నడుమువాల్చు : దే. అ. క్రి. శ్రమదీరుటకుఁ బండుకొను.
నడుమువిఱుగు : దే. అ. క్రి. దుఃఖాదులవార్త వినుటచే వివశుఁడగు, ప్రయత్నశక్తి ఉడుగు.
నడుసొచ్చు : దే. స. క్రి. నడుమఁ బ్రవేశించు.
నత్తు : దే. అ. క్రి. తడబడుచు మాట్లాడు.
నత్తుపనత్తుపలాడు: దే. అ. క్రి. దోషమున్నపుడు సరిగా సమాధానము చెప్పలేకపోవు.
నత్తుబొట్టు : దే. అ. క్రి. మాట తడఁబడు.

నజరుపెట్టు : హిం. అ. క్రి. కానుకపెట్టు (చూ. నజరుపెట్టు.)
నజురుపెట్టు : దే. స. క్రి. అనుపులోపెట్టు.
ననయు ; దే. అ. క్రి. 1. పూచు.
2. చిగిరించు.
ననలొత్తు : దే. అ. క్రి. అంకురించు.
ననుచు : దే. అ. క్రి. 1. పూఁచు.
2. చిగిరించు.
3. మొగ్గయెత్తు.
4. వికసించు.
5. అనురాగమొందు.
6. అతిశయించు.
7. ఇంపగు.
8 అంకురించు, జనించు.
చూ. ననయు, ననచు.
ననుపు : దే. స. క్రి, వికసింపఁజేయు.
అ. క్రి. అలవాటుపడు.
–ఆయెద్దు ఇచట ననపడు. (నె. జి.)
ననుపువడు : దే. అ. క్రి. అనురక్తమగు.
ననుఁబ్రాయిచూపు: దే. అ. క్రి. సరిగా నుడుకకుండ అన్నము పలుకగు.
ననుబ్రాయివడు: దే. అ. క్రి. ననుబ్రాయి యగు. జై. 8 ఆ. 193.
నప్పు : దే. అ. క్రి. సరిపోవు.
నఫరిచేయు : అన్య. దే. స. క్రి. బాకా మొదలగునవి యూది ప్రకటించు. చంద్రా. 4 ఆ. 28
నములపెట్టు : దే. స. క్రి. నమలించు.
నమలిపెట్టు : దే. స. క్రి. ఇతరులకొఱకై సిద్ధపఱచిపెట్టు.
నములు : దే. స. క్రి. 1. తిను.
2. దంతములతో నలగునట్లుచేయు.
3. ఆస్వాదించు.

నమస్కరించు : సం. స. క్రి. వందనముచేయు.
నమించు : సం. స. క్రి. నమస్కరించు.
నమ్మించు : దే. స. క్రి. నమ్మునట్లుచేయు.
నమ్ము : దే. స. క్రి. విశ్వసించు.
నమ్మెక్కు : దే. అ. క్రి. పదనెక్కు.
నయనించు : సం. స. క్రి. దృష్టిని నిలుపు. వే. కు. 1:36
నయమగు : దే. అ. క్రి. బాధ ఉపశమించు.
నయించు : సం. స. క్రి. నడుపు.
నరయు : దే అ. క్రి. ముదిమిచే వెంట్రుకలు తెల్లనగు.
నరవబడు : దే. అ. క్రి. రెండు మిట్టప్రదేశముల మధ్య లోతుగ నేర్పడు.
నరియు : దే. అ. క్రి. 1. వాడిపోవు.
2. నరయు.
నరుకు : దే. స. క్రి. నఱకు, ఖండించు.
నర్తించు : దే. అ. క్రి. 1. నర్తనముచేయు.
2. ఎగురు.
నర్తిలు : దే. అ. క్రి. నటించు, కదలియాడు.
నర్తిల్లు : దే. అ. క్రి. నర్తిలు.
నఱకించు : దే. అ. క్రి. నఱకు ధా. ప్రే.
నఱకు : దే. స. క్రి. 1. ఖండించు.
2. చంపు.
3. చెదరగొట్టు. 4. ప్రగల్భములాడు.
చూ. నఱుకు. నరకు. (తెలం.)
నఱకుడువడు : దే. అ. క్రి. ఖండితమగు.
నఱకువడు : దే. అ. క్రి. 1. తొలంగు, నశించు.
2. ఖండితమగు.
నఱుకాడు : దే. స. క్రి. శత్రువులను సంహరించు.

నక్రాడు : దే. అ. క్రి. సంచరించు.
నఱుమాడు : దే. స. క్రి. పొడిచేయు. భార. భీష్మ. 2 ఆ. 237
నఱుము : దే. స క్రి. పీడించు.
నలఁగించు : దే. స. క్రి. పీడించు; బాధించు.
నలఁగిపోవు : దే. అ. క్రి. ఆర్థికముగ కష్టములపాలగు (నలగిన కుటుంబము.)
నలఁగు : దే. అ. క్రి. 1. నలియగు; ముక్కలగు.
2. నొప్పికలుగు.
3. ముడుతలువడు.
4. నశించు.
5. శ్రమపడు.
నలఁగుడువడు : దే. అ. క్రి. బాధపడు, ఒత్తిడినొందు.
నలఁగుడువెట్టు : దే. స. క్రి. బాధించు.
నలచు : దే. స. క్రి. 1. నలఁగఁజేయు.
2. బాధించు.
3. చంపు.
4. కలియఁగలుపు.
నలపు : దే. స. క్రి. 1. నలగఁజేయు.
2. బాధించు.
నలభైయగు : దే. అ. క్రి. పరాభవమగు, (40 వ సంవత్సరము.)
నలవడు : దే. అ. క్రి నలఁగు.
నలిగొను : దే. అ. క్రి. ఉత్సాహపడు. పండితా. వాద. 176.
నలిదీటుగొను : దే. అ. క్రి. మిక్కిలి ప్రకాశించు.
నలినలియగు : దే. అ. క్రి. మిక్కిలి నలగు.
నలిపెట్టు: దే. స. క్రి. బాధించు.
నలిబడు : దే. అ. క్రి. (రోగార్తి) శరీరసంకటము నందు.

నలియు : దే. అ. క్రి. 1. నలఁగు, పొడియగు.
2. విఱుగు.
3. నలగు.
4. చచ్చు.

నలిరేగు : దే. అ. క్రి. విజృంభించు.

నలిసిపోవు:
నలియగు : } దే. అ. క్రి. చచ్చు. నీతి సీ. 58.

నలుఁగిడు : దే. అ. క్రి. తలంటుకొనునప్పుడు ముఱికిపోవుటకు దేహమున పిండి మొ॥నవి రాచుకొను.

నలుఁగు దే. అ. క్రి. నలఁగు, కృశించు, తగ్గు.

నలుగు . దే. అ. క్రి. 1. బాగుగా పరిచయమగు.
2. ఒకవిషయముపరిశీలనమునందుండు.
ఉదా:- ఆ విషయము నలుగుచున్నది.

నలుగుడుపడు : దే. అ. క్రి. బాధపడు.

నలుగురినోళ్లలోఁబడు :
నలుగురినోళ్లలోనాను : } దే. అ. క్రి. అప్రతిష్ఠ పొందు.

నలుగురిలోపడు : దే. అ. క్రి. బహిర్గతమగు.

నలుగువెట్టు : దే. స. క్రి. నలుగిడు, మర్దించు, కొట్టు.

నలుచు-నలుపు : దే. స. క్రి. నలుగునట్లుచేయు.

నలుపెక్కు : దే. అ. క్రి. నల్లనగు.

నలుమడించు : దే. అ. క్రి. నాలుగురెట్లగు.
స. క్రి. నాలుగురెట్లు చేయు.

నలుమడించుకొను: దే. అ. క్రి. నలుమడించు. భార. అను. 3ఆ. 297.

నలువందు :
నలువువాడు :
నలువుమిగులు:
నలువొందు :
నలువుదీఱు : } దే. అ. క్రి. ఒప్పు.

నల్పుదేఱు : దే. అ. క్రి. నల్లనగు.
నల్లబాఱు : దే. అ. క్రి. నల్లనగు.
నల్లముఖముచేయు : దే. అ. క్రి. విచారమును వ్యక్తముచేయు.
ప్రతిక్రియ లేకపోవు.
నల్లమేఁకతప్పుచేయు : దే. అ. క్రి. జారత్వముచేయు.
"బలభేది గౌతముభార్య నహల్యఁ గా
మించి చేయఁడె నల్లమేక తప్పు"
ప్రబోధచం. 1-150
నల్లతాళ్ళగు: దే. అ. క్రి. నిశ్చలముగా నుండు.
(ఎన్నిజాబులు వ్రాసినా వాళ్ళు నా
పాలిటి నల్లతాళ్ళయినారు) (వ్యవ.)
నల్లలుదీయు : దే. స. క్రి. 1. దిగఁదుడుచు. కువల. 4ఆ.217
2. నెత్తుటితో దిగఁదుడుచు నె. జి.
నల్లవడు : దే. అ. క్రి. నల్లనగు.
నవకమెక్కు : దే. అ. క్రి. సుందరమగు. (రూ) నవకమొప్పు,
నవనవమును : దే. అ. క్రి. కోమలమగు.
నవనవలాడు : దే. అ. క్రి. నవనవమును.
నవయించు : దే. స. క్రి. బాధపెట్టు.
నవయు : దే. అ. క్రి. 1. కృశించు, చిక్కు.
2. కష్టపడు, శ్రమపడు.
నవసిపోవు: దే. అ. క్రి. కృశించు.
నవుడుకొట్టు : దే. అ. క్రి. మిణకరించు. ద్వి. హరిశ్చ. పూ. 216
నవ్వారు : దే. అ. క్రి. నవ్వుతో నొప్పు.
నవ్వించు : దే. స. క్రి. నవ్వునట్లుచేయు.
నవ్వు : దే. అ. క్రి. 1. హసించు.
2. సంతోషించు.
స. క్రి. 1. పోలు.
2. పరిహసించు, మేలమాడు.

నవ్వుకొను : దే. అ. క్రి. నవ్వు.
నవ్వుదేఱు : దే. అ. క్రి. నవ్వు తేటపడు.
నవ్వుపఱచు : దే. స. క్రి. నవ్వులపాలుచేయు.
నవ్వులపాలగు దే. అ. క్రి. అపహాస్యము పాలగు, పలుగురితో నగుబాటునందు.
నవ్వులపాలుచేయు: దే. స. క్రి. అవమానము పాల్చేయు, అవమానించు.
నవ్వులఁబెట్టు : దే. స. క్రి. పరిహసించు.
నవ్వులుపడు : దే. అ. క్రి. నవ్వులపాలగు.
నశించు : దే. అ. క్రి. నాశమునొందు.
నసకించు : దే. స. క్రి. మోహింపజేయు. ప్రభులిం. 4ఆ. 14పు.
నసనసలాడు : దే. అ. క్రి. జరిగిన వ్యవహారమంతా దిచ్చలేక సన్నగా గొణుగు.
నసవెట్టు : దే. స. క్రి. ఒకపనిని జేయువాని వెనుకనుండి యదే పనిగాఁజెప్పు.
నసియించు : దే. అ. క్రి. నశించు.
నసుగు : దే. అ. క్రి. 1. అస్పష్టముగా చెప్పు.
2. జంకు.
3. కొంకు.
4. ఆలసించు.
5. తామసించు.
నసెముచేయు : దే. అ. క్రి. రోగనివృత్తికై ముకుపుటములలో రసాదులు పోయు. (శిరోబాధలు.)
రూ: నస్యముచేయు.

# నా

నాఁచికొను : } దే. స. క్రి. 1. అపహరించు.
(రూ) నాఁచుకొను: } 2. వశపఱచుకొను.
3. అణఁచు.

నాచు : దే. స. క్రి. అపహరించు.

నాఁటించు : దే. స. క్రి. 1. గ్రుచ్చు.
2. పాతించు.

నాఁటు : దే. అ. క్రి. 1. గ్రుచ్చుకొను.
2. స్థిరపడు.
3. జనించు, కలుగు.
4. అంటు, తగులు.
స. క్రి. 1. గ్రుచ్చు.
2. పాతు.
3. లగ్నముచేయు.
4. కలిగించు, ముల్లునాటు.

నాఁటుకొను : దే. అ. క్రి. 1. పాదుకొను, స్థిరపడు.
2. కలుగు, సంభవించు.

నాఁటుకొలుపు : దే. స. క్రి. 1. అతుకుకొనఁజేయు.
2. పుట్టించు. 3. పాదుకొనఁజేయు.
(రూ) నాటుకొల్పు.

నాఁటుతేఱు : దే. అ. క్రి. మొక్క మొ॥నవి పాతుకొని చక్కగా వ్యాపించు.

నాఁటుదేఱు : దే. అ. క్రి. జనించు, పుట్టు.

నాఁటువడు : దే. అ. క్రి. తెగు, నఱుకుడువడు,

నాఁడు : దే. అ. క్రి. నాటు, గ్రుచ్చుకొను, విఱుగు, ఖండితమగు.

నాకు : దే. స. క్రి. 1. నాలుకతో రాచి లోఁగొను.
2. తాఁకు

నాగవాసముబెట్టు: దే. అ. క్రి. తలుపులకు గొలుసుగల చిక్కుబెట్టు.
నాగవాసమెక్కు: దే. అ. క్రి. భోగపుపీఠికి తిరుగు.
నాచుబాఱు : దే. అ. క్రి. నీట పాచి ఏర్పడు.
నాఁడెముచూపు: } దే. అ. క్రి. సరుకుయొక్క మంచిచెడ్డలు చూపు.
నాణ్యముచూపు:
నాదారు : దే. అ. క్రి. చిక్కిపోవు.
నాదించు : దే. అ. క్రి. మ్రోగు.
నాదిచ్చు : దే. స. క్రి. బాధించు. కట్టా. యు. కాం. 13
అ. క్రి. నాటుకొను.
[అంటియుఁ దామరపాకు జలములనంటని గతి యొంత
యూ ప్తీకరించి నడపిన మదిలోన నాదీను చెలిమి]
నాదుకొను : దే. అ. క్రి. ధ్వనియగు.
నాదుకొల్పు : దే. స. క్రి. ధ్వనింపఁజేయు.
నానపైచు : దే. స. క్రి. నానబెట్టు, సిగ్గుపఱచు, పనికాకుండ నెట్టిపుచ్చు.
నాను : దే అ. క్రి. 1. తడియు.
2. ఇంకు, ఇగురు. ఇందు. 2 ఆ. 15.
నానుచు : దే. స. క్రి. (నాను ధా. ప్రే.) నానునట్లుచేయు.
నానుడుపెట్టు : దే. స. క్రి. పనిని తేలనీయకపోవు.
నానుపు : దే. స. క్రి. (నాను ధా. ప్రే.)
నానోడు : దే. స. క్రి. చెప్పుటకు వెనుకకుతగ్గు. కు. సం.
నాన్చినాన్చిచెప్పు: దే. స. క్రి. విషయము తేలకుండ మాటాడు.
నాన్చు : దే. స. క్రి. ఎక్కువగా తడుపు.
నాన్పు : దే. స. క్రి. నానుపు.
నామమడఁచు : దే. స. క్రి. 1. పేరులేకుండఁజేయు, చంపు.
2. నాశనముచేయు.
నామమణఁగు : దే. స. క్రి. చచ్చు.

నామముబెట్టు: దే. స. క్రి. మోసముచేయు.
నాముకొను : దే. అ. క్రి. పసరము నాముదంట్లు తిని వ్యాధిగ్రస్తమగు.
2. వడ్లకు వడ్లతో వడ్డికొను.
నాములుతీయు : దే. అ. క్రి. వడ్రంగి బల్ల మొ. వానిపై గీతలుగీయు.
నారపాచు : దే. అ. క్రి. భయాదులచే బట్ట తొలఁగు.
నారుచు (నార్చు): దే. స. క్రి. నాటఁజేయు. శ.ర.
నాఱుపోయు : దే. స. క్రి. నాటుటకై ఒత్తుగా విత్తనములు చల్లి మొలకలు మొలిపించు.
నాలుకపీకికొను : } దే. అ. క్రి. మిక్కిలి ఇష్టమునుగాని కోపమును
నాలుకపెఱికికొను: } గాని ప్రదర్శించు.
నాలుకముల్లువిఱుగు: దే. అ. క్రి. మాట్లాడలేకపోవు, అవమానము కల్గు.
నాలుకజాఱు : దే. అ. క్రి. రహస్యము వదలు.
నాలుకలుగ్రోయు: దే. అ. క్రి. నాల్కలు చాచు. (అగ్ని.)
నాలుకకుపదునుపెట్టు: దే. అ. క్రి. అనరాని మాట లను. యథేచ్ఛముగా మాట్లాడు.
నాలుగువేళ్ళలోనికిపోవు: దే. అ. క్రి. భుక్తికి లోపములేకుండ కడచు
నాశపడు : దే. అ. క్రి. నశించు.
నాశపఱచు : దే. స. క్రి. నాశముచేయు.
నాసిరిల్లు : దే. అ. క్రి. నశించు. శ. ర.
నాసిలు : దే. అ. క్రి. నవయు, క్షీణించు.
నాసిల్లు : దే. అ. క్రి. నవయు, క్షీణించు.

# ని

నింకు : దే. అ. క్రి. ఇంకు, నశించు.

నింగిపడు: }
నింగివడు: } దే. అ. క్రి. అస్తమించు.

నింగిముట్టు : దే. అ. క్రి. ఆకాశము నంటు, అతిశయించు.

నించు : దే. స. క్రి. 1. నిండించు.
2. నెఱవేర్చు.
3. వ్యాపింపఁజేయు.
4. కలిగించు.
5. ఉంచు, పెట్టు.
6. పోయు.
7. ఏయు, ప్రయోగించు.
8. పుష్పాదులు చల్లు.
9. కలుపు, చేర్చు.
10. పొందు.
11. కటాక్షించు, చూచు.
12. పాటించు.
13. ఆవరించు.
14. వెలువఱచు.

నిండఁబడు : దే. అ. క్రి. వ్యాపించు.

నిండారు : దే. అ. క్రి. 1. పూర్ణమగు.
2. అతిశయించు.
3. వ్యాపించు.
4. కడచు.

నిండించు : దే. స. క్రి. 1. నెఱవేర్చు.
2. వ్యాపింపఁజేయు.
3. నిండఁజేయు.

నిండు : దే. అ. క్రి. 1. జలాదులచేఁబూర్ణమగు.
2. నెఱవేరు.
3. అధికమగు.
4. వ్యాపించు.
5. ఆయువు మూడు.
6. కడచు, అతిక్రమించు.
7. పూర్తియగు.
8. సంతోషించు.

నిండుకొను : దే. అ. క్రి. 1. సంతోషించు.
2. అయిపోవు.
3. వ్యాపించు.
4. అతిశయించు, పూర్ణమగు.

నిందించు : దే. స. క్రి. దూషించు.

నింపారు : దే. అ. క్రి. నినుపారు.

నింపు : దే. స. క్రి. 1. వ్యాపింపజేయు.
2. కలిగించు.
3. నిండఁజేయు.

నిక్కముచేయు : దే. స. క్రి. దృఢపఱచు.

నిక్కవొడుచు : దే. అ. క్రి. పైకి పొడుచుకొనివచ్చు.

నిక్కించు : దే. స. క్రి. నిగుడఁజేయు, పైకెత్తు.

నిక్కిచూచు : దే. స. క్రి. చక్కగాఁజూచు, పోఁకు, మునికాళ్ళపై లేచి మెడసాచి చూచు.

నిక్కిడు : దే. అ. క్రి. నిక్కు, పైకిలేచు.

నిక్కు : దే అ. క్రి. 1. నిగుడు, పైకి లేచు.
2. హెచ్చు.
3. పొంగు, పొరలు.
4. ఉబ్బు, ఉబుకు.

నిక్కు :
5. అధికమగు.
6. వ్యాపించు.
7. సాగు, దీర్ఘమగు.
8. పొడము, జనించు.
9. సంతోషించు.
10. టెక్కులుచూపు.

నిక్కువించు : దే. స. క్రి. నిగుడఁజేసికొను. ప్రభం. 61.

నిక్షేపించు : దే. స. క్రి. 1. దాఁచు.
2. నిలుపు.
3. పూడ్చు.
4. ఉంచు.

నిగదించు : దే. స. క్రి. స్పష్టముగాఁజెప్పు,

నిగనిగలాడు : దే. అ. క్రి. అంద మొసంగు, ధగధగలాడు.

నిగమించు : దే. స. క్రి. తెలుపు, చెప్పు.

నిగిడారు : దే. అ. క్రి. (నిగిడి+ఆరు) వ్యాపించు.
ఉ. హరి. 5 ఆ.

నిగిడించు_నిగుడించు: దే. స. క్రి. 1. చాచు.
2. వెలువరించు.
3. ప్రయోగించు.
4. వ్యాపింపఁజేయు.

నిగిడికొను : దే. అ. క్రి. తేడుముకొను, నిమురుకొను.

నిగుడఁజేయు : దే. స. క్రి. 1. వర్ధిల్లఁజేయు.
2. ప్రసరింపఁజేయు, ప్రయోగించు.

నిగుడఁదన్ను (రూ) నిగుడదన్ను: దే. అ. క్రి. కాళ్ళు బిగ్గసాచు.

నిగుడారు : దే. అ. క్రి. వ్యాపించు.

నిగుడించు : దే. స. క్రి. నిగిడించు. వ్యాపింపజేయు,
-సున్నము నిగిడించినట్టి జోడరుగులపై.
భీముఖం. ఆ. 2

నిగుడు : దే. అ. క్రి. 1. నిక్కు, పైకిలేచు.
2. విజృంభించు.
3. వ్యాపించు.
4. బయలుదేఱు.
5. యుద్ధాదులందు కవియు.
6. వెలువడు.
7. చక్కఁబడు.
8. పొడము, జనించు,
9. తలచు, కోరు.
10. ఒప్పు.
11. ప్రవహించు.
12. విస్తరించు, దీర్ఘమగు.
13. పరుగెత్తు.
14. బాణాదులు మీఁదికి వచ్చు.
15. మరణించు.
16. అధికమగు.
17. స్వాస్థ్యము నొందు.

నిగుడుచు : దే. స. క్రి. పెట్టు, మాపు (గూ) నిగుడ్చు.

నిగుడుదెంచు : దే. అ. క్రి. పొడము, కలుగు.

నిగుడ్చు-నిగుడుచు: దే. స. క్రి. 1. వ్యాపింపజేయు, ప్రసరింపఁజేయు.
2. వెలువరించు.
3. బాణాదులను ప్రయోగించు.
4. కలిగించు.
5. పెట్టు.

నిగుఱుసేయు : దే. స. క్రి. బూడిదచేయు.

నిగూహించు : సం. స. క్రి. దాచు, మఱుగుపఱచు.

నిగ్గదీయు-నిగ్గలాగు: దే. స. క్రి. నిలబెట్టి యడుగు.

నిగ్గారు : దే. అ. క్రి. ఉత్కృష్టమగు.
నిగ్గించు : దే. స. క్రి. నెఱవేర్చు, నిర్వహించు.
నిగ్గు : దే. స. క్రి. మించు, మీఱు.
నిగ్గుతీయు : దే. స. క్రి. సారముతీయు.
నిగ్రహపడు : సం. అ. క్రి. ఇబ్బందిపడు.
నిగ్రహించు : సం. స. క్రి. 1. నిరసించు.
2. అడఁచు, నిరోధించు.
3. త్రోఁపాడు.
4. నిర్వహించు, నెఱవేర్చు.
నిఘాయుంచు : హిం. స. క్రి. ఒకని వర్తనమును జాగ్రత్తగా పరిశీలించు.
నిజపట్టు : దే. స. క్రి. నిజముగా తలచు.
నిజముచేయు : దే. స. క్రి. ప్రమాణముచేయు.
నిజముపట్టు : దే. స. క్రి. నిజముగా గ్రహించు.
నిటక్కనిలుచు : దే. అ. క్రి. స్తంభమువలె పొడుగుగా నిలుచు.
నిటునిటనగు : దే. అ. క్రి. మదాదులచే కన్నులు తేలిపోవు.
నిటారునిలుచు: దే. అ. క్రి. నిట్టనిలువుగా నిలుచు.
నిట్టకనిలుచు : దే. అ. క్రి. స్తంభమువలెనిలుచు. పొడవుగనిలుచు.
నిట్టగ్రమ్ము : దే. అ. క్రి. ఉప్పొంగు. నృసిం. 2 ఆ. 50
నిట్టతొలఁకు : దే అ. క్రి. వెల్లివిరియు, భాగ. 8 స్కం. 717
నిట్టఁదొట్టు : దే. అ. క్రి. వెల్లివిరియు. పద్మ. 9 ఆ. 231
నిట్టఁద్రోచు : దే. అ. క్రి. వెల్లివిరియు. కు. సం. 8 ఆ. 118
నిట్ట(క)నిలుచు : దే. అ. క్రి. పొడవుగా నిలుచు (నిట్ట నిలుచుండు)
నిట్టపొడుచు : దే. అ. క్రి. 1. నిక్కపొడుచు.
2. ఉప్పొంగు.
3. రోమాంచమగు.
4. విజృంభించు.

నిట్టలమగు : దే. అ. క్రి. పొంగు.
నిట్టలుద్రోచు : దే. అ. క్రి. ఉబుకు. భార. విరా. 1 ఆ. 245.
నిట్టలుద్రోయు : దే. అ. క్రి. అతిశయించు. కేయూర. 4 అ. 5.
నిట్టుపొడుచు : దే. అ. క్రి. వ్యాపించు.
నిట్టూరుచు : దే. అ. క్రి. నిట్టూర్పు విడుచు.
నిట్టూర్పులిచ్చు : దే. అ. క్రి. నిశ్వాసము విడుచు.
నిట్రపడు : దే. అ. క్రి. నిక్కు.
నిట్రపొడుచు : దే. అ. క్రి. పొడవగు, నిక్కు.
నిట్రించు . దే. స క్రి. నిక్కించు, నిలువుగానుంచు.
నిట్రిల్లు : దే. అ. క్రి. ఉపవాసముండు.
నిట్రువడు : దే అ. క్రి. నిక్కపొడుచు.
నిడుచను : దే. అ. క్రి. సాగు.
నిడువెండ్రుకపెట్టు: దే అ. క్రి. రోమాంచము నొందు. భార. 1 ఆ. 181.
నిదర్శించు : సం. స. క్రి. తార్కాణపఱచు.
నిదానించు : దే. స, క్రి. నిర్ణయించు. పరిశీలించు.
అ. క్రి. నెమ్మదించు, తొందరపడకుండు.
నిదురతీయు : దే. అ. క్రి. గాఢముగా నిదురించు
నిదురతెలియు : దే. అ. క్రి. మేలుకాంచు.
నిదురపుచ్చు : దే. స. క్రి. నిద్రింపఁజేయు.
నిదురపట్టు : దే. అ. క్రి. నిద్రాళువగు.
నిదురపోవు : దే. అ. క్రి. నిద్రించు.
నిదురించు : దే. అ. క్రి. నిద్రపోవు.
నిదేశించు : సం. స. క్రి. ఆజ్ఞాపించు.
నిద్దురగొను : దే. అ. క్రి. నిద్రించు.
నిద్దురపుచ్చు : దే. స. క్రి. నిద్రింపఁజేయు.

నిద్దురపోవు : దే అ. క్రి. నిద్రించు.
నిద్రతెలియు : మి. అ. క్రి. మేల్కొను. ఆము. 4 అ. 144
నిద్రతేలిపోవు : మి. అ. క్రి. వచ్చిన నిద్ర ఆగిపోవు.
నిద్రపుచ్చు : మి. స. క్రి. నిద్రింపజేయు.
నిద్రవోవు : మి. అ. క్రి. నిద్రించు.
నిద్రసేయు : మి. అ. క్రి. నిద్రించు.
నిద్రించు : సం. అ క్రి. నిద్రపోవు (రూ) నిద్రిలు, నిద్రిల్లు, నిదురించు.
నిధ్యానించు . సం. స. క్రి. చూచు.
నిధువనము గావించు: మి. స. క్రి. సంభోగించు. శివ. రా.
నినదించు : సం. అ. క్రి. ధ్వనిచేయు.
నినుచు : దే. అ. క్రి. 1. అతిశయించు.
స. క్రి. 1. ఉంచు, పెట్టు.
2. వ్యాపింపజేయు.
3. నాటు, ఏయు.
4. నిండించు.
నినుపారు : దే. అ. క్రి. 1. అధికమగు.
2. పూర్ణమగు.
నిపతించు : సం. స. క్రి. 1. పడద్రోయు, పడగొట్టు.
2. నిపాతముచేయు, నియమించు.
నిపాతించు : సం. స. క్రి. పడగొట్టు. భార. అర. 3 ఆ. 36
నిపాదించు : సం. స. క్రి. సంపాదించు.
నిప్పొడిగట్టు : దే. అ. క్రి. స్వయముగా కీడు తెచ్చుకొను, దుష్కార్యమును చేయు.
నిబంధించు ; సం. స. క్రి. 1. బంధించు, కట్టు.
2. అడ్డగించు, నిరోధించు.
3. కూర్చు, రచించు, శాసించు.

నిబ్దిలించు : దే. స. క్రి. నిబద్ధించు. ఉ. హరిశ్చ. 4 ఆ. 51
నిబద్ధించు : సం. స. క్రి. 1. నిజపఱచు.
2. రుజువుచేయు. రాధా. 1 ఆ. 25
నిబిడీకరించు : సం. స. క్రి. దట్టముగాఁజేయు.
నిబ్బరముగానుండు: దే. అ. క్రి. ధైర్యముగ, స్తిమితముగ నుండు.
నిబ్బరించు : దే. అ. క్రి. 1. అతిశయించు. చంద్రా. 6 ఆ. 142.
2. నిదానించు.
నిబ్బరికించు : దే. స. క్రి. 1. కనుణించు, ఆలోచించు.
అ. క్రి. 1. ఉప్పొంగు.
2. నిదానించు.
నిభాయించు : దే. స. క్రి. సమర్థించు, నిర్వహించు.
నిభాయించుకొను: అన్య. దే. స. క్రి. తట్టుకొను, తాళు, ఓర్చుకొను.
నిమంత్రించు : సం. స. క్రి. యజ్ఞాదులకుఁ బిల్చు, ఆహ్వానించు,
రాజు వ్యవహార నిర్ణయార్థము పిలుచు,
అవశ్యమైన శ్రాద్ధ భోజనాదులందుఁ
దగు వారిని బిలుచు.
నిముడు : దే. అ. క్రి. స్తన్యపానము చేయు.
నిమురు : దే. స. క్రి. స్పృశించు, తాఁకు, వాత్సల్యముతో
రాచు.
నిముడుకొను : దే. అ. క్రి. ఆవృతమగు.
స. క్రి. తడవుకొను
నిమ్మకునీరువోయు: దే. అ. క్రి. అచంచలముగా నుండు.
నిమ్మళించు : దే. అ. క్రి. స్వస్థమగు, ఉపశమించు.
నియచ్ఛించు : సం. స. క్రి. నియమించు, ఇచ్చు.
నియమించు : సం. స. క్రి. 1. ఆజ్ఞాపించు.
2. నిరోధించు, అడ్డగించు.
3. ఏర్పఱచు, నిర్ణయించు.

నియోగించు : సం. స. క్రి. 1. ఏర్పఱచు.
2. ఆజ్ఞాపించు.
3. సంతానముకై భర్త అన్యునిగవయ భార్యకు చెప్పు.

నియోజించు : సం. స. క్రి. లగ్నము చేయు.

నిరసించు : సం. స. క్రి 1. తిరస్కరించు, త్రోసివేయు.
2. అలక్ష్యముసేయు, అగౌరవించు.

నిరీక్షించు : సం. స. క్రి. 1. చూచు.
2. ఎదురుచూచు.
3. భావించు, తలపోయు.
రామా. 7 ఆ. 173

నిరూపించు : సం. స. క్రి. 1. నిర్ణయించు.
2. గ్రహించు, తెలిసికొను.
3. చూచు,
4. నిర్వచించు.
5. అభినయించు. (నాట్య.)

నిరోధించు : సం. స. క్రి. అడ్డగించు.

నిర్గమించు . సం. అ. క్రి. 1. ఉద్భవించు.
2. పైకి వచ్చు, ఉద్గతమగు.
3 బయలువెడలు, బయలుదేఱు.

నిర్ఘాంతపోవు : వై. అ. క్రి. నిశ్చేష్టమగు.

నిర్ఘోషించు : సం. అ. క్రి. ధ్వనిచేయు.

నిర్జించు : సం. స. క్రి. 1. బాధించు.
2. జయించు.
3. చంపు.

నిర్ణయించు : సం. స. క్రి. 1. స్థిరపఱచు.
2. నిర్ధారణచేయు.
3. ఏర్పఱచు.

నిర్దళించు : సం. స. క్రి. చంపు.

నిర్దహించు: సం. స. క్రి. 1. పూర్తిగాఁగాల్చు.
2. నాశముచేయు.

నిర్దేశించు : సం. స. క్రి. 1. చూపు.
2. ఆజ్ఞాపించు.
3. నిరూపించు, నిర్ణయించిచెప్పు.

నిర్ధరించు : సం. స. క్రి. నిర్ధారించు.

నిర్ధారించు : సం. స. క్రి. నిశ్చయించు.

నిర్బంధపఱచు : సం. స. క్రి. బలవంతముచేయు.

నిర్బంధించు : సం. స. క్రి. 1. గట్టిగా బంధించు, కదలకుండఁ జేయు.
2. బలవంతపెట్టు, నిర్బంధపఱచు.

నిర్భర్త్సించు : సం. స. క్రి. 1. తిరస్కరించు.
2. బెదరించు.

నిర్భేదించు : సం. స. క్రి. చీల్చు.

నిర్మథించు : సం. స. క్రి. ధ్వంసముచేయు.

నిర్మించు : సం. స. క్రి. 1. సృజించు.
2. చేయు.
3. గ్రంథాదులను రచించు.
4. గృహాదులను కట్టు.

నిర్మితిచేయు : సం. స. క్రి. నిర్మించు.

నిర్మూలపడు : సం. అ. క్రి. నాశనమగు.

నిర్మూలపఱచు : సం. స. క్రి. నాశనముచేయు.

నిర్మూలించు : సం. స. క్రి. 1. నాశనముచేయు.
2. ఊడదీయు.
3. పెకలించు.

నిర్వచించు : సం. స. క్రి. వివరించిచెప్పు, స్పష్టపఱచు.

నిర్వర్ణించు : సం. స. క్రి. చూచు.

నిర్వర్తించు : సం. స. క్రి. 1. చేయు.
2. ఆచరించు.
3. సిద్ధముచేయు.
రూ. నిర్వర్తిల్లు.

నిర్వహించు : సం. అ. క్రి. జీవించు.
స. క్రి. 1. నెఱవేర్చు.
2. ఆచరించు.
3. చేయు.
4. జరుపు.
5. అన్నాదికమిడి పోషించు.

నిర్వహిల్లు : సం. అ. క్రి. జరుగు, నెఱవేరు.

నిర్వాకపఱచు-నిర్వాకపెట్టు : దే. స. క్రి. నిర్వాకముచేయు.
నిర్వహించు.

నిర్వాదించు : సం. స. క్రి. 1. విచారించు, దుఃఖించు.
2. రోఁతపడు.

నిర్వాసించు : సం. స. క్రి. ప్రవాసముగాఁ బంపు.

నిర్విషయమగు : సం. అ. క్రి. విషయవాసన లేనివాఁడగు. భార.

నిర్వేదించు : సం. అ. క్రి. దుఃఖించు, విరక్తినొందు.

నిఱునీఁగు : దే. స. క్రి. సంపూర్ణముగ త్యజించు. కాశీ.1ఆ.179

నిఱ్ఱనీల్గు : దే. అ. క్రి. ఒడలు విఱిచికొను, అతిగా గర్వించు.
శవము గట్టిగా బిగియు.

నిలకయిచ్చు : దే. స. క్రి. ప్రవాహవేగమున కాలాననిచ్చు.
(నిలక = ఊఁత.) ఈ యేఱు నిలకనీయదు. వ్యావ.

నిలచికొలు : దే. అ. క్రి. ఆరిపోకుండ నెమ్మదిగా మండు.

నిలఁబడు : దే. అ. క్రి. నిలువఁబడు.

నిలఁబెట్టు : దే. స. క్రి. నిలవేయు, నిర్బంధించు, సహాయము
చేసి స్వయంపోషకముగా చేయు.

నిలవేయు : దే. స. క్రి. నిర్బంధించు.

నిలుగు : దే. అ. క్రి. 1. నీలుగు, ఒడలు నిఱుచుకొను.
2. చచ్చు.
3. గర్వించు,

నిలుచు : దే. అ. క్రి. 1. నిలువఁబడు.
2. ప్రతిష్ఠితమగు. శ. ర.
3. వర్తించు.
4. నివసించు.
5. పాఱిపోకుండు.
6. శేషించు.
7. ఆఁగు.
8. ఉండు, పోకుండు.
9. జాఱు.
10. కలుగు.
11. తీఱు.
12. జీవించు.
13. కనఁబడు.
14. వృద్ధినొందు.
15. తగులుకొను.
16. నశింపకుండు.
17. చిత్తైకాగ్రత నొందు.
18. విశ్రమించు.

నిలుచుండఁబెట్టు: దే. స. క్రి. నిలుచునట్లుచేయు.

నిలుచుండు : దే. అ. క్రి. 1. నిలువబడు.
2. వేచియుండు.
3. కదలకయుండు.

నిలుచుకొను : దే. అ. క్రి. నిలుచు. శ. ర.

నిలుపు : దే. స. క్రి. 1. నిలువబెట్టు, కనబఱచు.
2. స్థాపించు, ప్రతిష్ఠించు.
3. అలంకరించు, పెట్టు.
4. వసింపఁజేయు.
5. ఆపు.
6. అడ్డగించు.
7. స్థిరముగా నుంచు.
8. పుట్టించు.
9. తగుల్కొనఁజేయు.
10. స్వస్థపఱచు.
11. ఏర్పఱచు.
12. పాటించు.
13. నిర్మించు.
14. కూరుచుండఁబెట్టు.
15. రక్షించు.

నిలుపుకొను : దే. స. క్రి. 1. ఏర్పఱచుకొను.
2. స్థిరపఱచుకొను, చిక్కఁబట్టుకొను.

నిలుపుసేయు : దే. స. క్రి. ఆపు.

నిలుపోవు : దే. స. క్రి. తాలు, ఓర్చు (చూ) నిల్వోపు.

నిలువనాడు : దే. అ. క్రి. ఘోషించు, దృఢముగా పలుకు.

నిలువబట్టు : దే. స. క్రి. 1. దాచు, రహస్యముగా నుంచు.
2 నిలుచుండు నిలబడు.
3. ఆగిపోవు.
4. నశించు.

నిలువబెట్టు: దే. స. క్రి. పాటించు. ఉదా. మాట నిలువబెట్టుకొను.

నిలువఁబడు-నిల్వఁబడు: దే. అ. క్రి. 1. ప్రతిష్ఠితుడగు.
2. ఆధారమిచ్చు. ఉదా:-వానిని తిరిగి ఒక వ్యక్తిగా నిలువబెట్టెను.

నిలువరించు : దే. స. క్రి. 1. తాళు, ఓర్చుకొను.
2. కవియు, మార్కొను.
3. నిరోధించు.
4. ఉంచు, పెట్టు.
5. నిలుపు, వహించు.
6. ఆపు (రూ) నిల్వరించు.

నిలువవేయు : దే. స. క్రి. 1. ధనము ప్రోగు చేయు.
2. వస్తువు చెడిపోకుండఁజేయు.
3. నిలువఁబెట్టు.
4. రక్షించు.

నిలువుదోపులిచ్చు: దే: స. క్రి. దేవుళ్ళకు మొక్కుబడుల నిమిత్తము ఒంటి నున్న భూషలు పూర్తిగా సమర్పించు.

నిలువునపడు :
నిలువుటపడు : } దే. అ. క్రి. 1. నిలువున కూలఁబడు, నిశ్చేష్టమగు
2. తెలిచికొను.

నిలువునీరగు : దే. అ. క్రి. నివ్వెఱపోవు.
నిలువోపు : దే. స. క్రి. తాళు, ఓర్చు. శ.ర.
నివర్తించు : దే. స. క్రి. 1. మఱలించు.
2. పోగొట్టు.
3. నిర్వర్తించు, చేయు.

నివర్తింపించు : దే. స. క్రి. మఱలింపఁజేయు.
నివర్తిల్లు : దే. అ. క్రి. తొలఁగు, పోవు.
నివసించు . సం. అ. క్రి. ఉండు, వాసముచేయు.
నివారించు : సం. స. క్రి. 1. పోగొట్టు.
2. అడ్డగించు.
3. నివారణచేయు.

నివాళించు : దే. అ. క్రి. ఆరతిచ్చు.
స. క్రి. 1. నీరాజితము సేయు.
2. నివాళి కలదానినిగాఁ జేయు.
3. దిగదుడుచు.
4. తృణీకరించు, తిరస్కరించు.

నివాళిసేయు : దే. స. క్రి, 1. ఆరతిచ్చు.
2. వ్యాపించు.

నివిడించు : దే. స. క్రి. వెలికిఁజూచు.

నివుడు : దే. అ. క్రి. 1. చిప్పిలు, స్రవించు.
2. వ్యక్తమగు, స్ఫుటమగు.
3. చాఁగు, దీర్ఘమగు.
4. తగు, ఒప్పు.
5. పైకుబుకు
6. వ్యాపించు.
7. అతిశయించు.

నివుడుచు : దే. స. క్రి. నిగుడ్చు.

నివురు : దే: అ. క్రి. అతిశయించు.
స. క్రి. 1. వాత్సల్యాదులచేఁ జేతితో రాచు
2. దువ్వు.
3. తుడుచు.

నివుఱుగప్పు :
నీఱుగప్పు : } దే. అ. క్రి. బూడిద గప్పు.

నివేదనచేయు : సం. స. క్రి. నైవేద్య మర్పించు.

నివేదించు : సం. స. క్రి. 1. విన్నవించు.
2. సమర్పించు.
3. భక్తితో నిచ్చు.
4. ఎఱిఁగించు.

నివ్వగిలు : దే. అ. క్రి. వెలువడు.

నివ్వటించు : దే. స. క్రి. ఒప్పునట్లుచేయు.

నివ్వటిలు-నివ్వటిల్లు : దే. అ. క్రి. 1. అతిశయించు.
2. కలుగు.
3. వ్యాపించు.
4. వర్ధిల్లు.
5. ఒప్పు.

నివ్వటిల్లు : దే. అ. క్రి. 1. నిండారు.
2. సిద్ధించు.
3. ఒప్పు, ప్రకాశించు.
4. అతిశయించు.
5. వ్యాపించు.
6. కలుగు,

నివ్వెఱపడు : దే. అ. క్రి. 1. మిక్కిలి భయపడు.
2 మిక్కిలి ఆశ్చర్యపడు.
3. చేష్టలు దక్కు.
4. భ్రాంతిపడు.

నివ్వెఱపఱచు : దే. స. క్రి. భయపెట్టు.

నిశ్చయించు : సం. అ. క్రి. నిర్ణయించు, స్థిరపఱచు.

నిశ్వసించు : సం. అ. క్రి. 1. నిట్టూర్పు విడుచు.
2. ఊర్పు లోపలికిగొను.
3. ఊర్పు బయటికి విడుచు.

నిశ్వాసించు : సం. అ. క్రి. నిట్టూర్పు విడుచు.

నిశ్శేషపఱచు : సం స. క్రి. మిగులకుండజేయు.

నిషేధించు : సం. స. క్రి. కూడదనిచెప్పు, త్రోసిపుచ్చు.

నిష్కర్షించు : సం. స. క్రి. నిశ్చయించు.

నిష్క్రమించు : సం. అ. క్రి. వెడలిపోవు.

నిష్టంపించు : సం. స. క్రి మార్కొను, తాకు.
నిష్ఠించు : సం. స. క్రి. 1. శ్రద్ధ వహించు.
2. నిర్ణయించు.
నిష్ఠీవించు : సం. స. క్రి. ఉమ్మివేయు.
నిష్ఠురములాడు: } సం. స. క్రి. సూదిపోటు మాటలాడు,
నిష్ఠూరములాడు: } దెప్పిపొడుచు.
నిష్ఠూరము వేయు: సం. స. క్రి. నిందవేయు.
నిష్పాదించు : సం. స. క్రి. కలిగించు, నెఱవేర్చు.
నిస్తరించు : సం. స. క్రి. 1. దాటు, తొలగించుకొను.
2. దాటించు, తరింప జేయు.
నిస్సరించు : సం. అ. క్రి. వెలువడు
స. క్రి. 1. నిహ్నవించు.
2. మఱుగుపఱచు.
నిహ్నవించు : సం. స. క్రి. మఱుగుపఱచు.
నిక్షేపించు : సం. స. క్రి. ఉంచు, దాచు.

# నీ

నీఁగు : దే. స. క్రి 1. పోఁగొట్టుకొను.
2. ఋణము తీర్చు.
నీచుకాసపడు : దే. అ. క్రి. చేపలకు ఆశపడు.
నీటగలియు : దే. అ. క్రి. నశించు (రూ) నీళ్ళఁగలియు.
నీటారు : దే. అ. క్రి. ప్రకాశించు, ఒప్పు.
నీటుపడు : దే. అ. క్రి. నీటుగల దగు.
నీటుపఱచు : దే. స. క్రి. నీటు గలదానినిగాఁ జేయు.
నీటువెట్టు : దే. అ. క్రి. విలాసము కల్గించుకొను.
నీటుసేయు : దే. అ. క్రి. విలాసముచూపు.

నీడదోచు : దే. అ. క్రి. ప్రతిబింబించు.
నీరగు : దే. అ. క్రి. 1. ద్రవించు,
2. నశించు.
3. మిక్కిలి మెత్తబడిపోవు, బూడిద అగు.
నీరసించు . సం. అ. క్రి. బలహీనమగు.
స. క్రి. నీరసము కల్గించు.
నీరాడు : దే. అ. క్రి. స్నానముచేయు.
నీరాను : దే. అ. క్రి. తడియారు.
నీరార్చు : దే. స. క్రి. స్నానముచేయించు (చూ) నీళ్ళార్చు.
నీరెనడుము ద్రెంపు: దే. అ. క్రి. అసాధ్యకార్యము తలపెట్టు. కు. సం.
నీరు : దే. అ. క్రి. నిక్కు,
"కులుకుగుబ్బలు నీరగా
జిలుగు పయ్యెదకొంగు తొలంగి జారగా"
రాజరంజన విద్యావిలాసనాటకము.
నీరు ఎత్తించు : దే. అ. క్రి. బంగారుపోత బోయు,
గాయము చీముపట్టు. (నె. జి.)
నీరుకట్టు : దే. అ. క్రి. చేలకు నీరు పాటించు.
నీరుకాసుపట్టు: దే. అ. క్రి. తీర్థములయందు బ్రాహ్మణులు స్నాన మంత్రములు చెప్పి డబ్బులు గ్రహించు.
నీరుకారు–నీర్కారు: దే. అ. క్రి. 1. ఉత్సాహము లేకుండు.
2. నీరసపడు.
నీరుగాలివడు : దే. అ. క్రి. తాపమునొందు.
నీరుచిచ్చుగొను : దే. అ. క్రి. నీరుచిచ్చు అను వ్యాధి కలదగు. (నృక్షాదులు).
నీరుచిచ్చువడు : దే. అ. క్రి. నశించు.
నీరుచూపు : దే. అ. క్రి. నంజువ్యాధి అంకురించు.

నీరుతాపు : దే. స. క్రి. కత్తులు మొ॥ వానిని కాల్చి వాదర కావించి పదునుకోసమై వేడితో నీటిలో ముంచు.

నీరుపట్టు : దే. అ. క్రి. (రోగాదులచే శరీరము) ఉబ్బు, రక్తముపట్టు, నంజువ్యాధి కలుగు, గర్భవతులకు దేహము నిగారించు.

నీరుపోఁత్రలాడు : దే. అ. క్రి. జలక్రీడలాడు. కు. సం.

నీరుపోయు : దే. అ. క్రి. క్రొవ్వెక్కు. మదించు.

–ఇవ్విధంబున మెలఁగునయ్యింతి యొంటిలెలిండి కలంబున నినుఁడికండపట్టి నీరుపోసిన మేనితో నిలుపరాని మనసుచే జారభోగ మేమఱక తిరుగు. శుక.3.351.

నీరుముట్టు_నీర్ముట్టు : దే. అ. క్రి, మలమూత్రవిసర్జనము చేయు.

నీరుమోయు : దే. అ. క్రి. నీటిలో మునుగు.

2. గర్భవతి యగు. పార్వ.2 ఆ. 7.

నీరువట్టగు : దే. అ. క్రి దప్పికగొను.

నీరువట్టు : ద్వ. అ. క్రి. దప్పిగొను. భార. అ. 3. ఆ.

నీరువిడుచు . దే. అ. క్రి. ఉచ్చపోయు.

"పీరయుగంధర్ పేరుచెప్పి తేనీరువిడుచు ఘోడా"

(ప్రతాపరుద్రీయము.)

నీరువెట్టు : దే. స. క్రి. పొలము మొ॥ వానికి నీరు ప్రవహింపఁ జేయు.

నీరుసిచ్చువట్టు : దే. అ. క్రి. నీరధికముగా పొందు.

నీరెక్కు : దే. అ క్రి. జలభరితమగు, వాపునొందు, పొగరెక్కు.

(రా.సీ.)

నీరెత్తు : దే. స. క్రి. చేనికి నీరుపెట్టు.

నీరొత్తు : దే. స. క్రి. నీరుపిండు.

నీర్వట్టు : దే. అ. క్రి. దప్పిగొను.

నీఱుపాఱపుగొను: దే. అ. క్రి. భస్మము కవియు. కు.సం.
నీఱుసేయు : దే. స. క్రి. బూడిదచేయు,
నీఱుగు : దే. అ. క్రి. మరణించు, ఒడలుపెంచు.
నీల్గు : } దే. అ. క్రి. 1. చచ్చు.
నీలుగు : } 2. సాగు.
3. గర్వించు.
4. ఒడలు విఱుచుకొను.
5. ఒడలుసాచు.
6. ఒడలుపెంచు.
నీళ్ళనాడు : దే. అ. క్రి. స్నానముచేయు.
నీళ్లాడు : దే. అ. క్రి. 1. స్నానముచేయు.
2. ప్రసవించు.
నీళ్ళార్చు : దే. స. క్రి. స్నానముచేయించు.
నీళ్ళుకారు : దే. అ. క్రి. మందమతితోనుండు, జాప్యముచేయు.
నీళ్ళుతోడు : దే. స. క్రి. బావిలోనుండి జలమునుద్ధరించు;
వ్యవహారము పాడుచేయు,
వేడినీళ్ళు స్నానమునకు పాళముచేయు.
నీళ్ళునమలు : దే. అ. క్రి. సంకోచించు, సంశయించు.
నీళ్ళుపోసికొను : దే. అ. క్రి. గర్భవతియగు.
నీళ్ళుబెట్టు : దే. స. క్రి. పశువులకు నీళ్ళుపెట్టు.
నీళ్ళులాడు : దే. అ.క్రి. స్నానముచేయు.
నీళ్ళువదలు : దే. అ. క్రి ఆశవదలుకొను, పితాళ్ళకు తర్పణము
చేయు.
నీళ్ళువదలుకొను: దే. అ. క్రి. ఆశ వీడు.
నీళ్లోడు : దే. అ. క్రి. నీళ్ళుకారు.

# ను

నుంపారు, దే. అ. క్రి. నునుపారు.
నుకసానపడు : హిం. అ. క్రి. దీనుఁడగు.
రూ. లుకసానపడు.
నుగ్గడచు : దే. స. క్రి. నలఁగఁగొట్టు.
నుగ్గాడు : దే. స. క్రి, 1. నలఁగఁగొట్టు.
2. వధించు.
3. ధ్వంసముచేయు.
4. ఖండించు.
నుగ్గించు : దే. స. క్రి. తిట్టు. వి్ర ప. 4 ఆ. 76
నుగ్గినూచముచేయు : } దే. స. క్రి. పొడిపొడిచేయు.
నుగ్గునూచముచేయు : }
నుగ్గు : దే. అ. క్రి. నలఁగు.
నుగ్గుచేయు : దే. స. క్రి. పొడిచేయు.
నుగ్గునూచు : దే. అ. క్రి. పొడిపొడిగానగు.
నుగ్గుసేయు : దే. స. క్రి. చంపు.
నుగుఱువాఱు : దే. అ. క్రి. పొడియగు.
నుచ్చు : దే. స. క్రి. నుచ్చుపాతలుగట్టు. శ.ర.
నుడుగు : దే. స. క్రి. 1. చెప్పు.
2. జపించు. భీమ. 2 ఆ. 154.
నుడువు : దే. స. క్రి. 1. వచించు.
2. బోధించు.
3. చదువు.
4. అంకితముగా రచించు.
నుతించు : సం. స. క్రి. కొనియాడు.

నుతియించు : దే. స. క్రి. నుతించు.
నుదురంటు : దే. స. క్రి. నమస్కరించు.
నునుపారు : దే. అ. క్రి. మృదువగు, నున్నగు.
నురుగుకొను : దే. అ. క్రి. నురుగుకట్టు.
నుగ్గాడు : దే. అ. క్రి. నుగ్గగు.
నుఱిచియాడు : దే. స. క్రి. సంహరించు. రాఘవ. 4 ఆ 142.
నుఱిమించు : దే. స. క్రి. నుఱుము ధా. ప్రే.
నుఱుచు : దే. స. క్రి. 1. ధాన్యాదికము గాళ్ళతోఁ ద్రొక్కి నలుపు.
2. నశింపజేయు.
నుఱుపు-నుఱుచు : దే. స. క్రి. 1. ధ్వంసముచేయు.
2. చంపు.
3. ఖండించు.
నుఱుమాడు : దే. స. క్రి. 1. పొడిచేయు.
2. చంపు.
3. ఖండించు.
నుఱుము : దే. అ. క్రి. 1. పొడిచేయు.
2. చంపు.
3. పీడించు.
నుఱుముచేయు : దే. స. క్రి. నుఱుముసేయు.
నుఱుముసేయు : దే. స. క్రి. 1. చంపు.
2. పొడిచేయు.
నులకవేసు : దే. అ. క్రి. దురదననణచుకొనుటకై మర్మావయవముల నలుపుకొను.
నులించు : దే. స. క్రి. నులియఁజేయు, నులుపు, పీడించు, హరి. పూ. 8 ఆ. 50.
నులిగొను : దే. అ. క్రి. 1. చిక్కబడు.
2. వలయితమగు.

నులిగొల్పు : దే. స. క్రి. మెలివెట్టు.
నులిపడు : దే. అ. క్రి. దోపుడువడు.
నులియగు : దే. అ. క్రి. 1. పొడియగు. 2. అల్లలాడు.
నులియు : దే. అ. క్రి. ఏదైన నొకటి తాఁకుటచే స్థానము తప్పి యిట్టటు తొలఁగు. భా. శ. 1 ఆ.
2. పొడియగు.
నులివడు : దే. అ. క్రి. నులిపడు, మెలికపడు.
నులివాడు :
నులివాళ్ళనాడు :
నులివాళ్ళువాడు : } దే. అ. క్రి. కొంచెముగా వాడు.
నులివెచ్చచేయు : దే. స. క్రి. గోరువెచ్చచేయు.
నులివెట్టు : దే. స. క్రి. 1. మెలిపెట్టు.
2. గ్రుచ్చు,
నులుచు-నుల్చు: దే. స. క్రి. 1. వధించు.
2. మెలికవెట్టు.
నులిచికొనిపోవు : దే. అ. క్రి. 1. త్రిప్పలుపడు.
2. పీకుకొనిపోవు.
3. ముడుతలుపడు.
4. వ్యసనమునొందు.
నులుపు-నుల్పు : దే. స. క్రి. నలఁగఁగొట్టు, నలగఁజేయు.
నులుము : దే. స. క్రి. 1. మెలికవెట్టు.
2. నలుపుకొను.
3. పెకలించు.
4. నాశముచేయు.
5. వధించు.
6. విడుచు.
7. పిసుకు.
8. ఒడిసిపట్టుకొను, లాగుకొను.

నువ్వానేనాయను: దే. స. క్రి. అహమహమిక ప్రకటించు.
నుసనుసలాడు : దే. అ. క్రి. కోపముగా నుండు.
నుసలు : దే. అ. క్రి. 1. ఆలసించు.
2. కదలు.
3. ప్రమాదమొందు.
4. వ్యతిరేకించు.
5. మసలు.
స. క్రి. పట్టుకొను.
నుసుగు : దే. స. క్రి. తిరస్కరించు.
నుసుము : దే. స. క్రి. లాగు, ఆకర్షించు, గుడ్డ ముటికిపోవునట్లు చేతులచో రాతిమీదఁగొట్టి గుంజు.
నుసులు : దే. అ. క్రి 1. కదలు, చలించు.
2. ఒడలు విఱుచుకొను.
3. ఒదుగు.
4. నిద్రపట్టక పడకలో అటునిటు పొరలుచుండు.
స. క్రి. 1. నలుపు.
2. పూను.
నుసులుకొను: } దే. స. క్రి. నలుపుకొను.
నుసులొత్తు : }

# నూ

నూకలుండు: దే. అ. క్రి. ఆయుర్దాయముండు.
(వానికి నూకలున్నవి. అందుచే బ్రతికినాడు.)
నూకులాడు : దే. అ. క్రి. పోట్లాడు.
నూకలుపడు : దే. స. క్రి. పెండ్లియగు.

నూకించు : దే. స. క్రి. త్రోయించు. అచ్చ. రా. యు. 72

నూకు : దే. స. క్రి. 1. దాటు. పండితా. దీక్షా. 44
2. త్రోలు. స్వా. 4 ఆ. 44
3. త్రోయు, గెంటు, దొంగిలించు, ఊడ్చు.
అ. క్రి. సాగు, సాధ్యమగు, (ఇది నూకదు.) (నె. జి.)

నూఱకత్రావు-నూఱికొనిత్రావు : దే. స. క్రి. ఘోరముగా చంపు.

నూఱిపోయు : దే. స. క్రి. బాగుగా బోధించు.

నూఱు : దే. స. క్రి 1. సన్నికల్లులో మర్దించు.
2. రాచు, నలగఁగొట్టు.
3. ఆయుధములు మొ॥ నవి పదనెక్కుటకు రాతిమీఁద నొఱపెట్టు.

నూఱుచు : దే. స. క్రి. నూర్పిడిచేయు. (గూ. నూర్చు.)

నూఱునునిండు : దే. అ. క్రి. ఆయుస్సు పరిసమాప్తమగు.

నూలుకొను : దే. అ. క్రి. 1. చక్కఁబడు, సరియగు.
2. స్థిరపడు.
3. పురికొను, బలపడు.
స. క్రి. పూనుకొను.

నూలుకొలుపు : దే. స. క్రి. 1. చక్కఁబఱచు, సరిచేయు.
2. ప్రసరింపజేయు.
3. కలిగించు.

నూలుకొల్పు : దే. స. క్రి. నూలుకొలుపు.
1. పురిగొల్పు, ప్రేరించు.
2. స్తిమితపఱచు, కుదురుపఱచు.
3. అంగీకరింపఁజేయు. కళా. 7 ఆ. 157

నూలుపట్టు : దే. స. క్రి. దారము పట్టి సూటియగునట్లు తీర్చు.

నూల్కొను : దే. అ. క్రి. 1. పురికొను.
2. చక్కఁబడు.
3. జాలువారు.
4. సమ్మతమగు.
5. స్థిరపడు.
6. వ్యాపించు.
7. సంభవించు, కలుగు.
రం. రా. యు. 326.
స. క్రి. 1. ఒప్పుకొను.
2. స్థిరపఱచు.
3. సమ్మతించు. ప్రబోధ. 5 ఆ. 37

నూల్కొలుపు : దే. స. క్రి. చక్కఁబఱచు, పొందుపఱచు.

## నె

నెక్కొను : దే. అ. క్రి. 1. ఉండు.
2. వ్రాలు, పడు.
3. పాదుకొను, స్థిరపడు.
4. తోడ్పడు.
5. తగులు, నాటు.
6. వ్యాపించు.
7. జనించు.
8. అతిశయించు.
9. ఫలించు.
10. నిగుడు, పైకివచ్చు.

నెక్కొలుపు : దే. స. క్రి. 1. నిలుపు.
2. తాల్చు.
3. సంఘటించు.

నెగడించు : దే. స. క్రి. 1. వరిల్లఁజేయు.
2. ప్రవర్తింపఁజేయు.
నెగడు : దే. అ. క్రి. 1. బయలుపడు.
2. వర్ధిల్లు.
3. ప్రవర్తించు, నడచు.
4. ప్రసిద్ధికెక్కు.
5. యత్నముచేయు.
6. గర్వించు.
7. అతిశయించు.
8. అధికమగు.
9. కలుగు, లభించు.
10. ఒప్పు.
11. వ్యాపించు.
నెగయు : దే. అ. క్రి 1. ఎగురు.
2. పైకి లేచు.
3. బయలువెడలు.
4. నీటినుండి పైకిఁదేలు.
నెగయుతెంచు : దే. అ. క్రి. నీటినుండి పైకిఁదేలు.
భార. ఆది. 5 ఆ. 193
నెగవైచు : దే. స. క్రి. ఎగురవైచు. కళా. 6. ఆ. 14
నెగుచు : దే. స. క్రి. ఎగుచు, తఱుము. భాగ.8.స్కం.66
నెగులుకొను : దే. అ. క్రి. పీడ నొందు. భా. రా. యు, 580.
నెగులుపడు : దే. అ. క్రి. బాధ నొందు.
నెగులుపఱచు : దే. స. క్రి. పీడించు.
నెగులువెట్టు : దే. అ. క్రి. బాధించు.
నెగ్గించు : దే. స. క్రి. గెలిపించు.

నెగ్గు : దే. అ. క్రి. 1. నెఱవేఱు, సిద్ధించు.
2. మను, బ్రదుకు.
3. జయమునొందు.
4. నిస్సత్త్వమగు.
5. ఎదురాడు.
6. నిర్వహిల్లు.

నెగ్గుకొను : దే. అ. క్రి. జయించు.

నెగ్గురను : దే. అ. క్రి. కోపముతో నెద నుండు.

నెటికలువిఱుచు : దే. అ. క్రి. వ్రేళ్ళసందులను విఱుచు.
(రూ) మెటికలు విఱుచు.

నెటికవిఱచు : దే. అ. క్రి. నెటికలు విఱుచు (ఏవగించుకొను.)

నెట్టగు : దే. అ. క్రి. అధికమగు.

నెట్టించు : దే. స. క్రి. 1. జయించు.
2. పెంపొందించు.

నెట్టు : దే. అ. క్రి. అధికమగు, అతిశయించు, పయనించు.
స. క్రి. 1. త్రోయు, పడద్రోయు.
2. తిరస్కరించు.

నెట్టుకొట్టు : దే. అ. క్రి. 1. చలించు.
"నియతస్థితి యిట్టిట్టు నెట్టుకొట్టగా"
సమీరకుమార విజయము.

నెట్టుకొను : దే. అ. క్రి. 1. నివసించు.
2. అతిశయించు, విజృంభించు.
3. పట్టు పట్టు.
స. క్రి. 1. త్రోసికొను.
2. పూనుకొను.

నెట్టుకొలుపు : దే. స. క్రి. ఉండఁజేయు, ఉంచు.

నెట్టుపడు : దే. అ. క్రి. త్రోయఁబడు.

నెట్టోడు : దే. అ. క్రి. చేష్టలుదక్కు. బసవ. 5 ఆ. 130

నెత్తటిల్లు : దే. అ. క్రి. శ్రమదీర్చికొను. భాను. 4 ఆ. 97

నెత్తికెఁజుట్టుకొను: దే. అ. క్రి. 1. అనవసరముగా చెడువచ్చు. 2. లేనిపోనికార్యములలో ప్రవేశించు.

నెత్తికిదెచ్చుకొను: దే. అ. క్రి. ఆపదలు తెచ్చుకొను.

నెత్తికెక్కించుకొను: దే. స. క్రి. 1. బోధపఱచుకొను. 2. అనర్హునికి ఎక్కువ ప్రాధాన్యమిచ్చు.

నెత్తికెక్కు : దే. అ. క్రి. 1. బోధపడు. (తెలం) 2. నడుమంతరముగా మదమెక్కు. 3. ఒకనిమీఁద తన భారము వైచు.

నెత్తిగట్టుకొనిపోవు : దే. స క్రి. (చచ్చునపుడు) విడువక వెంటఁ దీసికొనిపోవు.

నెత్తిదాకు : దే. అ. క్రి. తలఁదాకు, అనుభవమునకు వచ్చు. (తెలం.)

నెత్తిదిను : దే. స. క్రి. వేధించు, విసిగించు (తెలం)

నెత్తిదిరుగు : దే. అ. క్రి. పైత్యవికారము చేయు, గర్వమెక్కు. (రూ. తల దిరుగు.)

నెత్తినఁజేతులుపెట్టు : దే. స. క్రి. నాశముసేయు.

నెత్తిన పెట్టుకొను: దే. స. క్రి. ఆదరించు, విశేషాభిమానము జూపు.

నెత్తినీడపోవు : దే. అ. క్రి. విధవయగు.

నెత్తిమాయు : దే. అ. క్రి. పేదవడు. (తెలం)

నెత్తిరుమాలుక్రిందవడు: దే. అ. క్రి. అవమానము జరుగు. (తెలం)

నెత్తురువాఱు : దే. అ. క్రి. ఎఱ్ఱనగు.

నెనయు : దే. అ. క్రి. ఎనయు.

నెనరుంచు : దే. అ. క్రి. విశ్వాసముంచు.

నెనరుచూపు : దే. అ. క్రి. కృతజ్ఞతచూపు.
నెనరుముట్టజూచు: దే. స. క్రి. అధికప్రేమతోఁజూచు.
నెపవడు : దే. అ. క్రి. నెపమునొందు, దోషియగు.
నెపమలుగు : దే. స. క్రి. మిషచే కోపించు.
నెపమాడు : దే. స. క్రి. మిష కల్పించి చెప్పు.
నెపమార్చు : దే. స. క్రి నాశనముసేయు.

"ధనము హేరాళ మబ్బె నీతఁడు బళాయి,
వీఁడు ప్రాణాన నరిగిన వెదకివెదకి
మనల నెపమార్చుగా కేల మనఁగ నిచ్చు,
నితని వధియింతమని నిశ్చయించి రపుడు."
కాశీ. 7-252.

నెప్పరించు : దే. స. క్రి. మూఁదలించు (వాసనచూచు) నిరూపించు. శ. ర.
నెప్పడు : దే. అ. క్రి. స్థానభ్రంశ మందు. రామ. 5 ఆ. 187
నెప్పు : దే. స. క్రి. గెంటు, త్రోయు. వరాహ. 3 ఆ. 50
నెప్పుకొను : దే. అ. క్రి. పాదుకొను. స్వా. 4 ఆ. 34
నెమకు : దే. స. క్రి. వెదకు.
నెమరుచు : దే. స. క్రి. నెమరు వేయు.
నెమరుపెట్టు : దే. స. క్రి. పశువులు మ్రింగిన యాహారమును మఱల నోటికిఁ దెచ్చుకొని చక్కఁగా నమలు.
నెమరువేయు : దే. స. క్రి. నెమరుపెట్టు, మఱలమఱల యోజించు.
నెమర్చు : దే. అ. క్రి. నెమరుచు.
నెమ్మించు: దే. అ. క్రి అతిశయించు. పి. శకుం. 1 ఆ. 86.
నెమ్మిసేయు : దే. అ. క్రి. 1. ఇష్టపడు.
2. ఉత్సహించు. నైష. 7 ఆ. 172

నెమ్మికొను : దే. అ. క్రి. చెమ్మగిల్లు.
నెమురు : దే. స. క్రి. నూనెతో మర్దించు.
నెయ్యమాడు: దే. అ. క్రి. చెలిమిచేయు, వైవాహిక సంబంధము కూర్చుకొను. (నె.జి.)
నెరనమ్ము : దే. స. క్రి. మిక్కిలిగా విశ్వసించు.
నెరపు : దే. స. క్రి. 1. నెఱవేర్చు.
2. పఱచు, విస్తరింపఁజేయు.
3. ప్రసరింపఁజేయు.
4. వెదజల్లు, చిమ్ము.
5. కనఁబఱచు.
6. కల్పించు.
7. ఆడు.
నెరయించు : దే. స. క్రి. వ్యాపింపఁజేయు,
నెరయు : దే. అ. క్రి. 1. నిండు, అతిశయించు.
2. వ్యాపించు.
3. నెఱవేఱు, సిద్ధించు.
4. చెదరిపడు.
5. విడివడు, తప్పించుకొనిపోవు.
నెఱవచ్చు : దే. అ. క్రి. అధికమగు.
నెరవిడియగు: దే. అ. క్రి. వ్యాప్తమగు.
నెరవు : దే. అ. క్రి. గుమిగూడు.
నెరసుదెగడు: దే. స. క్రి. తప్పులెన్ను, నిందించు.
నెరసులెన్ను: దే. స. క్రి. చిన్నచిన్న దోషము లెంచు.
నెరసుపెట్టు : దే. స, క్రి. దోషినిజేయు.
నెరుము : దే. స. క్రి. 1. అదుము.
2. నరములమీదనాయుధములతో రాయు.
3. గుంటను బాగుగా అటు నిటు నెఱపి పెద్దదిచేయు.

నెఱకులాడు : దే. స. క్రి. 1. మర్మచ్ఛేదముగా పలుకు.
2. ఆయువుపట్టుల గ్రుచ్చుకొను.
భార. అర. 1 ఆ. 314

నెఱకులుగొను : దే. స. క్రి. మర్మభేదనముగా మాటాడు.

నెఱకువేయు : దే. స. క్రి. మర్మములను భేదించు. నైష.2 ఆ.97

నెఱపించు : దే. స. క్రి. ప్రకటించు, వెలయించు.

నెఱపు : దే. స. క్రి. 1. వ్యాపింపఁజేయు.
2. నెఱవేర్చు.
3 ప్రకటించు.
4. ఆచరించు.
5. కూర్చు.

నెఱయించు : దే. స. క్రి. నెఱపించు. వసు. 6 ఆ. 91

నెఱయు : దే. అ. క్రి. 1. అతిశయించు.
2. వ్యాపించు.
3. ఒప్పు, ప్రకాశించు.
4. వ్యక్తమగు.
5. విజృంభించు.
6. పడు.
7. చలించు.
8. సిద్ధించు. ఉత్తర హరి వం.2ఆ.173

నెఱవేర్చు : దే. స. క్రి. 1. సిద్ధింపఁజేయు.
2. పూర్తినొందించు.

నెఱవేరుచు : దే. స. క్రి. పూర్తిచేయు.

నెఱికగట్టు : దే. స. క్రి. కుచ్చెళ్ళుపోసికట్టు. కాశీ. 3 ఆ. 212

నెఱికవట్టు : దే. అ. క్రి. కుచ్చెళ్ళుపోయు. ఆము. 6 ఆ. 128

నెఱికొల్పు : దే. స. క్రి. చక్కగా ధరించు

నెఱిగొట్టు : దే. అ. క్రి. భూమిపగులు.

నెఱిపడు : దే. అ. క్రి. 1. అగు.
2. సిద్ధించు.
నెఱిఁబడు : దే. అ. క్రి. కుదుటబడు, యథాస్థితికివచ్చు.
నెఱియలువాఱు : దే. అ. క్రి. బీటలువాఱు, పగులు.
నెఱియు : దే. స. క్రి. బాధపెట్టు.
అ. క్రి. భూమి పగులు.
నెఱ్ఱెవారు : దే. అ. క్రి. నెఱియలువాఱు.
నెఱ్ఱెవట్టు : దే. స. క్రి. తొలుచు, రంధ్రముచేయు.
స్వా. 2ఆ. 7.
నెలకన్నెఱుగు : దే. అ. క్రి. చంద్రదర్శనముచేయు.
నెలకొను : దే. అ. క్రి. 1. కుదుకుకొను.
2. స్థిరపడు.
3. ఉండు.
4. ప్రాప్తించు, కలుగు.
స. క్రి. పూను, యత్నించు.
నెలకొలుపు : దే. స. క్రి. నిలుపు, స్థాపించు.
(నెలకొను ధా. ప్రే.) రూ. నెలకొల్పు.
నెలతప్పు : దే. అ. క్రి. గర్భిణియగు.
నెలమసలు . దే. అ. క్రి. నెలతప్పు, గర్భిణియగు.
నెలయు : దే. అ. క్రి. ఉండు.
నెలవుకొను : దే. అ. క్రి. 1. పాదుకొను, స్థిరపడు.
2. ఉండు, వర్తిల్లు.
3. ఒప్పు, ప్రకాశించు.
4. కలుగు, జనించు.
నెలవుకొలుపు : దే. స. క్రి. 1. పాదుకొలుపు, నిలుపు.
2. చేయు, కలిగించు.
నెలవుకొల్పు : దే. స. క్రి. 1. పాదుకొలుపు, నిలుపు.
2. చేయు, కలిగించు.

నెలవుపడు : దే. అ. క్రి. నిలుచు.
నెలవుపఱచు : దే. స. క్రి. నిలుపు.
నెలవేదు : దే. అ. క్రి, స్థానభ్రష్టమగు.
నెలవొందు : దే అ. క్రి. వ్యాపించు.
నెవడు : దే. అ. క్రి వెలయు, ఉండు.
నెవయఁబడు : దే. అ. క్రి. ఎగయు, పైకిలేచు. క.కు.5 ఆ.37
నెవయు : దే. అ. క్రి. ఎగయు, ఎగుడు. భార.సభా.1ఆ.325.
నెవ్వాలుదీర్చు : దే. స. క్రి. తృప్తికలిగించు.

ఇష్టమృష్టాన్నంబులిడి పదార్థములఁ
దుష్టి నొందించి బంతులవెంట వారి
నుపచరింపుచు వినియోగజనంబు
నిపుణులై వడ్డించి నెవ్వాలుదీర్చ
నన్నపర్వతములు నాజ్యవాహినులు.
గౌల. కట్టా. 1390.

నెసమార్చు : దే. స. క్రి. చంపు. [నలువుర నీగతి నెసమార్చు.]
కుశలనోపాఖ్యానము.

# నే

నేటించు : దే. స. క్రి. 1. చాగిలపడు.
భద్రరాజపుత్ర చరిత్రము, శ. ర.
2. నిశ్చయించి పలుకు.
నేటివ్వు (నేటు+ఇవ్వు): } దే. అ. క్రి. ఇంటికపళ్ళు, గుడిసెలకు
నేట్లువెట్లు : } కూలకుండ పోటీపెట్టు.
నేటుగొను : దే. అ. క్రి. అతిశయించు.
స. క్రి. 1. నిశ్చయముచేయు.
2. దృఢపఱచు.

నేటుచేయు :
నేటుసేయు : } దే. స. క్రి. దృఢపఱచు.

నేమించు : దే. అ. క్రి. నియమముగొను, దీక్షవహించు.
స. క్రి. నియమించు, నిరోధించు.

నేము : దే. స. క్రి. ధాన్యాదులను చేటలో పోసి రాళ్ళు లేకుండఁజేయు.

నేయు : దే. స. క్రి. నేతసేయు.

నేరపెట్టు : దే. స. క్రి. దోషినిగాఁ బలుకు.

నేరముకొను : దే. స. క్రి. తప్పుపట్టు.

నేరుచు : దే. అ. క్రి. 1. సమర్థుఁడగు.
2. సంభవించు.
స. క్రి. 1. ఎఱుగు.
2. అభ్యసించు.

నేర్చు : దే. స. క్రి. కఱచు, అభ్యసించు

నేర్పించిపంపు : దే. స. క్రి. ఎక్కుఁడోలి పంపు.

నేర్పు : దే. స. క్రి. అభ్యసింపఁజేయు.

నేలఁగలియు : దే. అ. క్రి. మంటిపాలగు, నశించు.

నేలఁగలుపు : దే. స. క్రి. నాశముచేయు.

నేలకుఁగోలకుఁదెచ్చు : దే. స. క్రి. ఓడించు. భార. ద్రోణ. 2 ఆ. 332

నేలగొట్టు : దే. స. క్రి. భూమిని తాకి ఒట్టుపెట్టుకొను. (తెలం)

నేలపాలుచేయు : దే. స. క్రి. కూల్చు, నాశముచేయు.
(రూ) నేలకూల్చు.

నేలమట్టముచేయు: దే. స. క్రి. నాశమొనరించు.

నేళించు . దే. స. క్రి. సొక్కు.
[రమణీయ సుమరజోరాజి రాజిలుచోట
సొలయుచు నేళించి తొలఁగునమ్మ.]
కు. మ. చ.

నేస్తమగు : దే. అ. క్రి. చెలిమిసేయు.

# నొ

నొంచు : దే. స. క్రి. 1. బాధించు.
2. చంపు.

నొక్కలి-నొక్కల్లు: దే. అ. క్రి. నొక్కుడువడు.

నొక్కు : దే. స. క్రి. 1. నలుపు.
2. అదుము.
3. ఒకపని చేయ బలవంతముచేయు.

నొగిలించు : దే. స. క్రి. 1. పగులగొట్టు.
2. బాధించు.

నొగులు : దే. అ. క్రి. 1. బాధనొందు.
2. నలగు.
3. చెడు.
4. వాడు.

నొగుల్చు : దే. స. క్రి. 1. బాధించు.
2. పగులఁజేయు.

నొచ్చిలు : దే. అ. క్రి. రాలుపడు. కృ. శకుం. 3 ఆ. 107

నొచ్చు : దే. అ. క్రి. 1. బాధపడు.
2. నశించు.

నొచ్చుకొను : దే. స. క్రి. నిందించు. చం. రా. 5 ఆ. 68
అ. క్రి. బాధపడు.

నొడుచు : దే. స. క్రి. తప్పులు పట్టు.

నొడువు : దే. స. క్రి. 1. వచించు.
2. రచించు.
3. స్తుతించు.

నొప్పించు : దే. స. క్రి. నొవ్వఁజేయు.

నొప్పివడు : దే. అ. క్రి. బాధపడు.

నొప్పులుపడు : } దే. అ. క్రి. ప్రసవవేదనపడు. (తెలం.)
నొప్పులుదిను : }
నొల్లు : దే. స. క్రి. 1. ప్రోగుచేయు.
2. బిడ్డలు నోటఁ వేలిడుకొనిచప్పరించు.
నిర్వ. ఉ. రా. 1 అ 40
నొల్లుకొను : దే. స. క్రి. అత్యాశతో ప్రోగుచేసికొను.
నొవ్వు : దే. అ. క్రి. నొగులు.

## నో

నోఁచు : దే. అ. క్రి. వ్రతాదు లాచరించు.
నోఁచుకొను : దే. అ. క్రి. ప్రాప్తమునొందు, అదృష్టము కలిగి యుండు.
నోట(ర)గాయవేయు: దే. అ. క్రి. ఊరకుండు.
నోటనాలుకకలు: దే. అ. క్రి. మాట్లాడు.
నోటికితాళమువేయు: దే. అ. క్రి. వాగ్బంధనముచేయు.
నోటికొలదులువల్కు: దే. అ. క్రి. నోటికి వచ్చినట్లు మాటాడు.
నోటిలోనాడు : దే. అ. క్రి. చదువుటకు సరిగా గుర్తునకు రాకపోవు
నోనాడు ; దే. స. క్రి, నొవ్వనాడు.
నోమించు : దే. స. క్రి. నోము ధా. ప్రే.
నోము : దే. అ. క్రి. వ్రతాదు లాచరించు.
స. క్రి. 1. పూజించు.
2. పోగొట్టు. శ. ర.
నోయు : దే. అ. క్రి. నొచ్చు, బాధపడు.
భార. ఆది. 2 ఆ. 37
నోరఁబట్టు : దే. స. క్రి. పుక్కిటఁబట్టు, త్రాగు.
నోరదుము : దే. స. క్రి. నోరునొక్కు.
నోరాచు : దే. అ. క్రి. ఎక్కువ తినకుండు; వ్యర్థప్రసంగము చేయకుండు.

నోరాడించు : దే. స. క్రి. 1. ఎప్పుడును తిను.
2. ప్రసంగించు.
నోరాడు : దే. అ. క్రి. మాట వెలువడు.
నోరార్చు : దే. అ. క్రి. 1. నోరాడించు.
2. ఆవులించు, ద్వి. హరి. పు. 209
నోరికఱ్ఱగొను : దే. స. క్రి. మ్రింగు.
అసురు లనినఁ జంప, నల గుహావ్యాహారు
లనిన నోరికళ్లు గొనఁగఁ దలఁచు.
నృ. పు. 2–5.
నోరికింబోవు : దే. అ. క్రి. నోటికింపగు. క. కు. 4 ఆ. 51
నోరికివచ్చినట్లుపలుకు : దే. స. క్రి. ఇష్టము వచ్చినట్లు మాట్లాడు.
నోరుకట్టుకొను : దే. అ. క్రి. పథ్యము నాచరించు, వాగకుండు.
నోరుకాయలుగాచు : దే. అ. క్రి. పలుమాఱు పిల్చుటచే నోరు నొప్పి నొందు.
నోరుకాయు : దే. అ. క్రి. నోటికి రుచియైన దెల్ల తినకుండ పథ్యము చేయు.
నోరుగొట్టు : దే. స. క్రి. 1. తినకుండఁ జేయు.
2. అన్యాయముచేయు.
నోరుచేయు : దే. అ. క్రి. మాటలాడు.
నోరుచేసికొను : దే. స. క్రి. 1. నిందించు.
'వాఁడూరక నోరుచేసికొన్నాఁడు.'
2. ధిక్కరించి మాట్లాడ నుద్యమించు.
నోరుదెఱచు : దే. అ. క్రి. 1. మాటాడు.
2. బదులు చెప్పకయుండు.
3. అత్యాశపడు. భార. శాం. 3 ఆ.30
నోరునొక్కు : దే. స. క్రి. మాటాడకుండఁ జేయు.
నోరుపారవేయు :
నోరుపారవేసికొను : } దే. అ. క్రి. 1. ఇష్టమువచ్చినట్లుమాటాడు.
2. వ్యర్థముగా ప్రలాపించు.

నోరుమూయు : దే. అ. క్రి. మాటాడకుండు.
నోరుమెదపు : దే. అ. క్రి. మాటలాడు.
నోరుమెదల్చు : దే. అ. క్రి. చెప్పు.
నోరువిప్పు : దే. అ. క్రి. మాటలాడు. (నిందతో)
నోరూరు : దే. అ. క్రి. 1. అపేక్షకలుగు.
2. తినుబండముల తలచినపుడు నోట నీరు పుట్టు.
నోరెత్తు : దే. అ. క్రి. మాటాడ యత్నించు.
నోళ్లలోపడు : దే. అ. క్రి. అపనిందపడు.
నౌడుకొట్టు : దే. అ. క్రి. మిణకరించు (గూ) నవ్వుడుకొట్టు. శ. ర.

న్యక్కారించు : సం. స. క్రి. ధిక్కరించు.
న్యసించు : సం. స. క్రి. 1. ఉంచు.
2. ఇల్లడపెట్టు, తాకట్టుపెట్టు.
3. తాకు.
4. జపసమయమున దేహావయవములను బీజాక్షరముల నుచ్చరించుచు స్పృశించు. వి. పు. 4 ఆ. 197.
న్యాయమాడు : మి. అ. క్రి. న్యాయము పలుకు.
న్యాసముపెట్టు: మి. స. క్రి. తాకట్టుపెట్టు.

# ప

పంకించు : దే. స. క్రి. 1. పట్టించు.
2. చలింపఁజేయు.
3. (తల) కుడియెడమలకు ఆడించు,
4. అంకితమొనరించు. చంద్ర. వి.1
పంక్తిగట్టు : మి. అ. క్రి. వరుస దీర్చు.

పంక్తులుతీర్చు : మి. అ. క్రి. పంక్తిగాఁ గూర్చుండు.
పంక్తులుసాగు : మి. అ. క్రి. బంతులుదీర్చి కూర్చుండు.
పంగటించు : దే. అ. క్రి. ఎడముగా చాచు. (రూ.) పంగడించు, పంగలించు.
పంగలువెట్టు : దే. అ. క్రి: కొమ్మలు వేయు.
పంగించు : దే. స. క్రి. కోపించు.
పంచనామాజరుపు: అన్య. దే. స. క్రి. హత్యగాని, యిల్లు వేలముగాని, జరిగినపుడు అధికారయుక్తముగ విచారణ జరుపు.
పంచబంగాళమగు: దే. అ. క్రి. చెల్లాచెదరగు.
పంచితిలు : దే. అ. క్రి. గోవు మూత్రము విడుచు.
"గంభీర గోరాజమున్, నేలంగూలఁగఁ దన్నేఁబంచితిలఁగా." భాగ.
పంచెడుపగు : దే. అ. క్రి. పనిచెడు.
పంచారించు : దే. అ. క్రి. 1. వ్యాపించు.
2. అతిశయించు.
3. నిక్కు.
పంచు : దే. స. క్రి. 1 ఆజ్ఞాపించు.
2. పుచ్చు.
3. విభాగము సేయు.
పంజరించు . దే. స. క్రి. అభ్యర్థించు.
"దాని, గబ్బిచనుదోయి యొనునుంచి కౌఁగిలించి, పడఁతితో దెల్పవలదని పంజరించి." రా. సా. 2 ఆ.
పంటించు : దే. అ. క్రి. 1. జాగుసేయు. 2. తడఁబడు.
స. క్రి. 1. అనుమానించు. 2. వరుసపెట్టు.
"పీరులనెల్ల పంటించి చంపుచు"
క. వ. రా. యు. కాం.

పంట్రించు : దే. స. క్రి. పంట్రకోలతో బొడుచు.
పండు : దే. అ. క్రి. 1. ఫలించు.
2. శయనించు.
పండుకొను : దే. అ. క్రి. 1. శయనించు.
2. ఫలముగొను.
పండువుసేయు : దే. అ. క్రి. 1. ఉత్సవముసేయు.
2. పండుగనాటివలె వంటకములతో విందుసేయు.
పంతగించు : దే. స. క్రి. 1. పోటీచేయు.
2. విఘించు.
అ. క్రి. ప్రతిజ్ఞచేయు.
పందలయెత్తు : దే. అ. క్రి. అప్పుడే నలుకగా వచ్చి తలచూపు.
కు. సం.
పందాపట్టు : దే. స. క్రి. పనిపట్టించు.
పంపించు : దే. స. క్రి. పంచు, పుచ్చు.
పంపు ; దే. స. క్రి. 1. ఆజ్ఞాపించు;
2. పంపించు.
పంపుకొట్టు : అన్య దే. అ. క్రి. ముఖస్తుతిచేయు.
పంపుజేయు : దే. స. క్రి. దుష్టశక్తులను,దయ్యములను బైకిపంపు.
పంపువడు : దే. అ. క్రి. ఆజ్ఞాపింపఁబడు.
పంపువెట్టు : దే. స. క్రి. ఆజ్ఞాపించు.
పంప్రచేయు : దే. స. క్రి. విభాగముసేయు. (తెలం)
పంబు : దే. అ. క్రి. అతిశయించు.
పకపకనవ్వు : దే. అ. క్రి. పండ్లు కన్పడునట్లు మిక్కుటముగా నవ్వు.
పక్కాచేయు. దే. స. క్రి. వ్యవహారమును దృఢముచేయు.
పక్కగట్టు : దే. అ. క్రి. పొరగానేర్పడు; రూ. పొక్కగట్టు.

పక్కుగొనవేయు : దే. స. క్రి. గాఢముగా నాటునట్లు వ్రేయు.
పక్షీకరించు : సం. అ. క్రి పక్షము వహించు.
పక్ష్మలించు : సం. అ. క్రి. ఱెప్పవేయు.
పగగొను : దే. స. క్రి. విరోధపడు.
పగటు . దే. స. క్రి. చాటు.
పగటుచూపు : దే. స. క్రి. మురిపెము కనఁబఱచు.
పగదెంచు : దే. స. క్రి. చంపు.
పగఁబట్టు : దే. అ. క్రి. పగఁగొను.
పగులఁగొట్టు : దే. స. క్రి. పగుల్చు
పగులఁబడిపోవు: దే. స. క్రి. అధికముగాఁ దిట్టు.
అ. క్రి. విఱుగఁబడిపోవు.
పగులఁబాఱు : దే. అ. క్రి. పగులు.
పగులిచ్చు : దే. అ. క్రి. బీటలువాఱు,
పగులు : దే. అ. క్రి. భిన్నమగు. (రూ) పగలు.
పగులుచు : దే. స. క్రి. పగులఁజేయు.
పగులుచూపు : దే. అ. క్రి. భిన్నమగు.
పగులుబోయు : దే. అ. క్రి. 1. పగులుచూపు.
2. పగులుటకు ప్రారంభించు.
పగులువారు : దే. అ. క్రి. చీలు.
పగ్గించు : దే. అ. క్రి. ప్రజ్ఞలు పలుకు.
పచనముచేయు :
పచియించు : } సం. స. క్రి. వండు.
పచేళిమమగు : సం. అ. క్రి. తనంతట పక్వమగు. పాండు.
పచ్చబారు : దే. అ. క్రి. పండబారు.
పచ్చానవెట్టు : దే. స. క్రి. అడ్డముగాఁబెట్టు. (తెలం)
పచ్చిదేరు : దే. అ. క్రి. పచ్చియగు.

పచరించు : దే. అ. క్రి. ప్రవర్తించు.
స. క్రి. 1. ప్రసరింపజేయు.
2. సరకుల నమ్ము.
3. వలను పఱచు.
4. ప్రయోగించు.
5. చాచు.
6. నడపు.
7. సవరించు.
8. ప్రకటించు.

పచారించు : దే. స. క్రి. 1. నడపు.
2. ప్రసరింపఁజేయు.

పజీతుచేయు : దే. స. క్రి. అవమానపఱచు. (తెలం)

పటపటపండ్లుగీటు : దే. అ. క్రి. పటాత్కారముతో దంతములు కొఱకు.

పటవణించు : దే. అ. క్రి. వ్యాపించు.

పటితళించు : }
పటితాళించు : } దే. స. క్రి. చఱచు

పట్టించు : దే. స. క్రి. 1. విద్యార్థులకు నూతనపుస్తకము ప్రారంభముచేయించు.
2. ఇతరులచే స్వీకరింపఁజేయు.
అ. క్రి. శిక్షించు.
"రేపు నీ పని పట్టించెదను"

పట్టించుకొను. దే. స. క్రి. 1. ఒక విషయమై శ్రద్ధచూపు.
2. తన, లేక, తాను లక్ష్యముగా నెంచు.

పట్టిపల్లార్చు : }
పట్టిపాలార్చు : } దే. స. క్రి. 1. అధికముగాఁ గలఁత నొందించు.
2. జరిగినదానిని గూర్చి మాటిమాటికి దెప్పిపొడుచు.

పట్టియాడు : దే. స. క్రి. అవలంబించు.
పట్టందు : దే. అ. క్రి. పట్టుకొనుటకు నిలుచు.
పట్టుకున్నకొఱుకు : దే. స. క్రి. పటుక్కుమనునట్లు కొఱుకు.
పట్టు : దే. అ. క్రి. 1. చెల్లు.
2. బహుకాలము గతించు.
3. అవధి నిరూపించు.
4 పట్టుపట్టు.
5. అంగీకారము కాకపోవు.
6. ప్రారంభముచేయు.
7. అంటు. "వీనికక్షరమునోటపట్టదు"
8. సంబంధము కలిగియుండు.
"నా కేమి పట్టినది?"
9. ఏర్పడు.
10. వచ్చు. (గింజ పట్టినది. క్రొవ్వు పట్టినది.)
స. క్రి. 1. గ్రహించు.
2. భరించు. "ఇది సేరుబియ్యము పట్టును."
3. ప్రమాణము సరిపోవు.
'ఈ యుంగరము నా వ్రేలికిపట్టినది.'
4. శంఖాదికమును ధ్వన్యావిర్భావమున కనుకూలముగ పట్టు.
5. సంవాహనార్థము పట్టు.
6. తదనంతరకార్యానుకూలముగఁగాని కార్యార్థముగాని యొక వస్తువును గ్రహించు.
7. గ్రసించు, "గ్రహణము పట్టినది."

పట్టు 8. ఆశ్రయమిచ్చు. "పట్టివిడువరాదు." త్యాగ.

9. కీడ్పు పట్టుకొను.

10. ఎక్కించు, "వడ్లు బస్తాలకు పట్టిరి."

పట్టుకొను : దే. స. క్రి. 1. భూతాదు లావేశించు.

2. సూక్ష్మముగ గ్రహించు. (విద్యాదులు.)

3. దొరకనిదానిని లభింపఁజేసికొను.

4. ఆశ్రయమును దొరకించుకొను.

5. (దొంగను) పట్టుకొను.

6. ఆపుకొను. "నవ్వు పట్టుకొనలేక పోయెను."

అ. క్రి. 1. కార్యవ్యగ్రమగు శరీరైకదేశమున రక్తప్రసారము తగ్గుటచే బిగియు.

2. ఒక వస్తువు గ్రహించబోయినపుడు మేకులు మొ॥ యడ్డగించు.

పట్టుచేయు : దే. స. క్రి. విస్తరి వేయుటకు ముందు స్థలశుద్ధిచేయు. "కరగృహీతములైన పరిమళోదకములు పలుచగాఁ జిలికించి పట్టుచేసి, రమణీయ నవరత్న రజతచామీకర రచితంబులగు పళ్ళెరములు వెట్టి."

పట్టుతప్పు : దే. అ. క్రి. ఆధారము తప్పు.

పట్టున వఱచు : దే. స. క్రి వశముచేసికొను.

పట్టుపట్టు : దే. స. క్రి. 1. నిరోధించు.

2. బిగించు; (లేపాదులు)

3. తీవ్రముగా కార్యవ్యగ్రుఁడగు.

పట్టుపఱచు : దే. స. క్రి. చిక్కింపఁజేయు.

పట్టుపెట్టు : దే. స. క్రి. పట్టుచేయు.

పట్టులుపట్టు : దే. స. క్రి. కుస్తీలుపట్టు.

పట్టువడు : దే. అ. క్రి. చిక్కు, విదితమగు.

పట్టువదలు : దే. అ. క్రి. 1. కార్యవిరామము నొందు.
2. దానియంతట నది సడలు.
స. క్రి. వదలిపెట్టు.

పట్టువఱుచు : దే. స. క్రి. ఒప్పుకొనునట్లుచేయు.

పట్టువేయు : దే. అ. క్రి. 1. ముగ్గులు వేయు.
2. గ్రహాదినివారణకొఱకు పట్టులు వేయు.
3. నొసటిపై శాంతి మొ॥వి చాది వేయు.

పట్లువట్టు : దే. అ. క్రి. కుస్తీలుపట్టు.

పఠించు : సం. స. క్రి చదువు.

పడగలువాలు : దే. అ. క్రి. టెక్కెములు రాలు.

పడగెత్తు : దే. అ. క్రి. ధ్వజమెత్తు. ''కోటికిఁ బడగెత్తు.''

పడచు : దే. స. క్రి. పడయు.

పడదీసిపోయు : దే స. క్రి. బలవంతముగ ఔషధము సేవింపఁజేయు.

పడదీసి బిగించు. దే. స. క్రి. బలవంతమున న్యవహారమున బెసక కుండఁజేయు.

పడ(ద్రో)సికొనివచ్చు : దే. అ. క్రి. 1. కార్యతీవ్రతలో మనుష్యులను కానకుండ త్రోసికొనుచు ముందుకుఁ బోవు.
2. నిద్రాదు లొక్కసారిగ తీవ్ర రూపమును ధరించు.
''నిద్ర పడఁద్రోసికొని వచ్చు చున్నది.''

పడఁబడఁబాఱు : దే. అ. క్రి. తప్పటడుగులు వేయు.

"పడఁబడఁబాఱుచున్ నడఁకుఁ బట్టిని దల్లి ని దండ్రి నేలలో
వెడలని తమ్ముగుబ్బల నవీనకులాంగన నోరులేని."

పాండు. 3 ఆ.

పడయు : దే. స. క్రి. పొందు (బిడ్డలను.)
పడియపడు : దే. అ. క్రి. (నేల) గుంటపడు.
పడియుండు : దే. అ. క్రి. వశమైయుండు.
పడిసెము పట్టు : దే. అ. క్రి. జలుబుచేయు.
పడు : దే. అ. క్రి. 1. క్రిందఁబడు.

2. పాటుపడు.
3. తిట్లుతిను.
4. ముద్రపడు.
5. కోపము మొ॥ సర్వవికారములను పొందు (కోపపడు, భయపడు, మోహపడు మొ.)
6. నాణెములు చెల్లు
7. స్నేహము భాసించు.
"వారిద్దఱకు పడును, వారిద్దఱకు పడదు."
8. బావిలో జల యూఱు.
9. కలహము సంభవించు,
"వారిద్దరకు పడ్డది."
10. శరీర మొకస్థితిలో నుండు.
బోర్లగిలపడు, చేర్లగిలబడు. మొ॥
11. ఒకస్థితిని పొందు.
12. లంఘనములు పడు.
13. అప్రతిష్ఠ పడు.
14 అడ్డుపడు.

పడు :
15. అడ్డముపడు.
16. వ్యాధిగ్రస్తుఁ డగు.
17. ఎగిరిపడు, పొగరుచూపు.
18. ఎత్తుపడు. శక్తివిహీనమగు.
"గొడ్డెత్తుపడెను."
19. లేవనెత్తవలసిన స్థితిలోనుండు.
(దుర్దశాపన్నుఁడగు.)

పడికట్టు : దే. అ. క్రి. నేయి మొ॥ కొనునప్పుడు పాత్రలకు సరియగు తూకము పెట్టు.

పడిచచ్చు : దే. అ. క్రి. 1. నశించు.
2. మిక్కిలి ఆసక్తిచూపు.

పడిచేయు : దే. అ. క్రి. జీతముకొఱకు పనిచేయు.

పడిపోవు : దే. అ. క్రి. కూలు.
1. వైరము ప్రకటించు.
2. నిస్సత్తువయగు.
"కాళ్ళు పడిపోయెను."

పడియకట్టు : దే. అ. క్రి. పల్లములో నీళ్ళు నిలుచు.

పడివెట్టు : దే. అ. క్రి. దినవెచ్చమిచ్చు, భృతి నిచ్చు.

పడుకయిచ్చు : దే. స. క్రి. భోగించు.
"అందరికి నన్నిరూపంబులంది పొంద...
...యిరువురకు ముగ్గురకు మఱియేవుర
కును, బడకయిచ్చుచుఁ బెనఁగె గోపాలుఁ
డపుడు." దశ. చ. 8 ఆ.

పడుకవాసియగు : పశువులకు దోమకాటు లేక నిదురపట్టు ప్రదేశమై యుండు. (చేయివాసియగు)

పడుకవేయు : దే. అ. క్రి. జబ్బుపడు.

పడుకొను : దే. అ. క్రి. 1. శయనించు.
2. వ్యవహార మాగిపోవు.

పడుచుకొను : దే. అ. క్రి. వ్యభిచారముచే సంపాదించు.

పడుచులేచుచుఁజేయు : దే. అ. క్రి. లేనియోపికను దెచ్చుకొనిచేయు.

పడటంగల్పు : దే. స. క్రి. 1. కలుష మొనర్చు.
2. వృథాయొనర్చు. యా.వి.వి.

పదనిచ్చు : దే. స. క్రి. 1. పాకమునకుఁదెచ్చు,
"పన్నీటన్ నయనమ్ము లొత్తెఁ దనువుం
బాటీరపంకంబుతోఁ
జెన్నారం బదనిచ్చి గీరి సిగవేసెన్"
హం. వి. 1 ఆ.
2. సరకు చేయు. (పొగాకుపదనుచేయు)
రూ. పదనుచేయు.

పదనుకొను : దే. అ. క్రి. 1. కార్యప్రారంభానుకూలదశ నొందు.
2. సహజమైనది తదంశమునందుఁగూడ
భాసించు, ప్రకాశించు.
"అఱచంద్రులోని చిహ్నంశనునుంబోలె
నుదుటఁ గస్తురిబొట్టు పదనుకొనఁగ."
పాండు. 4ఆ.

పదరు : దే. స. క్రి. 1. కోపించు.
2. చలింపఁజేయు.
3. ఆక్షేపించు.
4. వదరు.

పదస్తుచేయు : అన్య. దే. అ. క్రి. 1. భద్రముగా దాచిపెట్టు.
2. విలువైనదిగా భావించు.

పదిలపడు: దే. అ. క్రి. 1. భద్రపడు.
2. స్థిరపడు.

పదిలముచేయు : దే. స. క్రి. భద్రపఱచు.

పదిలించు : దే. స. క్రి. భద్రపఱచుకొను.
"హృదయము పదిలింపలేక." భా.రా.
'ఎద పదిలించుకొన్నది' ఆంధ్రప్రశస్తి.

పదుప : దే. అ. క్రి. 1. త్వరపడు.
స. క్రి. 1. దూషించు.
2. బెదరించు.

పదురుచు : దే. స. క్రి. పదురఁజేయు,
రూ. పద్రుచు.

పనవు : దే. అ. క్రి. ప్రలాపించు.

పనిగొను : దే. స. క్రి. నియోగించు.

పనితగులు : దే. అ. క్రి. కార్యావసరము కలుగు.

పనితీర్చు : దే. స. క్రి. చంపు.

పనియైపోవు : దే. అ. క్రి. 1. కార్యము పూర్తియగు.
2. పేదపడు.
3. మృత్యువు సమీపించు.
4. కొఱగాకపోవు.
"వాని పని యైపోయెను."

పనివంచు : దే. స. క్రి. పనిగొను.

పనివడు : దే. అ. క్రి. (పని+పడు) అక్కఱపడు.
స. క్రి. 1. అభ్యసించు.

పనివిను : దే. అ. క్రి. 1. ఆజ్ఞానశవర్తియగు;
2. సెలవు తీసికొను.

పనుకు : దే. స. క్రి. ఆగ్రహించు.

పనుగొను : దే. అ. క్రి. 1. దృఢపడు.
2. కలుగు.

పనుచు : దే. స. క్రి. 1. నియోగించు.
2. పుచ్చు.

పనుపడు : దే. అ. క్రి. 1. కలుగు.
2. నాటు.
3. కార్యము సమకూడివచ్చు.

పన్నిదముపొడుచు: దే. అ. క్రి. పందెము వేయు.

పన్నుపడు : దే. అ. క్రి. 1. కలుగు.
2. నాటు.
3. వాడుకపడు. ప్రే. పన్నుపఱచు.

పన్ను సెఱచు : దే. స. క్రి. ఉన్న కుదిరిక పాడుసేయు.

పన్ను : దే. స. క్రి. 1. వ్యూహములు దీర్చు.
2. సిద్ధపఱచు.
3. ఏర్పఱచు;
4. కుట్రపన్ను.
5. అమర్చు.
6. నాగలి మొ॥గు సాధనములకు త్రాళ్ళతో కాడి మొదలగునవి యమర్చు;
7. వలపన్ను.
అ. క్రి. 1. కలుగు.
2. యుద్ధమునకు సిద్ధపడు.

పన్నుండు : దే. అ. క్రి. శయనించు; పరుండు.

పన్నుపడు : దే. అ. క్రి. 1. కలుగు.
2. నాటుకొను.
3. వాడుకపడు.

పప్పుచేయు : దే. స. క్రి. 1. పెసలు కందులు మొ॥ దాసి పొట్టు పోయి బద్దలగునట్లుచేయు.
2. పొడిచేయు.
3. నఱుమాడు. ఆం. వా. 4
4. బేడలుచేయు.

పప్పులుడుకు : దే. స. క్రి. 1. సాధ్యమగు (సామాన్యముగా వ్యతిరేకమునందే ప్రయోగము.)
"నాదగ్గర నీ పప్పు లుడకవు."

2. ఆటలుసాగు.

పప్పెత్తు : దే. స. క్రి. తగినశాస్తి చేయు.

పమ్మ : దే. అ. క్రి. అతిశయించు.

పయనించు : దే. అ. క్రి. ప్రయాణముచేయు.

పయ్యాడు : దే. అ. క్రి. 1. ఆవహించు.

2. పైనినాడు.

3. కలిసివచ్చు.

"ఈకైక యేమిటి కిట్టులయ్యె నెవతె
చెప్పెరా యీబుద్ధి దీని కివ్వేళ
దయ్యంబుసోకెనో తనయదృష్టంబు
పయ్యాడి దీని నెపంబైన యదియొ.
క. వ. రా. బాల. 1.

పయిసేఁతసేయు: దే స. క్రి. ఉపరతిసేయు. బిల్హా.

పయిసేయు : దే. స. క్రి. ఆక్రమించు;

"ధరణి నీయంతపాతకుఁ జూడలేదు
నయసువాఁడవు నీవు వార్ధకంబగుటఁ
బయిఁ సేయకున్నాఁడఁ బదరి నీమీఁద."
క. వ. రా. ఆరణ్య కాం.

పరకాయించిచూచు : దే. స. క్రి. విషయము తెలిసికొనుటకు నిదానించి చూచు.

పరకాయించు : దే. స. క్రి. పరికించు, పరీక్షగాఁజూచు.

పరంగించు : దే. స. క్రి. పరగించు.

క. సంగతి పంచామృతములు
పొంగున రసవితతి గూర్చి పుటమిడి యజుఁడా
బంగరు సిగ్గులగులికఁబ
రంగించె ననంగ నుంగరము నిడి రతివల్.

యా. వి. వి.

పరఁగు : దే. అ. క్రి. 1. ప్రయుక్తమగు.
2. ప్రసిద్ధమగు.
3. ప్రవర్తిల్లు.
4. ప్రసరించు.
5. ప్రయాణమగు.
6. ప్రవహించు.
7. విహరించు.

పరడులెత్తియుండు: దే. అ. క్రి. కాయలు కాచు. ప. వి.

పరపరగీయు : దే. స. క్రి. వేగముగా నవిస్పష్టముగా వ్రాయు.

పరపర చించు : దే. స. క్రి. వేగముగా, లేక కోపముతో చించు.

పరపు : దే. స. క్రి. 1. బాణములు ప్రయోగించు.
2. ప్రవహింపఁజేయు.

పరముపడు : దే. అ. క్రి. ప్రాణాచారము పడు.

పరవంజు : దే. స. క్రి. 1. క్రమ్ముకొను. 2. ఆవరించు.

పరవత్రోలు : దే. స. క్రి. వేటాడునపుడు పొదలోనున్న జంతువులను బైటకుఁ ద్రోలు.

పరవళ్ళుద్రొక్కు: దే. అ. క్రి. కోపముతో గంతులువేయు.

పరవసముచేయు: దే. అ. క్రి. ఆవేశమునొందు.

"ఇట్లు శిఖండి గండడంగి పోయినం గని
మత్స్యచేది కేకయాది సైన్యంబులు
పరవసంబుచేసి యురవడించిన."

ద్రోణ. 4 ఆ.

పరవు : దే. అ. క్రి. వ్యాపించు.

పరాకు చేయు : దే. స. క్రి. 1. ఉపేక్ష సేయు.
2. మఱపు కలిగించు.
3. బహుపరాకులు చెప్పు.
4. హెచ్చరించు.

పరాకుపడు : ద్వి. అ. క్రి. ప్రమాదపడు.

పరాక్రమించు: సం. అ. క్రి. 1. బలముచూపు.
2. శౌర్యమును ప్రకటించు.

పరాచికమాడు : దే. స. క్రి. ఎకసక్కెములాడు.

పరాభవించు : సం. స. క్రి. అవమానించు.

పరామర్శ చేయు : సం. స. క్రి. ఎవరైన చనిపోయినపుడు వారి కత్యంత బంధువులైనవారిని పలుకరించు.

పరామరిస సేయు:
పరామరిసించు : } దే. స. క్రి. చక్కఁగా విచారణసేయు.

పరామర్శించు : సం. స. క్రి. చక్కఁగా విచారించు.

పరామృశించు : సం. స. క్రి. వివేచించు.

పరిఁజించు : దే. స. క్రి. పరుజుతో (కత్తిపిడి) పట్టు.
"ఇఱువదేనేడుల యెలజవ్వనంపు
దొరలు పసిండికత్తులు పరిఁజించి
కుండలకోటీరకోటితో దివ్యమండ
నంబులుదాల్చి." క.వ.రా. అరణ్యా.

పరికరించు : దే. స. క్రి. పరీక్షించు,
అ. క్రి. 2. ఆయత్తపడు.
"పంకనిర్మగ్నమగు గోవుఁ బరికరించి
సుకరముగనుద్ధరించుగోపకునిమాడ్కి.
జై. భా. 1 ఆ.
సం. అ. క్రి. 1. వలసిన వస్తువులను సేకరించు.

పరికల్పించు : సం. స. క్రి. ఏర్పఱచు. భాగ. శాం. 5 ఆ.

పరికించు : దే. స. క్రి. 1. పరీక్షించు.
2. విచారించు.
3. చూచు.

పరికీర్తించు : సం. స. క్రి. కీర్తనముసేయు.

పరిక్రమించు : సం. అ. క్రి. నిర్గమించు, బయలుదేరు.

పరిక్రీడించు : సం. అ. క్రి. విహారించు.

పరిగ ఏరు : దే. అ. క్రి. కోసిన పైరు కట్టలు కట్టిన తర్వాత క్రిందపడిపోయిన కంకులను ఏరికొను.

పరిగట్టు : దే. స. క్రి. మునుము పెట్టు.
"గసికలు పారలు గడ్డపారలును
ముసలముల్ దాల్చి క్రమ్మక పరిగట్టి
యిలయెల్ల త్రవ్వుచు. క.వ.రా. బాల.

పరిగణించు ; దే. స. క్రి. ఎన్ను.

పరిగొను : దే. అ. క్రి. బాగుతీఱు.
స. క్రి. చుట్టుకొను.

పరిగ్రహించు : సం. స. క్రి, ప్రియముతోఁ బుచ్చుకొను.

పరిఘటించు : సం. స. క్రి. 1. కలిగించు.
2. చేయు.

పరిఘట్టించు : సం. స. క్రి. 1. మోదు, కొట్టు,
2. నేలను దిమ్మిస మొదలైన వానితో బాగుగఁ గొట్టు.

పరిఘూర్ణించు : సం. స. క్రి. ఎదురాడు.

పరిచయించు : సం. స. క్రి. 1. స్నేహించు.
2. మఱగు.

పరిచరించు : సం. స. క్రి. పరిచర్య చేయు.

పరిచ్ఛేదించు : సం. స. క్రి. 1. భేదించు.
2. విడివిడిగాచేయు.
3. నిశ్చయించు. కు. సం. 6 ఆ.
పరిజేయు : దే. స. క్రి. పాలించు.
"పండినచేలెల్ల పరిజేస్తిమంత్రి." కా.క.
పరిఢవించు : సం. స. క్రి. 1. పరిఢవిల్లఁజేయు.
2. నడపు.
3. అతిక్రమించు.
పరిఢవిల్లు : సం. స. క్రి. 1. ధరించు.
అ. క్రి. 1. ప్రవర్తిల్లు.
2. అతిశయిల్లు.
పరిణమించు : సం. అ. క్రి. 1. సంతోషించు.
2. మార్పునొందు.
స. క్రి. నమస్కరించు.
పరితపించు : సం. అ. క్రి. సంతాపించు.
పరితోషించు : సం. అ. క్రి. మిక్కిలి సంతోషించు.
పరిత్యజించు : సం. స. క్రి. పొత్తిగా విడచు.
పరిపాలించు : సం. స. క్రి. చక్కఁగాఁగాపాడు.
పరిపోషించు : సం. స క్రి. చక్కఁగాఁబోషించు.
పరిభవపడు : సం. అ. క్రి. పరిభవముచెందు.
పరిభవించు : సం. స. క్రి. అవమానించు.
పరిభ్రమించు: సం. అ. క్రి. అంతటఁదిరుగు.
పరిమళించు : సం. అ. క్రి. తావి వీచు.
పరిమాఱుచు: దే. స. క్రి. 1. ఖండించు.
2. చంపు.
పరియలువాఱు : దే. అ. క్రి. బీటలువాఱు, ముక్కలగు.
పరియాచకముచేయు: దే. స. క్రి. పరిహసించు.

పరియు : దే. అ. క్రి. 1. తొలఁగు;
2. చెడు.
3. మీఁదిభాగము సారహీనమై
చెక్కలువాసి రాలు.
పరిలంఘించు : సం. స. క్రి. దాటు.
పరివర్తించు : సం. స. క్రి. 1. చుట్టివచ్చు.
2. మార్పింపఁజేయు.
పరివశించు : సం. స. క్రి. మిక్కిలి స్వాధీనముచేయు.
పరివేష్టించు : సం. స. క్రి. చుట్టుకొను.
పరివోవు : దే. స. క్రి. ఆక్రమించు.
అ. క్రి. 1. చెడిపోవు.
2. నశించు.
పరిశీలించు : సం. స. క్రి. శోధించు.
పరిశోధించు : సం. స. క్రి. మిక్కిలి శోధనముచేయు.
పరిశ్రమించు . సం. అ. క్రి. శాస్త్రాదికములందుఁ గృషిసేయు.
పరిసిపోవు : దే. అ. క్రి. 1. కొన్నాళ్ళకు దోష ముపశమించు.
2. మాసిపోవు.
రూ. పరిసిబారిపోవు.
పరిస్ఫోటించు : సం. స. క్రి. 1. చీల్చు.
2. ప్రకాశింపఁజేయు.
పరిషించు : సం. అ. క్రి. పరిషేచనముసేయు.
పరిషేధించు : సం. స. క్రి. నిషేధించు.
పరిష్కరించు : సం. స. క్రి. 1. చక్కఁబెట్టు.
2. అలంకరించు.
3. సర్దుబాటుసేయు.
పరిష్వజించు : సం. స. క్రి. కౌఁగిలించు.
పరిహరించు : సం. స. క్రి. 1. విడుచు; విసర్జించు.

పరిహసించు : సం. స. క్రి. పరిహాసముచేయు, నవ్వు.
పరీక్షించు : సం. స. క్రి. 1. పరిశీలించు.
2. పరికించు.
పరుండు : దే. అ. క్రి. శయనించు.
పరుగులెత్తు : దే. అ. క్రి. పనితొందరచే వేగముగఁబోవు.
పరుగెత్తు : దే. అ. క్రి. వేగముగఁబోవు.
పరుమగు : దే. అ. క్రి. చూర్ణ మగు.
పరువుపోవు : దే. అ. క్రి. మానముపోవు.
పరువులుపెట్టించు దే. స. క్రి. తఱుము.
పరువువెట్టు :
పరువుగొను :
పరువువాఱు :
పరువిడు :
} దే. అ. క్రి. పరుగెత్తు. [రూ] పరుగిడు.
పరువెక్కు : దే. అ. క్రి. చేను మొ॥ నవి పక్వస్థితికి వచ్చు.
పర్యటించు : సం. అ. క్రి. భక్షాదులకుఁ దిరుగు.
పర్యాలోచించు : సం. స. క్రి. చక్కఁగా నాలోచించు.
పర్యుదాసించు : సం. స. క్రి. త్రోయు.
పర్వు : దే. అ. క్రి. వ్యాపించు.
పఱగప్పు : దే. అ. క్రి. పొరగప్పు.
పఱుఁగు : దే. అ. క్రి. ప్రసరించు.
పఱచు : దే. అ. క్రి. ప్రవహించు. రూ. పఱపు.
స. క్రి. 1. పడజేయు.
2. దుప్పటిపఱచు.
3. అనుభవింపఁజేయు.
4. వ్యాపింపఁజేయు.
పఱతెంచు : దే. అ. క్రి. పాఱివచ్చు.

పఱపు : దే. స. క్రి. 1. పోఁగొట్టు.
2. త్రోలు.
3. ప్రయోగించు.
4. వ్రాయు.

పఱవద్రోలు : దే. స. క్రి. వేటయందు మృగములను పొదలలో నుండి వెడలఁగొట్టు.

పఱిగొను : దే. స. క్రి. 1. అపహరించు.
2. చంపు.

పఱియవాయు : దే. అ. క్రి. చీలు.

పఱివోవు : దే. అ. క్రి. 1. కొల్లవోవు.
2. నశించు.

పఱుచు : దే. స. క్రి. 1. పడఁజేయు.
2. దుష్కీర్తిపఱచు.
3. పాటుపడఁజేయు.

పఱుపుచేయు : దే. అ. క్రి. వ్యాపించు. (తెలం.)
స. క్రి. విశాలముచేయు.

పలకపట్టించు : దే. స. క్రి. చదువవేయు.

పలకపట్టు : దే. అ. క్రి. చదువారంభించు.

పలకు : దే. అ. క్రి. 1. పండు.
2. ఫలించు.

పలచమందు : దే. అ. క్రి. కష్టముగొను.

పలపలవేగు : దే. అ. క్రి. తెల్లవారు.

పలమారు : }
పొరమారు: } దే. అ. క్రి. ఆహారము తినునప్పుడు పదార్థము నాసికారంధ్రములోనికిఁ బోవు.

పలవరించు : దే. అ. క్రి. ప్రలాపించు.

పలవించు : దే. అ. క్రి. పలవరించు.

పలవు : దే. అ. క్రి. పలవించు.

పలాములుచేయు: దే. స. క్రి. 1. పాడుచేయు:
2. దోపిడిచేయు.
పలాయనసూత్రముపఠించు: సం. అ. క్రి. పాఱిపోవు.
రూ. పలాయనము చిత్తగించు.
పలుకబాఱు : దే. అ. క్రి. 1. వివర్ణమగు.
2. పాకోన్ముఖమగు.
పలుకరించు : దే. అ. క్రి మాటాడు
స. క్రి. 1. మాటాడించు.
2. హెచ్చరించు.
3. ఆపదలోనున్న వారి నాశ్వాసించు
పలుకు : దే. అ. క్రి. మాటాడు.
స. క్రి. 1. అను.
2. నిందించు.
పలుకుచేయు : దే. స. క్రి. అన్నమును అపక్వస్థితిలో దించు.
పలుకులు చేయు : } దే. స. క్రి. ముక్కలుచేయు.
పొలుకులు చేయు: }
పలుచబడిపోవు: దే. అ. క్రి. 1. పలుచనగు.
2. గౌరవము తగ్గు.
పలుచబడు . దే. అ. క్రి. 1. పలుచనగు.
2. గౌరవము తగ్గు.
పలుము : దే. అ. క్రి. ప్రలాపించు.
పల్కరించు : దే. అ. క్రి. 1. మాటాడు.
స. క్రి. 1. మాటాడించు.
2. హెచ్చరించు.
పల్చించు : దే. స. క్రి. జీనువేయు.
పల్టీకొట్టు : అన్య. దే. అ. క్రి. 1. గతితప్పు.
2. తలక్రిందులగు.
3. చచ్చిపోవు.

పల్లకట్టు.
పల్లగించు: } దే. స. క్రి. 1. పల్లముకట్టు.
2 జీను వేయు.

పల్లటిల్లు: దే. అ. క్రి. 1. వ్యత్యస్తమగు.
2. చలించు,
3. తెల్లఁబోవు.
4. ఎత్తివాలు.

పల్లటీలోను:
పల్లటీలాటు:
పల్లటీల్వైచు: } దే. అ. క్రి. 1. ఎగురు. (పావురము వలె)
2. పల్టీలుగొట్టు.

పల్లనగట్టు: దే. స. క్రి. 1. పల్యాణముకట్టు.
2. అంబారీవైచు.

పల్లవించు. సం. అ. క్రి. చిగుర్చు, చిగిరించు.

పల్లవిలు: సం. అ. క్రి. చిగుర్చు.

పల్లాబోవు: అన్య. దే. అ. క్రి. గుఱ్ఱము మొ॥ నిలువక ఒకదాటు పోవు, ప్రయాణముచేయు.

పల్లార్చు: దే. స. క్రి బాధించు. హంస.

పల్లుకుట్టు: దే. అ. క్రి. దంతమధ్యమునఆహారపదార్థము చిక్కుకొన్నప్పుడు సూచీముఖాదులతోకుట్టు.

పలొత్తు: దే. స. క్రి. దంతక్షతముసేయు.

పల్వరించు: దే. అ. క్రి. ప్రలాపించు.

పళ్ళెముకొట్టు: దే. అ. క్రి. పెండ్లియయిన తర్వాత మగపెండ్లి వారిని వెళ్ళిపొమ్మని పళ్ళెమును ప్రయోగించు.

పవడించు;
పవళించు:
పవ్వడించు:
పవ్వళించు: } దే. అ. క్రి. శయనించు.

పశువతించు : సం. స. క్రి. బలిపెట్టు. (పశువుగాఁ జేయు.)
పశువఱచు . సం. స. క్రి. యజ్ఞమునందు బలియిచ్చు.
పసందుచేయు : దే. స. క్రి. 1. అందముచేయు.
2. మేలుగానున్నదని నిర్ణయించు.
పసగరగొను : దే. స. క్రి. పీడించు.
పసఁగు : దే. అ. క్రి. విశదమగు.
పసచెడు : దే. అ. క్రి. 1. రుచిచెడు.
2. ప్రయోజనము చెడు.
3. శోభ చెడు.
పసరించు : దే. అ. క్రి. వ్యాపించు.
పసరుకొను : దే. అ. క్రి. పాచిపట్టు
పసాపడు : దే. స. క్రి. భుజించు. రూ. పసాబడు.
పసిగొను : దే. అ. క్రి. 1. గాలిపట్టు.
2. ఆఁకలిగొను.
స. క్రి. 1. ఆఘ్రాణించు.
2. కుక్కలు వాసనబట్టి కనుగొను.
రూ. 1. పసికట్టు. 2. పసిబట్టు.
పసుపాడు : దే. అ. క్రి. పసుపు పూసికొని జలకమాడు.
పస్తాయించు : దే. అ. క్రి. 1. పశ్చాత్తాపపడు.
2. సంకోచించు.
3. నిదానించు.
4. పరిశీలించు.
పళ్ళెముపట్టు : దే. అ. క్రి. హారతిపట్టు.
పళ్ళెము వెట్టు :
పళ్ళెము పట్టు : } దే. అ. క్రి. వీరభద్రుని పళ్ళెముపట్టు.
పళ్ళెరమిడు : దే. స. క్రి. అన్నము వడ్డించు.
పక్షీకరించు : సం. అ. క్రి. పక్షము నవలంబించు.

# పొ

పొగెముడుగు : దే. అ. క్రి. శోభ కోల్పోవు.
పొత్రగిల్లు : దే. అ. క్రి. పాతది యగు.
పొత్తు : దే. స. క్రి. పూడుచు.
పొగుబడు దే. స. క్రి. మెత్తబడు, ముద్దకట్టు. (బెల్లపుపాగు.)
పొచికపాఱు దే. అ. క్రి. వేసినయెత్తు సాగు.

పొచిపట్టు :
పొచిపోవు :
పొసిపోవు : } దే. అ. క్రి. చెడిపోవు. (అన్నము పాసిపోయినది.)

పొచు : దే. స. క్రి. 1. పాయఁజేయు.
2. చిక్కుడలించు.
3. తొలగించు.

పొటనసేయు : దే. స. క్రి. పాపటదీయు. (అలంకరించు) మనుచ.
పొటపాడు : దే. స. క్రి. 1. వేలము వేయు.
అ. క్రి. 2. వేలములోఁబాల్గొను.
పొటించు : దే. స. క్రి. 1. ఆదరించు.
2. విచారించు;
3. ప్రతీక్షించు.
4. ధరించు.
5. పొందు.

పొటికెక్కు : దే. అ. క్రి. ప్రశస్తిపొందు.
పొటిగొను : దే. స. క్రి. లెక్కచేయు.
పొటిచూడు : దే. అ. క్రి. గుర్తు చూచు. (తెలం.)
పొటిదప్పు : దే. అ. క్రి. 1. ప్రశస్తిపోవు.
2. గుఱి తప్పు.
3. నియమము తప్పు.

పాటిలు : దే. అ. క్రి. కలుగు.
పాటిసేయు : దే. స. క్రి. లెక్కసేయు.
పాటునఁబడు : దే. అ. క్రి. 1. పైరు యథాపయముఁ బడు.
2. యథాస్థానముఁ బడు.
3. యథాస్థితికి వచ్చు.
పాటుపడు : దే. అ. క్రి. శ్రమపడు.
పాఱలు : దే. అ. క్రి. పాడుపడు.
పాడిచేయు : దే. అ. క్రి. 1. పశువులను పాలు తీసి పెరుగు మొ॥ నవి చేయు.
2. న్యాయముచేయు.
పాడు : దే. అ. క్రి. పాటపాడు.
పాడువాఱు : దే. అ. క్రి. పాడుపడు. ప్రే. పాడుపెట్టు.
పాతపడు : దే. అ. క్రి. పాతది యగు.
పాతరబెట్టు : దే. స. క్రి. 1. క్రొత్తధాన్యము మ్రగ్గుటకు భూమిలో గుంటచేసి పూడ్చిపెట్టు.
2. మదమణఁచు.
పాతరలాడు : దే. అ. క్రి. 1. నర్తించు.
2. చలించు.
పాతరించు : దే. అ. క్రి. 1. శోకించు.
"రాత్రియగుటయు నొక ఘోరరాక్షసుండు బాధవెట్టంగ నొక సతి పాతరింప." స. నీ. క. ని.
పాత్రలాడు : దే. అ. క్రి. 1. నర్తించు.
2. చలించు.
పాదుకొను : దే. అ. క్రి. 1. నెలకొను.
2. నిలుచు. ప్రే. పాదుకొలుపు.
పాదుచేయు : దే. అ. క్రి. చెట్టుచుట్టు పళ్ళెమువలె నీరు నిలుచునట్లు చేయు.
రూ. పాదిచేయు.

పాదునిలుచు. దే. అ. క్రి. 1. నెలకొను;
2. నిలుచు.

పాపటతీర్చు : దే. స. క్రి. కేశవిభిని దీర్చు.

పాపటతోలు : దే. అ. క్రి. 1. నేల చదును చేయుటకు గుంటక తోలు.
2. గొర్రిన వేసిన మెట్టపైరు చాళ్ళ మధ్య గుద్దలించుట కుపయోగించు సాధనము పాపణము. దానితో చేనుకు పైపాటు చేయు.

పాపటపుచ్చు : దే. స. క్రి. పాపటన లెం దీయు.

పాపటవోవు : దే. అ. క్రి. చదునగు.

పాపఠ్యమానమగు: సం. అ. క్రి. పఠింపంబడుచున్న దగు. రామా.

పాపు : దే. స. క్రి. 1. పాయంజేయు.
2. దున్ను.

పాము : దే. స. క్రి. 1. రుద్దు.
2. రాచు.

పాముకొను దే. స. క్రి. వశముచేసికొను.
అ. క్రి. 1. పాచి పేరుకొను. (నె.జి.)
2. అనవసరముగా బాధ్యతపెట్టుకొను.

పాయగిల్లు : దే. అ. క్రి. తొలంగు.

పాయందట్టు : దే. స. క్రి. పోంద్రోయు.

పాయదెర్లువెట్టు: దే. స. క్రి. విభేదములు కల్పించు. (తెలం)

పాయబాఱు : దే. అ. క్రి. 1. పాయు.
2. చెడు, 'అన్నము పాసినది.'

పాయలుతీయు : దే. స. క్రి. 1. విభాగముచేయు.
2. చేనిలో జనుము మొ॥ చల్లుటకై వరి మొ॥ పంటలను విడిగాం దీయు.

పాయవడు : దే. అ. క్రి. 1. చీలు.
2. తొలఁగు.

పాయవాఱు : దే. అ. క్రి. 1. చీలు.
2. తొలఁగు.
3. ఏఱు పాయఁగ నేర్పడు.

పాయు : దే. అ. క్రి. 1. తొలఁగు.
2. చిక్కఁబడలు.
3. పక్వపదార్థములు కాలాతిక్రమముచే మెత్తబడి చెడు.
స. క్రి. విడుచు.

పారమేదించు : వి. స. క్రి. తుదముట్టించు.

పారాణించు : దే. స. క్రి. పారాణిపెట్టు.

పారిఖత్తుపెట్టు : అన్య. దే. అ. క్రి. 1. విడాకు లిచ్చు.
2. విభక్తమగు.

పారు : దే. అ. క్రి. 1. పరుగెత్తు.
2. పాసనము చేయు.
3. పశువులు పాఱుకొను.

పారుకాడు : దే. అ. క్రి. 1. పరుగెత్తు.
2. కీటకాదులు తిరుగాడు.
రూ. పారకాడు.

పార్తెంచు . దే. అ. క్రి. పరుగెత్తివచ్చు.

పాఱఁజూచు : దే. స. క్రి. కలయఁజూచు.

పాఱదోలు : దే. స. క్రి. తఱుము.

పాఱఁబట్టు : దే. స. క్రి. పోఁద్రోలు.

పాఱఁబోయు : దే. స. క్రి. క్రుమ్మరించు.

పాఱవేయు :
పాఱవైచు : } దే. స. క్రి. 1. విసరివేయు,
2. పోఁగొట్టుకొను.

పాఱాడు : దే. అ. క్రి. 1. పిల్లలు ప్రాకు.
2. పరుగెత్తు.

పాఱు : దే. అ. క్రి. 1. పరుగెత్తు.
2. ప్రవహించు.
3. ప్రసరించు.
(విరియఁబాఱు; పండఁబాఱు.)

పాఱుచూచు : దే. అ. క్రి. గృహనిర్మాణసమయమున స్తంభాదులు పాతుటకు సూటి చూచు.

పాఱుతెంచు : దే. అ. క్రి. 1. పరుగెత్తుకొని వచ్చు.
2. ప్రవహించు.

పాఱుపోఁగుపోయు: దే. స. క్రి. దూరదూరముగ నూలుపోయు.

పాఱుపోవు : దే. అ. క్రి. 1. పొల్లపోవు.
2. వ్యర్థమగు.

పాలాడు : దే. స. క్రి. ఖండించు.

పాలాఱుచు : } దే. స. క్రి. 1. ఉపేక్షించు,
పాలాఱ్చు : } 2. హింసించు (పట్టి పాలార్చు.)
"రక్షః పాలుని ద్రుంపక యూరక
పాలార్చుట నీతియే." భాగ.

పాల్గారు : దే. అ. క్రి. కోమలమగు, "రమణ పాల్గారు చెక్కుటద్దములతోడ." రా. సాం. 1 ఆ.

పాలించు : దే. స. క్రి. 1. రక్షించు.
2. ఇచ్చు. హేమాబ్జ.

పాలు : దే. స. క్రి. 1. వివర్ణమగు.
2. రక్తక్షీణతచేఁ దెల్లనగు.
(ముఖము పాలిపోయినది.)

పాలుచు : దే. స. క్రి. భాగము పంచు.
"పాలుపంపని యీఁక మేలిమాటలన
అలుక తీర్చెదరు." భార.ఉద్యో.3ఆ.

పాలుగొను : దే. అ. క్రి. పంచుకొను.

పాలుపడు : దే. స. క్రి. 1. పూనుకొను.
2. స్వాధీనమగు.

పాలుపుచ్చు : దే. స. క్రి. 1. విభాగించు.
2. నిర్ణయించు.

పాలుపోవు : దే. అ. క్రి. 1. తోచు.
2. ఊహ కలుగు.
(అది యెట్లుచేయుటకు పాలు
పోలేదు.

పాలుమాలు : దే. అ. క్రి. ప్రాలుమాలు, బద్ధకించు.

పాలువెట్టు : దే స. క్రి. 1. భాగించు.
2. నిర్ణయించు.

పాల్గొను : దే. అ. క్రి. పాలుగొను.

పాల్పడు : దే. అ. క్రి. పాలుపడు. (నీచార్థమున)

పాల్మాలు : దే. అ. క్రి. పాలుమాలు.

పాలెంబుదిగు : దే. అ. క్రి. దండు విడియు.

పాళాలుసేయు : దే. స. క్రి. చన్నీళ్లువేన్నీళ్ళు కలిపి శరీరము
సహించు స్థితిలో నుంచు.
"కడువేగ విభునికిఁ గ్రాగిన నీళ్ళు
బిందెలఁ జన్నీళ్ళు బిరబిరఁదెచ్చి
పసిఁడి చెంబులనీరు పాళాలు చేసి
యక్కడ మంచంబు నడ్డంబు వెట్టి."
కా. క.

పాళెముండు : } దే. అ. క్రి. కాపుండు.
పాళెముసేయు : }

పావుకొను : దే. స. క్రి. అతిగా భుజించు.

పాశముపెట్టు : దే. స. క్రి. తొడపా(శ)సెముపెట్టు.

# పి

పింగటించు : దే. అ. క్రి. 1. అతిశయపు మాటాడు.
2. బెట్టుసేయు.
స. క్రి. సాధించు.

పించమణఁచు : దే. స. క్రి. పీచమణఁచు.

పింజాపెట్టు : } దే. స. క్రి. పంచెలు చీరలు మొ॥ వానిని చేతి వ్రేళ్ళతో చిన్నచిన్న మడతలుగాఁ పెట్టు.
పింజలుపెట్టు: }

పింజించు : దే. స. క్రి. 1. పింజెపోయు.
2. నీళ్ళు చిలకరించు.

పిండలించు : దే. స. క్రి. ముద్దసేయు.

పిండలిసేయు : దే. స. క్రి. పిసికి పిండలిచేయు.

పిండాకూడుపెట్టు : } దే. అ. క్రి. తిండిపెట్టు (నీచార్థమున)
పిండాకూడుపెట్టు. }

పిండిపెట్టు : } దే. స. క్రి. మెత్తగా నలుపు.
పిండియిడు: } "బండొకఁడ వైన నిప్పుడు
నీ పిండియిడమె." మను. 4 ఆ.

పిండిలించు : దే. స. క్రి. పొడిపొడిగాఁ జేయు.

పిండు : దే. స. క్రి. 1. పాలుపిదుకు.
2. రసము పిడుచు.
3. బలవంతముగా డబ్బు రాబట్టు.

పిండుకొను : దే. అ. క్రి. గుంపుకూడు.

పిండుగట్టు : దే. అ. క్రి. 1. గుమిగూడు.
2. గుంపుగాఁజేరు.

పింపిసలాడు : దే. అ. క్రి. 1. పిల్లలు పెదవులతో ధ్వనిచేయుచునాడు.
2. చలించు.

పింపిళ్లాడు : దే. అ. క్రి. నర్తించు.

పింపిళ్ళుగూయు : దే. అ. క్రి. 1. నర్తించు;
2. మొత్తని గొంతు కొల్లరసికొని సవ్వడి గలుగు.

పికరగు : అన్య. దే. అ. క్రి. కనిపించు, భయము కలుగు.
ఉ. నీకు లెంపకాయ కొడితే మీ తాతకు పిక రవ్వాలి.

పికవికలగు :
పికాపికలగు : } దే. అ. క్రి. చెల్లాచెదరగు.

పిక్కటిల్లు : దే. అ. క్రి. 1. నిండు.
2. అతిశయించు;
3. వ్యాపించు;
4. పిగులు.

పిక్కు : దే. అ. క్రి. 1. బిగువుచేఁ జినుఁగు.
2. శీర్ణమగు.
3. గ్రుడ్లనుండి పిల్లలు బయటపడు;
4. వెలువడు.
ఉ. నోటమాట పిగులలేదు.
5. ప్రాఁతదై పోగులు తెగు.
స. క్రి. ఉన్న కొలదిలోనే కష్టపడి నిలువవేయు.

పిగులు : దే. అ. క్రి. చినిగిపోవు.

పిచ్చలించు : దే. అ. క్రి. 1. అతిశయించు.
2. భయపడు.
స. క్రి. ప్రశంసించు.

పిచ్చలుగొట్టు : దే. అ. క్రి. నట్టగొట్టు.

పిచ్చికళలుపోవు: దే. అ. క్రి. వెకిలి వేషములు వేయు.

పిచ్చిల్లు : దే. స. క్రి. 1. చిప్పిల్లు.
2. ఉబుకు.

పిట్టపాలు : దే. అ. క్రి. పైనిపిట్ట పాలుటవల్ల శిశువులకు జబ్బు చేయు.

పిట్టపిడుగలు : దే. అ. క్రి. (పిడుగు+పిడుగు= పిట్టపిడుగు) పిడుగువలెఁబ్రవర్తించు.

పిట్టముకట్టు : దే. అ. క్రి. వ్యవహారము స్తంభించు, ఎండిపోవు.

పిడికిలించు : దే. స. క్రి. పిడికిటఁబట్టు.
"ఉత్తరంబున గల నాయకులు చిచ్చయినం బిడికిలింత మనుచున్నవారు.

పిడిగొట్టు : దే. స. క్రి. (పిడి+కొట్టు) ఎద్దు పట్టు.

పిడిదరుగు : దే. అ. క్రి. వరికోతకు మంచి ముహూర్తమున నుపక్రమించు.

పిడివాటుకొట్టు: దే. అ. క్రి. 1. నడ్లపనలు బల్లమీఁదగొట్టిరాల్చు.
2. ఒడంబడిక చేయు.

పిడివెట్టు : } దే. స. క్రి. 1 బట్టీపెట్టు.
పిడివేయు : } 2. కంఠస్థముచేయు.

పిడివేయు : దే. అ. క్రి 1. పసుల కణిలో చేయిడి త్రిప్పు.
2. బట్టీపట్టు, కంఠస్థముచేయు.

పిడిసానబట్టు : దే. స. క్రి. బరమా పట్టు.

పిడిసుట్టుగట్టు : దే. స. క్రి. నడుమునకు బలముగా నుండుటకు చీర కొంగును మూడు నాలుగు చుట్లు త్రిప్పి కట్టు. (తెలం)

పిదుచు : దే. స. క్రి. పిండు.
పిదుకద్రాము : దే. స. క్రి. పిడుకతో త్రోము.
పిదుపుపెట్టు : దే. స. క్రి. పిండు.
పిదువరించు : దే. స. క్రి. త్రోపిల్లజేయు. ప. వీ.
పిదుసుగట్టు : దే. స. క్రి. గట్టిపడు.
పితుకు : దే. స. క్రి. పాలు పిండు.
పిత్తబలియు : దే. అ. క్రి. మిక్కిలి బలియు.
పిత్తు : దే. అ. క్రి. అపానవాయువు విడుచు.
పిదుకు : దే. అ. క్రి. పాలు పిండు.
పిమ్మిటిగొను : దే. అ. క్రి. విరవిరఁబోవు. రూ. బిమ్మిటినొందు.
పిమ్మిటినొందు : దే. అ. క్రి. శక్తి క్షీణించు.

"అయ్యాసుర పిమ్మిటి నొంది చెమర్చి
దుర్మాంసముతో డీకొని. భాగ.7స్కం.

పిరిగొను : దే. స. క్రి. 1. పెనఁగొను.
2. మెలిపెట్టు.
పిరువీకులాడు : దే. అ. క్రి. 1. వెనుకంజవేయు.
2. పీకులాడు.
స. క్రి. బాధించు
పిరువీకుసేయు : దే. అ. క్రి. వెనుకంజవేయు.
(రూ) పిరువీకుడులు సేయు.

"ఒడిసిహస్తముల
పరుపునేలనె తమ్ము బట్టుక తివిచి,
పిరువీఁకుడులు సేసి భీతి పుట్టించి."
క. వ. రా. ఆర.

పిఱుతివియు :
పిఱుతివుచు : } దే. అ. క్రి. వెనుదీయు.
పిఱుదీయు :

పిఱుదుకొను : దే. స. క్రి. వెంబడించు.
పిఱుదెక్కు : దే. అ. క్రి. వెనుకకు జిక్కు.
పిఱువడు : దే. అ. క్రి. 1. వెనుదీయు.
2. భయపడు.
పిఱువెట్టు : దే. స. క్రి. 1. అనాదరించు.
2. వెనుకకు బెట్టు.
పిఱువోవు : } దే. అ. క్రి. వెనుదీయు.
పిఱుసను : } స. క్రి. వెనుక వెడలు.
పిలపిలలాడు : దే. అ. క్రి. ఉత్సుకత వహించు.
పిలపిలవచ్చు : దే. అ. క్రి. తొందరగా వచ్చు.
పిలుకుమాఱు : } దే. అ. క్రి. 1. చచ్చు.
పిలుకుమాలు : } 2. నాశమందు.
పిలుకుమాల్చు : } దే. స. క్రి. చంపు.
పిలుకుమార్చు : }
పిలుచు : దే. స. క్రి. ఆహ్వానించు.
పిల్లిగింతయుకొట్టు : }
పిల్లిమింతపులు వేయు : } దే. అ. క్రి. తలక్రిందులగు.
పిల్లిమంత్రములు వేయు : }
పిసపిసలాడు : దే. అ. క్రి. మిక్కిలి మెత్తగానుండు.
పిసమాల్చు : దే. స. క్రి. చంపు.
పిసాళించు : దే. అ. క్రి. 1. ప్రకాశించు.
2. వ్యాపించు.
3. దొంగ దెబ్బ వేయు.
స. క్రి. పరిహాసము లాడు.
పిసుకుకొను : దే. అ. క్రి. లోలోన నిందించుకొను.
పిసుకు : దే. స. క్రి. 1. సంవాహనము సేయు.
2. మెత్తని వస్తువును చేతితో గలయునట్లు నలుపు.

# పీ

పీఁకు : దే. స. క్రి. 1. లాఁగు.
2. తీసివేయు.

పీకులాడు . దే. అ. క్రి. పెనఁగులాడు.

పీఁకువాఱు : దే. అ. క్రి. 1. చప్పుటయగు, అణగారిపోవు.
2. కృశించు.

పీకువీఁకాడు : దే. స. క్రి. మిక్కిలి పెఱుకులాడు, భా. స్త్రీ. 2ఆ

పీచమణఁచు :
పీసమణచు : } దే. స. క్రి. నిర్వీర్యునిచేయు, పొగరు తగ్గించు.

పీఁటవెట్టు : దే. అ. క్రి. 1. కదలకుండఁగూర్చుండు.
2. తిరుగఁబడు.

పీడించు : దే. స. క్రి. పట్టుకొని వదలకుండు.

పీరు : దే. అ. క్రి. పిగులు.

పీరుచు : దే. స. క్రి. పీలుచు.

పీలిచి పిప్పిచేయు: దే. స. క్రి. నిస్సారమొనర్చు.

పీలు : దే. అ. క్రి. పిగులు.

పీలుచు : దే. స. క్రి. 1. జుఱ్ఱు.
2. ఊపిరిపట్టి పొడి ముక్కులోనికి ఈడ్చుకొను. రూ. పీల్చు.

# పు

పుంభీభవించు : సం. అ. క్రి. 1. బలియు.
2. వృద్ధిపొందు.

పుంజికొను : దే. అ. క్రి. 1. గుబురుకొను.
2. శరీరమునందు బలము చేకూరు.
స. క్రి. ధనము బలవంతముగా రాఁబట్టుకొను

పుంజీభవించు : సం. అ. క్రి. ప్రోగుపడు.

పుంజుకొను : సం. స. క్రి. 1. శక్తి కూడఁదీసికొను.
2. పట్టిలాగు.

పుండలించు :
పుండరించు : } దే. స. క్రి. విస్మృతి చెందిన దోషమును మఱల కెలుకు.
2. అభూతకల్పనము చేయు.

పుండాకోరిచెప్పు: సం. అ. క్రి. కొండెములు చెప్పు.

పుంపులువచ్చు : దే. స. క్రి. బయటికిఁదలుము.

పుక్కిలించు :
పుక్కిరించు : } దే. స. క్రి. గండూషించు.

పుచ్చు : దే. అ. క్రి. చెడిపోవు,
స. క్రి. పంపు.
ముల్లు మొ॥ వానిని తీయు.

పుచ్చుకొను : దే. అ. క్రి. 1. గ్రహించు.
2. (వాడుకభాషలో) కొట్టు.
3. ఫలాహారములనుగాని, పఠనార్థము గ్రంథమునుగాని స్వీకరించు.

పుచ్చిపోవు : దే. అ. క్రి. చెడిపోవు.

పుటమారిపోవు : దే. అ. క్రి. నాశమగు.

పుటమెగయు : దే. అ. క్రి. 1. మీఁది కెగయు.
2. పుటుక్కుమను.
3. తెగు.

"పేరాస నధర బింబీఫలంబులకుఁ
గీరము ల్వాలఁగొనఁ గ్రేళ్ళు దాటుచును
తొంగలి తెప్పసందులఁ బుటమెగసి
నింగి పేరెమువారు నిడువాలుచూపు.
క. వ. రా.

పుటపుటనగు : దే. అ. క్రి. ప్రవృద్ధమగు.

పుటమురించు : } దే. అ. క్రి. 1. వ్యాధి ప్రారంభమగు.
పొటమరించు : } 2 ననలెత్తు.

పుటమారిపోవు : దే. అ. క్రి. నాశమగు.

పుటమార్చు . దే. అ. క్రి. 1. నాశముచేయు.
2. దీపమార్చు.
3. వృద్ధిని నిరోధించు.

పుటముబ్బు : ద్వ. అ. క్రి. మీఁది కుబ్బు. వసు. 2. ఆ.

పుట్టిమునుగు : దే. అ. క్రి. అధికనష్టమగు.

పుట్టు : దే. అ. క్రి. జన్మించు;

పుట్టుమాల్చు : దే. స. క్రి. నాశముచేయు.

పుడికిరించు : } దే. స. క్రి. 1. కొంచెము సేయు.
పుణికిరించు : } 2. తగ్గించు.

పుడిసిలించు : దే. స. క్రి. పుడిసిటఁబట్టు.

పుడుకు : } దే. స. క్రి. 1. స్పృశించు.
పుణుకు : } 2. కొంచెముగా నిచ్చు. విక్ర. 2 ఆ.
3. ఇచ్చు. హరి. 9 ఆ.
4. (ఐదు వేళ్ళతో) గ్రహించు. ఉ. హరి. 5 ఆ.
5. చేపలను చేతులతోఁ బట్టు.

పుడుచు . దే. అ. క్రి. 1. తృప్తిపడు.
2. దాసముచేయు.
3. గ్రహించు.

"కుడువఁ గట్టనుదోడుగను ముడువఁబుడువ
నెంతగలిగినఁ బ్రాయంపు టింతులకును
గ్రామ్యధర్మంబు లేకున్నఁ గలుగు దుఃఖ
మెంతని వచింపవచ్చునో దంతిగమన!
హంస. 3 ఆ.

పుతపుతపోవు : దే. అ. క్రి. 1. పుతపుతలాడు.
2. వినశమగు.

పుత్తెంచు : దే. స. క్రి. పంపించు.

పుత్యాంగోయు : దే. స. క్రి. మొదలంట నాశనము చేయు.

పునాదులులేపు : దే. స. క్రి. 1. ఒకరిని పూర్తిగా నాశపఱచు.
2. ఇంటికిఁ బునాదులను త్రవ్వు.

పునిస్త్రీనిచేయు : దే. స. క్రి. పెండ్లిచేయు.

పుప్పించు : దే. స. క్రి. పుచ్చు.

పుయితోడు : దే. అ. క్రి. వెనుదీయు.

పురచెయ్యిపెట్టు : దే. అ. క్రి. అక్రమముగా జోక్యము కల్పించుకొను

పురచేయిచూపు : దే. అ. క్రి. లేదను.

పురడించు : దే. అ. క్రి. 1. వర్ధిల్లు.
2. విజృంభించు.

పురణించు : దే. అ. క్రి. 1. సమానమగు.
2. ప్రకాశించు.

పురపురపొక్కు : దే. అ. క్రి. మిక్కిలి దుఃఖించు.

పురపురలాడు : దే. అ. క్రి. సిద్ధివేళలందు ఫలము పొందుటకు తత్తరపడు.

పురమాయించు: అన్య. దే.స.క్రి. 1. పనిని విభాగించి యప్పగించు.
2. ప్రారంభించుటకుఁ బ్రోత్సహించు.

పురమేగు : దే. అ. క్రి. ఊరేగు.

పురస్కరించు : సం. స. క్రి. 1. ముందిడుకొను.
2. పూజించు.

పురస్కరించుకొను: సం. స. క్రి. 1. ముందిడుకొను.
2. ఆధారము చేసికొను.

పురాణించు : సం. అ. క్రి. 1. పురాణము రచించు.
"పురాణింపం దొరంకొంటి." భాగ.

పురాణించు : 2. వర్ధిల్లు.
3. విజృంభించు.
4. పురాణము చెప్పు.

పురాయించు : దే. అ. క్రి. 1. బలియు.
2. విజృంభించు.
3. వర్ధిల్లు.

పురికొను : దే. అ. క్రి. కలియు.
స. క్రి. క్రమ్ము.

పురికొలుపు . దే. స. క్రి. 1. ప్రోత్సహించు.
2. పురిపెట్టు, పురియెక్కించు.

పురియెక్కించు : దే. స. క్రి. కొండెములు చెప్పి కోపమును వృద్ధి చేయు.

పురియెక్కు : దే. అ. క్రి. 1. త్రాళ్ళు దారములు పేనునపుడు మిక్కిలి బిగువు కలుగు.
2. మనసునందు బిగియు.

పురివేయు : దే. స. క్రి. పేను.

పురివిడు : } దే. అ. క్రి. 1. విడిలిపోవు.
పురివిచ్చు : } 2. నెమలిపురి విచ్చు.

పురుడించు : } దే. అ. క్రి. సమానమగు.
పురుణించు : }

పురులుకూలు : దే. అ క్రి. గర్వమణఁగు.

పురులువోనాడు : దే. స. క్రి. 1. గర్వము విడుచు.
2. పొగరు విడుచు.

పుఱ్ఱిచెయ్యిపెట్టు : } దే. అ. క్రి. 1. కాదను.
పుఱ్ఱిచెయ్యిచూపించు: } 2. లేదను.
3. అపసవ్యముగాఁ జేయు.
బసవ.మ. విలా.
5. చివరికి ఆశాభంగముచేయు.

పులకరించు: } దే. అ. క్రి. గగుర్పొడుచు.
పులకించు :

పులపొడుచు : దే. అ. క్రి. 1. గగుర్పాటుపొందు (పులము + పొడుచు)
2. కన్ను తటాలున మూసి తెఱచు.
"చప్పాళ్ళకుఁ బులపొడుచుచుఁ జొప్పరయుచు." భల్లా. ఆ. 3

పులికాపుపెట్టు : దే. స. క్రి. 1. లోహవిగ్రహములను కడిగి మెఱుఁగెక్కించు.
2. పులుకడుగు.
3. తోము.
4. తొలుచు, శుభ్రపఱచు.
వి. రా. విప్రనారా. చరి.
చూ. పులికాపు తీయు.

పులికడుగు : దే. స. క్రి. 1. రత్నాదులను కడుగు.
2. మాలిన్యము తొలగించు.

పులుగఱచు: } దే. అ. క్రి 1. గడ్డికఱచు.
పూరికఱచు: 2. దైన్యస్థితి నందు.
ఉదా: పూరి కఱచినఁ జంపరాదు.

పులుము : దే. స. క్రి. 1. పూయు.
2. ఒకదోషమును పరులపై నారోపించు.

పుల్కడుగు : దే. స. క్రి. మాలిన్యము కడుగు.

పులొ్పడుచు : దే. అ. క్రి. 1. పులపొడుచు.
2. ఱెప్ప లప్పళించు.

పుల్లగిల్లు : దే. అ. క్రి. 1. భయపడు.
2. పుల్లనగు. (పులు పగు)

పుల్లవడు : దే. అ. క్రి. 1. నీరసపడు.
2. స్తంభించు.

పుల్లవిఱుచు : దే. స. క్రి మంత్రించు.
అ. క్రి. మనసు విఱుగునట్లు మాటాడు.
"పెనుజీఁకటులు గ్రమ్మ పెన్బై టపసియించి
వెఱచెగా యని పుల విఱిచి విఱిచి."
పాం. మా. 3 ఆ.

పుల్లసిల్లు : దే. అ. క్రి. 1. వివర్ణమగు.
2. కలఁగు.

పుష్పవతియగు : సం. అ. క్రి. సమర్తాడు.

పుష్పించు : సం. అ. క్రి. 1. వికసించు; పూచు.
2. సమర్తాడు.

పుసలాయించు : హిం. స. క్రి. బుజ్జగించు.

పుసురుకొను : దే. అ. క్రి. వ్యసనపడు. ప. వి.

# పూ

పూంచు : దే. స. క్రి. పూనుచు.

పూఁచిపోవు : దే. అ. క్రి. నిరర్థకమగు,

పూఁచీపడు : అన్య. దే. అ. క్రి. బాధ్యత వహించు.

పూఁచు : దే. స. క్రి. పూను; ఉద్యమించు.

పూఁటపడు ; దే. అ. క్రి. 1. బాధ్యతవహించు;
2. హామీయిచ్చు.

పూఁటవెట్టు : దే. స. క్రి. పూఁటపడఁజేయు.

పూఁచెక్కు . దే. అ. క్రి. ధనము, బలము, క్రొవ్వు మొ॥ వానిచే బలియు.

**పూచు :** దే. అ. క్రి. 1. పుష్పించు.
"పూచిన మావులు." ఆముక్త.
2. నాలుక పూచు.
3. తప్పు సుళ్ళు పొడము.
4. నిస్సారమగు.

**పూజయిచ్చు :** దే. అ. క్రి. పూజచేయు.
"వాసుదేవుఁ డన్ జడునకుఁ బూజ యిమ్మని విచారవిదూరుఁడు భీష్ముఁ డెంతయున్ వెడఁగుఁదనంబునన్ బనిచె'
భా. సభా. 2-9

**పూజించు :** దే. స. క్రి. 1. ఆరాధించు.
2. గౌరవించు.

**పూజజేయు :** దే. స. క్రి. ఘటాదులను జిత్రించు.

**పూఁతఁగొట్టు :** దే. స. క్రి. పోఁగొట్టుకొను.

**పూడికతీయు :** దే. స. క్రి. నూతిలో అడుగున పేరుకొన్న మట్టి మొ॥ వానిని తీసివేయు.

**పూడు :** దే. అ. క్రి. 1 మట్టిలోనగువానిచేఁ బల్లమునిండు.
2. నిండు.

**పూడ్చు :** దే. స. క్రి. 1. పూడఁజేయు.
2. పాతు.

**పూదెగట్టు :** దే. అ. క్రి. బంగారు పూసగా నేర్పడు.

**పూను :** దే. స. క్రి. 1. కడఁగు.
2. ఉద్యమించు.
3. ధరించు.
4. వహించు.
5. ఆవేశించు.

పూనుచు : } దే. స. క్రి. 1. పూనఁజేయు.
పూన్చు : 2. సిద్ధపఱచు.
3. (తేరు) పూనుచు.
4. కాడికి కట్టు.

పూయు : దే. స. క్రి. 1. అలఁదు.
2. మెత్తు.

పూరగించు : దే. స. క్రి. 1. నెఱవేర్చు.
2. పూరించు.
3. కడపు.

పూరడించు : } దే. స. క్రి. నింపు.
పూరణించు :

పూరించు : సం. స. క్రి. 1. పూర్తిచేయు.
2. నించు.
3. ఉబ్బునట్లుచేయు.

పూరిగఱచు : దే. అ. క్రి. నేలఁబడు.

పూర్ణముచేయు : మి. అ. క్రి. నెఱవేర్చు.

పూర్ణీభవించు : వై. అ. క్రి. పూర్ణమగు.

పూవుగట్టు : దే. అ. క్రి. పూవుగలదియగు.

పూసకట్టు : దే. అ. క్రి. కాచిననేయి మొ॥ చల్లారి పూసలుగా నేర్పడు.

పూసికొను ; దే. స. క్రి. అనవసరముగా బాధ్యత వహించు.

# పె

పెంచు : దే. స. క్రి. పెనుచు.

పెంచుకొను : దే. స. క్రి. దత్తుతీసికొను.

పెంటగట్టు : దే. స. క్రి. పొలములలో నెరువునకై పశువులను మందగట్టు.

పెంటిపడు : దే. అ. క్రి. కవగూడు.

పెండిలియగు : }
పెండిలియాడు: } దే. స. క్రి. 1. వివాహమగు.

పెండిలిసేయు : దే. స. క్రి. 1. పెండ్లిచేసికొను.
2. పెండ్లాడఁజేయు.

పెండ్లాడు : దే. స. క్రి. వివాహమగు.

పెంపగు : }
పెంపారు : } దే. అ. క్రి. వర్ధిల్లు.
పెంపుమీఱు: }

పెంపు : దే. స. క్రి. నాశనముచేయు. భాగ. 10 స్కం.

పెకలు : దే. అ. క్రి. 1. పెల్లగిల్లు.
2. ప్రయాణమగు.

పెకలుచు: }
పెకల్చు : } దే. స. క్రి. పెకలించు.

పెగలు : దే. అ. క్రి. పెకలు ప్రే. పెగలుచు, పెగల్చు.

పెచ్చుపెరుగు : దే. అ. క్రి. మితిమీరు.

పెటపెటమను : }
పెటపెటలాడు: } దే. అ. క్రి. బిఱ్ఱబిగిసిన వస్తువుల నూడఁదీయుటలో పెటపెట యను శబ్దముఁ చేయు.

పెటిలిపడు : దే. అ. క్రి. చిటిలిపడు.

పెటిలు : }
పెటులు: } దే. అ. క్రి. 1. చిట్లు.
2. పేలు రేగు. రూ. పెట్లు.

పెట్టు : దే. స. క్రి. 1. ఉంచు.
2. గ్రుద్దుపెట్టు.
3. నాటు.
4. కొట్టు.
5. వదలు.

అనుప్రయుక్తమయిన (విడిచిపెట్టు, వదలిపెట్టు) పూర్తిగా నని యర్థము.

పెట్టుకొను : దే. స. క్రి. ఉంచుకొను.
పెట్టువడు: దే. అ. క్రి. దెబ్బతిను.
పెట్టెవెట్టు . దే. అ. క్రి. చుట్టుకొను.
"పీఠరూపంబునఁ బెట్టెవెట్టిన శేషు
ఫణారత్నఘృణులకుఁ బ్రాకు వెట్టు.
పాండు. 4 ఆ.
పెట్రకోలికకట్టు: దే. స. క్రి. పెడ రెక్కలు విఱిచికట్టు.
పెట్లు : దే. అ. క్రి. 1. ప్రేలి ధ్వనితో బ్రద్దలగు.
2. ఒడలు పెట్లు. (ఒడలు ప్రేలు).
పెడచెవిఁబెట్టు . దే. స. క్రి. 1. వినకుండు. 2. అలక్ష్యము సేయు.
పెడతలఁబడు : దే అ. క్రి. అపమార్గమునఁ బడు.
పెడతిరుగు : దే. అ. క్రి. వ్యతిరేకమగు, మఱియొక త్రోవ పట్టు.
పెడఁబాయు : దే. స. క్రి. ఎడఁబాయు.
పెడమరలు: } దే. అ. క్రి. వెనుకకుఁ దిరుగు.
పెడమర్లు :
పెడమఱు :
పెడమఱించు : దే. స. క్రి. వెనుకకుఁ దిరుగజేయు.
పెడమువెట్టు : దే. అ. క్రి. పెడమొగము పెట్టు.
"పెట్టరని పెండ్లిపెద్దలు పెడమువెట్ట."
నై. 6 ఆ.
పెడముసేయు : దే. అ. క్రి. పెడమొగముపెట్టు.
పెడమోమువడు : దే. అ క్రి. విముఖుడగు.
పెడరించు : దే. స. క్రి. పెడత్రోవపట్టించు.
"మంథరాదేశ మాత్మఁ బెడరింప
శమనుని బిల్చినరీతి
అనరానిమాట - కామాతురుండైన
మనుజేశుఁజూచి యమ్మగువ యిట్లనియె."
క. వ. రా. అయోధ్య.

పెడరేచు : దే. స. క్రి. పురికొలుపు.
పెడులు : దే. అ. క్రి. పెట్లు. "పెడిలి సువర్ణ పర్వతము."
భార. ఆది. 8 ఆ.
పెదవులునాకు : దే. స. క్రి. నీచముగ నొకస్త్రీ యొక్క తగులను పొందు.
పెద్దనిద్దురబోవు: దే. అ. క్రి. చచ్చు.
పెద్దమనిసియగు: దే. అ. క్రి. 1. కన్నియకుప్రథమరజోదర్శనమగు.
2. అల్లరిపిల్లవాఁడు బుద్ధిమంతుఁడివలెఁ గూర్చుండు.
పెనఁకువలుగొను: దే. అ. క్రి. మెలివడు.
పెనఁగఁబడు : దే. అ. క్రి. పెనవేసికొను.
పెనఁగాడు : దే. అ. క్రి. మల్లాడు. రూ. పెనఁగులాడు.
పెనఁగు : దే. అ. క్రి. 1. పెనగొను.
2. కలయు.
3. యుద్ధముసేయు.
4. మాఱుపలుకు.
పెనఁగొను : దే. అ. క్రి. పెనవడు.
పెనఁచు :
పెనపు : } దే. స. క్రి. పెనఁగు ధా. ప్రే.
పెనయు : దే. అ. క్రి. 1. కలయు.
2. పెనఁగు.
పెనవెట్టు : దే. స. క్రి. మెలివెట్టు.
పెనవేయు : దే. స. క్రి. 1. మెలివెట్టు.
2. పశువుల నొండొంటిఁజేర్చికట్టు.
పెన్నాటకమువేయు. దే. స. క్రి. అధికప్రదర్శనము చేయు.
"కలితనం బేల పెన్నాటకంబు సేయ."
భీమ.

పెఁగియాడు : దే. అ. క్రి. పెనఁగియాడు.
పెనుచు : దే. స. క్రి. పెరుగఁజేయు.
పెనుపడు : దే. అ. క్రి. 1. అతిశయిల్లు.
2. వర్ధిల్లు.
పెనుపారు : దే. అ. క్రి. పెంపారు.
పెరంజు : దే. స. క్రి. 1. లాగు.
2. ఆకర్షించు.
3. చీల్చు.
పెరపెరలాడు : దే. అ. క్రి. మనసులో కోరికపడు.
పెరరేఁచు : } దే. స. క్రి. ప్రేరేపించు.
పెరరేఁపు :
పెరుఁగు : దే. అ. క్రి. 1. వర్ధిల్లు.
2. ఎదుగు.
3. ఆవేశముపొందు (శివ మెక్కు)
పెఱుగు : దే. అ. క్రి. తెగు.
పెరువు : దే. అ. క్రి. 1. వర్ధిల్లు.
2. ఎదుగు.
పెర్కు : దే. స. క్రి. పెఱుకు, పెల్లగించు.
పెర్గు : దే. అ. క్రి. పెరుఁగు.
పెర్వు : దే. అ. క్రి. పెరువు.
పెటికి పేటాడు : దే. స. క్రి. నాశముసేయు.
పెఱుకు : దే. స. క్రి. 1. పెల్లగించు.
2. మోయు.
పెఱుగు : దే. స. క్రి. 1. కదఁగు.
2. ఉద్యమించు.
అ. క్రి. విజృంభించు.
పెలకు : దే. అ. క్రి. కంపించు.

పెలుకుఱు : జే. అ. క్రి. విహ్వాలించు.
పెల్కుఱు : దే. అ. క్రి. పెలుకుఱు.
పెల్లగించు : దే. స. క్రి. పెల్లగిల్లఁజేయు.
పెల్లగించుకొను : దే. అ. క్రి. వెలికుబుకు. "ఏఱు పెల్లగించుకొని వచ్చినది."
పెల్లగిల్లు : } దే. అ. క్రి. 1. పాము ఊడి లేచు.
పెల్లగిలు : } 2. పాఱు.
పెల్లుకొను : దే. అ. క్రి. అతిశయిల్లు.
పెళపెళయను: } దే. అ. క్రి. 1. వస్త్రములు గంజిచేతగట్టిగానుండు.
పెళపెళలాడు: } 2. ధనాదికముచే జనులు బడాయి నెఱపు.
పెళ్ళలేచు : దే. అ. క్రి. బెత్తిక లేచు.
పెళ్ళలేపు : దే. స. క్రి. పెళ్ళలేచు ధా. ప్రే.

# పే

పేటనపెట్టు : దే. స. క్రి. యత్నించు.
పేటాడు : దే. స. క్రి. భేదించు.
అ. క్రి. మిక్కిలిగా తిరుగు.
పేప్రేగు : దే. అ. క్రి అతిశయించు.
పేడు : దే. అ. క్రి. దారముపేను.
పేదెత్తు : దే. అ. క్రి. 1. విచ్చు.
2. తొలఁగు.
3. విభేద మేర్పడు.
పేదగిల్లు : దే. అ. క్రి. పేదపడు.
పేదవడు : దే. అ. క్రి. 1. దారిద్ర్యము పొందు.
2. దైన్యము పొందు.

పేను : దే. స. క్రి. (దారము) పేను.
పేనుకొాఱుసు : దే. అ. క్రి. వెంట్రుకలు రాలు.
పేరు : దే. అ. క్రి. 1. ఘనీభవించు.
2. సాంద్రమగు.
3. అతిశయించు.
పేరుకొను : దే. స. క్రి. 1. పేరుపెట్టి పిలుచు.
2. పిలుచు.
3. నుచించు.
4. స్తుతించు.
5. చేయవలసిన పని పేరుకొను.
అ. క్రి. గట్టిపడు. (నెయ్యి మొ॥)
పేరుగ్రుచ్చు : దే. స. క్రి. 1. పేరుపెట్టి పిలుచు.
2. పేర్కొను.
అ. క్రి. దండగ్రుచ్చు.
పేరుచు : దే. స. క్రి. ఒకదానిమీఁదనొకటిపెట్టి యేర్పఱచు.
పేర్చు : దే. అ. క్రి. 1. అతిశయించు.
2. విజృంభించు.
పేర్కొను : దే. స. క్రి. పేరుకొను.
పేరుమాయు : దే. అ. క్రి. నశించు; ప్రే. పేరుమాయించు.
పేరువడు : } దే. అ. క్రి. కీర్తియందుగాని యపకీర్తియందుఁగాని
పేరువోవు : } ప్రసిద్ధికెక్కు.
పేరువాడు : దే. అ. క్రి. 1. కీర్తిఁబొలఁగు.
2. పేరుపెట్టి పిలుచు.
పేరు వాడుకొను: దే. అ. క్రి. పరపతి నుపయోగించు.
పేరెమువాఱు : దే. అ. క్రి. పరుగెత్తు.
పేరెముఁవాఱు : } దే. అ. క్రి. విజృంభించు.
ఫేరెములువాఱు: }

పేరేలుద్రొక్కు: దే. అ. క్రి. ప్రకాశించు.

"నిడుద కేల్దోయిఁ బూనిన సంకు
చుట్టువాల్, డాలిరువంక పేరేలుఁ
ద్రొక్క." వి. పు. 1 ఆ.

పేయు : దే. అ. క్రి. 1. సెగచే వేగి యుబ్బు,
2. పగులు.

పేళ్ళుమడఁచు : దే. స. క్రి. నామమడఁచు.

ప్రేలు : దే. అ. క్రి. వదరు.

ప్రేలుచు: } దే. స. క్రి. ప్రేలఁజేయు.
ప్రేచ్చు : }

# పై

పైఁడిముడుచు : దే. అ. క్రి. పెండ్లికి నిశ్చితార్థము చేయు.
(పెండ్లికి పైఁడిముడుచు.)

పైకివచ్చు : దే. అ. క్రి. అభివృద్ధిపొందు.

పైకొను : దే. స. క్రి. 1. మీఱు.
2. కవియు.
3. యత్నించు.
అ. క్రి. కలుఁగు.

పైత్యము సేయు : } దే. అ. క్రి. 1. పైత్యగుణవృద్ధి కలుగు.
పైత్యమునఁబడు: } 2. వెఱ్ఱిగా మాటాడు.
పైత్యానఁబడు : }

పైనముచెప్పు : దే. స. క్రి. దండువెడలుట కాజ్ఞ యిచ్చు.

పైపడు : దే. స. క్రి. 1. మీఱు.
2. కలియు.
3. మీఁదఁబడు.

పైరగు : దే. అ. క్రి. వెవ యగు.
పైవచ్చు : దే. అ. క్రి. మీఁదికి వచ్చు.

## పొ

పొంకపడు : దే. అ. క్రి. పొందికపడు.
పొంకముమీఱు : దే. అ. క్రి. గర్వించు.
పొంకఱచు : దే. స. క్రి. పొంకపడు ధా. ప్రే.
పొంకాలుగొట్టు : దే. అ. క్రి. ప్రగల్భములు పల్కు.
పొంకించు : దే. స. క్రి. పొంకపడు ధా. ప్రే.
పొంగణఁచు : దే. స. క్రి. గర్వము హరించు.
పొంగలించు : దే. అ. క్రి. నిక్కు.
పొంగలివెట్టు : దే. స. క్రి. గ్రామదేవతకు నైవేద్యముపెట్టు.
పొంగారు : దే. అ. క్రి. 1. ఉబుకు.
2. సంతోషించు.
3. అతిశయించు.
4. విజృంభించు.
5 నిక్కు.

పొంగించు : దే. స. క్రి. వండు.
అ. క్రి. రథసప్తమినాఁడు పాలుకాచి
పరమాన్నము చేసికొను.
ఉదా: పాలు పొంగించు.

పొంగిలు : దే. అ. క్రి. పొంగు.

"పగవాని యడుగు
లెనసియున్నవి కంటె యీ ప్రదేశమున
మ్రింగెనో చంపెనో మేదినీతనయఁ
బొంగిలి యెత్తుకపోయెనో వాఁడు.
క. వ. రా. ఆర.

పొంగు : దే. అ. క్రి. 1. ఉల్బణమగు.
2. సంతోషించు.
3. గర్వించు.

పొంగుడు వంగుడగు: దే. అ. క్రి. 1. పొంగుతగ్గు.
"వార్ధకంబైన దుర్వారదనుజానీక
సంగతి పొంగుడువంగుడగుచు."
వి. పు. 1 ఆ.

పొంచు : దే. అ. క్రి. ఏదేని నుద్దేశించి మఱుగుపడి కనిపెట్టియుండు.

పొంజు : దే. అ. క్రి. పోఁజు.

పొంతనపెట్టు : } పొంతపెట్టు : } దే. స. క్రి. 1. ప్రొయ్యికి ఒకప్రక్కన నీరు కాఁచుకొనుటకు కుండ మొ॥ నీటితోఁబెట్టి వండుటకు ఆను ఏర్పఱచు.
2. నీరు కాచు.

పొంతనబడు : దే. అ. క్రి. 1. దారికి వచ్చు.
2. స్నేహ మేర్పడు.

పొందు : దే. అ. క్రి. కన్నుమొగుడు.
స. క్రి. 1. ప్రాప్తించు.
2. కలయు.

పొందుకొను : దే. అ. క్రి. నెలకొను.

పొందుపడు : దే. అ. క్రి. అనుకూలించు.

పొందుపఱచు : దే. స. క్రి. అనుకూలపఱచు.

పొంపిరిగొను : } పొంపిరివోవు : } దే. అ. క్రి. 1. అతిశయిల్లు.
2. వర్ధిల్లు.
3 వ్యాపించు.
4 సంతోషించు.
5. ప్రసిద్ధికెక్కు.

పొంపెసలారు: దే. అ. క్రి. ఒప్పగు.

పొకారు : దే. అ. క్రి. నాశమగు.

పొకారుచు : దే. అ. క్రి. పొకారు ధా. ప్రే.

పొకాలు : దే. అ. క్రి. వెడలు, నాశనమగు.

పొక్కు : దే. అ. క్రి. 1. దుఃఖించు.
2. బొబ్బలేచు.
3. ఉలుకు.
4. వార్త బయలుపడు(వార్తపొక్కు.)

పొగచు : దే. స. క్రి. 1. పొగ వ్యాపింపఁజేయు.
2. సొతాళించు.
3. పట్టించుకొను.

పొగచూరు : దే. అ. క్రి. పొగపట్టు.

పొగడ్తవడు : దే. అ. క్రి. స్తుతింపఁబడు.

పొగడు : దే. స. క్రి. స్తుతించు.

పొగపు : దే. స. క్రి. సొతాళించు.

పొగయు : దే. అ. క్రి. 1. పొగకలదియగు.
2. కుములు.
3. రాజు.

పొగులు : దే. అ. క్రి. పరితపించు.

పొగులుగట్టు : దే. అ. క్రి. గుంపుగట్టు.
"తన్ముఖ నిశ్వాస వాతాహతిం దూలి వలాహకంబులు పుచ్ఛోపరిభాగంబునం బొగులుగట్టి వర్షింప." వి. పు. 1 ఆ.

పొచ్చపోవు : దే. అ. క్రి. న్యూనతనొందు. ప. వీ.

పొచాయించు : హి. స. క్రి. వ్యవహారమును ఏదో ఒకరీతి సానుకూలపఱచు.

పొజుంగుపడు : దే. అ. క్రి. అధోముఖమగు.
2. ఆధిక్యము తగ్గు.

"తటమహావిద్రుమద్రుమవితానము లొప్ప పయోధి కింక ను
త్కటచటులోర్మిహస్తముల గర్వమునన్ వెడలంగద్రోచినం
బటుతరభావ మేది బహుభంగి వికీర్ణత నొంది క్రింద న
చ్చట నచటన్ బొజుంగుపడి ప్రగ్గిన బాడబకీలలో యనన్."
నృ. పు. 1 ఆ.

పొటకరించు : దే. అ. క్రి. 1. మొలుచు.
2. ఉబ్బు.

పొటమరించు :
పొటమరిల్లు :
పొటమరియు :
పొటము :
} దే. అ. క్రి. 1. బొబ్బలేచు.
2. మొలుచు.

పొట్టకువచ్చు : దే. అ. క్రి. వరి మొ॥ గింజకు వచ్చు.

పొట్టకూటికి కుదురు: దే. అ. క్రి. 1. హీనముగ జీవితము గడుపు.
2. పొట్టపోసికొను.

పొట్టపోసికొను : దే. అ. క్రి. 1. జీవించు.
2. కడుపు నింపుకొను.

పొట్టఁబెట్టు : దే. స. క్రి. 1. నాశము చేయు.
2. చంపు.

పొట్టపొరలగు : దే. అ. క్రి. 1. పీడితమగు.
2. జర్జరితమగు.

పొట్టలుపెట్టు : దే. అ. క్రి. గింజలుపట్టు. (తెలం.)

పొట్టులెట్టు : దే. అ. క్రి. పోరుపెట్టు. (తెలం.)
స. క్రి. వదలక వేధించు.

పొల్లు : దే. అ. క్రి. పాచిపట్టు.

పొడకట్టు : దే. అ. క్రి. 1. కనఁబడు.
2. ప్రత్యక్షమగు.

పొడగను : } దే. స. క్రి. చూచు.
పొడగాంచు: }
పొడచూచు: }

పొడచూపు : దే. అ. క్రి. 1. కనబడు.
2. ప్రత్యక్షమగు.

పొడతెంచు : దే. అ. క్రి. ఉదయించు.

పొడము : దే. అ. క్రి. పుట్టు.

పొడవడఁగు : దే. అ. క్రి. 1. చెడు.
2. చచ్చు.

పొడవడఁచు : దే. స. క్రి. పొడవడఁగు ధా. ప్రే.

పొడవడు : దే. అ. క్రి. కనఁబడు.

పొడవఱు : దే. అ. క్రి. పొడవు తగ్గు.

పొడవుసూపు : దే. అ. క్రి. ప్రత్యక్షమగు.

పొడవుసేయు : దే. స. క్రి. పుట్టించు.

పొడవెట్టు : దే. అ. క్రి. వృద్ధిసూపు.

పొడిగించు : దే. స. క్రి. వృద్ధిసేయు.

పొడిగొట్టు : దే. స. క్రి. 1. చేనియందలి చెట్లు గొట్టు.
2. చూర్ణముచేయు.
3. కారము దంచు. (తెలం.)

పొడిచివేయు : దే. అ. క్రి. మిక్కిలి శౌర్యము చూపు.

పొడిసేయు : దే. స. క్రి. చూర్ణముచేయు.

పొడుగు ; దే. అ. క్రి. 1. ఉన్నతమగు.
2. వర్ధిల్లు.

పొడుచు : దే. అ. క్రి. 1. పోట్లాడు.
2. ఉదయించు.
స. క్రి. 1. కుమ్ము.
2. గ్రుచ్చు.

పొడుచు : 3. వ్రేయు.
4. కుట్టు.
5. ఆనవెట్టు. (ఆనపొడుచు)

పొడుచుకొనివచ్చు: దే. అ. క్రి. రోషము వచ్చు.

పొడుమ్రు : దే. అ. క్రి. పొడము.

పొత్తిచ్చు : దే. అ. క్రి. భాగస్వామ్య మొసగు.

పొత్తిబోవు . దే. అ. క్రి. కాన్పుల తర్వాత స్త్రీలకు కడ
లావెక్కు.

పొత్తు సేయు : దే. అ. క్రి. చెలిమిచేయు.

పొదలాడు :
పొదలు :
పొదలుకొను : } దే. అ. క్రి. వర్ధిల్లు.

పొదవెట్టు : దే. అ. క్రి. 1. సూచించు.
2. ఆరోపించు.
3. పొదగా ఎదుగు.
4. పొదలచే వ్యాపించు.

పొదిగొను : దే. అ. క్రి. గుంపుగూడు.
స. క్రి. పరివేష్టించు.

పొదిరించు : దే. స. క్రి. పొదురు ధా. ప్రే.

పొదివెంచు : దే. అ. క్రి. పురివిప్పు. ప.

పొదుగుచేయు : దే. అ. క్రి. పొదుగుకట్టు.

పొదుగు : దే. స. క్రి. 1. గుడ్లు పొదుగు.
2. రత్నములు పొదుగు.
3. క్రమ్ము.
4. మందును బెల్లము మొ॥ వానిల
గప్పిపెట్టు.

పొదుపుచేయు : దే. స. క్రి. 1. ఆదాచేయు.
2. వస్తువును జాగ్రతగా వాడు.

పొదుము : దే. అ. క్రి. కోడి పొదుగు.

పొదుపు :
పొద్రుచు : } దే. అ. క్రి. పూచు.

పొదువు : దే. స. క్రి. 1. కవియు.
2. క్రమ్ము.
3. చుట్టుకొను.
4. పొదుగు.

పొద్దుపోవు : దే. అ. క్రి. 1. ఆలస్యమగు.
2. సూర్యుఁ డస్తమించు. (రా.సీ.)

పొనఁగు . దే. అ. క్రి. 1. పొనుపడు.
2. కాంతిమాయు.
"మనుజులయూర్పుల మాసి యద్దము
పొనఁగినగతి." క. వ. రా. అరణ్య.

పొనరారు : దే. అ. క్రి. ఒప్పు.

పొనరు : దే. అ. క్రి. 1. అగు.
2. పొసఁగు.

పొనరుచు :
పొనర్చు : } దే. స. క్రి. పొనరు ధా. ప్రే. రూ. పొనరించు.

పొనరువడు : దే. అ. క్రి. పొందువడు.

పొనఱు : దే. అ. క్రి. గనగన మండు.

పొనుగుపడు : దే. అ. క్రి. 1. నివురుగప్పు
2. నిస్తేజమగు.
3. అణఁగు
4. శూన్యమగు.

పొనుపడు : దే. అ. క్రి. 1. నిస్తేజమగు.
2. వ్యర్థమగు.
3. ఉడుగు.

పొనుబాటగు : దే. అ. క్రి. క్రమ్ముదల కలుగు.

క. ద్రోహోక్తుల వైరానల
మూహింపక రాఁజవెట్టి యుక్తిరహితులై
స్నేహంబు విదపఁ జనునె య
పోహంబుగ నుంచుగాక పొనుబాటగునే?
కే. చ.

పొన్పడు : దే. అ. క్రి. 1. నిస్తేజమగు.
2. వ్యర్థమగు.
3. ఉడుగు.

పొమ్మను : దే. స. క్రి. 1. వెళ్ళు మని సూచించు.
2. నిశ్చయము దెలుపు.

పొరఁటు : దే. స. క్రి. 1. కూరాకు నీళ్ళిగురున ట్లుడికించు.
2. వండు.

పొరగల్లు దే. అ. క్రి. విభేదమగు.

పొరగ్రమ్ము : దే. అ. క్రి. కంటికి పొర అడ్డమువచ్చు.

పొరపడు : దే. అ. క్రి. ప్రమాదపడు.

పొరపోవు : దే. అ. క్రి. 1. పొలమారు.
2. ఆహారపదార్థము నాసికారంధ్ర
ములో దిగు.

పొరయు : దే. అ. క్రి. 1. కలుగు.
2. పొంచు.
స. క్రి. పొందు.

పొరలఁబడు : దే. అ. క్రి. పొంగిపడు.

పొరలాడు : దే. అ. క్రి. పొరలు.

పొరలు : దే. అ. క్రి. 1. పొర్లు.
2. ప్రవర్తిల్లు.

పొరలుచు : దే. స. క్రి. పొరలించు. పొరలు ధా. ప్రే.

పొఱ్లు : దే. అ. క్రి. చూలుకట్టు.
పొఱిగొను : దే. స. క్రి. 1. చంపు.
2. నాశముచేయు.
పొఱిమాఱుచు :
పొఱిమాఱ్చు :
పొరిమాలుచు : } దే. స. క్రి. చంపు.
పొఱిమాల్చు :
పొరివుచ్చు : }
పొరిమాలు :
పొలివోవు : } దే. అ. క్రి. చచ్చు.
పొర్లాడు : దే. అ. క్రి. పొరలాడు.
పొర్లు : దే. అ. క్రి. 1. పొర్లాడు.
2. పశుమిథునము కూడు.
పొరడుపుచ్చు :
పొరడువోవు :
పొఱకుమాను : } దే. అ. క్రి. గూనుపడు.
పొఱయు : దే. అ. క్రి. పొందు.
పొఱివుచ్చు : దే. స. క్రి. కలఁచు.
పొఱివోవు : దే. అ. క్రి. కలఁగు.
పొలగొను : దే. స. క్రి. చంపు.
పొలమారు : దే. అ. క్రి. ప్రమాదపడు.
పొలమార్చు : దే. స. క్రి. పొలమారఁజేయు.
పొలయు : దే. అ. క్రి. 1. సంచరించు.
2. వ్యాపించు.
3. సమీపించు.
4. ప్రవేశించు.
పొలసాడు : దే. అ. క్రి. సంచరించు.
పొలికలుగు : దే. అ. క్రి. వృద్ధికలుగు.

పొలియు : దే. అ. క్రి. 1. చెడు.
2. చచ్చు.
పొలివుచ్చు : దే. స. క్రి. పొలివోనఁజేయు. రూ. పొలిదిసగు.
పొలివోవు : దే. అ. క్రి. 1. చచ్చు.
2. చెడు.
3. వ్యర్థమగు.
4. భంగమగు.
5. ఉడుగు.
పొలుచు : } దే. అ. క్రి. 1. ప్రత్యక్షమగు.
పొల్చు : } 2. కనఁబడు.
3. ఒప్పు.
4. స్థిరమగు.
పొలుపారు : దే. అ. క్రి ఒప్పారు.
పొలువడు : దే. అ. క్రి. తఱుగు.
పొలుసుదోము : దే. అ. క్రి. చేపలపై నుండు బిళ్ళవంటి తొడుగు. తీసివేయు.
పొల్లవడు : దే. అ. క్రి. 1. వ్యర్థమగు.
2. క్షయించు.
పొల్లవుచ్చు : దే. స. క్రి. పొల్లవోవఁజేయు.
పొల్లవోవు : దే. అ. క్రి. పొల్లవడు.
పొల్లుచేయు : దే. స. క్రి. వ్యర్థముచేయు.
పొల్లుబోవు : దే. అ. క్రి. వ్యర్థమగు.
పొల్లువడు : దే. అ. క్రి. 1. క్షయించు.
2. వ్యర్థమగు.
3. తాలుగింజపడు
పొవడు : దే. అ. క్రి. పొగడు.
పొవయు : దే. అ. క్రి. పొగయు.

పొవులు : దే. అ. క్రి. పొగులు.
పొసఁగించు : దే. స. క్రి. 1. అనుకూలపడునట్లుచేయు.
2. అందఁజేయు.
పొసఁగు : దే. అ. క్రి. 1. అనుకూలించు.
2. లభించు.
3. చక్కఁబడు.
4. పొందువడు.
5. ఒప్పు.

## పో

పోంచాయించు : దే. స. క్రి. 1. చేరవేయు.
2. అందజేయు. (తెలం.)
పోఁగుపోయు : దే. స. క్రి. 1. సంతనకై తిన్నగాపోగుపాటించికుట్టు
2. గుట్టపోయు.
పోగువాఱు : దే. స. క్రి. ఆవరించు.
పోగొట్టు : దే. స. క్రి. 1. నశింపఁజేయు.
2. పోగొట్టుకొను.
పోఁజు : దే. స. క్రి. గోటితో నార మొ॥ సన్నగా చీల్చు.
పోఁజోపు : దే. స. క్రి. పోవునట్లుచేయు.
పోఁదెచ్చు : దే. అ. క్రి. వచ్చు.
పోఁద్రోలు : దే. స. క్రి. వెళ్ళగొట్టు.
పోకడపెట్టు : దే. స. క్రి. 1. వ్యయపెట్టు.
2. విక్రయించు.
3. పోఁగొట్టు.
పోకాలు ; దే. అ. క్రి. పోవు.
పోచు : దే. స. క్రి. 1. పొగచు.
2. నారచీల్చు.

పోజుగొట్టు :
పోజువేయు : } ఆం. అ. క్రి. చక్కనిభంగిమలో కన్పడు.
పోజిచ్చు :

పోటీపెట్టు :
పోటీవెట్టు : } దే. స. క్రి. 1. ఒకటి పడకుండ మరొకదాని నాధారముగ నుంచు.
2. ప్రతికక్షిగా మరొకరిని నిలుపు.

పోటులాడు : దే. అ. క్రి. యుద్ధముచేయు.

పోటెక్కు : దే. అ. క్రి. నొప్పికలుగు. "తలపోటెక్కినది."

పోటాగు :
పోటాడు : } దే. అ. క్రి. యుద్ధప్రయత్నముసేయు.

పోట్లాడు : దే. అ. క్రి. కలహించు.

పోడిమిసేయు : దే. స. క్రి. 1. పోషణముసేయు.
2. అలంకరించు.

పోడుపెట్టు : దే. స. క్రి. చెట్టు చేమలుగల కొండలపై బొగ్గు కొఱకు అగ్నిని దరికొలుపు.

పోడేర్చు : దే. స. క్రి. బోదేర్చు. బ. పు.

పోతపోయు : దే. అ. క్రి. 1. ఒకేరూపులోఁ దయారుచేయు.
2. అచ్చువాను కన్పట్టు.

పోతరించు ; దే. అ. క్రి. 1. క్రొవ్వుగలుగు.
2. మదించు.
3. బలుపెక్కు.

పోతలుగుట్టు : దే. అ. క్రి. వింత వింత కుట్లు కుట్టు.

పోనాడు : దే. స. క్రి. 1. పోగొట్టు.
2. నిందించు.

పోపడు : దే. అ. క్రి. పోవు.

పోపుచేయు :
పోపువేయు : } దే. అ. క్రి. తిరుగమూతపెట్టు.
పోపుపెట్టు :

పోబడితీయు : దే. స. క్రి. ఆచూకి తీయు.

పోమొత్తు దే. స. క్రి. పోద్రోయు.

పోయు : దే. అ. క్రి. 1. పుట్టు. (చెమటపోయు. మొ॥)
2. నారుపోయు.
3. నీరుపోయు.
4. ఉరిపోయు.
5. ప్రాణ మరిపోయు.
6. నూలుపోయు.
7. అమ్మవారు మొ॥ శరీరముపై కన్పడు.

పోరచు దే. స. క్రి. దేవిరింతగా నడుగు.

పోరాడు :
పోరితమాడు:
పోరామిపెట్టు :
పోరామిసేయు:
దే. అ. క్రి. కలహించు.

"నారాయణుండు మెల్లన
నారీమణి మేఖలకును నచ్చినగతినే
పోరామిచేసి మానము
దూరము గావించె." స.నీ.క.ని. 2 ఆ.

పోరు : దే. అ. క్రి. కలహించు.

పోరుడించు : దే. అ. క్రి. యుద్ధవిరమణము చేయు.

పోరుపెట్టు :
పోరువెట్టు :
దే. అ. క్రి. పిల్లలు పోరుపెట్టి యేడ్చు.

పోలు : దే. అ. క్రి. 1. ఒప్పు.
2. సదృశమగు.
3. శక్యమగు.
4. తగు.

పోలుచు: } దే. స. క్రి. 1. పోలఁజేయు.
పోల్చు : } 2. ఉపమించు.

పోలుచుకొను: } దే. స. క్రి. గుర్తుపట్టు.
పోల్చుకొను : }

పోలుదిరుగు : దే. అ. క్రి. గుండ్రముగాఁ దిరుగు.

పోలుపోము : దే. అ. క్రి. అటునిటు తిరుగు.

పోవు : దే. అ. క్రి. 1. వెడలు.
2. చచ్చు.
3. కడచు.
4. చెడు. (కన్నులు పోవును.)
స. క్రి. 1. పొందు.

పోవుదెంచు : దే. అ. క్రి. పోవు.

పోషాకుదొడుగు: అన్య. దే. అ. క్రి. ప్రత్యేకమైన (చక్కని) దుస్తులు వేయు. (తెలం)

పోషించు : సం. స. క్రి. రక్షించు.

పోసరించు : దే. అ. క్రి. పోతరించు.

పోసికొనిపోవు : దే. స. క్రి. ఎండఁబెట్టిన వడ్లు మొ॥ వానిని కాకు లెత్తుకొని పోవు.

పోసువెట్టు : దే. స. క్రి. 1. ప్రోత్సాహపఱచు.
2. ఉద్రిక్తునిఁజేయు. (తెలం.)

పోహణపెట్టు: } దే. స. క్రి. 1. క్రమ ప్రమాణముగ వలుదముత్యములు నడిమికివచ్చునట్లు గ్రుచ్చు.
పోహణించు : }
పోహళించు : } 2. చక్కఁగా వరుసగా పేర్చినట్లు కూర్చు.

# పో

పోఁజుఁతీయు:
పోఁజుతీయ . } అన్య దే. అ. క్రి. బాఁపులు తీఁయు.

పోఁజులుతీయుచు :
పోఁజులుసేయు : } దే. స. క్రి. పోఁజుతీయు ధా. ప్రే.

# ప్ర

ప్రకటించు : సం. స. క్రి. వెల్లడిచేయు.
ప్రకాశించు : సం. అ. క్రి. వెలుఁగు.
ప్రకృతిస్థునిచేయు: మి. స. క్రి. సహజముగా నుండునట్లుచేయు.
ప్రకోపించు : సం. అ. క్రి. మున్మురించు.
ప్రక్షాళించు : సం. స. క్రి. చక్కఁగాఁ గడుగు.
ప్రక్షిప్తము(లు)చెప్పు : సం. అ. క్రి. లేనిమాటలు కల్పించిచెప్పు.
ప్రక్షిప్తముసేయు: సం. స. క్రి. గ్రంథములలో లేని విషయము
లెక్కించు.
ప్రక్షోభించు : సం. అ. క్రి. మిక్కిలి కలఁతపడు.
ప్రచ్చుపోవు : దే. అ. క్రి. అధికసంఖ్యలో నుండు. (తెలం)
ప్రచ్చు : దే. స. క్రి. నిందించు (ప్రచ్చికోలు.)
ప్రచ్ఛాదించు : సం. స. క్రి. కప్పిపుచ్చు.
ప్రజ్వలించు : సం. అ. క్రి. 1. తెస్సగా నుండు,
2. ప్రకాశించు.
ప్రణమిల్లు : సం. స. క్రి. నమస్కరించు.
ప్రణయించు : సం. స. క్రి. జ్వలింపఁజేయు.
ప్రణుతించు : సం. స. క్రి. పొగడు.
ప్రతాపించు : సం. అ. క్రి. ప్రతాపము చూపు.
ప్రతారించు : సం. స. క్రి. మోసపుచ్చు.
ప్రతికలుగు : వై. అ. క్రి. సాటువ కలుగు.
ప్రతికారము గావించు: మి. అ. క్రి. మాఱుసేఁతసేయు.

ప్రతికౌఁగిలించు: మి. స. క్రి. మాఱుకౌఁగిలించు. పండితా.
ప్రతిగట్టు: మి. అ. క్రి. ఎదురుతిరుగు. పండితా.
ప్రతిగ్రహించు: సం. స. క్రి. దానము పుచ్చుకొను.
ప్రతిఘటించు: సం. స. క్రి. మాఱొడ్డు.
ప్రతిపాదించు: సం. స. క్రి. 1. కలిగించు.
2. తెలుపు.
3. నిరూపించు.
ప్రతిపాలించు. సం. స. క్రి. 1. రక్షించు.
2. ప్రతీక్షించు.
ప్రతిఫలించు: సం. స. క్రి. ప్రతిబింబించు.
ప్రతిబంధించు: సం. స. క్రి. 1. అడ్డగించు.
2. గ్రహబాధ కలుగు.
ప్రతిబింబించు: సం. అ. క్రి. 1. ప్రతిఫలించు,
ప్రతిలేకయుండు: దే. స. క్రి. సాటిలేకుండు. పండితా.
ప్రతివచ్చు: వై. అ. క్రి. సాటివచ్చు.
ప్రతివసించు: సం. అ. క్రి. వసించు.
ప్రతివాదించు: సం. అ. క్రి. వాదికిఁ బ్రతిపక్షముగ మాటాడు.
ప్రతిషేధించు: సం. స. క్రి. నిషేధించు.
ప్రతిష్ఠాపించు: } సం. స. క్రి. 1. శాశ్వతముగ నెలకొల్పు.
ప్రతిష్ఠచేయు: } 2. దేవాలయాదులు ప్రతిష్ఠచేయు.
ప్రతిసేయు: వై. స. క్రి. సమానపఱుచు.
ప్రతిస్పర్థించు: సం. స. క్రి. స్పర్థచేయు.
ప్రతీక్షించు: సం. అ. క్రి. ప్రత్యాశతో నెదురుచూచు.
ప్రత్యక్షించు: సం. అ. క్రి. కనిపించు.
ప్రత్యాహరించు: సం. స. క్రి. వెనుకటివానిని సంగ్రహించు.
ప్రత్యుద్గమించు: సం. స. క్రి. ఎదురేఁగిపోవు.
ప్రత్యేకించు: సం. అ. క్రి. ప్రత్యేకమగు, వేర్వఱగు.

ప్రదక్షిణించు : సం. స. క్రి. వలగొను.

ప్రదర్శించు : సం. స. క్రి. విశదపఱచిచూపు.

ప్రధావించు : సం. అ. క్రి. పరుగెత్తు, పాఱు.

ప్రపంచంబు నెఱుగు: మి. అ. క్రి. లోకమెఱుగు.

ప్రపంచించు : సం. స. క్రి. విస్తరించు.

ప్రబలు : సం. అ. క్రి. 1. అతిశయిల్లు.
2. వర్ధిల్లు.

ప్రబోధించు : సం. స. క్రి. 1. చక్కఁగాఁ దెలుపు.
2. మేలుకొలుపు.

ప్రబ్బు : దే. అ. క్రి. 1. వ్యాపించు.
2. వర్తిల్లు.
3. అతిశయించు.
4. వర్ధిల్లు.
స. క్రి. 1. నిందించు.
2. కలయు.

ప్రభవించు : దే. అ. క్రి. 1. పుట్టు.
2. కలుగు.
3. జనించు.

ప్రమాణించు : దే. స. క్రి. సత్యనిర్ధారణమున కుదాహరణము చూపు.

ప్రమాణీకరించు: సం. స. క్రి. 1. ప్రమాణములు చూపు.
2. సత్యముగా నెంచు.
3. ఒట్టుపెట్టుకొను.

ప్రమాదపడు : మి. అ. క్రి. పొరపడు.

ప్రమోదించు : సం. అ. క్రి. సంతోషించు.

ప్రమోషించు : సం. స. క్రి. 1. వంచించు.
2. బుద్ధి నపహరించు.

ప్రమ్మిదఆరు : మి. అ. క్రి. 1. దీపమారు.
2. మరణించు.

ప్రమ్ము : దే. స. క్రి. పరివేష్టించు.

ప్రయత్నించు : సం. స. క్రి. మిక్కిలి యత్నించు.

ప్రయాణించు : సం. అ. క్రి. ప్రయాణముచేయు.

ప్రయాసపడు : సం. అ. క్రి. 1. శ్రమపడు.
2. పాలుపడు.

ప్రయోగించు : సం. స. క్రి. 1. మంత్రించి విడుచు.
2. మాటలు వాడు.

ప్రయ్యవడు : దే. అ క్రి. నిందపడు.

ప్రలాపించు . సం. అ. క్రి. పలవించు.

ప్రలోభించు : సం. స. క్రి. ఆసగొనఁజేయు.

ప్రవచించు : సం. స. క్రి. భాష్యార్థము చెప్పు.

ప్రవర్తించు : సం. అ. క్రి. నడచు.

ప్రవర్ధిల్లు : సం. అ. క్రి మిక్కిలి వృద్ధి నొందు.

ప్రవహించు : సం. అ. క్రి. పాఱు.

ప్రవేశించు : సం. అ. క్రి. చొచ్చు.

ప్రవ్వు : దే. అ. క్రి. సమృద్ధమగు.

ప్రశంసించు : సం. స. క్రి. స్తోత్రము జేయు, పొగడు.

ప్రసంగముచేయు: సం. స. క్రి. 1. సంగము కలుగఁజేయు.
"మకరకేతనుఁ బంపుడ వారికిం దప
శ్చ్యలనముసేసి మైవడిఁ బ్రసంగము
సేయు జగద్ధితంబుగాన్. కు. సం. 4ఆ.
2. ఉపన్యసించు.

ప్రసంగించు : సం. స. క్రి. ప్రసంగముచేయు.

ప్రసక్తించు : సం. స. క్రి. ప్రస్తావమునకు వచ్చు.

ప్రసరించు : సం. అ. క్రి. వ్యాపించు.

ప్రసవించు : సం. స. క్రి. బిడ్డను కను.
ప్రసాదించు : సం. స. క్రి. అనుగ్రహించి యిచ్చు.
ప్రసాధించు : సం. స. క్రి. అలంకరించు.
ప్రసేవించు : సం. స. క్రి. సేవించు.
ప్రస్తరించు : సం. స. క్రి. 1. విస్తరించు.
2. ఛందఃప్రస్తారము చేయు.
ప్రస్తావించు : సం. స. క్రి. 1. ప్రస్తావమునకుఁ దెచ్చు.
ప్రస్తుతించు . సం. స. క్రి. 1. స్తుతించు.
2. అప్పటి కుపయోగపడునట్లు చేయు.
ప్రస్థాపించు : సం. స. క్రి. 1. చక్కగా స్థాపించు.
2. బయలుదేరఁదీయు.
3. పంపించు.
ప్రహారించు : సం. స. క్రి. కొట్టు.
ప్రహారిచరించు: } దే. అ. క్రి. గస్తితిరుగు.
ప్రహారిచుట్టు : }
ప్రహారితిరుగు : }
ప్రహాసించు : సం. అ. క్రి. పెద్దగ నవ్వు.
ప్రహ్వీకరించు : సం. స. క్రి. నమ్రముగాఁజేయు.

# ప్రా

ప్రాంజలించు : సం. స. క్రి. దోసిలొగ్గు.
ప్రాకు : దే. స. క్రి. 1. ఎక్కు.
అ. క్రి. 1. ఱొమ్ముతో మోకాళ్ళతోజరుగు.
"తీగ ప్రాకుచున్నది"
2. వ్యాపించు.
3. వృద్ధినొందు.

ప్రాకుడెంచు : దే. స. క్రి. 1. ఎక్కు,
అ. క్రి. 1. జరుగు.
2. వ్యాపించు.
3. వృద్ధినొందు.

ప్రాకులాడు : దే. అ. క్రి. అల్పప్రయోజనము కల లాభాశచే నంటిపెట్టుకొని తిరుగు.

ప్రాఁకువట్టు :
ప్రాఁకొను : } దే. అ. క్రి. పాచిపట్టు.

ప్రాణగొడ్డమాడు : దే. స. క్రి. ప్రాణమును హింసించుటకుఁదగిన మాటలాడు.

ప్రాణమగు : మి. అ. క్రి. అతిప్రియమగు.

ప్రాణముగూఁటబడు : మి. అ. క్రి. మనస్సున కూరట గలుగు.

ప్రాణముగొను : మి. స. క్రి. చంపు.

ప్రాణము ఝల్లను: మి. అ. క్రి. భయభ్రాంతమగు.

ప్రాణముతిను : మి. అ. క్రి. మిక్కిలి బాధపెట్టు.

ప్రాణముతీయు : మి. స. క్రి. ప్రాణముపోవునంత బాధకలిగించు.

ప్రాణముతెగు : మి. అ. క్రి. మృతినొందు.

ప్రాణమునిల్పుకొను : మి. అ. క్రి. అతికష్టముచే జీవించు.

ప్రాణముపోవు : మి. అ. క్రి. మరణించు.

ప్రాణముపైవచ్చు: సం. అ. క్రి. 1. మిక్కిలి ప్రమాదమగు.
2. ప్రాణము మీఁదికివచ్చు.

ప్రాణముప్రాణమగు : మి. అ. క్రి. అతిప్రియమగు. రాజ.గో.3ఆ.

ప్రాణముమీఁదికివచ్చు : మి. అ. క్రి. ప్రాణముపైకి వచ్చు.

ప్రాణములుపట్టుకొనియుండు : మి. అ. క్రి. ఆశతో జీవించు.

ప్రాణమెత్తు : సం. స. క్రి. ప్రాణముతీయు.

ప్రాణములేచివచ్చు : మి. అ. క్రి. అత్యుత్సాహము కలుగు.

ప్రాణాచారముపడు మి. అ. క్రి. ప్రాయోపవేశముచేయు.

ప్రాదుర్భవించు: సం. అ. క్రి. పుట్టు.
ప్రాపించు : సం. స. క్రి. పొందు.
ప్రాపుచెడు : సం. అ. క్రి. రక్షణ పోవు.
ప్రాప్తించు : సం. అ. క్రి. లభించు.
ప్రాము : దే. స. క్రి. 1. ఊచు.
2. పూఁతపెట్టు.
3. మోయు, కనుప్రాము.
4. తుడుచు.
5. పీడించు.
6. ఖండించు.
ప్రారంభించు : సం. స. క్రి. మొదలుపెట్టు.
ప్రార్థించు : సం. స. క్రి. 1. వేడుకొను. భార. ఆది.
2. అడుగు
ప్రాల్గలుగు : దే. అ. క్రి. ఆయుస్సు కలుగు.
ప్రాలుమాలు: } దే. అ. క్రి. 1. సోమరితనము ప్రకటించు.
ప్రాల్మాలు : } 2. బడలికపడు.
3. జబ్బుపడు.
ప్రావు : వై. అ. క్రి. వ్యాపించు. రూ. పరవు.
ప్రాశించు : సం. అ. క్రి. తిను.

# ప్రి

ప్రిదిలిపడు : } దే. అ. క్రి. 1. జాఱు.
ప్రిదిలికొను : } 2. విరియు.
ప్రిదిలిపోవు: } 3. పిగులు.
ప్రిదులు : }
ప్రియపడు : దే. అ. క్రి. ఇష్టమును పొందు.

## ప్రు

ప్రుచ్చు : దే. అ. క్రి. పుప్పిపట్టు.

ప్రుచ్చుపట్టు : దే. అ. క్రి. 1. పుప్పిపట్టు.
2. పుచ్చుపట్టు.

ప్రువ్వఁదిట్టు : దే. స. క్రి. బాధపడునట్లు నిందించు.

## ప్రే

ప్రేఁచు : దే. స. క్రి. ప్రేరేచు.

ప్రేముడించు : దే. అ. క్రి. 1. ప్రియపడు.
2. శోకించు.
3. బాధపడు.

ప్రేరించు :
ప్రేరేఁచు :
ప్రేరేపించు :
ప్రేరేపు : } దే. స. క్రి. ప్రేరేపణచేయు.

ప్రేలగించు : దే. స. క్రి. ప్రేలు.

ప్రేలు : దే. అ. క్రి. 1. వదరు.
2. వేఁగు.
3. వేగి చిటిలిపడు.
4. మందు ప్రేలు.

ప్రేలుచు :
ప్రేల్చు : } దే. స. క్రి. ప్రేలు ధా. ప్రే.

ప్రేవులఱచు : దే. అ. క్రి. ఆకలియగు.

ప్రేవులుమాడు : దే. అ. క్రి. ఆఁకలియగు.

# ప్రై

ప్రైయిడు:
ప్రయ్యాడు: } దే. స. క్రి. నిందపెట్టు.
ప్రయిడు :

ప్రైవడు :
ప్రయ్యవడు: } దే. స. క్రి. నిందపడు.
ప్రయివడు :

ప్రైవెట్టు : :
ప్రయ్యవెట్టు : } దే. అ. క్రి. నిందించు, నిందపెట్టు.
ప్రయివెట్టు :

# ప్రొ

ప్రొద్దగు : దే. అ. క్రి. ఆలస్యమగు.

ప్రొద్దుగ్రుంకు : దే. అ. క్రి. సూర్యాస్తమయమగు.

ప్రొద్దుపుచ్చు : దే. అ. క్రి. కాలక్షేపముచేయు. రూ. ప్రొద్దుచ్చు.

ప్రొద్దుపొడుచు: దే. అ. క్రి. 1. సూర్యోదయమగు.
2. అభ్యుదయమగు.
3. (నిందార్థమున) మొగాన పొడుచు.

ప్రొద్దుపోవు : దే. అ. క్రి. ఆలస్యమగు.

ప్రొద్దువేఁగు : దే. అ. క్రి. తెల్లవారు. రూ. ప్రొద్దువేవు.

ప్రొద్దెక్కు : దే. అ. క్రి. 1. సూర్యుడు పైకివచ్చు.
2. ఎండఎక్కు.

# ప్రో

ప్రోక్షించు : సం. స. క్రి. 1. మంత్రజలము చిలకరించు.
2. (అసభ్యముగా) జార స్త్రీ సంగమము చేయు.
3. యజ్ఞమునందుపశువునుశుద్ధిచేయు

ప్రోగుచేయు : } దే. స. క్రి. 1. రాశీకరించు.
ప్రోవుచేయు : } 2. కూడఁబెట్టు.

ప్రోగుపడు : } దే. అ. క్రి. 1. రాశియగు.
ప్రోవువడు : } 2. కూడు.

ప్రోచు : దే. స. క్రి. రక్షించు.

ప్రోజు : దే. స. క్రి. నార లోనగువాని నలుసులు వాయ సన్నముగాఁదీయు. రూ. పోజు.

ప్రోదిగొను : దే. స. క్రి. పోషించు.

ప్రోదిసేయు : దే. స. క్రి. పోషణముసేయు.

ప్రోపడు : దే. అ. క్రి. పోషణమును బొందు.

ప్రోపెట్టు : దే. స. క్రి. 1. గుంపుచేయు.
2. రక్షించు.

ప్రోలుడుపు : దే. స. క్రి. ప్రేరేఁచు.

ప్రోవుకొను : దే. అ. క్రి. రాశిపడు. ప్రే. ప్రోవుకొలుపు.

ప్రోవెట్టు : } దే. స. క్రి. కుప్పలుగాఁబెట్టు.
ప్రోవుపెట్టు : }

# ఫ

ఫజీతుసేయు : హిం. స. క్రి. తిట్టి యవమానపఱచు. రూ. బజీదుసేయు.

ఫణమంటు : దే. స. క్రి. రెచ్చగొట్టు.

ఫర్మాయించు : హిం. స. క్రి. ఆజ్ఞాపించు.

ఫలించు : } సం. అ. క్రి. 1. పండు.
ఫలియించు: } 2. నెఱవేరు.

ఫసందగు : హిం. స. క్రి. 1. బాగుగా నుండు.
2. కంటికింపగు.

ఫిరాయించు : హిం. అ. క్రి. 1. మారు. "తత్త్వము ఫిరాయించినది.
2. ధూర్తుడుగా మాఱు.
స. క్రి. తిరిగియిచ్చు.

ఫుసలాయించు : హిం. స. క్రి. బతిమాలు.

ఫెళఫెళమను : } దే. అ. క్రి. 1. విజృంభించు.
ఫెళఫెళలాడు : } 2. ఫెళఫెళమని ధ్వనితో మ్రోగు.

ఫైసలగు : హిం. అ. క్రి. తీరుమానమగు.

ఫైసలుచేయు : హిం. స. క్రి. తీరుమానముచేయు.

ఫొర్తుపఱచు : హిం. స. క్రి. కుదురుపఱచు.

## బ

బంటించు : దే. స. క్రి. పరాక్రమించు.
"బంటిగాఁడవు నన్నొకయెడ డించి
బంటించి యహితులఁ బైకొనరాదు"
క. వ. రా. సుందర.

బండకొయ్యవేయు: } దే. స. క్రి. పంగగానున్న కొయ్యలో కాళ్లు
బండవేయు : } చేతులు దూర్చి బిగించు.
చూ. బొండకొయ్య వేయు.

బండగించు : దే. అ. క్రి. బండపడు.

బండపడు : దే. అ. క్రి. బండకొయ్యవేయఁబడు, మొద్దుబారు.

బండపాఱు : దే. అ. క్రి. మొద్దుపాఱు.

బండారము బయటపడు: దే. అ. క్రి. ఉన్నవిషయము బహిర్గతమగు.

బండిగిల్లు : దే. అ. క్రి. కడగండ్లను పడు.

బంతిసాగు : దే. అ. క్రి. పంక్తిగా నేర్పడు.

బంతులాడు : దే. అ. క్రి. పెండ్లియందు చెండ్లాడు.

బంతులుగట్టు : దే. అ. క్రి. 1. వరుసలు దీర్చు.
2. కుప్పనూర్పిడియందు కుప్పచుట్టు గొడ్ల చేతఁ ద్రొక్కించు.
3. పూలచెండ్లు కట్టు.
4. వరుసగా పలుపులతో నెడ్లను గట్టు.

బంతులుగా సాగు: దే. అ. క్రి. వరుసగా నుండు. పండి. 2.

బంతులుదీరు : దే. అ. క్రి. 1. బారులుతీరు.
2. భోజనసమయములందుఁబంక్తులుగా నేర్పడు.

బందనగొను : దే. అ. క్రి. జిగురుగొను.

బందముకట్టు : దే. అ. క్రి. పశువుల కాళ్ళను పలుపుతోఁగట్టివేయు

బందానపడు : దే. అ. క్రి. 1. చెట్టు ఎక్కుటకు కాళ్ళకు ఉగ్గము తగిలించుకొను.
2. చిక్కులలో సిలుకుకొను.

బందివెట్టు : దే. స. క్రి. బంధించు.

బందుబస్తుచేయు: } హిం. స. క్రి. 1. కట్టుదిట్టముచేయు.
బందోబస్తుచేయు: } 2. జాగ్రత్తచేయు
ప్రే. బందోబస్తు చేయించు.
కు. రా.

బందెగొను : దే. స. క్రి. చెఱపెట్టు.

బందెలుసుట్టు : దే. అ. క్రి. బందాలు వేయు.

బంధించు : సం. స. క్రి. 1. కట్టు.
2. బంధనముచేయు.

బకషాయించు : అన్య దే. స. క్రి. సహించు.

"నేను రాజరికంచేసే రాజునని ఒక
తప్పుకు బకషాయించెదరు, ఇద్దరిని
ముగ్గురిని చంపుచుంటే వాండ్లెట్లు
ఓర్చేరు." కు. రా.

బకాళించు : దే. అ. క్రి. ఊపుకలుగు.

"వెన్నునఁగొమ్ములు వెళ్ళ గుమ్ముచును
బకాళించి తన్నఁ గుంభంబులు పగిలె"
కా. క.

బకాయిపడు : అన్య. దే. అ. క్రి. బాకీపడు.

బకాయిపెట్టు : అన్య. దే. స. క్రి. బాకీపెట్టు.

బక్కచిక్కు : దే. అ. క్రి. కృశించు.

బక్కటిల్లు :
బక్కటిలు : } దే. అ. క్రి. శుష్కించు.

బగటు : దే. స. క్రి. ప్రకాశింపఁజేయు.

"హరినీలసోపాన సరణి గాఁబోలును
బగటుచున్నదిన ల్లపాపపేరు ప్ర.ప్ర.1ఆ.

బగళంబుసేయు : దే. స. క్రి. తొలగించు.

బగాయించు : దే. స. క్రి. పసుగత్తించు.

బగిసిమాలు : దే. అ. క్రి. సిగ్గు వదలిపెట్టు.

"ఆబిడ గర్భోత్పత్తికి
నైబగిసియు మాలి పతిరతాదృతి మీఁదన్
లోఁబొడమిన రుచి మించినఁ
బ్రాబల్యము గలుగు విటులపాలిదియయ్యెన్.,,

బగ్గముపాడగు : దే. అ. క్రి. సర్వనాశమగు.

బగ్గిపడు : దే. అ. క్రి. దుమ్మువడు.

"కాక వెఱచినమాట నిక్కంబయేని
నేడు నీవంక శార్దూలనికరమునకుఁ
జెల్లఁబో మాంసకబళంబు జెల్లమయ్యెఁ
గ్రొంత పరివారములనోట బగ్గిపడియె.
శుక.

బగ్గుమను : దే. అ. క్రి. 1. మండు;
2. కోపించు.

బచ్చివెట్టు : దే. స. క్రి. ముద్దుపెట్టు. (తెలం)

బచ్చెనపెట్టు :
బచ్చెనపోయు: } దే. స. క్రి. రంగుపూయు.

బజ్జవెట్టు : దే. స. క్రి. నిద్రపుచ్చు.

బజాయించు : హిం. స. క్రి. 1. కొట్టు.
2. తాడించు.
3. జాడించు.

బజారించు : దే. స. క్రి. వ్యభిచరించు.

బజీతుచేయు : దే. స. క్రి. చిత్తుచేయు.

బట్వాడాచేయు : అన్య. దే. స. క్రి. 1. పంచు.
2. కూలీలకు జీతములు పంచు.

బట్టీపట్టు . దే. స. క్రి. 1. కంఠస్థముచేయు.
2. ఏదైన రసము దీయుటకు ప్రాయి మీఁదనుంచి కాఁచు.
3. కంఠస్థముచేయు.
4. సారాయి మొ॥ కాచి వడపోయు.

బడలు : దే. అ. క్రి. శ్రమపడు.

బడలుకొను :
బడలుపడు : } దే. అ. క్రి. 1. శ్రమపడు.
బడలిపోవు : 2. నీరసించు.
బడల్వడు :

బడాయించు : దే. అ. క్రి. 1. వృద్ధినొందు.
2. బడాయికొట్టు.
స. క్రి. 1. వృద్ధి యొనరించు. ఆం. వా.
2. నచ్చక సాగ నంపు.

బడాయిచెప్పు : దే. అ. క్రి. గొప్పచెప్పు.

బడితపూజచేయు :
బడితబాజాపట్టు : } దే. స. క్రి. బాగుగఁగొట్టు.
బడితసంబరముచేయు:

బడిత్రిప్పు : దే. స. క్రి. దృష్టితీయు.

బడియు : దే. అ. క్రి. వెంటవచ్చుచు మధ్యలో నెడఁబాయు.

బడివాయు : దే. స. క్రి. వెంట నెడఁబాయు.

బడివిడుచు : దే. అ. క్రి. 1. తెగించు.
2. పరువు లెక్కపెట్టకుండు.
"బడివిడిచినముండ బజారుకుపెద్ద."
(సామె.)
స. క్రి. ఆయత్తపఱచు. సుకు. పరి.

బడుగగు : దే. అ. క్రి. నిర్వీర్యమగు.

బతాయించు : హిం. స. క్రి. నిర్ణయించు.

బతిచెడు : దే. అ. క్రి వ్రతము చెడు.

బతిమాలు : దే. స. క్రి. దైన్యముతో వేడికొను.

బతిమాలుచు : దే. స. క్రి. బతిమాలు ధా. ప్రే.

బతిమాలించుకొను : దే. అ. క్రి. పెఱవాడు బతిమాలునట్లు చేసికొను

బత్తెమిచ్చు : దే. అ. క్రి. దినవెచ్చమిచ్చు.

బత్తెముతోదాటు : దే. అ. క్రి. ఒక పెద్దమ్రానును తెప్పగా మలచి దానితో కాలువలు దాటు.

బదనాయంపెట్టు హిం. అ. క్రి. బాధ్యత కల్పించు.

బదనాయించు : హిం స. క్రి. 1. మార్చు.
2. తిరుగఁబడు. (తెలం)

బద్దమానముచేయు : దే. స. క్రి. కొలతలు తూకములు సరిచూచు.

బద్దముతప్పు : దే. అ. క్రి. నియమము చెడు.

బద్దించు : దే. స. క్రి. కొల్చినది మఱలఁగొల్చు.

బద్దికెక్కు : దే. అ. క్రి. అపనిందపాలగు.

బదులిచ్చు: దే. అ. క్రి. అప్పు ఇచ్చు.

బదులుచేయు : దే. అ. క్రి. అప్పుతీసికొనివచ్చు.

బద్ధకించు: దే. అ. క్రి 1. ప్రాలుమాలు.
2. శిశువు పురీషించు.

బనాయించు : హిం. స. క్రి. 1. ఏర్పాటుచేయు.
2. వెక్కిరించు.
3. ఆయత్తపఱచు.
4. వేళాకోళముగఁ బాగడు.
5. కృత్రిమముగాఁగల్పించు. (తెలం)

బనాయించుకొను : దే. అ. క్రి. కలుపుకొనియుండు. (తెలం)

బబ్బరించు : దే. అ. క్రి. బొబ్బరించు.

"పీరవానరకోటి వేలంబులోనఁ
దృణము చలింప దైతేయులటంచు
గణుతించి ఝల్లనఁగలఁగఁ బాఱుచును
బబ్బరించుచు సేతుపద్ధతిఁబట్టి.
క. వ. రా. యుద్ధ కాం.

బమ్మరించు:
బమ్మరిల్లు : } దే. అ. క్రి. భ్రమరించు, తిరుగు.
బమ్మరిలు :

బమ్మ్రు : దే. అ. క్రి. ప్రసిద్ధమగు.
బమ్మెరపోవు : దే. అ. క్రి. 1. భ్రమపడు.
2. జంకు.
బయటకుఁబోవు: దే. అ. క్రి. బహిర్భూమికిఁ బోవు.
బయటపడు : దే. అ. క్రి. వెల్లడియగు.
బయటపెట్టు. బయల్పెట్టు : దే. స. క్రి. 1. రహస్యమును వెలువరించు.
2. వెలివేయు.
బయలనుండు : దే. అ. క్రి. ఋతుకాలమందు స్త్రీ వెలుపలనుండు.
బయలుదేఱు : దే. అ. క్రి. ప్రయాణము ప్రారంభించు.
బయలుపడు : దే. అ. క్రి. ప్రకాశితమగు
బయలుపఱచు : దే. స. క్రి. ప్రకాశమాన మొనర్చు. కు. సం. 9ఆ.
బయలుమెఱయు: దే. అ. క్రి. ప్రకాశితమగు.
బయలువెడలు : దే. అ. క్రి. బయలుదేరు.
బయలువోవు : దే. అ. క్రి. వెలివడు.
బయసిమాలు : దే. అ. క్రి. 1. అపకీర్తిపాలగు.
2. అధర్మపరుఁడగు.
బరబరలాడు : దే. అ. క్రి. నునుపులేకయుండు.
బరాబరిసేయు : దే. స. క్రి. హెచ్చరికసేయు.
బరకాస్తుచేయు : హిం. అ. క్రి. 1. కొలువుచాలించు.
2. సమావేశము ముగించు.
3. తొలగించు.
"మహారాజు కచేరికివెళ్ళి బరకాస్తు చేసి నగరుకుఁ బ్రవేశించి." కు.రా.
బరితెగించు : దే. అ. క్రి. 1. హద్దుమీఱు.
2. దుస్సాహసముచేయు.
బరిమీదనిలుచు : దే. అ. క్రి. పాఱిపోకుండ నెదురుకొను.

బరిపీచేయు : అన్య. దే. స. క్రి. మార్పిడిచేయు (ఉద్యోగములు స్థలములు వస్తువులు మొ.)
బరుకు : దే. అ. క్రి. 1. గోళ్ళతో ధ్వనివచ్చునట్లు శరీరము మీఁద గీయు.
2. కొంకిబికిగా వ్రాయు.
బరువుచేయు : దే. అ. క్రి. వ్యాధి అతిశయించు.
బరువుతీరు : దే. అ. క్రి. భారము తొలఁగు.
బర్తరఫుచేయు: అన్య. దే. స. క్రి. ఉద్యోగమునుండి తీసివేయు.
బఱటు : దే. అ. క్రి. 1. సంజ్ఞగా గీటు.
2. గోఁకు.
బలకరించు: దే. అ. క్రి. వ్యాపించు.
బలకొాయించు : దే. స. క్రి. అతిశయించు.
బలకొట్టు : దే. అ. క్రి. "ఆ" యని శ్రుతిపట్టు.
బలకొను : దే. అ. క్రి. అతిశయించు.
బలపడు : దే. అ. క్రి. 1. అధికమగు.
2. దృఢపడు.
బలయు : దే. స. క్రి. పరివేష్టించు. (బలసి కొలుచు)
బలవంతము సేయు : దే. స. క్రి. బలాత్కారముసేయు.
బలాత్కరించు : దే. స. క్రి. బలాత్కారముచేయు.
బలిపెట్టు :
బలిగొను :
బలియిడు: } దే. స. క్రి. 1. చంపు.
2. ఆహుతిగా చంపు.
బలియు : దే. అ. క్రి. 1. పుష్టికలుగు.
2. అధికమగు.
స. క్రి. చుట్టుకొను. కు. సం. 10 ఆ.
బలివాఱు : దే. స. క్రి. చంపు.
బలుపుగొను దే. అ. క్రి. పుష్టినొందు.

బయిలువుచేయు : దే. అ. క్రి. వ్యాధిమోపగు.
బవియు : దే. అ. క్రి. బలుపునొందు.
బవిసిమాలు : దే. అ. క్రి. సిగ్గులేకుండు. రూ. బైసిమాలు.
బసచేయు : దే. అ. క్రి. విడిదిచేయు.
బహిరవెట్టు : } దే. స. క్రి. తెలుపుడుచేయు, వెలివేయు.
బహిరవోవు: }
బహిపడు : దే. అ. క్రి. వెలివేయఁబడు.
బహివెట్టు : దే. స. క్రి. వెలిపెట్టు.
బహిష్కరించు : సం. అ. క్రి. వెలిపెట్టు.
బహుమతిచేయు: సం. స. క్రి. కానుకచేయు.
బహుమానించు : సం. స క్రి. బహుమతిచేయు, గౌరవించు.
బహురూపమాడు : సం. అ. క్రి. వేషములువేయు. పండితా.
బహూకరించు : సం. స. క్రి. సన్మానించు.

## బా

బాఁదు : దే. స. క్రి. 1. తీవ్రముగఁ గొట్టు. 2. ప్రహరించు.
బాఁదుకొను : దే. అ. క్రి. ఱొమ్మపై బాఁదుకొను.
బాకాపట్టు : దే. స. క్రి. ముఖస్తుతిచేయు.
బాకీపడు : హిం. అ. క్రి. ఋణపడు.
బాగుండు : దే. అ. క్రి. 1. చక్కగానుండు.
2. మర్యాదగానుండు.
బాగుచేయు : దే. స. క్రి. 1. శుభ్రముచేయు.
2. చక్కఁబఱచు.
బాజాపట్టు : దే. స. క్రి. 1. స్తోత్రముచేయు.
2. దెబ్బలుకొట్టు.
బాడించు : దే. స. క్రి. 1. జాడించు
2. అదేపనిగా దోషోద్ఘాటనము సేయు.
3. తెగఁదిట్టు.

బాడుదలవట్టు : దే. స. క్రి. జీవగ్రాహముగా గ్రహించు.
"భీతిఁబాఱెడు పురుషులాతు వెన్కొని
బాడుదల వట్టి దర్పంబు దలకుమీఱు.
నృ. పు. 2 ఆ.

బాతళించు : దే. అ. క్రి. తత్తరించు.

బాతాలుకొట్టు : దే. అ. క్రి. బాతాఖానీ చేయు.

బాదరించు : దే. అ. క్రి. సమానమగు.

బాధించు : సం. స. క్రి. బాధపెట్టు.

బానగిల్లు : దే. అ. క్రి. బలాత్కృత మగు.

బారకించు : దే. అ. క్రి. 1. భారమగు.
2. తలనొప్పి మొ. కలుగు.

బారచా(సా)పు : దే. అ. క్రి. చేతులుచాచు.

బారపోవు : దే. అ. క్రి. చేయిచాఁగునంతకొలఁది నూలువడుకు

బారినబడు : దే. అ. క్రి. 1. కపిల (మోట) పశువులు నీరు లాగుచు నడచు వాలు ఏర్పడు.
2. మోటయెద్దువలెఁ గష్టించు.
3. ఎదనఁబడు, అగ్గమగు.

బారిసమరు : దే. స. క్రి. 1. వెంపరలాడు.
2. చంపు.

బారసాపు : దే. అ. క్రి. విజృంభించు.

బారుగాపోవు : దే. అ. క్రి. ఉదారముగ నడచుకొను. (నె. జి.)

బారుచేయు :
బారుపేయు : } దే. స. క్రి. 1. తుపాకిలో మందుగుండు వేసి కూరు.
2. నూటిచేయు.

బావుకొను : దే. అ. క్రి. 1. అన్నము లోనగునవి ఆత్రముతో చేతినిండ ఎత్తి నోట నిడుకొను.
2. అనుభవించు.
"ఇది చేసి యేమి బావుకొంటివి."

బావుటాయెత్తు : దే. అ. క్రి. దండెత్తు.

బావురుమను : దే. అ. క్రి. 1. బావురుమని యేడ్చు.
2. శూన్యమగు.
"సందడిలేక యిల్లు బావురు మను చున్నది.

బాళితాపు : దే. అ. క్రి. మూర్ఛనందు.

బాసగొను : దే. అ. క్రి. ఒట్టుపెట్టుకొను.

బాసాడు : దే. అ. క్రి. 1. భాషించు.
2. తనకుఁ దెలియనిభాషలోమాటాడు

బాహాస్ఫాలించు : వై. అ. క్రి. భుజాస్ఫాలనము సేయు.

బాహాస్ఫాలనమాచరించు: దే. స. క్రి. భుజములను చఱచు.

బాహిరపోవు : వై. అ. క్రి. 1. బయలుపడు.
2. మూర్ఛిల్లు.

## బి

బింకముచూపు : దే. అ. క్రి. 1. పౌరుషముచూపు.
2. పట్టుపట్టి కూర్చుండు.

బింకమెక్కు : దే. అ. క్రి. 1. గర్వమెక్కు.
2. అతిశయించు.
"బింకంబెక్కు క్రోధాగ్నికిన్"
కు. సం. 1 ఆ.

బిందించు : దే. అ. క్రి. తొలివానపడు.
"కన్య బిందింపదయ్యో" కాళహస్తి. 3 ఆ.

బిక్కట్టువడు : దే. అ. క్రి. భయపడు.
"పెక్కుజీవులు లోన బిక్కటువడఁగనా
బ్రహ్మాండభాండమ్ము పగిలె నాఁగ్గా
పగిలె గంబము భువనకంపంబు గదుర"
నృ. పు. 5 ఆ.

బిక్కిరించు : దే. స. క్రి. ఊక్కించు. (చెవులు)

బిక్కిరించుకొను : దే. అ. క్రి. అసహాయస్థితిలో నుండు.

బిక్కుబిక్కుమను : దే. అ. క్రి. ఒంటరిగా భయపడుచుండు.

బిగబట్టు : } దే. స. క్రి. 1. గట్టిగా పట్టుకొను,
బిగించుకొను : } 2. శ్వాసము బంధించు

బిగించు : } దే. స. క్రి. 1. కట్టు.
బిగియించు : } 2. గట్టిచేయు.

బిగుచు : దే. స. క్రి. బిగించు.

బిగియు : దే. అ. క్రి. 1. బిగు వగు.
2. బెట్టుసేయు.

బిగువుకొను : దే. అ. క్రి. బిగువగు.

బిచానా ఎత్తిపోవు: అన్య. దే. అ. క్రి. ఊరినుండి వెడలిపోవు.

బిజుగు : దే. అ. క్రి. బొంకు.

బిట్టాడు : దే. అ. క్రి. హెచ్చుగా మాటలాడు.

బిడాయించు : దే. అ. క్రి. బిగియు. "ముక్కు బిడాయించినది."
స. క్రి. 1. ఒకదానిలో మఱియొకదానినుంచు.
2. మూయు.

బిడియపడు : దే. అ. క్రి. సిగ్గుపడు.

బిత్తరపోవు : దే. అ. క్రి. 1. చలించు.
2. నిశ్చేష్టమగు.

బిత్తరములాడు: దే. అ. క్రి. విలసిల్లు.

బిత్తరించు : దే. అ. క్రి. 1. సరసమాడు.
2. విలాసముచూపు.
3. ప్రకాశించు.
4. చలించు.

బిద్దు : దే. అ. క్రి. చచ్చు.

బిబ్బరించు : దే. అ. క్రి. పులి గర్జించు.

బిమ్మిటిగొను : దే. అ. క్రి. 1. మూర్ఛిల్లు.
2. వివశత నొందు.

బియ్యమిచ్చుకొను : దే. అ. క్రి. బ్రాహ్మణేతరులు పితృకార్యము చేసికొను.

బిరబిరనడచు: }
బిలబిలనడచు: } దే. అ. క్రి. తొందరగా నడచు.

బిసవెత్తు : దే. స. క్రి నేలను ద్రవ్వినపుడు ములుములుగా చేయు:

బిస్స : దే. అ. క్రి. కుతూహలపడు.

బిఱ్ఱబిగియు : దే. అ. క్రి. (బిగియు+బిగియు) 1. మిక్కిలిబిగియు
2. మిక్కిలిబెట్టుసేయు.

బిఱ్ఱు : దే. అ క్రి. బిఱుసగు.

బిఱ్ఱుకొను : దే. అ. క్రి. బిగిసిపోవు.

బిల్లకట్టు దే అ. క్రి. మెడలోనగుచోట్ల నెత్తురు గడ్డకట్టు.

బిసతిప్పు : దే. స. క్రి. 1. మంత్రము చెప్పు.
2. సలహానిచ్చి తనకు వీలుగా మార్చుకొను.

బిసచెడు : దే. స. క్రి. యంత్రము చెడు.

బిసిపోవు దే. అ. క్రి. పట్టువదలు.

## బీ

బీజాపు : దే. స. క్రి. 1. ధాన్యాదులను పైకెగసన్రోయు.
2. గింజలను బైకెగద్రోసి మంచి వేర్పఱచు. (నె.జి.) చూ. బేజారు.

బీటగిల్లు : దే. అ. క్రి. పగులువాఱు.

బీటలువాఱు : }
బీటలువోవు : } దే. అ. క్రి. పగులువాఱు.

బీటువేయు : దే. అ. క్రి. బీటువాఱు. అన్యదే. పహారా కాచు.
బీడుపడు : దే. అ. క్రి. 1. పాడగు.
2. పనిలేకయుండు.
బీడుపెట్టు : దే. స. క్రి. 1. పాడుచేయు.
2. పంటచేలు పండింపక విడిచిపెట్టు.
బీతుకొను :
బీతువడు : } దే. అ. క్రి. భయపడు.
బీరముచెడు : దే. అ. క్రి. దర్పము నశించు.
బీరాజు : దే. స. క్రి. తుడిచి కుప్పచేయు.
బీఱువడు :
బీఱువాఱు :
బీఱవోవు : } దే. అ. క్రి. 1. వ్యర్థమగు.
2. బలహీనమగు.
బీఱుమాన్చు : దే. అ. క్రి. 1. బీరము మాన్చు.
2. నిబ్బరము పోగొట్టు.

## బు

బుకాయించు : దే. స. క్రి. అబద్ధమును నిజమని వాదించు.
బుక్కు : దే. స. క్రి. ఆబగా తిను. రూ. బొక్కు.
బుంగతేలు : దే. అ. క్రి. ఉబ్బు.
బుగబుగమను :
బుగబుగలాడు: } దే. అ. క్రి. 1. చితచితలాడు.
2. బుడగలెత్తు.
3. అధిక కోపమును ప్రదర్శించు.
బుగపెట్టు :
బుగ్గలించు : } దే. అ. క్రి. నీరు సానపెట్టి పాఱు.
బుగ్గరించు :
బుగ్గలించు : } దే. అ. క్రి. ఉబ్బు.
బుగ్గియగు : దే. అ. క్రి. బూడిదయగు.

బుగులుకొను : దే. అ. క్రి. 1. చిప్పిలు.
2. వ్యాపించు.
3. విజృంభించు.
రూ. గుబులుకొను.

బుగులుపుచ్చు : దే. స. క్రి. బయలుపఱచు.

బుగులువోవు : దే. అ. క్రి. బయలుపడు.

బుచ్చివాఱు : దే. అ. క్రి. చిన్నవోవు.

బుజయిడు : దే. అ. క్రి. 1. సున్నచుట్టు.
2. ముద్రించు.

"కొనొక్కటె దబ్బఱ
యని బుజయిడు పగిది నాభి యంగన కమరున్"
చంద్ర.

బుజుమువైచు : దే. అ. క్రి. ముద్రలు వేయు.

బుజ్జగించు : దే. స. క్రి. ఉపలాలించు.

బుజాఱుపొంగు : దే. అ. క్రి. ఉప్పొంగు.

బుట్టలోఁబెట్టు :
బుట్టలోవేసికొను : } దే. స. క్రి. వశముచేసికొను. (మనుజులను)

బుట్టదాఖలుచేయు : దే. స. క్రి. విన్నపమును విచారింపకపోవు.

బుడిబుడిదీర్ఘముదీయు : దే. అ. క్రి. ఏడుపు నభినయించు.

బుడిబుడిపోవు : దే. అ. క్రి. గుసగుసలాడు.

బుడివడు : దే. అ. క్రి. తొట్రుపడు.

బుడివుచ్చుపోవు: దే. అ. క్రి. గుసగుసలుపోవు.

బుడగించు : దే. అ. క్రి. పంది ముట్టెతో గోరాడు.

బుడ్డపొడుచు : దే. అ. క్రి. బుడగ లేర్పడు.

బుడ్డిబిగించు : దే. అ. క్రి. మద్యపానముచేయు.

బుద్ధిగడికఱచు:
బుద్ధిగడ్డితిను : } దే. అ. క్రి. 1. దురూహాలుసేయు.
2. కక్కుర్తిపాలగు.

బుద్ధిబూరెలుతిను : దే. అ. క్రి. పొరపాటుపడు.

బుద్ధిసేయు : దే స. క్రి. తలంచు.

"మాత్స్యపురమున దైన్యపడుట బుద్ధి సేయకు" భార. అశ్వ. 1. ఆ.

బుదుకరించు : దే. స. క్రి. బుజ్జగించు.

బురబురలాడు : దే. అ. క్రి. శైత్యాద్యులచేఁ బిల్లలకు లోంపపట్టు.

బురణించు : దే. స. క్రి. తిరస్కరించు.

బురిడీకొట్టు : దే. స. క్రి. 1. మోసముచేయు.
2. డంబములాడు.

బుఱ్ఱగోఁకికొను : దే. అ. క్రి. యోచన కుదురక ఆలోచించు.

బుఱ్ఱరామకీర్తనపాడు : దే. స. క్రి. తలపగులఁగొట్టు

బులిపించు : దే. స. క్రి. వ్యామోహపెట్టు.

బులియు : దే. అ. క్రి. సుఖపడు.

బుసకొట్టు : దే. అ. క్రి. 1. పాము రోషముతో నిశ్వసించు.
2. కోపపడు.

బుసబుసలాడు: దే. అ. క్రి. పొంగు

బుసిపోవు : దే. అ. క్రి. కొద్దిగా చెడిపోవు.

## బూ

బూకరించు : దే. స. క్రి. అబద్ధపుమాటను నిజమని సాధించిచెప్పు.

బూజుపట్టు : దే. అ. క్రి. 1. చెడిపోవు.
2. ప్రాతదగు.

బూజెక్కు : దే. అ. క్రి. బూజుపట్టు.

| | |
|---|---|
| బూదరిల్లు :<br>బూదరించు : | దే. అ. క్రి. ఒడలువాచు. |

బూదిచఱచు : దే. అ. క్రి. బూడిదపట్టు.

బూదువాఱు : దే. అ. క్రి. నూగుపాఱు.

బూరటించు: } దే. అ. క్రి. 1. నిండు.
బూరటిల్లు : 2. ఉబ్బు.
బూరటిలు :
బోకరించు : దే. స. క్రి. బూకరించు.

# బె

బెంగటిల్లు : దే. అ. క్రి. బెంగపడు.
బెండగిల్లు : దే. అ. క్రి. 1. పెల్లగిల్లు.
2. ప్రయాణమగు.
బెండాడు : దే. స. క్రి. 1. చెండాడు.
2. హింసించు.
బెండుపడు : } దే. అ. క్రి. 1. సారహీనమగు. ప్రే. బెండుపఱచు.
బెండువడు : 2. బరువులేక తేలిపోవు.
3. రుచి తప్పు.
బెంబేలుపెట్టు : దే. స. క్రి. ఎక్కువ మోసపుచ్చు.
బెకబెకలాడు : దే. అ. క్రి. కప్పలుకూయు.
బెకొట్టు : దే. అ. క్రి, 1. వాపోవు.
2. "బే" యను.
బెగడాయించు : దే. స. క్రి. విరోధించు. రూ. బిగడాయించు.
బెగడు :
బెగడొందు: } దే. అ. క్రి. భయపడు.
బెగడువడు:
బెగడిల్లు :
బెగ్గడిలు :
బెగ్గడు :
బెగ్గలించు : దే. అ. క్రి. 1. విహ్వాలించు.
2. భయపడు.

బెగ్గిల్లు : దే. అ. క్రి. 1. విహ్వాలించు.
2. భయపడు.
3. చింతించు.
4. చలించు.

బెట్టపడు : దే. అ. క్రి. 1. వడదెబ్బ తిను.
2. మనసులో విరాగము పొందు.

బెట్టించు : దే. స. క్రి. చిమ్ము.

బెట్టుచెడు : దే. అ. క్రి. 1. గౌరవము చెడు.
2. యంత్రపు కీళ్లు సడలు.

బెట్టుచేయు : దే. అ. క్రి. ఒకానొక యాధిక్యమును ప్రకటించు.

బెడఁకు :
బెళఁకు :
బెడంకు :
బెళంకు : దే. అ. క్రి. 1. చలించు.
2. తొలఁగు.

బెడఁగారు : దే. అ. క్రి. ప్రకాశించు.

బెడఁగు : దే. అ. క్రి. 1. అందగించు.
2. పాత్రాదికమును తోమి మెఱుఁగెక్కించు.
"కోర బెడంగనో" బసవ.

బెడఁగొందు : దే. అ. క్రి. అందగించు.

బెడవడు : దే. అ. క్రి. పశువు మందనుండి వేఱై తిరుగు. (నె. జి)

బెడాయించు :
బెడియు : దే. అ. క్రి. తప్పు.

బెడిసికొట్టు : దే. అ. క్రి. పథకము అనుకూలింపక పోవుటయే కాక ప్రతికూలించు. (కథ) అడ్డము తిరుగు.

బెడిసిపోవు : దే. అ. క్రి. వ్యవహారము చెడిపోవు.

బెణఁకు :<br>బెణుకు : } దే. అ. క్రి. మెడ మొ॥ చోట నరము చెదరు.

బెదరించు : దే. స. క్రి. భయపెట్టు.

బెదరుపడు :<br>బెదరిపోవు :<br>బెదరు : } దే. అ. క్రి. భయపడు.

బెరయించు : దే. స. క్రి. కలిగించు.

"అరుదారఁ గురియించి రమృతంపుసోన
బెరయించి మొరయించి పృథులదుందుభుల."
కు. పా.

బెరయు : దే. అ. క్రి. 1. కలుగు.
2. వ్యాపించు.
3. చేరు.

బెరసగు : దే. అ. క్రి. (పందెపుకోడివలె) శౌర్యముచూపు.

బెలయు :<br>బెలయించు: } దే. అ. క్రి. కలియు.

బెసుకు : దే. అ. క్రి. 1. వదులగు.
2. ఉన్నతస్థలమునుండి కొలఁదిగా చలించు.

బెళఁకు : దే. అ. క్రి. చలించు.

బెళగు : దే. అ. క్రి. తోము. బ. స.

బెళుకు : దే. అ. క్రి. తళతళలాడు.

# బే

బేజారెత్తు : దే. అ. క్రి. 1. గాబరాపడు.
2. భయపడు.

బేరమాడు : దే. స. క్రి. ధరలు తగ్గించి యడుగు.

బేరముచేయు : దే. స. క్రి. కొను.

బేరీజుచేయు :
బేరీజువ్రాయు: } దే. స. క్రి. 1. లెక్కగట్టు.
2. జమ ఖర్చులు వ్రాయు.
కళింగ. వా.

బేలుపడు:
బేలుపోవు: } దే. స. క్రి. మోసపోవు.

బేలువెట్టు : దే. స. క్రి. మోసముచేయు.

# బై

బైతాయించు : హిం. అ. క్రి. తిష్ఠవేయు.

బైలగు : ద్వ. అ. క్రి. బైలుపడు.

బైలుసేయు : దే. స. క్రి. బయలు వెట్టు.
"సభ బైలుసేసి ఒకరితో నొకరు
మాటలాడక గాలి మంద యెద్దులవలె
మారాజును తలచుకొంటూ."
రా. రం. వి.

బైసిమాలు : దే. అ. క్రి. 1. అపకీర్తిపాలగు.
2. సిగ్గుమాలు.

# బొ

బొంకు : దే. అ. క్రి. అబద్ధముచెప్పు.

బొంకులాడు : దే. అ. క్రి. అసత్యమాడు.

బొంకించు : దే. స. క్రి. (బొంకు ధా. ప్రే.) మోసపుచ్చు.

బొంగుబుజానవేసికొను: దే. అ. క్రి. ముష్టియెత్తుకొను, దైన్యపడు.

బొంగురువోవు : దే. అ. క్రి. గొంతు విస్వరమగు.

బొంతకుట్టు : దే. అ. క్రి. 1. చిరిగినబట్టలను ఒకచోఁజేర్చి చిరుగులు కనిపించకుండ పఱుపువలెఁగుట్టు.
2. స్వారికి జీను కుట్టు.

బొంతరేగు : దే. అ. క్రి. గుడ్డలోని దారములు సడలి పైకిలేచు.

బొంతరేగఁగొట్టు: దే. స. క్రి. మిక్కిలి తాడించు.

బొందుకట్టు : దే. అ. క్రి. 1. తాళిబొట్టు దారముకట్టు.
2. పరికిణీలు మొ॥ వానికి దారముతో బొందునల్లు.

బొందువోవు : దే. అ. క్రి. వరి వెన్నువదలువేళ చెడిపోవు. (పైరు.)

బొక్కపెట్టు : దే. స. క్రి. 1. ఎగవేయు.
2. పోగొట్టు.
3. వంచనసేయు.

బొక్కలువెదకు: దే. స. క్రి. రంధ్రాన్వేషణము సేయు.

బొక్కు:
బొక్కులాడు:
బొక్కలాడు : } దే. స, క్రి. 1. పిండివంటి పదార్థములను నోటఁబోసికొను.
2. పేరాసతోఁదిను.
3. తిను.

బొబ్బరించు : దే. అ. క్రి. పెద్దకేకలుపెట్టు.

బొబ్బలిడు : దే. అ. క్రి. కేకలుపెట్టు.
బొబ్బిడు : దే. అ. క్రి. 1. కేకపెట్టు.
2. వంతఁబొందు. అను. 124.
బొబ్బులువోడుచు : దే. అ. క్రి. సింహనాదములు సేయు.
బొమలుముడివేయు : దే. అ. క్రి. కోపమును ప్రకటించు.
బొమ్మరవోవు : దే. అ. క్రి భ్రమించు.
బొమ్మవెట్టు : దే. స. క్రి. 1. అవమానము చేయుటకై ప్రతికృతిని పెట్టు.
2. చేతఁబడిచేయు.
బొల్లు : దే. స. క్రి. అసత్యమాడు.

## బో

బోగిడుచు : దే. అ. క్రి. ఎండకు వానకు కొయ్య చెడి మెత్తనై పోవు. (నె.జి.)
బోటుచేయు : దే. స. క్రి. నేలను మిట్టగాచేయు.
బోడించు . దే. స. క్రి. తలగొఱిగించు.
బోడికొట్టు : దే. స. క్రి. తల శుభ్రముగా గొఱిగించు.
బోదేర్చు : దే. అ. క్రి పంట పోగా మిగిలిన పొలముః సందలి చెత్తను ఎరువుకై కాల్చు. రూ. పోదేర్చు.
బోధచేయు : } మి. స. క్రి. 1. పాఠముచెప్పు, కఱపు.
బోధించు : } 2. తెలియఁజేయు.
బోధపడు : మి. అ. క్రి. ఆకళింతకు వచ్చు.
బోనముపెట్టు : దే. అ. క్రి. మద్దెల కెడమవైపున నన్నమును బూడిదయుఁ గలిపి మెత్తు.
బోరగించు : దే. స. క్రి. బోరగిలఁజేయు.
బోరగిలు : } దే. అ. క్రి. మొగము నేల కానుకొనునట్లు పడు.
బోరగిల్లు : } రూ. బొర్లగిలబడు.

బోరచఱచు : దే. అ. క్రి. ఝొమ్మచేయు.

బోర్రత్రోసికొను: } దే. స క్రి. 1. అనుభవించలేక పాడుచేసికొను.
బోర్లదోసికొను : } 2. తనపైకిఁదానే తెచ్చుకొను.
అ. క్రి. 1. చతికిలఁబడు.
2. కార్యము చెడు.

బోరుకలుగు : } దే. అ. క్రి. మ్రోగు.
బోరుకొను :

బోరుకాడించు : } దే. స. క్రి. పిల్లలకు స్నానము చేయించు.
బోర్కాడించు:

బోరుకాడు : } దే. అ. క్రి. స్నానముచేయు.
బోర్కాడు :

బోసిపడు : } దే. అ. క్రి. దంతములు కాని చెవుల దుద్దులుకాని లేని ముఖముయొక్క శూన్యస్థితిగలుగు. (వృక్షాదులు కొట్టివేయఁబడినయిల్లు మొ॥ వానికిఁ గూడ నందురు)
బోసివోవు:

బోసేయు : దే. అ. క్రి. భుజించు. చూ. బోంచేయు.

# బౌ

బౌళివట్టు : దే. అ క్రి. ఒడలు మఱచు.
"పచ్చినెత్తురు ద్రావి బౌళివట్టుటయు రిచ్చపాటున సంచరించుచున్నాఁడు."
క. వ. రా. యుద్ధ కాం.

## బ్ర

బ్రతుకు : } దే. అ. క్రి. 1. జీవించు.
బ్రదుకు : } 2. ఆపదనుండి రక్షింపఁబడు.

బ్రమయించు దే. అ. క్రి. బ్రమించు. ప్రే.
"పగలెల్ల నాటల బ్రమయించుచును
సందుగొందులెల్ల నెఱింగికొనుచు."
ప్ర. ప్ర. 1 ఆ.

బ్రమయు : దే. అ. క్రి. భ్రమించు.

బ్రమరితిరుగు : దే. స. క్రి. చుట్టితిరుగు.

బ్రమరివాఱు : దే. స. క్రి. చుట్టితిరుగు.

బ్రమసివడు : దే. అ. క్రి. భయపడు.

బ్రాహ్మణార్థముసేయు: సం. స. క్రి. 1. పితృకార్యము జరిపించు.
భార. ఆది. 4 ఆ.
2. సుష్ఠుగా భోజనము చేయు.

## బ్రు

బ్రుంగు : దే. అ. క్రి. 1. పూడు.
2. మునుగు.

బ్రుంగుడువడు : దే. అ. క్రి. కష్టపడు.

బ్రుంగువడు : దే. అ. క్రి. మునుఁగు.

బ్రుంచు : దే. స. క్రి. 1. బ్రుంగఁజేయు.
2. పూడునట్లుగాఁజేయు.

బ్రుయ్యు : దే. అ. క్రి. నశించు.

# భ

భంగపడు : మి. స. క్రి. మోసపోవు.
భంగపెట్టు మి. స. క్రి. భంగపఱచు.
భంగించు : మి. స. క్రి. మోసపెట్టు.
భంజించు : మి. స. క్రి. విఱుచు.
భండించు : సం. స. క్రి. తిట్టు.
భక్షించు : సం. స. క్రి. తిను.
భగభగలాడు : దే. అ. క్రి. 1. భగభగమని మండు.
2. మిక్కిలి కోపము గలుగు.
భజించు : సం. స. క్రి. సేవించు.
భటీవేయించు :
భట్టీయంవేయించు: } దే. స. క్రి. వల్లెవేయించు.
భద్రపడు. సం. అ. క్రి. జాగ్రత్తగా నుండు.
భద్రపఱచు : సం. స. క్రి. జాగ్రత్త చేయు.
భద్రవెట్టు : సం. స. క్రి. జాగ్రత్త పెట్టు.
భద్రాకరించు : సం. స. క్రి. ముండనముచేయు.
భయంపడు : సం. అ. క్రి. భయపడు.
భరపడు :
భరంపడు : } సం. అ. క్రి. శ్రమపడు.
భరవసాచెప్పు : హిం. అ. క్రి. ధైర్యముచెప్పు. కళింగ. వా.
భరాయించు : వై. స. క్రి. వహించు.
భరించు. అంబావివాహము.
భరించు : సం. స. క్రి. 1. మోయు.
2. రక్షించు.
3. వ్యయము నంగీకరించి వెచ్చపెట్టు.
(నె. జి.)

భర్జించు : సం. స. క్రి. బెదరించు.
భర్తిచేయు : నై. స. క్రి. పూర్తిచేయు.
భర్త్సించు : సం. స. క్రి. నిందించు.
భస్మీకరించు : సం. స. క్రి. 1. బూడిదచేయు.
2. దుమ్ముచేయు.

## భా

భాంకరించు : సం. అ. క్రి. 1. భేరీ మొ॥ ధ్వనిసేయు.
2. సింహనాదము సేయు.
భాగించు : సం. స. క్రి. విభజించు.
భాతియగు : మి. అ. క్రి. 1. ప్రకాశించు.
2. సమానమగు.
భావించు : సం. స. క్రి. తలంచు.
భాషించు : సం. స. క్రి. మాటలాడు.
భాసిల్లు : సం. అ. క్రి. ప్రకాశించు.

## భి

భిక్షించు : సం. స. క్రి. యాచించు.

## భీ

భీతిల్లు : సం. అ. క్రి. భయపడు.
భీతుగొను: నై. అ. క్రి. భయపడు.
భీష్మించు : సం. అ. క్రి. పట్టుపట్టి కూర్చుండు.

## భు

భుజించు : సం. స. క్రి. 1. తిను.
2. అనుభవించు.
"సవిహారకుమారవిజయము."

## భూ

భూషించు :    సం. స. క్రి. స్తుతించు.

## భే

భేటిసేయు :    దే. స. క్రి. 1. సందర్శించు.
2. సముఖముసేయు.
(శాహామహారాజు కల్యాణము.)

భేటీసేయించు :    దే. స. క్రి. సమావేశపఱచు.
"నేవచ్చినపుడే సగుణుఁడై యే
వుండుననుమాట మందలించి భేటీ
సేయించవోయి."

భేదించు :    సం. స. క్రి. చీల్చు.

భేదిల్లు : }
భేదిలు : }    సం. అ. క్రి. చీలు.

## భో

భోగించు :    దే. స. క్రి. అనుభవించు.

భోరుకొల్పు :    దే. అ. క్రి. మ్రోతకల్పించు.

భోసేయు :    వై. అ. క్రి. భోజనముసేయు.

## భ్ర

భ్రమపుట్టు :    మి. అ. క్రి. కోరికపుట్టు.
"పువ్విలుకాని కైన భ్రమపుట్టుగదే
భువనైక మోహినీ."    ఉ.రా.

భ్రమరించు :    సం. అ. క్రి. తిరుగు.

భ్రమలఁబెట్టు : సం. స. క్రి. భిన్నముగాఁదోపఁజేయు.
భ్రమించు:
భ్రమియించు: } సం. అ. క్రి. 1. తిరుగు.
2. పరిభ్రమించు.
స. క్రి. 1. ఆశపెట్టు.
2. భ్రమపెట్టు.
"మాటనేర్పున భ్రమించు ననున్"
జాహ్నవి.4.
3. భ్రాంతిపొందు.
భ్రష్టమగు :
భ్రష్టగు : } సం. అ. క్రి. చెడిపోవు

# భ్రా

భ్రాజిల్లు : సం. అ. క్రి. ప్రకాశించు.
భ్రాంతిపఱచు : సం. అ. క్రి. భ్రాంతిపడఁజేయు.

# మం

మంకుచేయు : దే. అ. క్రి. పట్టుపట్టు.
మంకుపట్టుపట్టు : దే. అ. క్రి. మొండికివేయు.
మంగు : దే. అ. క్రి. మాఁగు.
మంగుబాఱు : దే. అ. క్రి. వ్యాధిచే ముఖముమీఁదమచ్చలేర్పడు.
రూ. బంగుబాఱు (తెలం)
మంచమునేయు : దే. అ. క్రి. వ్యాధిగ్రస్తుఁడగు.
రూ. 1. మంచమెక్కు.
2. మంచముపట్టు.
3. మంచానఁబడు.
మంచమువేయు : దే. అ. క్రి. లంజతికముచేయు.

మంచిచేసికొను : దే. స. క్రి. 1 స్నేహము చేసికొను.
2. అనుకూల పఱచుకొను.

మంచిమాటచేసికొను: దే. అ. క్రి. అన్నముతిను.
స. క్రి. అనుకూలము చేసికొను.

మంచు : దే. స. క్రి. రక్షించు. రూ. మనుచు.

మంచెపెట్టు : దే. స. క్రి. 1. చేనికి కాపుంచు.
2. కాయలు పండుటకు గడ్డివేయు.

మంజూరుచేయు: అన్య. దే. అ. క్రి. 1. అనుమతియిచ్చు.
2. అంగీకారము తెల్పు.

మంటగలుపు : దే. స. క్రి. నాశముచేయు.

మండాడు : దే. స. క్రి. దైన్యముతో యాచించు.
''వలదని కేల్వట్టి వారించి చనవు
గలయట్టి దేవతాకామిను లెల్ల
మండాడుటయు వారి మనవియాలించి.'
క. వ. రా. సుందర.

మండిపడు : దే. అ. క్రి. కోపగించు.

మండిపోవు : దే. అ. క్రి. 1. జ్వలించు.
2. కోపాదులచే దహించు.
3. ధర లెక్కువగు.

మండు : దే. అ. క్రి. జ్వలించు, కోపాదులచే జ్వలించు.

మండెకట్టు :
మండెదింపు : } దే. స. క్రి. క్రొత్తగాఁ ద్రవ్వవలసిన బావిలో ఒరలకు ముందుగా త్రాటితోఁజుట్టిన గుండ్రని వస్తువు నేర్పఱచు.

మండెవేయు : దే. స. క్రి. పొగాకు మొ॥ త్రొక్కుటకు గుట్టవేయు.

మండెవేసిపొడుచు: దే. స. క్రి. దొంతరగాఁబెట్టి బల్లెముతోఁ గ్రుచ్చు.

మంతఖానికొట్టు: దే. అ. క్రి. ముచ్చటలు చెప్పు.

మంతరించు : దే. అ. క్రి. 1. ఉపాయము చెప్పు.
2. సలహాచెప్పు. (తెలం)

మంతుకెక్కు : దే. అ. క్రి. ప్రసిద్ధికెక్కు.

మంత్రాంగముచేయు: మి. అ. క్రి. కూడుపుఠాణి చేయు.

మంత్రించు :
మంతిరించు : } సం. అ. క్రి. మంత్రముపెట్టు.

మందగట్టు : దే. స. క్రి. పశువులను చేలలో పెంటగట్టించు.

మందగించు : దే. అ. క్రి. 1. ఆఁకలితగ్గు
2. మందమగు.

మందగొను . దే. అ. క్రి. గుంపుగూడు.

మందటలాడు : దే. అ. క్రి. తగవులాడు.
స. క్రి. ఎదిరించు, త్రిప్పు.

మందటిల్లు : దే. అ. క్రి. అణగు.

మందడిగొను : దే. స. క్రి. గుఱ్ఱమును లాయమునఁగట్టు.

మందరముసేయు: దే. స. క్రి. దహించు.

మందలచెప్పు : దే. స. క్రి. పని వైనము చెప్పు.

మందలయుండు ; దే. స. క్రి. పనిచేయుస్థలమున ఉండి పరిశీలించు.

మందలించు : దే. స. క్రి. 1. చెప్పు.
2. ఆజ్ఞాపించు.
3. హెచ్చరించు.
4. హితోపదేశముచేయు.
5. సమానముగఁ జాటించు.
"ముక్తాఫలమ్ముల మందలింతురు కురువింద లట్లు" కాళహస్తి.3 ఆ
6. ఒకరు చనిపోయినపుడు వారి యింటివారిని పరామర్శించు.

మందీకరించు : సం. అ. క్రి. స్తబ్ధమగు.

మందీభవించు : సం. అ. క్రి. మందమగు.

మందుపెట్టు : దే. స. క్రి. మరులుకొనుటకు దుష్టవస్తువులు తినిపించు.

మంపిల్లు :
మంపుగొను: } దే. అ. క్రి. అతిశయించు.

"పంపాతరంగిణీప్రాంతపుకానలకు
మంపిల్లఁదొడఁగె నెమ్మది లోన భీతి"
క.వ.రా. అరణ్య.

మంబరము సేయు : దే. స. క్రి. దహించు.

మకమకలాడు : దే. అ. క్రి. కాంతిహీనమగు.

మక్కజేయు : దే. స. క్రి. కాంతి పోగొట్టు.

మక్కళించు : దే. స. క్రి. 1. ఉబ్బించు.
2. సరిపఱచు.
రూ. మక్కడించు.

మక్కించు : దే. స. క్రి. మక్కెలు విఱుగఁదన్ను.

మకుక : దే. అ. క్రి. 1. కాంతిహీనమగు.
2. నవయు.
3. చచ్చు. (తెలం.)
4. ఫలించు.
5. పక్వమగు.

మకుకవచేయు : దే. స. క్రి. ప్రేమించు.

మకుకడుపట్టు : దే. అ. క్రి. కాంతిహీన మగు.

మకుకపెట్టు : దే. స. క్రి. కొయ్యలయం దెసము పూయుచుట కొరక ద్రవ్యమును మప్పు.

మకుకమాపు :
మకుకమారుచు: } దే. స. క్రి. పీచమణఁచు.

'కాకకాఁ గొనక నిలింపులఁబట్టి
మకుకమారుచు దైత్యమండలి గలిగి
యాలంకనెప్పు'. క.వ.రా. కిష్కింధ.

మకెక్కక్కు : దే. అ. క్రి. ముడికియగు.

మగుడఁబడు :
మగుడు : } దే. అ. క్రి. వెనుకకుఁ దిరుగు.

మగుడుచు : దే. స. క్రి. వెనుకకుఁ ద్రిప్పు.
మగ్గు : దే. అ. క్రి. వేడికి మెత్తపడు. గూ. మ్రగ్గు.
మగ్గుడుపాఱు : దే. అ. క్రి. మగ్గు.
మచ్చఁగట్టు: దే. స. క్రి. మచ్చరించు.

"కూరిమిఁ గొసరుచుఁ గోలి చెదననుచు
మచ్చగట్టెడి వీఁడు మాయావిచేత
నిచ్చిన మనలోన నెవ్వరినైనఁ
దలమానిసిని జంపి దాటిపోవంగ."

క. వ. రా. యుద్ధ.

మచ్చమాపు : దే. స. క్రి 1. పొగరణచు.
2. అపకీర్తి తొలగించు.
మచ్చయిడు : దే. స. క్రి. కళంక మాపాదించు.
మచ్చరించు : } దే. అ. క్రి. చలము పట్టు.
మచ్చరికించు: } స. క్రి. స్పర్ధించు.
మచ్చికపడు : దే. అ. క్రి. 1. చనవు వృద్ధినొందు.
2. పురుషుడు స్త్రీయందు తగులుపడు.
మచ్చిర్కచేయు: దే అ. క్రి. 1. ఆకర్షించు.
2. అతిగా లోఁబఱచుకొను.
మచ్చుచల్లు : దే. అ. క్రి. మచ్చుమందుచల్లు.
మజ్జనమార్చు : మి. స. క్రి. స్నానముచేయించు.
మటమటలాడు : దే. అ. క్రి. 1. ఇతరులయం దీర్ష్యాదులచేత మొగమువికారమగు.
2. కోపమును వెలిగ్రక్కు.
మటుమాయమగు: దే. అ. క్రి. కన్పడకుండఁబోవు.
మటుమాయలుచేయు: దే. స. క్రి. మోసముచేయు.
మట్టగించు : దే. స. క్రి. 1. బురదను కాళ్ళతోఁద్రొక్కు.
2. తగ్గించు.
అ. క్రి. వ్యవహారము తగ్గు.

మట్టముచేయు : దే. స. క్రి. 1. ఎత్తు సమానముచేయు.
ఉదా: ఇల్లు కిటికీల మట్ట మయినది.
2. నాశనముచేయు.
ఉదా: నేలమట్టమయినది.
మట్టసముచేయు: దే. స. క్రి. 1. పొదుపుచేయు.
2. నాశముచేయు.
మట్టాడు : దే. అ. క్రి. 1. సంచలించు.
2. వ్యాపించు.
మట్టిమల్లాడు : దే. అ. క్రి. మిక్కిలి పెనఁగు.
మట్టు : దే. స. క్రి. త్రొక్కు.
మట్టుకట్టు : దే. అ. క్రి. పునాది వేయు.
స. క్రి. వహించు.

"మాకు నాశాస్యమైన
యట్టి కార్యము సేయు మవనిభారంబు
మట్టుకట్టితి వసమాన శౌర్యమున."
క. వ రా. యుద్ధ.

మట్టుకొను : దే. అ. క్రి. కుదుకుకొను.
మట్టుచేయు : దే. స. క్రి. తగ్గించు.
మట్టుపడు : దే. స. క్రి. కుదురుపడు.
మట్టుపఱచు : దే. స. క్రి. మట్టుపడు ధా. ప్రే.
మట్టుమల్లాడు : దే. అ. క్రి. యథేచ్ఛముగ తిరుగు.

"చాల చౌకళింపుచును మందలోనఁ
జాల మట్టుమల్లాడె." కా. క.

మట్టుమీఱు : ద్వ. స. క్రి. అతిక్రమించు.
మట్టువెట్టు : దే. స. క్రి. (మట్టు + పెట్టు) చంపు.
మడఁగు : } దే. అ. క్రి. 1. వంగు.
మణఁగు : } 2. మఱలు.
ప్రే. మడఁచు, మణఁచు.

మడచు : దే. స. క్రి. మణంగఁజేయు.
మడత్రొక్కు : దే. స. క్రి. తాటియాకులు మణగునట్లు త్రొక్కు.
మడమతిరుగు : దే. అ. క్రి. వెనుదిరుగు.
మడమలుద్రొక్కు: దే. స. క్రి. త్వరపెట్టు.
అ. క్రి. గోతులుత్రవ్వు. (తూ.గో.)
మడవవేయు : దే. అ. క్రి. మడికి నీరుకట్టు.
మడవు . దే అ. క్రి. 1. విముఖుడగు, నిష్ఫలమగు.
మడికట్టుకొను : దే. అ. క్రి. దేవపూజాదులకొఱకు ఉదికిన దోవతులు కట్టుకొను.
మడిమంచగు : దే. అ. క్రి. హీనమగు.
మడియు : దే. అ. క్రి. చచ్చు.
మడ్డివెట్టు : దే. స. క్రి. పశువులకు రోగనివృత్తికై మడ్డికూడుపెట్టు.
మడుగు : దే. అ. క్రి. 1. అడఁగు. 2. వంగు.
ప్రే. మడుచు, మణుచు. రూ. మడువు, మడ్గు.
మడుగుమడుగుచేయు: } దే. అ. క్రి. బురద బురదచేయు.
మడ్గుమడ్గుచేయు: } నీళ్ళు నిలుచునట్లు చేయు.
మణాయించు : దే. స. క్రి. సంతరించు.
"ఈరీతి పేరోలగంబుండి రాణువ
కార్యంబులు మణాయించి" రఘు.నా.
మతలబుచెప్పు : దే. అ. క్రి. సంగతిచెప్పు.
మతించు : సం. స. క్రి. విచారించు.
రూ. మతియించు.
మతిగొల్పు : సం. స. క్రి. మతిగొను ధా. ప్రే.
మత్తాగొను : } దే. అ. క్రి. మత్తుగొను.
మత్తాయిగొను: }
మత్తుగొను : దే. అ. క్రి. 1. మథనపడు.
2. లోలోన గుబ్బిసలాడు.
3. తెలివితప్పు.

మథనపడు సం. అ. క్రి. మానసికముగ సంకటపడు,
ఆందోళనమొందు.

మథించు : సం. స. క్రి. 1. మథనముచేయు.
2. త్రచ్చు.

మదమడఁచు : మి. స. క్రి. చంపు.

మద్దటిల్లు : దే. అ. క్రి. వేడిచల్లారు.

మద్దతుసేయు : } దే. స. క్రి. ఆసరాయిచ్చు. ల. నా. వి.
మద్దతిచ్చు : }

మదించు : సం. అ. క్రి. పొగరెక్కు.

మదింపుకట్టు : దే. స. క్రి. వెల నిర్ణయించు.

మదింపుచేయు : దే. స. క్రి. వెలకట్టు.

మదుపుచేయు : దే. స. క్రి. బంగారులో రాగి కలుపు.

మదురంగఁబండు: దే. అ. క్రి. మగ్గఁబండు.

మదురు : దే. అ. క్రి. కమియు.

మనమువడయు: దే. అ. క్రి. మెప్పునొందు.

మనసగు : } దే. అ. క్రి. 1. నచ్చు.
మనసుంచు: } 2. కోరికపుట్టు.
3. శ్రద్ధపూను.
స. క్రి. 1. విను.
2. చిత్తగించు.
3. మనస్సును లగ్నముచేయు.

మనస్కరించు: దే. అ. క్రి. మగ్గఁబండు, ఇష్టమగు.

మనసువిఱుగు : దే. అ. క్రి. ప్రీతి నశించు.

మనాయించు : దే. స. క్రి. లక్ష్యపెట్టు.

మనికితపడు : దే. అ. క్రి. 1. దుఃఖపడు.
2. కలఁతపడు.
"మనలోన ఏమైన మనికిత మొస్తేను
నాప్రేటు లన్నిటిని నీవే తిను.
ఉషా.
"పరానీకానుల్ మనికితపడఁగా"
సమీరకుమార విజయము.

మను : దే. అ. క్రి. బ్రదుకు.

మనుఁగు : దే. అ. క్రి. చచ్చు.

మనుచు : దే. స. క్రి. రక్షించు. ప్రే. మనుపు.

మనువు : దే. అ. క్రి. చచ్చు.

మన్నించు : దే. స. క్రి. 1. గౌరవించు.
2. క్షమించు.

మన్నిగొను : దే. స. క్రి. 1. చంపు.
2. బందిగొను.

మన్ను : దే. అ. క్రి. 1. వస్త్రాదులు చాలకాలము చినిఁగిపోకుండు.
2. బ్రదుకు.

మన్నుచేయు : దే. స. క్రి. 1. అగ్ని సంస్కారముచేయు.
2. మట్టిలోఁగలుపు.
3. (తర్జనార్థమున) నాశముచేయుదునని బెదరించు.

మప్పు : దే. స. క్రి. 1. కన్నుఁబ్రాము.
2. నేర్పు.

మబ్బుకొను : దే. అ. క్రి. మదించు.

మబ్బుఁబడు : దే. అ. క్రి. మేఘచ్ఛన్నమగు.

మభ్యపెట్టు : దే. స. క్రి. కన్నుబ్రాము.

మయికొను : దే. స. క్రి. సమ్మతించు. రూ. మేకొను, మైకొను.

మరఁగు : దే. స. క్రి. 1. అంటఁబ్రాఁగు.
2. తగులము నొందించుకొను.
అ. క్రి. సలసలఁగ్రాఁగు, రూ. మరుగు, మఱగు.

మరణించు : సం. అ. క్రి. చచ్చు.

మరపు : దే. స. క్రి. 1. అలవాటుచేయు.
'మరపవచ్చుఁగాని మాన్పలేము.
2. కోడెదూడను కాడికి అలవాటు చేయు.
3. మరగఁజేయు, మరగించు.

మరలఁబడు : దే. అ. క్రి. మఱలు.

మరలఁబాఱు : దే. స. క్రి. మఱలించు.

మరలు : దే. అ. క్రి. 1. తిరుగు.
2. నివర్తిల్లు.
3. వెనుకకుఁదిరుగు.

మరలుచు : దే. స. క్రి. మరలఁజేయు. రూ. మరల్చు.

మరించు : సం. అ. క్రి. మరణించు.

మరులుకొను: }
మరులొకొను: } దే. స. క్రి. అధికముగా వలచు.
మరులెత్తు : }

మర్దించు : సం. స. క్రి. 1. కొట్టు.
2. సంవాహనముచేయు.

మర్మమెత్తు : దే. స. క్రి. ఊటాడు.

మఱచు : దే. స. క్రి. విస్మరించు.

మఱపడు : దే. అ. క్రి. విస్మృతమగు.

మఱలు : దే. అ. క్రి. వెనుదిరిగిపోవు.

# లై

లైచేయు : అన్య. దే. స. క్రి. 1. ముద్దచేయు.
2. పలుచగాచేయు. (తెలం)

# లొ

లొంగదీయు : దే. స. క్రి. 1. స్వాధీనమునకుఁదెచ్చు.
2. లొంగునట్లుచేయు.

లొంగు : దే. అ. క్రి. 1. లోకువగు.
2 వెనుదీయు.
3. స్వాధీనమగు. (రూ.) లొగ్గు.

లొగ్గడిలఁజేయు: దే. స. క్రి. 1. కలగుండుపడఁజేయు.
2. లోఁబడునట్లుచేయు.
పల్నా. [బ్రా.]

లొగ్గడిల్లు : దే. అ. క్రి. 1. కలగుండుపడు.
2. క్షోభించు.

లొచ్చగు : దే. అ. క్రి. 1. తీసిపోవు.
2. తక్కువయగు.

లొచ్చుపడు : దే. అ. క్రి. తక్కువపడు.

లొటలొటమను : దే. అ. క్రి. లొటలొటమని ధ్వనించు.
రూ. లొటలొటలాడు.

లొట్టపడు : దే. అ. క్రి. పాత్రాదికము దెబ్బతగిలి నిమ్నమగు.

లొట్టపోవు : దే. అ. క్రి. 1. అణఁగు.
2. పల్లమగు.
3. చిదుకు.
[వాని కన్ను లొట్టపోయినది.]

లొట్టవేయు : దే. అ. క్రి. రుచిగల పదార్థములను తినునప్పుడు నాలుకను అంగిటఁజేర్చి ధ్వనిపుట్టించు.
లొడపెట్టు : దే. స. క్రి. ద్రవద్రవ్యమును చేతఁగలియఁబెట్టు. రూ. లొడుపు.
లొడలొడమను: దే. అ. క్రి. 1. వదలు.
2. నీళ్ళు మున్నగునవి కాలుట యందగు ధ్వని చేయు.
లొడారించు : దే. అ. క్రి. తెగవాగు.
లొడుపుకొను : దే. స. క్రి. పరద్రవ్య మపహరించు.
లొల్లిపెట్టు : దే. స. క్రి. అల్లరిచేయు.
లొప్పు : దే. అ. క్రి. మొఱుగు.

## లో

లోంగొను : దే. స. క్రి. స్వాధీనము చేసికొను. రూ. లోఁగొను.
లోఁగు : దే. అ. క్రి. 1. లొంగు.
2. అడఁగు.
3. వెనుదీయు.
స. క్రి. చొచ్చు.
లోఁగొను : దే. స. క్రి. 1. లోపల నణఁచుకొను.
2. స్వాధీనపఱచుకొను.
లోఁచు : దే. స. క్రి. 1. లొంగఁజేయు.
2. ఆచుకొను.
లోఁడు : దే. స. క్రి. 1. వ్రేలులోనగు వానితో కెళ్ళగించు.
2. ప్రాఁతవిషయములను పెల్లగించు.
లోఁబడు : దే. అ. క్రి. అధీనమగు.
లోకువకట్టు : దే. స. క్రి. తక్కువపఱచు.

లోకువచేయు : దే. స. క్రి. తక్కువచేయు.
లోటగు : దే. అ. క్రి. 1. లోకువయగు.
2. తక్కువయగు.
లోటు : దే. అ. క్రి. ఇంటిపను లన్నియుఁ జేయు.
లోటుపడు : దే. అ. క్రి. 1. నష్టియగు.
2. లోపముగు.
చూ. లోటుపోవు; లోటగు.
లోతుదెలియు : దే. అ. క్రి. అభిప్రాయము తెలిసికొను.
లోనగు : దే. అ. క్రి. వశమగు.
లోపముచేయు : వి. స. క్రి. 1. తక్కువచేయు.
2. చులుకనచేయు.
లోపించు : దే. అ. క్రి. 1. మఱుఁగుపడు
2. తక్కువపడు.
లోపు : దే. స. క్రి. బాగుగా కలియునట్లు కలుపు [తెలం.]
లోయు : దే. అ. క్రి. కొండ మున్నగునవి పగులు.
[కృ. లోయ]
లోలమగు : దే. అ. క్రి. తగులమగు.
లోలాయపడు : సం. అ. క్రి. శ్రమపడు.
లోలాయమానమగు: సం. అ. క్రి. మిక్కిలి చలించు.
లోలాయిపడు : } దే. అ. క్రి. 1. పనిలేక సోమరిగాఁ ద్రిమ్మరు.
లోలాయిలుపడు: } 2. శ్రమించు.
లోవు : దే. అ. క్రి. లోఁగు [చూ]

# వ

వంకబెట్టు : దే. అ. క్రి. 1. లేనితప్పు చూపు.
2. నెపముపెట్టు.

వంకలుదిద్దు ; దే. స. క్రి. 1. సరిచేయు.
2. బాగుపఱచు.
3. సంస్కరించు.

వంకలుదీర్చు :
వంకలొత్తు : } దే. అ. క్రి. వంకలుదిద్దు.

వంకవోవు : దే. అ. క్రి. వంకరపోవు, వంకరయగు.

వంగఁదీయు : దే. స. క్రి. 1. వంచు.
2. గర్వమడచు.
3. త్రోవకుఁదెచ్చు.
4. లోఁబఱచుకొను.

వంగు : దే. అ. క్రి. 1. వ్రాలు.
2. అణఁగియుండు.

వంచాడించు : దే. అ. క్రి. బెదరు, సంకోచించు.

వంచించు : దే. స. క్రి. 1. వంచనసేయు.

వంచు : దే. స. క్రి. 1. వంగు. ప్రే. వంగఁజేయు.
2. మోసపుచ్చు.

వంచుకొను : దే. స. క్రి. వంగఁదీసికొను.

వంచోడించు : దే. స. క్రి. దయతోఁ జూపించు.

వంజువాఱు : దే. అ. క్రి. గొడ్డువాఱు.

వండు : దే. స. క్రి. పచనముచేయు.

వంతదీయు : దే. స. క్రి. ఆసతోఁ జూచు.

వంతపడు : దే. అ. క్రి. బాధపొందు.

వంతపాడు : దే. అ. క్రి. 1. ఒకనివెనుక మఱియొకడు హాంగుగా పాటపాడు.
2. ప్రాపగు.
3. మద్దతుచేయు.

వంతపొందు : దే. అ. క్రి. వంతపడు.

వంతుకువచ్చు : దే. అ. క్రి. 1. సాటికివచ్చు.
2. పోటీకివచ్చు.

వంతుకెక్కు : దే. అ. క్రి. ప్రసిద్ధికొందు.

వంతునకువచ్చు : దే. అ. క్రి. వంతుకువచ్చు.

వంతుపెట్టు : దే. అ. క్రి. 1. కూలిపెట్టు.
2. భాగముపెట్టు.

వంతులుపెట్టుకొను : దే. అ. క్రి. 1. పని భాగించుకొను
2. పట్టుదలచూపి కలహించు.
3. వంతులువేసికొను.
చూ. వంతులుపోవు.

వందఅలాడు : దే. స. క్రి. ఖండించు.

వందలాడు : దే. స. క్రి. చెల్లాచెదరుచేయు.

వందించు : సం. స. క్రి. స్తుతించు.

వందు : దే. అ. క్రి. సంతాపించు.

వకీలొనరించు . అన్య. దే. అ. క్రి. మఱియొకరికొఱకు మాటాడు.

వక్కణించు : దే. స. క్రి. 1. వచించు.
2. వ్యాఖ్యానించు.
చూ. వక్కాణించు.

వక్కరించు : } దే. అ. క్రి. 1. తిరుగబడు.
వక్కలించు : } 2. మాఱుమలయు.

వక్కాణించు : దే. స. క్రి. 1. వ్యాఖ్యానముచేయు.
2. వాక్రుచ్చు.

వక్కు : దే. అ. క్రి. 1. బక్కటిల్లు.
2. కృశించు.

వక్రించు : సం. అ. క్రి. 1. మఱలు.
2. మఱలంబడు.
3. విషమించు.
4. భేదించు.

వగచు : దే. అ. క్రి. 1. శోకించు.
2. పశ్చాత్తాపపడు.
3. దుఃఖించు.
4. ఆలోచించు.
5. తలంచు.

వగతెంచు : దే అ. క్రి. వగను తెగజేయు.
స. క్రి. పరిష్కరించు.

వగదెగు : దే. అ. క్రి. పరిష్కృతమగు.

వగపుచు (ర్చు): దే. అ. క్రి. నిట్టూర్చు.

వగలించు : దే. అ. క్రి వగలుచూపు.

............రఘురామునివంటి
జగదేకసౌందర్యశాలినిజూచి
వగలింపుచును దాను వలచితి ననుచు.
క. న. రా. యుద్ధ.

వచించు : సం. స. క్రి. మాటలాడు.

వచ్చందాలుపోవు: దే. అ. క్రి. సంతసులుపెట్టుకొను.
వాడని వీడు, వీడనివాడు పనిచేయు
కుండు.

వచ్చు : దే. అ. క్రి. 1. దగ్గరపడు.
2. చనుదెంచు.

వటవటపడు : దే. అ. క్రి. దుఃఖించు.

వటించు : దే. అ. క్రి. వస్తుండు.

వట్టకొట్టు : దే. స. క్రి. 1. విచ్చలుకొట్టు. (వృషభాదులకు.)
2. కాలుబట్టు.

వట్టిపోవు : దే. అ. క్రి. 1. పశువులు పాలీయకపోవు.
2. ఇంకు.

వట్టు : దే. అ. క్రి. 1. ఇంకు.
2. కృశించు. (నీరు వట్టినది.)

వట్రపడు : దే. అ. క్రి. 1. తగ్గు.
2. గుండ్రమగు.

వట్రపెట్టు : దే. స. క్రి. 1. తక్కువపఱచు.
2. లక్ష్యపెట్టు.

వట్రించు : దే. అ. క్రి. 1. తిరుగు.
2. పరాఙ్ముఖమగు.

వట్రిలు(ల్లు) దే. అ క్రి 1. ప్రవర్తిల్లు.
2. తిరుగు.
3. కలుగు.

వడఁకాడు : దే. అ. క్రి. కంపించు.

వడఁకు : దే. స. క్రి. 1. నూలుతీయు.
2. డబ్బు రాఁబట్టుకొను.
అ. క్రి. కంపించు.
రూ. వణఁకు.

వడఁకుపడు : దే. అ. క్రి. భయపడు. (తెలం.)

వడఁగట్టు : దే. స. క్రి. నీరు లేకుండఁజేయు.

వడఁగొను : దే. అ. క్రి. 1. తాపమునొందు.
2. ఎండదెబ్బ తగులు.
రూ. వడఁగొట్టు.

వడఁబోయు : దే. స. క్రి. వడిగట్టు.
వడచు : దే. స. క్రి. 1. పోయు.
2. కాల్చు. (బియ్యము వడగట్టు.)
వడపోయు : దే. స. క్రి. శోధించు.
వడలు : దే. అ. క్రి. పుష్పాదులు వాడు.
వడవేయు : దే. స. క్రి. గట్టిగా మెలివేయు.
వడికొను : దే. అ. క్రి. వేగము నందు.
ప్రే. వడికొలుపు.
వడిగట్టు : దే. స. క్రి. పాత్రము నోటికి గుడ్డకట్టి నీళ్ళలోనగు వానిని వడబోయు.
వడిగొను : దే. అ. క్రి. 1. మెలిపడు.
2. వేగము కలుగు. ప్రే. వడిగొలుపు.
వడితిరుగు : దే. అ. క్రి. మెలికలు తిరుగు.
వడిపించు : దే. స. క్రి. 1. కాఁజేయు.
2. పూర్తిగా అయిపోవునట్లు చేయు.
వడిపెట్టు : దే. స. క్రి. మెలిపెట్టు.
వడిఁబెట్టు : దే. స. క్రి. 1. వడిఁగట్టు.
2. శోధించు.
3. కోపము కలిగించు. (తెలం)
వడియఁగట్టు : దే. స. క్రి. వడిగట్టు.
వడియఁబోయు : దే. స. క్రి. వడిగట్టు.
వడివేయు : దే. అ. క్రి. 1. మెలిపెట్టు.
2. జందెములు వడివేయు.
వడుకు : దే. స. క్రి. కదురు లోనగువానిని త్రిప్పి దూదిగా నూలుగా దీయు. (రాట్నము)
వడుగు : దే. అ. క్రి. కాంతిమాయు.
వడుచు : దే. స. క్రి. వడియు ధా. ప్రే.

వడుసుపోవు : దే. అ. క్రి. వస్త్రాదులు జల్లివడు.

వడ్డించు : దే. స. క్రి. వడ్డనచేయు.

వడ్డికెక్కు : దే. అ. క్రి. అధికమగు. రాధికా. 1 ఆ.

వతనుపెట్టు : దే. స. క్రి. వాడుకపెట్టు.

వత్తాసగు : దే. అ. క్రి. మద్దతగు.

వదరు : దే. అ. క్రి. 1. అదరు
2. వ్యర్థపు మాటలాడు.

వదలించు : దే. స. క్రి. 1. తగ్గించు. ప. వీ.
2. డబ్బురాబట్టు. (తెలం.)
3. తన్ను విడుచునట్లు చేయు. (తెలం)
4. విముక్తి నొందించు.

వదలించుకొను : దే. అ. క్రి. అనిష్టమునుండి విముక్తుడగు.
రూ. వదలించుకొను.

వదలు : దే. అ. క్రి. 1. ఊడు.
2. వీడు.
స. క్రి. విడుచు.
ఉదా: అరటిమొక్క పూవు వదలెను,

వదవదలాడు : దే. అ. క్రి. 1. చలితో వణకు
2. బాగుగా మాగినపండ్లు మెత్తనగు.

వదిగొను : దే. అ. క్రి. చెప్పు

వదులు : దే. అ. క్రి. బిగువు తప్పు.

వధించు : సం. స. క్రి. 1. మారణముచేయు.
2. చంపు.

వధైపోవు :
వధయిపోవు: } సం. అ. క్రి. అత్యధికక్లేశమువడు.
ఉదా: పాపం ఆపిల్లాడు ప్రొద్దుటినుంచి వధైపోయినాడు.

వనటు : దే. అ. క్రి. దుఃఖించు.

వసటుగొను : దే. అ. క్రి. దుఃఖపడు.
వసపు : దే. అ. క్రి. 1. శోకించు.
2. దీనాలాపము లాడు.
3. విలపించు.
వన్నెతేఱు : దే. అ. క్రి. 1. రంగెక్కు.
2. చాయతేఱు.
వన్నెదఱుగు : దే. అ. క్రి. వగ్గు.
వన్నెపెట్టు : దే. స. క్రి. కాంతి గలిగించు.
వన్నెమీఱు : దే. అ. క్రి. రంగు అతిశయించు.
వన్నెలుచూపు : దే. అ. క్రి. నైపుణ్యము కనబఱచు.
వన్నెలుపచరించు: దే. అ. క్రి. పైపై విలాసములు చూపు.
వపదీయు : దే. స. క్రి. 1. బాధించు. 2. యాగీయపశువు కుడి డొక్కనుండి యొక వలుచనిపొరను దీయు.
వమ్మగు : దే. అ. క్రి. వ్యర్థమగు.
వమ్మువోవు : దే. అ. క్రి. 1. వ్యర్థమగు.
2. నష్టమగు.
వయాళించు : దే. అ. క్రి. విహరించు.
గూ. వయ్యాళించు.
వయిచు : దే. స. క్రి. వైచు. బస. 3 ఆ.
వరఁగలించు : దే. అ. క్రి. 1. ప్రకాశించు.
2. నఱలు.
వరటు : దే. అ. క్రి. కృశించు.
సీ. సంతతంబును గృచ్ఛచాంద్రాయణాదుల
వరటుచునుంట యెవ్వరికి మెచ్చు. భీమ. 4 ఆ.
వరపడు : దే. అ. క్రి. వరములకై దేవతలమ్రోల సాష్టాంగ పడి దినముల తరఁబడియుండు.
వరవుఁబడు : దే. అ. క్రి. ప్రాణాచారములుపడు.

వరించు : సం. స. క్రి. వరణముచేయు, కోరు. చూ. వరియించు.
వరుగగు : దే. అ. క్రి. ఎండిపోవు.
వరులు (ర్లు) : దే అ. క్రి. వదరు.
వర్గించు : సం. స. క్రి. వర్గీకరించు.
వర్జించు : సం. స. క్రి. విడుచు.
వర్ణించు : సం. స. క్రి. 1. స్తుతించు.
2. పొగడు.
వర్తించు :
వర్తిలు, వర్తిల్లు : } సం. అ. క్రి. 1. ఉండు.
2. వ్యవహరించు.
వర్ధించు : సం. స. క్రి. 1. వర్ధిల్లఁజేయు.
2. పెంచు,
వర్ధిలు (ల్లు) : సం. అ. క్రి. వృద్ధిపొందు.
వర్షించు : సం. అ. క్రి. వానకురియు.
వరుషించు : వై. అ. క్రి. వానకురియు.
వఱదగట్టు : దే. అ. క్రి. 1. ప్రవాహముగా మాఱు.
2. జనసమూహము తగ్గక సాగివచ్చు.
వరదవాఱు : దే. అ. క్రి. ప్రవహించు.
వఱపుసఁబడు : దే. అ. క్రి. 1. ఎండిపోవు.
2. వర్షములు వెనుకపట్టు.
వఱలు : దే. అ. క్రి. 1. ప్రకాశించు.
2. వర్తిలు.
3. వ్యాపించు.
వఱువట్లుగొను : దే. అ. క్రి. మిక్కిలి యొఁడు.
వఱ్ఱనగు : దే. అ. క్రి. నాలుకకు మిక్కిలి కారముగా నుండు.
వఱ్ఱునగు : దే. అ. క్రి. గుంటలేర్పడు. (తెలం)
వఱ్ఱోడ్డు : దే. అ. క్రి. వఱ్ఱోడు.
వఱ్ఱోడు : దే. అ. క్రి. ప్రవహించు, వఱ్ఱగు.

వలకట్టు : దే. స. క్రి అనుకూలపఱచు.
వలగొను : దే. స. క్రి. 1. ప్రదక్షిణించు.
2. చుట్టుకొను.
వలచు : దే. అ. క్రి. 1. వాసనకొట్టు.
2 వాసన వచ్చునట్లు వీచు.
స. క్రి. 1. కోయు.
2. కామించు.
వలచుట్టు : దే. అ. క్రి. వలగొను.
వలపలించు : దే. అ. క్రి. వలగొను, ఎడమప్రక్కగా పోవు.
వలపించు : దే. స. క్రి. వలచునట్లుచేయు.
వలపుగొను : దే. స. క్రి. కామించు.
వలయు : దే. అ. క్రి 1 ఇష్టమగు.
2. ఆవశ్యకమగు.
3. యుక్తమగు.
4 విహితమగు.
వలయెత్తు : దే. అ. క్రి. కామోద్రిక్తమగు.
వలలోవేసికొను: దే. స. క్రి. తన మాయలో చిక్కించుకొను.
వలవలమను : } దే. అ. క్రి. 1. శోకించు.
వలవలయేడ్చు: } 2. మిక్కిలి యేడ్చు.
వలసతీయు : } దే. అ. క్రి. రాజోపద్రవాదులచేత
వలసపోవు : } దేశాంతరము పట్టు.
వలిగొను : } దే. అ. క్రి. 1. చలిగొను.
వలిబట్టు : } 2. వణఁకు.
3. చల్లఁబడు. వ. పీ.
వలియఁబాఱు : దే. అ. క్రి. వేగముగా పరుగెత్తు.
వలియు : దే. అ. క్రి. సన్నగిల్లు.
వల్చు : దే. స. క్రి. రూ. వలచు.

వల్లకాకపోవు : దే. అ. క్రి. 1. స్వాధీనముతప్పు.
2. వీలులేకపోవు.

వల్లకాపను: దే. అ. క్రి. చేతఁగాదను.

వల్లతప్పు : దే. అ. క్రి. 1. నైపుణ్యతప్పు.
2. చేయిజాఱిపోవు.

వల్లనగు : దే. అ. క్రి. సాధ్యమగు.

వల్లనవేయు : దే. అ. క్రి. వల్లించు. రూ. వల్లెవేయు.

వల్లించు : దే. స. క్రి. 1. వల్లెవేయు.
2. వల్లెవేయించు.

వల్లిపోవు : దే. అ. క్రి. 1. కలఁగుఁడుపడు.
2. వాడిపోవు. (తెలం.)

వల్లు : దే. అ. క్రి. (రూ. ఒల్లు.)
"వారలు పెండ్లియేమిటికి వల్లనటంటె నటంచుఁ బల్కినన్." హం. వి. 5 ఆ.

వల్లెవేయు : దే. స. క్రి. 1. పొగరెక్కిన పశువులకు బందము వేయు.
వల్లెవైచు వారెవ్వరు మల్లరాల.
ఉ. హ. 4 ఆ.
2. వల్లించు.

వశపడు : దే. అ. క్రి. స్వాధీనమగు.

వశీకరించు : సం. స. క్రి. మంత్రమూలికలచే లోఁబఱచుకొను.

వసపడు : దే అ. క్రి. స్వాధీనమగు.

వసపోవు : దే. అ. క్రి. శక్యమగు.

వసమఱు : దే. అ. క్రి. వశము తప్పు. ప్రే. వసమఱఁజేయు
చ. అసురు లెసంగినప్పు డమరావళిక్రుంగినయప్డు ధర్మముల్
వసమఱి తూలినప్పు డపవర్గముత్రావలినయప్డు భాగ.

వసించు : సం. అ. క్రి. 1. వాసముచేయు.
2. ఉండు.
గూ. వసియించు.

వసిగొను : దే. స. క్రి. పూను.

వసిలిపోవు : దే. అ. క్రి. తొలఁగు.

వసివాఱు : దే. స. క్రి. 1. వాడిపోవు.
2. మిక్కిలి సొగపాఱు.

వసివాళ్ళువాడు : దే. అ. క్రి. మిక్కిలి కృశించు.

వసు[illegible] : దే. అ. క్రి. తొలఁగు.

వహించు :
వహాయించు : } సం. స. క్రి. తాల్చు.

## వా

వాంచు : దే. స. క్రి. 1. వంచు (గూ.)
2. వాగించు.

వాంఛించు : సం. స. క్రి 1. కోరు.
2. కాంక్షించు.

వాఁకలువేయు : దే. అ. క్రి. తబకలాడు.

వాఁగు : దే. అ. క్రి. 1. వదరు.
2. మ్రోఁగు.

వాఁచు : దే. అ. క్రి. 1. ఏకరు.
2. ఉత్కంఠపడు (మోమువాఁచు.)
3. లావెక్కు (కాలువాఁచు.)

వాకట్టువడు : దే. అ. క్రి. నోరు మూఁతపడు.

వాకబుచేయు : అన్య. దే. స. క్రి. 1. విచారించు.
2. తెలిసికొను.

వాకొను : దే. అ. క్రి. 1. మాటాడు.
2. అరచు.
వాకొలుపు : దే. స. క్రి. మాటాడఁజేయు.
వాక్రుచ్చు : దే. స. క్రి. 1. పేరుచెప్పు.
2. చెప్పు.
వాగించు : } దే. స. క్రి. మ్రోయించు.
వాయించు :
వాగు : దే. అ. క్రి. 1. వదరు.
2. మ్రోయు.
వాచనముసేయు: సం. స. క్రి. చెప్పు. (స్వస్తి)
వాచఱచు : దే. స. క్రి. యాచించు.
అ. క్రి. ఏడ్చు, మొఱపెట్టు.
వాచించు : సం. అ. క్రి. వచించు.
వాచిపోవు : దే. అ. క్రి. వాపిరిగొను.
వాచ్చెడు : దే. స. క్రి. (వావి + చెడు) చెడిపోవు.
వాచాడు : దే. అ. క్రి. పరిదేవనముచేయు.
వాటుపడు : దే. అ. క్రి. అనుకూలమగు.
వాటముగాతిను : దే. స. క్రి. పుష్టిగా తిను.
వాటముగానుండు: దే అ. క్రి. అనుకూలముగా నుండు.
వాటులాడు : దే. అ. క్రి. కొట్లాడు.
వాడఁబాఱు : దే. అ. క్రి. వాడు.
వాడిచూపు : దే. అ. క్రి. 1. పౌరుషము కనఁబఱచు.
2 వేగము హెచ్చించు. (శైలం.)
వాడిమీఱు : దే. అ. క్రి. పదునెక్కు. రూ. వాడియగు.
వాడు : దే. అ. క్రి. మ్లానమగు.
స. క్రి. ఉపయోగపఱచు.
తెలియఁజెప్పు. (పేరువాడి)

వాడుకపడు : దే. అ. క్రి. 1. పనుపడు.
2. అలనడు.
వాడుకపెట్టు : దే. అ. క్రి. వతనుపెట్టు.
వాడుకొను : దే. స. క్రి. 1. ఉపయోగపఱచుకొను.
2. జనులు ప్రవాదముగాఁజెప్పకొను.
వాడుచు : దే. స. క్రి. (వాడు ధా. ప్రే) (సూ.) వాడ్చు.
వాడుచూపు : దే. అ. క్రి. వాడిపోవుటకు మొదలగు.
వాడుదెంచు : దే. స. క్రి. వాడుదేఱు, వాడుపడు.
సూ. వాడుపాఱు.
వాడుపడు : ద్వ. అ. క్రి. వాడుపాఱు. ప్రే. వాడుపఱచు.
వాడుపఱచు : ద్వ. స. క్రి. వాడుపాఱు ధా. ప్రే.
వాతఁబెట్టు : దే. అ. క్రి. నోటఁబెట్టు.
స. క్రి. అర్పించు.
ఉదా: నిష్కారణముగా పులి వాఁతబెట్టితిమి.
వాదడుచు : దే. అ. క్రి. వాదించు (సూ.) వాదాడు.
వాదించు : సం. అ. క్రి. వాదులాడు, వాదముసేయు.
వాదిడు : దే. అ. క్రి. (వాదు+ఇడు) వాదముచేయు.
వాదులాడు : దే. అ. క్రి. 1. తగాదాలాడు.
2. వాగ్వివాదములు సలుపు.
వాను : దే. అ. క్రి. కుమ్మరి కుండలుచేయు.
వాపసుచేయు : అన్య. దే. స. క్రి. తిరిగి యిచ్చు.
వాపిరిగొను : దే. అ. క్రి. వాచిపోవు.
వాపిరిమోడు: } దే. అ. క్రి. దేబిరించు.
వాపిరోడు :
వాపుచ్చు : దే. అ. క్రి. నోరుతెఱచు.
వాపోవు : దే. అ. క్రి. 1. అఱచు.
2. ఏడ్చు.

వామహస్తముచూపు: దే. స. క్రి. లేదను
అ. క్రి. మొండిచేయిచూపు.

వాము : దే. అ. క్రి. జాఱు.

వాయగొట్టు : దే. స. క్రి. 1. వాయునట్లుగొట్టు.
2. నలగఁగొట్టు.

వాయోడు : దే. అ. క్రి. వాగ్దానభంగముచేయు.

వాయారు : దే. అ. క్రి. నోరు పడిపోవు.

వాయించు : దే. స. క్రి. 1. వాదనముసేయు.
2. ప్రయోగించు.
3. కొట్టు.
"నాలుగు వాయించి కూర్చుండబెట్టితిని"

వాయోడు : దే. అ. క్రి. 1. మాట పిఱికియగు.
2. మాటాడ లేకపోవు.
2. వాగ్దానభంగముచేయు.

వారఁజట్టు : దే. అ. క్రి. ఆపోశించు.

వారఁబెట్టు : దే. స. క్రి. అన్నము వార్చు.

వారఁబోయు : దే. స. క్రి. 1. గ్రామదేవత యూరేగునపుడు వేప మండలువేసిన నీరు క్రుమ్మరించు.
2. ధారపోయు.

వారడు : దే. అ. క్రి. ఆగిపోవు.

వారబోవు : దే. అ. క్రి. బహిష్ఠయగు.

వారించు : సం. స. క్రి. 1. అడ్డగించు.
2. నివారించు.

వారు : దే. అ. క్రి. 1. రెండుచేతులతో తాటూరు. ఓరచివ్వు
2. ఉడుగు.
3. దేనినిగాని సన్నగా కోయు,
(తోలు వారులు.)
4. వడియు. [ఉదా: గంజివారెను.]

వార్చు : దే. అ. క్రి. 1. ఆచమించు.
2. సంధ్యవార్చు.
స. క్రి. 1. ప్రతీక్షించు.
2. అన్నములోని గంజివోడ్చు.

వార్తకెక్కు : దే. అ. క్రి. ప్రసిద్ధికెక్కు.

వార్తలాడు : దే. అ. క్రి. 1. చమత్కారముగా మాట్లాడు.
విప్రనారాయణచరిత్ర. వి·రా.
2. కైవారముచేయు.
చిత్రకూట మాహాత్మ్యము.

వాలయించు : దే. స. క్రి. 1. నిర్బంధించు. ప్రే. వాలాయించు.

వాలాయముతీర్చు: దే. అ. క్రి. మొగముచూపించిపోవు.(పనిచేయక)

వాలాయించిచేయు: దే. స. క్రి. 1. తప్పక చేయు.
2. వల దన్నను చేయు.

వాలారు : దే. అ. క్రి. 1. పదునగు.
2. వాడియగు.

వాలార్చు :
వాలించు : } దే. స. క్రి. వాలఁజేయు.

వాలు : దే. అ. క్రి. 1. అతిశయించు.
2. క్రిందికి దిగు.
3. ఒఱగు.
4. వంగు.
5. అతిక్రమించు.

వాలుచు : దే. స. క్రి వాలఁజేయు.

వాలుచేయు : దే. స. క్రి. 1. ఘాడవు, లేక, కూచి చేయు.
2. ఏటవాలుచేయు.

వాల్చు : దే. స. క్రి. 1. వాలఁజేయు.
2. వంచు. 'తలవాల్చు.'
'మంచము వాల్చు.'

వాలూరు : దే. అ. క్రి. ఆలస్యమగు.

వాసనకట్టు : } దే. స. క్రి. వాసనపోకుండ మూతగట్టు.
వాసనగట్టు :

వాసనగొట్టు : దే. స. క్రి. కంపుగొట్టు.

వాసపోయు : దే. అ. క్రి. వాసాలు పఱచు.

వాసించు : దే. అ. క్రి. 1. వసించు.
2. వాసనకట్టు.
3. ప్రసిద్ధికెక్కు.

వాసికెక్కు : దే. అ. క్రి. ప్రసిద్ధిగోను

వాసిచేయు : దే. స క్రి. ప్రసిద్ధిని కల్గించు.

# వి

వింగడించు : దే. స. క్రి. 1. వేఱుపఱచు.
2. విభజించు.

వింజమూఁకిడు : దే అ. క్రి. వింధ్యము సూర్యు నడ్డగించు.

వింజమాకిడు : దే. అ. క్రి. 1. వింధ్యారణ్యము చిగిరించు.
2. వింధ్యను ఆజ్ఞాపెట్టు.

వికటించు : సం. అ. క్రి. 1. వంకరయగు.
2. ఎదురు తిరుగు.
3. వ్యతిరేకమగు.

వికర్షించు : సం. స. క్రి. లాగు.

వికారముగా నుండు: సం. అ. క్రి. 1. అజీర్ణముచేత, పైత్యముచేత డోకు వచ్చినట్లుండు.
2. అసుందరముగా నుండు.
3. వస్తువుసహజాకృతిమాలియుండు

వికారించు : సం. స. క్రి. మార్పు కలిగించు.

వికాసించు :
వికసించు : } సం. అ. క్రి. 1. వికాసముపొందు.
వికాసిలు : 2. విప్పారు.
వికాసిల్లు :

విక్కనవిఱుగు : దే. అ. క్రి. మిక్కిలి విఱుగు.

విక్కవిరియు : దే. అ. క్రి. మిక్కిలి విరియు.

విఱ్ఱ : దే. అ. క్రి. 1. విజృంభించు.
2. గర్వించు.
3. బద్ధకము సడలుటకై ఒడలు విఱుచుకొను.

విక్రమించు : సం. అ. క్రి. శౌర్యముచూపు.

విక్రయించు : సం. స. క్రి. అమ్ము.

విక్షేపించు : సం. స. క్రి. 1. ఎగురవేయు.
2. విసరివేయు.

విగాహించు : సం. అ. క్రి. 1. మునుగు.
2. ప్రవేశించు.

విగుర్వించు : సం. అ. క్రి. ప్రయత్నముచేయు.
'గుర్వీ ఉద్యమనే.' ధాతుపాఠము.

విగ్రహించు : సం. అ. క్రి. విరోధించు.

విఘటించు : సం. స. క్రి. విఘటనముచేయు.

విఘాతించు : సం. స. క్రి. 1. చెఱుచు.
2. చంపు.

విఘూర్ణించు : సం. స. క్రి. 1. చలించు.
2. మ్రోగు.

విఘ్నపడు : సం. అ. క్రి. అడ్డుపడు.

విచరించు :
విచలించు : } సం. అ. క్రి. సంచలించు.

విచారపడు : సం. అ. క్రి. 1. సంతాపించు.
2. కలవరపడు.

విచారించు : సం. అ. క్రి. 1. ఆలోచించు.
2. సంతాపించు.
స. క్రి. 1. చావుకు పరామర్శచేయు.
2. సంగతులు అడిగి తెలిసికొను.

విచేష్టించు : సం. అ. క్రి. మిక్కిలి చేష్టలు కలది యగు.

విచ్చు : దే. అ. క్రి. 1. విరియు.
2. విరియఁజేయు.
3. చీలు.

విచ్చుమొగ్గగు : దే. అ. క్రి. చెల్లాచెదరగు.

విచ్చేయు : దే. అ. క్రి. 1. వచ్చు.
2. పోవు.

విజయంచేయు : } వై. అ. క్రి. 1. వచ్చు.
విజయముచేయు: } 2. పోవు.

విజృంభించు : సం. అ. క్రి 1. చెలరేఁగు.
2. వికసించు.

విజ్ఞాపించు : సం స. క్రి. విన్నవించు.

విజ్జు : } దే. అ. క్రి. 1. వ్యాపించు.
విజ్జుపడు: } 2. తన్నుకొనుటయందు ధ్వనిచేయు.

విజ్జోడుపడు : దే. అ. క్రి. 1. భేదపడు.
2. వ్యత్యయమగు.

విటతాటనమగు : దే. అ. క్రి. కలఁతపడు.

విటతాటమాడు : దే. స. క్రి. 1. కలఁత నొందించు.
2. తాఱుమాఱుసేయు.

విడంబించు : సం. స. క్రి. 1. అనుకరించు.
2. మోసపుచ్చు.

విడదీయు : సం. స. క్రి. వేఱుచేయు.

విడద్రొక్కు : దే. స. క్రి. విడుచు.

విడాకులిచ్చు : దే. అ. క్రి. భార్యాభర్తలు విడిపోవు.

విడియముసేయు: దే. అ. క్రి. తాంబూలము సేవించు.

విడియు : దే. అ. క్రి. 1. ప్రయాణికులు దారిలో దిగు.
2. జాఱు.

విడిలించు : దే. స. క్రి. వేఱుసేయు.

విడివడు : దే. అ. క్రి. 1. వీడు
2. తెగనుండి వేఱుపడు.
3. నిర్బంధమునుండి తొలఁగు.

విడిపోవు : దే. అ. క్రి. 1. వదలు.
2. విడిపడు.

విడు : దే. స. క్రి. 1 వీడు.
2. విడుచు.

విడుగు : దే. అ. క్రి. వికసించు.

విడుచు : దే. స. క్రి. 1. విడఁజేయు.
2. విమోచనము సేయు.

విడుదలపెట్టు : దే. స. క్రి. విముక్తునిచేయు.

విడుపడు : ద్వ. అ. క్రి. (విడుపు+పడు) విడిపడు.

విడ్చు : దే. స. క్రి. విడుచు.

విడెముసేయు : దే. అ. క్రి. తాంబూలము సేయు;
చూ. విడియము సేయు.

వితర్కించు : సం. స. క్రి. 1. ఊహించు.
2. సంశయించు.

వితాకుపడు : దే. అ. క్రి. నిశ్చేష్టితుఁడగు

విదలించు : దే. స. క్రి. 1. చులకనచేయు.
2. నీళ్ళు మొ॥నవి విదిరించు.(నులుపు)

విదళించు : సం. స. క్రి. ఖండించు.

విదారించు : సం. స. క్రి. చీల్చు.

విదిరించు : దే. స. క్రి. విదరింపఁజేయు.

విదురు : దే. అ. క్రి. 1. విదురుచు.
2. విదులు.

విదురుచు : దే. స. క్రి. విదురఁజేయు, విదిలించు, విదులుచు.

విదులు : దే. అ. క్రి. రాలు. ప్రే. విదులుచు.

విద్దెములాడు :
విద్దెములుచేయు : } దే. అ. క్రి. పసిపిల్లలు నిలుచు.

విద్దెలాడు : దే. అ. క్రి. విద్యాప్రకర్ష చూపు.

విద్దెయుచూపు : దే. అ. క్రి. ప్రావీణ్యము కనబఱచు.

విద్యోతించు : సం. అ. క్రి. ప్రకాశించు.

విద్రవించు : సం. అ. క్రి. పాఱిపోవు.

విద్రావించు : సం. స. క్రి. పాఱిపోవునట్లు చేయు.

విద్రుచు : దే. స. క్రి. విదిలించు. గూ. విదుసుచు.

విద్రోహించు : సం. స. క్రి. అన్యాయముచేయు.

విద్వేషించు : సం. అ. క్రి. 1. పగగొను.
2. విరోధించు.

విధించు : సం. స. క్రి. 1. కట్టడిసేయు.
2. ఏర్పాటుసేయు.

వినాయించు : మి. స. క్రి. వేఱుచేయు.

వినిందించు : సం. స. క్రి. మిక్కిలి నిందించు.

వినికిడిచేయు : దే. స. క్రి. తెలియఁజేయు.

వినిపించు : దే. అ. క్రి. వినవచ్చు.
స. క్రి. వినునట్లు చేయు.

వినియోగించు : సం. స. క్రి. 1. ఉపయోగపఱచు.
2. దేవునికి నైవేద్యము పెట్టు.

విను : దే. స. క్రి. ఆకర్ణించు.

వినుకలి సేయు : దే. అ. క్రి. విను.

వినుచు : దే. అ. క్రి. వినవచ్చు.
ప్రే. వినఁజేయు, వినిపించు.

వినోదించు : సం. అ. క్రి. క్రీడాదులచేత ప్రొద్దుపుచ్చు.

విన్ననగు: దే. అ. క్రి. 1. వివర్ణమగు.
2. చిన్నఁబోవు.

విన్నఁబడు :
విన్నఁబోవు: } దే. అ. క్రి. వివర్ణమగు.

విన్నవించు : దే. స. క్రి. 1. మనవిచేయు.
2. విజ్ఞాపించు.

విన్నాణముచూపు: దే. అ. క్రి. నేర్పు ప్రదర్శించు.

విప్పు : దే. స. క్రి. 1. ఊడఁదీయు.
2. కట్టు విప్పు, బంధము సడలించు. మంత్రపుకట్టు విప్పు.
3 పురి విప్పు, నెమలి పింఛము విదియించు, త్రాడుపురి సడలించు.
4. చీర విప్పు, కోక యూడఁదీయు.
5. పొడుపుకథ విప్పు = పొడుపుకథ లోని తాత్పర్యము చెప్పు.
6. వివరించు. (విప్పిచెప్పు.)

విప్పుసేయు : దే. స. క్రి. 1. పెంచు.
2. తెఱచు.

విభజించు : సం. స. క్రి. 1. పంచు.
2. విభాగించు.

విభాళించు : సం. స. క్రి. నుఱుకు పగులగొట్టు.
అ. క్రి. పరాక్రమము నెఱపు.
విమర్దించు : సం. స. క్రి. చంపు.
విమర్శించు : సం. స. క్రి. 1. పరామర్శచేయు.
2. అనుశీలనము చేయు.
విమోహించు : సం. స. క్రి. మిక్కిలి మోహించు.
వియ్యమందు : దే. అ. క్రి. సంబంధము చేయు.
విరగఁబూయు: దే. అ. క్రి. విశేషముగాఁ బూయు.
విరచించు : సం. స. క్రి. విశేషముగా రచించు.
విరజిమ్ము : దే. స. క్రి. మిక్కిలిగాఁ జిమ్ము.
విరతిపొందు : ద్వ అ. క్రి. 1. అనిష్టతను పొందు.
2. విముఖతను పొందు.
విరమించు : సం. అ. క్రి. 1. విశ్రాంతి పొందు.
2. ఉడుగు.
విరవారు : దే. అ. క్రి. చెదరి పాఱిపోవు.
విరవిరలాడు : దే. అ క్రి. తైలసంస్కారము మాలిన శరీరము పగులుటకుఁ బూర్వస్థితిని గలుగు.
విరవిరవాఱు: } దే. అ. క్రి. విలవిలపోవు.
విరవిరవోవు: }
విరసించు : సం. అ. క్రి. విరసత్వము పొందు.
విరాగిలు : సం. అ. క్రి. వైరాగ్యము పొందు.
స. క్రి ద్వేషించు.
విరాజిల్లు : సం. అ. క్రి. ప్రకాశించు.
విఱిచికట్టు, విఱిచిరకట్టు : దే. స. క్రి చేతులు వెనుకకుఁదీసి కట్టు.
విఱిపోటుసేయు : దే. స. క్రి. భేదించు. కా. ఆ.
విరియఁజిమ్ము : దే. స. క్రి. మిక్కిలిగాఁ జిమ్ము.
విరియఁబడు : దే. అ. క్రి. పీడు, విరియు.

విరియఁబాఱు : దే. అ. క్రి. 1. వికసనోన్ముఖమగు.
2. వ్యాపించు.
3. పగులు.

విరియఁబూయు : దే. అ. క్రి. అధికముగా పుష్పించు.

విరియఁబోయు : దే. స. క్రి. కేశాదికమును వ్రేలాడ విడుచు.

విరియు : దే. అ. క్రి. 1. వికసించు.
2. తగులు.
3. వీడు.
4. చెదరు.
5. తొలఁగు.
6. ఉప్పొంగు.

విరివాఱు : దే. అ. క్రి. 1. పాయవడు.
2. చీలు.

విరోధించు : సం. అ. క్రి. 1. నిరోధించు.
2. పగఁగొను.

విఱుగగాయు : దే. అ. క్రి. విఱుగఁబండు.

విఱుగఁద్రొక్కికొను: దే. అ. క్రి. 1. త్రిక్కిఱిచేయు.
2. కాళ్ళు తడఁబడఁజేయు.

విఱుగఁబండు : దే. అ. క్రి. అధికముగాఁ బండు.

విఱుగఁబడు : దే. అ. క్రి. 1. గర్వించు.
2. ఓడు. ఆము. 6 ఆ.
3. కూలిపోవు.
4. అత్యంతాగ్రహము చూపు.
5. పొగరు చూపు.
6. విజృంభించు.
(విఱుగబడినవ్వ)

విఱుగు : దే. అ. క్రి. 1. తునియు.
2. ఓడు.
3. పాకముచెడు.
(పాలువిఱుగు, నెత్తురువిఱుగు, మనసు విఱుగు.)
4 విషాదములు నిర్వీర్యమగు.
విఱిచికట్టు : దే. స. క్రి. విరిచికట్టు.
విఱుచు : దే. స. క్రి. (విఱుగు ధా. ప్రే.)
1. రంగువిఱుచు.
2 ఒడలు విఱుచుకొను.
3. ఱొమ్ము విఱుచుకొను.
4. కట్టె మొ॥వానిని ఖండించు.
విఱుచుకతిను : దే. స. క్రి. మిక్కిలిగా (ఎదుటివారి యిష్టానిష్టము లతో నిమిత్తములేకుండ) తిను.
విఱ్ఱవీఁగు ; దే. స. క్రి. మిక్కిలి నిక్కు.
అ. క్రి. గర్వపడు.
విలంఘించు : సం. స. క్రి. దాఁటు.
విలంబించు : సం. అ. క్రి. విలంబముసేయు.
విలపించు : సం. అ. క్రి. దుఃఖముతో ప్రలాపించు.
విలవిలపోవు: }
విలవిలలాడు: } దే. అ. క్రి. విహ్వలత నొందు.
విలసిల్లు . సం. అ. క్రి. 1. ప్రకాశించు.
2. ఒప్పు.
విలాపించు : సం. అ. క్రి. విలపించు.
విలీనీకరించు : సం. స. క్రి. కలియు.
విలియ(యా) వేయు: దే. స. క్రి. 1. సరిచూచు.
2. ఏర్పఱచు.

విలుచు (ల్చు) : దే. స. క్రి. వెలయిచ్చి కొను.
విలోకించు : సం. స. క్రి. 1. చూచు.
2. ఆలోచించు.
వివక్షించు : సం. అ. క్రి. 1. తేడా తెలిసికొను.
2. చెప్ప నిచ్ఛించు.
వివదించు : సం. అ. క్రి. 1. కలహించు.
2. వాదపడు, రూ. వివాదపడు.
వివరపట్టు : సం. అ. క్రి. వివరముగా తెలియు. మత్స్య. 1 ఆ.
వివరించు : సం. స. క్రి. 1. వక్కాణించు.
2. విచారించు.
3. విశదపఱచు.
వివరుఁజేయు : దే. స. క్రి. తిరస్కరించు.
"శంబకు వలయాంబు సవదరించు కరంబు
తూడు వివరుజేయు దోర్యుగంబు."
యా. వి. వి.
వివహామగు : } సం. స. క్రి. పెండ్లాడు.
వివాహామగు: }
వివేకించు : సం. స. క్రి. 1. విచారించు.
2. విడబఱచి తెలిసికొను.
వివేచించు : సం. స. క్రి. వివేచనసేయు.
విశదించు : సం. స. క్రి. విశదముగా చెప్పు. వాసి. 4 ఆ.
విశదీకరించు : సం. స. క్రి. స్పష్టము చేయు.
విశిష్టాచేయు : సం. స. క్రి. తనకు సంబంధించినంతవఱకు బహిష్కరించు.
విశసించు ; సం. స. క్రి. యజ్ఞములోఁ బశువులను జంపు.
విశేషించు : సం. అ. క్రి. 1. అతిశయించు.
2. అధికమగు.
స. క్రి. ఒక అధికవిషయమును జెప్పు.

విశ్రమించు : సం. అ. క్రి. విశ్రమిల్లు, విశ్రాంమించు.
అలసట దీఱు.

విశ్లేషించు : సం. స. క్రి. విడబఱచు.

విశ్వసించు : సం. స. క్రి. నమ్ము.

విషమించు : సం. అ. క్రి. చెడు.
2. విరోధించు

విషముగ్రక్కు : దే. అ. క్రి. ద్వేషము ప్రకటించు.
'వాడు విషము క్రక్కుచున్నాడు.'

విషయించు : సం. స. క్రి. 1. విషయముచేయు.
2. సంగమించు.
3. చూచు.
4. కూర్చివచ్చు.
(విద్వజ్జనులు నిన్ను విషయించి వత్తురు)

విషయీకరించు: సం. స. క్రి. ఉద్దేశించు.

విషాదించు : సం. అ. క్రి. ఖేదపడు.

విష్ఠించు : సం. అ. క్రి. విష్ఠచేయు, మలవిసర్జనముచేయు.

విసంచుచేయు : దే. స. క్రి. పంచిపెట్టు.

విసంవాదించు : సం. అ. క్రి. సావర్ణ్యము లేకయుండు.

విసరికొట్టు : } దే. స. క్రి. 1. తిరస్కరించు.
విసరికొను : } 2. లోకువచేసి మాటలాడు.

విసరిపాఱవేయు: దే. స. క్రి. గిరవాటుపెట్టు.

విసరియాడు : దే. స. క్రి. విసరు (తిరుగలి మున్నగువానితో.)

విసర్జించు : సం. స. క్రి. 1. విడుచు.
2. విసర్జనముచేయు.

విసర్పించు : సం. అ. క్రి. వ్యాపించు.
'ధాతకేశంబులు విశీర్ణంబులై తలకెక్కి
విసర్పించు కతంబున సర్పంబులు పుట్టె.'
వి. పు. 1ఆ.

విసరు : దే. అ. క్రి. 1. బయలుపడు.
2. వీచు.
3. వేయు.
స. క్రి. 1. ఆడించు.
2. మాటలు విసరు.
3. పాఱవేయు.
4. అవతలవానిని తిరస్కరించు.

విసవిసనడుచు : దే. అ. క్రి. విసరుగా నడచు.

విసవిసలాడు : దే. అ. క్రి. అనిష్టము, కోపము, కార్పణ్యము, మొ॥ నవి ప్రకటించు.

విసికించు : దే. స. క్రి. మనస్సునకు శ్రమ కలుగఁజేయు.

విసిగికొను : }
విసివికొను : } దే. అ. క్రి. విసుగుపొందు.

విసుగు : దే. అ. క్రి. బడలికచే చికాకుపడు.
రూ. విసువు.

విసుగెత్తు : దే. అ. క్రి. చీకాకుపడు.

విస్తరించు : సం. స. క్రి. విస్తరిలఁజేయు.

విస్తరిలు : }
విస్తరిల్లు : } సం. అ. క్రి. వ్యాపించు.

విస్పష్టపడు : సం. అ. క్రి. విస్పష్టమగు.
స. క్రి. విస్పష్టముచేయు.

**విస్ఫారమగు** : సం. అ. క్రి. విస్తృతమగు.

విస్ఫురించు : సం. అ. క్రి. 1. భుజాదులు అదరు.
2. బాగుగా మనస్సునకు తట్టు.

విస్మరించు :
విస్మృతినొందు: } సం. స. క్రి. మఱచు.

విహరించు : సం. అ. క్రి. విహారముచేయు.
స. క్రి. 1. అగ్నులను విహరించు. (అనగా) ఆహుతికనుకూలముగాజ్వలింపజేయు.
2. వ్యభిచరించు.

విహ్వలించు : సం. అ. క్రి. భయాదులచేత అవయవముల స్వాధీనత తప్పినవాడగు.

విహారించు . సం. అ. క్రి. విహరించు.

## వీ

వీఁగిపోవు : దే. అ. క్రి. వదలిపోవు.

వీఁగియాడు : దే. అ. క్రి. 1. చలించు.
2. తూగాడు.

వీఁగు : దే. అ. క్రి. 1. తొలఁగు (గొడ్డువీఁగు.)
2. భారమగు.
3. నిక్కు.
4. భారముచేత జవజవలాడు.
5. ఓడిపోవు.

వీక్షచేయు : సం. స. క్రి. వీక్షించు. మత్స్య. 1 ఆ.

వీక్షించు : సం. స. క్రి. చూచు.

వీచు : దే. అ. క్రి. విసరు.

వీటతాటముసేయు: దే. స. క్రి. చెల్లాచెదరు చేయు.

వీటిఁబుచ్చు : దే. స. క్రి. వ్యర్థపుచ్చు.

వీటిఁబోవు : దే. అ. క్రి. 1. దూషితమగు.
2. వ్యర్థమగు.
3. నష్టమగు.
వీడికోలు సేయు: దే. స. క్రి. 1. ఓడిపోవు, 2. పంపు.
వీడు : దే. అ. క్రి. 1. వదలు.
2. కొనసాగు (తీగెలు వీడంగ.)
3. వీడఁజేయు.
వీడుకొను : దే. స. క్రి. 1. పోయివచ్చెదనని చెప్పుకొని వదలు.
2. వదలు.
ప్రే. వీడుకొలుపు, వీడుచు.
వీడుచు : దే. స. క్రి. వీడునట్లుచేయు. (రూ.) విడుచు.
వీడుజోడాడు : దే. అ. క్రి. వ్యత్యస్తమగు.
వీడుపడు : దే. అ. క్రి. 1. మారుపడు.
2. భేదపడు.
3. తడఁబడు. రూ. వీడువడు, వీడ్వడు.
వీడువిడియు : దే. అ. క్రి. దండువిడియు.
'అతులితోత్సాహమున వేటలాడియాడి
కడగి యచ్చోటనే వీడు విడిసెగాన.' శుక.
వీడెము సేయు : } దే. అ. క్రి. తాంబూలము వేయు.
వీడ్యము సేయు: }
వీడ్కొను : దే. స. క్రి. సెలవు పుచ్చుకొను. రూ. వీడుకొను.
వీడ్కొలుపు : దే. స. క్రి. [రూ] వీడుకొలుపు.
వీతెంచు : దే. అ. క్రి. 1. వీచు.
2. విసరు.
వీనిచ్చు : దే. అ. క్రి. చెవియొగ్గు.
వీనుమిగులు : దే. అ. క్రి. 1. ప్రసిద్ధికెక్కు.
2. అతిశయించు.

వీపడచు : దే. స. క్రి. భయము లేదని చెప్పుటకై వీపు చఱచు. హంస.

వీపుచఱచు : దే. స. క్రి. 1. ధైర్యము చెప్పు.
2. మర్దించు.

వీపునఁజఱచు : దే. స. క్రి. వీపుమీఁదఁగొట్టు.

వీఁటిడివోవు : దే. అ. క్రి. వృథయగు.

వీలగు : దే. అ. క్రి. అనుకూలమగు.

వీలు : దే. స. క్రి. ఉపయోగించు. శ. ర

వీలుచెడు : దే. అ. క్రి. అనుకూలము లేకపోవు.

వీలుచేయు : దే. స. క్రి. అవకాశము కల్పించు.

వీలుపడు : దే. అ. క్రి. 1. సరిపడు.
2. అనుకూలపడు.
3. అవకాశ మేర్పడు.

వీసరపడు :
వీసరపోవు :
వీసరవోవు : దే అ. క్రి. వెలితిపడు.

# వృ

వృద్ధియగు : సం. స. క్రి. 1. పెరుగు.
2. వర్ధిల్లు.

# వె

వెంటపడు :
వెంటాడు : దే అ. క్రి. 1. బాధించు.
2. అనుసరించు.

వెంటిగొను : దే. స. క్రి. పిరిగొను.

వెంటిపట్టు : దే. అ. క్రి. గడ్డితో మోకు పేను.

...కపట్టు : దే. అ. క్రి. రోమాంచము కలుగు.
'నునుఁడు వెంట్రుకపట్టెను తూపులేర్చి.'
సారం. 2ఆ.

...లాడు : దే. స. క్రి. 1. పీడించు.
2. కలచు
3. హింసించు.
'ప్రాణికోటుల వెంపరలాడు శరధి తూణీరుఁ డనఁగ.' క.వ.రా.యుద్ధ.

...ంచు : దే. స. క్రి. వెనుకొను.

...యగు : దే. అ. క్రి. వెఱ్ఱియగు.

... : దే. అ. క్రి. 1. విచ్చు.
2. చెదరు.
'దేవసంఘంబులు వెకలి పికపికలై బెదరింప నిరీక్షించి.' వి.పు. 1 ఆ.

...సపడు : దే. అ. క్రి. దుస్సహత్వమునొందు. చూ. వెక్కసించు

...ంచు :
...ంతలాడు: } దే. అ. క్రి. వికారచేష్టలుచేయు.
స. క్రి. 1. చేష్టానుకరణముచేయు.
2. హాస్యముచేయు.

... : దే. అ. క్రి. 1. వెక్కివెక్కి యేడ్చు.
'అనుపమవస్తువుల్ గొనుచు నంగడికిం గొనితేర నారికుల్ గని పఱతేర నగ్రమున గంధగజేంద్రము నిద్రవోవ నం తనుబడఁద్రోచి యేనుఁగునదల్చుచు, వెక్కి భటాలి ద్రోలి.'
స. నీ. క. ని. 4 ఆ.

... : దే. అ. క్రి. వెక్కివెక్కి యేడ్చు.

...రు :
...రు :
...పుట్టు: } దే. అ. క్రి. 1. అసహ్యము కలుగు.
2. వెగటించు.

వెగటించు : దే. స. క్రి. వ్యతిరేకించు.
వెగడుపడు : దే. అ. క్రి. తల్లడపడు.
వెగ్గలమగు : దే. అ. క్రి. అధికమగు.
వెచ్చగిలఁబెట్టు : దే. స. క్రి. వేడిచేయు.
వెచ్చఁజూపు : దే. అ. క్రి. వేడిమిచూపు.
వెచ్చఁజేయు : దే. స. క్రి. వేడిచేయు.
వెచ్చనగు : దే. అ. క్రి. వేడియగు.
వెచ్చపట్టు : దే. అ. క్రి. కొద్దిగా జ్వరము పట్టు.
వెచ్చపడు : దే. అ. క్రి. 1. వ్యయమగు.
ప్రే. వెచ్చపఱచు.
వెచ్చపెట్టు : దే. స. క్రి. వ్యయముచేయు.
వెచ్చపోవు : దే. అ. క్రి. వ్యయపడు.
వెచ్చించు : దే. స. క్రి. వెచ్చముసేయు. వ్యయముచేయు.
వెచ్చు : దే. అ. క్రి 1. కాగు.
2. తపించు. కేయూ. 3 ఆ.
వెటకారముసేయు: } దే. స. క్రి. వెక్కిరించు.
వెటకరించు : }
వెట్టదీయు : దే. అ. క్రి. చల్లబడు.
'దేహంబు బలువెట్ట దీసి సిస్తగ నుండు
జలువగాఁ బన్నీట జలకమాడు.'
హంస. 2 ఆ.
వెతఁగుపడు : దే. అ. క్రి. అవివేకము నందు.
వెఱఁగుపడు : దే. అ. క్రి. జడత్వమునొందు.
వెఱనిద్రవడు : దే అ. క్రి. 1. దొంగనిద్రవోవు.
2. జడత్వమునొందు.
వెఱరూపగు : దే. అ. క్రి. పిచ్చిరూపమగు.
వెఱలఁగ్రమ్ము : దే. స. క్రి. వెల్లడిచేయు.

వెడలఁబడు : } దే. అ. క్రి. వెడలు, బయలుదేరు.
వెడలఁబాఱు : } ప్రే. వెడలుచు.

వెడలఁబోయు : దే. స. క్రి. వెల్లడిచేయు.
ఉదా:- మంచితనము వెడలఁబోసెను.

వెడ్డుపెట్టు : } దే. స. క్రి. వంచించు.
వెడ్డుమీఱు : }

వెళ్లబుడ్లుపెట్టు: దే. అ. క్రి. భయముతో చూచు. బస. 2 ఆ.

వెతకు : దే. స. క్రి. అన్వేషించు. గ్రా. వెదకు.

వెదకులాడు : దే. స. క్రి. వెదకుకొను.

వెదచల్లు : దే. స. క్రి. 1. పాఱఁజల్లు,
2. వ్యాపింపఁజేయు.
3. విత్తనములుచల్లు [గ్రా.] వెచ్చల్లు

వెదచిందు : దే. అ. క్రి. వ్యాపించు.

వెదపెట్టు : దే. స. క్రి. విత్తు.

వెసకు : దే. స. క్రి. వెదకు [గ్రా]

వెనుఁబడు : దే. అ. క్రి. ఖేదపడు.
స. క్రి. వెంబడించు.

వెనుకకువచ్చు : దే. స. క్రి శరణుఁజొచ్చు.
'భీతంబై వెనుకకు వచ్చిన కపోతంబుఁ గాచిన శిబిచక్రవర్తిరీతి.' భాగ.

వెనుకచిక్కు : దే. అ. క్రి. వెనుకఁబడు.

వెనుకదీయు : దే. అ. క్రి. 1. సంకోచించు.
2. వెనుకకు మఱలు.

వెనుకద్రొక్కు: } దే. అ. క్రి. వెనుదీయు.
వెనుద్రొక్కు : }

వెనుకపడు : దే. అ. క్రి. 1. కూడఁబడు.
2. వెనుకచిక్కు.

వెనుకవేయు : దే. స. క్రి. కూడఁబెట్టు.
వెనుకవేసికొనివచ్చు : దే. స. క్రి. పక్షపాతము చేతగాని ప్రేమచేతగాని యొకని దోషము సమర్థించు.
వెనుకొను : దే. స. క్రి. వెంబడించు. రూ. వెన్కొను.
వెనుచఱచు : దే. స. క్రి. వెంబడించు.
వెనుచూచు : దే. స. క్రి. ఓడించు.
వెనుచూపు : దే. అ. క్రి. ఓడిపోవు.
వెనుతవులు, వెన్దవులు : దే. స. క్రి. వెంటబడు. రూ. వెన్తవులు.
వెనుదన్ను : దే. స. క్రి. 1. వెనువెంటనే వచ్చు.
2. ధిక్కరించు.
వెనుదీయు : దే. అ. క్రి. వెనుకకు మఱలు.
వెన్నకుపన్నువచ్చు : దే. అ. క్రి. 1. మెత్తని వస్తువు గట్టిపడు.
2. కఱుకెక్కు.
వెన్నడించు : / వెన్నడికొను : / వెన్నంటు : } దే. స. క్రి. 1. వెంబడించు.
2. తఱుము.
వెన్నాఁగు : దే. స. క్రి. రక్షించు.
వెన్నాడు : దే. స. క్రి. వెన్నడించు. రూ. వెన్నడు.
వెన్నిచ్చు : దే. అ. క్రి. వెనుదీయు, ఓడు, వెన్నుచూపు.
వెన్నిడు : దే. అ. క్రి. వెనుదీయు. అను.
వెన్నుచూపు : దే. అ. క్రి. వెన్నిచ్చు, వరి వెన్నుతీయు.
వెన్నుదన్ను : దే. స. క్రి. 1. అనుసరించు.
2. వెనుక నిలుచు.
3. తిరస్కరించు.
4. వెంబడించు.
"నెన్నడుముల విన్ను వెన్నుదన్ని." మను.
వెన్నుదీయు : దే. అ. క్రి. వరి మొదలగు వాని కంకి బయటపడు.

వెన్నువిఱుగు : దే. అ. క్రి. 1. వీపు విఱుగు.
2. పాడువడు.
3. నిరుత్సాహపడు.
వెన్నుప్రేయు : దే. అ. క్రి. వీపుచఱచు.
వెన్నొగ్గు : దే. అ. క్రి. వీపిచ్చు.
వెన్నడు : దే. స. క్రి. వెనుబడు.
వెమ్మ్రు : దే. అ. క్రి. తాపమునొందు.
వెరఁజాడు : దే. అ. క్రి. జాఱుకొను.
వెరఁజు : దే. స. క్రి 1. జవురుకొను.
2. సంగ్రహించు.
'జలములు ద్రిక్కగ సకలరత్నం
బులు వెరఁజి సాగరపతి పీడుకొలిపి.'
నృసిం.2 ఆ.
వెఱఁజొచ్చు : దే. అ. క్రి. భయముతోఁజొచ్చు.
"పరిమెయిఁజొచ్చితొల్తబహుభంగులఁగ్రాలెడి మిత్రుజైత్రునిం
బొరిగొనవచ్చు గ్రీష్మ మను పోచ్చెపుబేరి పురారి ఫాలభా
సురపటువహ్ని యంచు వెఱఁజొచ్చిన మన్మథుఁగా చె." నృ 3ఆ.
వెఱఁగుపడు : దే. అ. క్రి. 1. ఆశ్చర్యము నొందు.
2. నిశ్చేష్టత నొందు.
వెఱగొందు : దే. అ. క్రి. 1. ఆశ్చర్యము నొందు.
2. భయపడు.
వెఱచఱచు : దే. అ. క్రి. భయపడు.
వెఱచు : దే. అ. క్రి. భయమందు.
వెఱపించు : దే. స. క్రి. భయపెట్టు.
వెఱవేకులందు : దే. అ. క్రి. భయజ్వరము నందు.
వెఱ్ఱెత్తు : దే. అ. క్రి. పిచ్చెత్తు.
వెలందు : దే. అ క్రి. వెలను గ్రహించు.
"ఈ వెలంది గొమెడల్ పైడిలో వెలంది."

వెలకట్టు : దే. స. క్రి. ఖరీదు నిరూపించు.

వెలకిలఁబడు :
వెల్లకిలఁబడు : } దే. అ. క్రి. పడుటలో వీపుమీఁదఁ బడు.

వెలగఁబెట్టు : దే. అ. క్రి. నిర్వాహకముసేయు.

వెలచు : దే. స. క్రి. శుద్ధిచేయు. (పాత్రలు)

వెలచేయు : దే. స. క్రి. 1. వెలకట్టు.
2. కొను.

వెలతెలపోవు : దే. అ. క్రి. వివర్ణత్వమునొందు.

వెలతెలఁబోవు :
వెలవెలఁబాఱు :
వెలవెలఁబోవు :
వెలవెలనగు :
వెలవెలనవోవు:
వెలవెల్లనగు : } దే. అ. క్రి. వివర్ణమగు.

వెలపోయు : దే. స. క్రి. ధాన్యాదులు కొలుచు.

వెలయించు : దే. స. క్రి. ప్రకటించు.

వెలయు : దే. అ. క్రి. 1. ప్రకాశించు.
2. ప్రసిద్ధికెక్కు.
3. బయలుపడు.

వెలరారు :
వెలరువాఱు :
వెలరొందు : } దే. అ. క్రి. తెల్లఁబాఱు

వెలలఁబన్ను : దే. స. క్రి. తఱుము.

వెలలు : దే. అ. క్రి. వెడలు. ప్రే. వెలలుచు.

వెలార్చు :
వెలారుచు :
వెల్వరించు : } దే. స. క్రి. వెడలించు, బయలుపఱచు.

వెలికిలు : దే. అ. క్రి. 1. వీపు క్రిందగు
2. వీపు క్రిందుగాఁ బరుండు.

వెలితిపడు : దే. అ. క్రి. 1. లోపముచూపు.
2. చ్యుతుఁడగు.

వెలిపించు : దే. స. క్రి. వెలిపఱచు.

వెలిపుచ్చు : దే. స. క్రి. బయలుపఱచు.

వెలిబెట్టు :
వెలివేయు: } దే. స. క్రి. బహిష్కరించు.

వెలియు : దే. అ. క్రి. 1. వాన వెలియు.
2. రంగుతగ్గు.

వెలివిరియు : దే. అ. క్రి. 1. ప్రవహించు.
2. ఉబుకు.
3. బయలుపడు.

వెలివిసరు : దే. అ. క్రి. బయలుపడు.

వెలుకఁబాఱు : దే. అ. క్రి. వెల్లబాఱు.

వెలుఁగు : దే. అ. క్రి. 1. ప్రకాశించు.
2. జ్వలించు.
ప్రే. వెలిగించు.

వెలుఁగువేయు : దే. అ. క్రి. 1. (తోటకు) కరవేయు.
2. కంచెవేయు.

వెలుఁగొందు : దే. అ. క్రి. ప్రకాశించు.

వెలుచు :
వెల్చు : } దే. స. క్రి. తోలు (పశువులను.)

వెలుపలించు : దే. స. క్రి. వెలిపఱచు (రూ) వెల్వఱించు.

వెలుపించు : దే. స. క్రి. వెలుపుచేయు.

వెలువడు :
వెల్వడు : } దే. అ. క్రి. బయటఁబడు; బయలుదేరు.
ప్రే. వెలువరించు; వెలువఱుచు.
వెల్వరించు.

వెలువరించు : దే. స. క్రి. బయటికి వెడలఁజేయు.

వెల్లకిలపడు : దే. స. క్రి. వెలకిలఁబడు.

వెల్లకొట్టు : దే. అ క్రి. సున్నము వేయు.

వెల్లచఱచు : దే స. క్రి. వెల్ల వేయు.

వెల్లడించు : దే. స. క్రి. తెలియఁజేయు.

వెల్లనగు : దే. అ. క్రి. వివర్ణతనొందు.

వెల్లఁబాఱు : దే. అ. క్రి. వెలుకఁబాఱు.

వెల్ల వేగు : దే. అ. క్రి. మిక్కిలి తెల్లవాఱు.

వెల్ల వేయు : దే. స. క్రి. సున్నముకొట్టు.

వెల్లిగొను : దే. అ. క్రి. ప్రవహించు. (పరంపరగా)

వెల్లివిరియు : దే. అ. క్రి. 1. బాగుగా ప్రవహించు.
2. వఱదఁబెట్టు.
3. నిండుగా నుండు.

వెల్లివొడుచు : దే. అ. క్రి. 1. ప్రవహించు.
2.. వఱదపొడుచు.

వెల్లువగట్టు : దే. అ. క్రి. 1. ప్రవహించు.
2. మడుగుగట్టు.
3. వఱదఁబెట్టు.

వెల్వెలఁబాఱు : } దే. స. క్రి. 1. వెలవెలఁబాఱు.
వెల్వెలుకబాఱు: } 2. మిక్కిలి వెలుకబాఱు.

వెవ్వెఱలాడు : దే. అ. క్రి. వెలవెలఁబాఱు.

వెవ్వెలుకఁబాఱు: దే. అ. క్రి. వెల్వెలుకఁబాఱు.

వెళ్ళగొట్టు : దే. స. క్రి. వెడలించు.

వెళ్ళబెట్టు : దే. స. క్రి. 1. రహస్యము నవివేకముచేతఁగాని, బాధపెట్టుట చేతఁగాని వదలు.
2. వెల్లడిచేయు.
అ. క్రి. 1. తెలివితక్కువగా ప్రవర్తించు.
2. నాలుక (నోరు) వెళ్ళబెట్టు.
3. చేతగానితనము ప్రకటించు.
4. నిస్సహాయుఁడగు.

వెళ్ళబోసికొను : దే. స. క్రి. దుఃఖమును చెప్పుకొను.

వెళ్ళు : దే. అ. క్రి. వెడలు.

వెసులుబాటగు : దే. అ. క్రి. తీరికచిక్కు.

# వే

వేంచేయు : దే అ. క్రి. 1. వచ్చు.
2. కూర్చుండు.
3. నివసించు.
4. పోవు.

వేఁకటియగు : దే. అ. క్రి. గర్భవతియగు.

వేఁకియగు : దే. అ. క్రి. జ్వరమువచ్చు.

వేఁగు : దే. అ. క్రి. తపించు.

వేఁగుండు : దే. అ. క్రి. కాచియుండు.

వేఁచు : దే. స. క్రి. వేఁగఁజేయు, వేగించు.

వేఁటాడు : దే. స. క్రి. మృగ పక్షి మత్స్యాదులను వెదకిపట్టు.

వేఁడు : దే. స. క్రి. 1. ప్రార్థించు.
2. కోరు.
3. యాచించు. రూ. వేడుకొను.

వేగపడు : మి. అ. క్రి. త్వరపడు. భార ఉద్యో.

వేగించు : దే. అ. క్రి. జాగరముచేయు.

వేగిరపడు : దే. అ. క్రి. త్వరపడు.

వేగిరపెట్టు : దే. స. క్రి. త్వరపెట్టు.
వేగిరించు : దే. స. క్రి. త్వరపడునట్లుచేయు.
వేగు : దే. అ. క్రి. 1. ఉదయమగు.
2. శుభోదయమగు.
3. వేయించుటచే బాధపడు.
వేగునడచు : దే. అ. క్రి. రాయబారము నడచు.
వేచు : దే. స. క్రి. ఎదురుచూచు.
వేడబములాడు : దే. అ. క్రి. మాయలు పలుకు.
వేడబించు : దే స. క్రి. మాయ జేయు.
వేడించు : దే. స. క్రి. చుట్టివచ్చు.
వేడుకపడు : దే. అ. క్రి. కుతూహలపడు.
స. క్రి. అపేక్షించు.
వేడుకసేయు : దే. స. క్రి. అపేక్షపడు, కాంక్షించు. (తెలం)
అ. క్రి. 1. విందుసేయు.
2. పండువుసేయు.
3. కన్నులకు అందముగా నుండు.
4. వినోదము కలిగించు.
వేడుకొను : దే. స. క్రి 1. ప్రార్థేయపడు.
2. బతిమాలు.
3. అడుగు.
వేడెపెట్టు : దే. స. క్రి పరివేష్టింపఁజేయు.
వేదుఱుగొను : దే. అ. క్రి. పిచ్చియెత్తు.
వేదుఱుట్టు : దే. అ. క్రి. పిచ్చియెత్తు.
ఆ దురాత్మునిమాట యాలించి సెవుల
వేదుఱుట్టఁగ నిట్టు వెడలి వచ్చితివి
వత్తురే యెటులైన వనితను దించి
కత్తుల బోనైన గహనంబులోన
క. వ. రా. ఆర.

వేధించు : సం. స. క్రి. 1. తొలిగొట్టు.
2. బాధించు.

వేపుకొనితిను : దే. స. క్రి. మిక్కిలి బాధించు.

వేయించు : దే. స. క్రి. 1. ఉంచునట్లుచేయు.
2. మంగలమున వేయించు.

వేయు : దే. స. క్రి. 1. వైచు.
2. దిగ విడుచు.

వేరమిసేయు : దే. స. క్రి. విరోధము కలిగించు.

వేఱిడించు : దే. స. క్రి. అవివేక మొందఁజేయు.

వేఱుదన్ను : దే. అ. క్రి. పాతుకొను.

వేఱుపడు : | వేఱుపెట్టు : | వేఱుపోవు : } దే. అ. క్రి. 1. భేదపడు.
2. స్పష్టపడు.

వేఱుపెట్టు : దే. స క్రి. కొడుకులు మొ॥ వారికి
వేఱు కాపురములు పెట్టించు.

వేఱుసేయు : దే. స. క్రి. విడిచి చేయు.

వేలముపడు : దే. అ. క్రి. గతిమాలిబలవంతముగానమ్ముడుపడు.

వేలమువేయు : దే. స. క్రి. ఎవడెక్కువ ధరపెట్టునో వాడు కొను
నట్లు పదిమందిలో నమ్ము.
రూ. ఏలమువేయు.

వేలమునను : దే. అ. క్రి. 1. మొక్కవోవు.
2. వ్యర్థమగు.

వేలుచు : | వేల్చు : } దే. స. క్రి. హోమముచేయు.

వేళ్ళపాఱు : దే. అ. క్రి. 1. పాతుకొను.
2. స్థిరపడు.

వేవు : దే. అ. క్రి. వేఁగు. (రూ.)

వేష్టించు : సం. స. క్రి. చుట్టుకొను.

వేసరించు : దే. స. క్రి. శ్రమపఱచు.

వేసరు : } దే. అ. క్రి. 1. శ్రమపడు.
వేసారు: } 2. నొచ్చు.
3. విసుగు. ప్రే. వేసరించు.
4. ఓపికతగ్గు.

వేసుకుపోవు : దే. స. క్రి. బలాత్కారముగ కొనిపోవు.
ఉదా: పులి వేసుకుపోయెను.

## వై

వైచు : దే. స. క్రి. 1. విసరివేయు.
2. విక్షేపించు.
3. పడఁజేయు.

వైతొలఁగు : దే. అ. క్రి. బయటికి తొలఁగు.

వైనమగు : దే. అ. క్రి. 1. విశదమగు.
"వైనంబై శ్రుతి పలుకుచుండు." యా. వి. వి.
(గూ) వయినమగు.
2. పరిష్కారమగు.

వైరించు : సం. స. క్రి. పగగొను.

వైరీకరించు : సం. స. క్రి. శత్రువుగాఁజేయు.

వైళపడు : దే. అ. క్రి. తొందరపడు.

# వ్య

వ్యతిరేకించు : సం. అ. క్రి. విరోధభావము కలిగియుండు.

వ్యభిచరించు : సం. అ. క్రి. 1. తప్పి చరించు.
2. అంకుపోవు.

వ్యయించు : సం. స. క్రి. వెచ్చించు.

వ్యవహరించు : సం. స. క్రి. 1. వివాదముచేయు.
2. వాడుకచేయు.

# వ్యా

వ్యాకరించు : సం. స. క్రి. వివరించు.

వ్యాకులపడు : సం. అ. క్రి. 1. సంతాపపడు.
2. కలతచెందు.

వ్యాఖ్యానముచేయు : సం. స. క్రి. 1. వెక్కిరించు.
2. అధికార్థము చెప్పు.

వ్యాఖ్యానించు : సం. స. క్రి. వ్యాఖ్యానముచేయు.

వ్యాజ్యమాడు : దే. అ. క్రి. వివాదమాడు.

వ్యాజ్యముచేయు: దే. అ. క్రి. వివాదమును కోర్టు కెక్కించు.

వ్యాపించు: సం. అ. క్రి. 1. నిండు.
2. అంతట ప్రసరించు.

వ్యావర్తించు : సం. స. క్రి. 1. విడదీయు.
2. తొలగించు.

వ్యాహరించు : సం. స. క్రి. చెప్పు.

# వ్ర

వ్రక్కలించు : దే. స. క్రి. వ్రక్కలుచేయు, భేదించు.

వ్రక్కవాయు : దే. అ. క్రి. తెగు.

వ్రక్కవాఱు : దే. అ. క్రి. 1. వ్రక్కయగు.
2. చీలు.
3. భేదిల్లు.

వ్రచ్చివందఱలాడు: దే. అ. క్రి. చీల్చి చెండాడు.

వ్రచ్చు : దే. స. క్రి. చీల్చు.

వ్రప్పించు . దే. స. క్రి. చీల్పఁజేయు.

వ్రయ్యఁబడు :
వ్రయ్యలగు : } దే. అ. క్రి. బ్రద్దలగు.

వ్రయ్యవాఱు : దే. అ. క్రి. బ్రద్దలగు; చీలు.

# వ్రా

వ్రాయు : దే. స. క్రి. లిఖించు. ప్రే. వ్రాయించు.

వ్రాలు : దే. అ. క్రి. 1. పక్షి క్రిందికి దిగు.
2. ఒఱగు.
3. తగ్గు.
ప్రే. వ్రాలుచు, వ్రాల్చు.

# వ్రీ

వ్రీలు : దే. అ. క్రి. చీలు. ప్రే. వ్రీల్చు.

వ్రీలుపడు : దే. అ. క్రి. 1. భేదిల్లు.
2. దౌర్బల్యము నందు.

# ప్రే

ప్రేఁగు : దే. అ. క్రి. ప్రేగు. (గూ)
ప్రేఁగుడించు: దే. అ. క్రి. 1. బరువుదించు.
2. గర్వమడఁచు.
ప్రేఁగుపడు : దే. అ. క్రి. భరపడు.
ప్రేఁచు : దే. స. క్రి. వేగఁజేయు.
ప్రేటుగొను : దే. అ. క్రి. దెబ్బతిను, నఱకుడువడు.
ప్రేయు : దే. స. క్రి. 1. కొట్టు.
2. నఱకు.
ప్రేలఁబడు :
ప్రేలాడు :
ప్రేలు :
ప్రేలుకాడు :
} దే. అ. క్రి. ఊఁగు, లంబమానుఁడగు.
ప్రే. ప్రేలుచు.
ప్రేలిడు : దే. స. క్రి. జోక్యము కలిగించుకొను.
ప్రేలుచు : దే. స. క్రి. 1. ప్రేలఁజేయు.
2. కడుగు.
ప్రేలుపెట్టు : దే. అ. క్రి. 1. అనవసరముగా జోక్యము కల్గించుకొను.
ప్రేలెత్తిచూపు : దే. స. క్రి. నిందితునిగాఁజేయు.
ప్రేలుమడచిచెప్పు: దే. స. క్రి. 1. సగౌరవముగా ప్రశంసచేయు.
2. గణించిచెప్పు.
ప్రేలువంపించుకొను: దే. అ. క్రి. దోషి యనిపించుకొను.
ప్రేల్చు : దే. స. క్రి. ప్రేలాడఁజేయు.
ప్రేల్మడచు : దే. అ. క్రి. చిటుకవేయు.

# శ

శంకలుగట్టు : మి. అ. క్రి. సందేహించు.
శంకించు : సం. అ. క్రి. సందేహించు; భయపడు.
శంకిణీయగు : మి. అ. క్రి. గయ్యాళితనము నెఱపు.
శంకిలు :
శంకిల్లు : } దే. అ. క్రి. సందేహించు, భయపడు.
శకటలుపడు : దే. అ. క్రి. వగలుపడు రూ. శకటపడు. (అ.జి)
శకటాలాడు : దే. అ. క్రి. చదరంగమాడు. రూ. సొగటాలాడు.
శకించు : సం. అ. క్రి. సాధ్యమగు.
శఠగోపము(పె)వెట్టు : సం. స. క్రి. 1. మాయచేయు.
2. మోసగించు.
శఠించు : సం. అ. క్రి. మూర్ఖపుపట్టు పట్టు.
శనిపట్టుకొను : మి. అ. క్రి. దుష్కాలము వచ్చు.
శని వదలు : మి. అ. క్రి. చెడురోజులు పోవు.
శపించు : సం. స. క్రి. తిట్టు; శాపించు.
శబ్బరలాడు : దే. స. క్రి. 1. నిష్ఠురములు పలుకు.
2. అవాచ్యములు పలుకు.
శట్రవచ్చు : దే. అ. క్రి. 1. కీడు వచ్చు.
2. ఆపద వచ్చు.
3. పాపము వచ్చు. (తెలం.)
శబ్దించు : సం. అ. క్రి. ధ్వనిచేయు.
శమించు : సం. అ. క్రి. 1. అడఁగు.
2. శాంతినొందు.
శయనించు :
శయించు : } సం. అ. క్రి. పరుండు.
శరణను : దే. స. క్రి. శరణుఁజొచ్చు.

శరణార్థిచేయు : సం. స. క్రి. శరణు పొందు.
శరణుచొచ్చు : వై. స. క్రి. శరణాగతిని పొందు.
శరణువేఁడు : వై. స. క్రి. రక్షణ యడుగు.
శర్ధించు : వై. అ. క్రి. మలవిసర్జనముచేయు.

## శా

శాంతించు : సం. అ. క్రి. శాంతి నొందు.
శాకము(పె)వెట్టు: మి. అ. క్రి. కూర వడ్డించు. (తెలం.)
శాపించు : సం. స. క్రి. శపించు.
శాసించు . సం. స. క్రి. ఆజ్ఞాపించు, శిక్షించు.
శాస్తిచేయు : సం. స. క్రి. 1. శిక్షచేయు.
2. తగినశిక్ష అనుభవింపఁజేయు.
శాస్తియగు : సం. అ. క్రి. శిక్షయగు.

## శి

శికతరుగు : దే. అ. క్రి. కొలతయందు కొప్పు కొట్టి యిచ్చు.
శిక్షచేయు : వై. స. క్రి. శిక్షించు; దండించు.
శిక్షించు : సం. స. క్రి. శిక్షసేయు; నేర్పు.
శిఖాచేయు : (అన్య.) దే. స. క్రి. ముద్రవేయు.
"తను ముద్రచే కాగితము శిఖా చేసి"
(రఘునాథాభ్యుదయము.)
శిగతరుగు : దే. స. క్రి. 1. కొప్పు(జుట్టు) తఱిగివేయు.
2. అవమానపఱచు.
శిబ్బిచేతికిచ్చు : దే. స. క్రి. దరిద్రుని జేయు.
శిరసావహించు: సం. స. క్రి. 1. తలయందు ధరించు; ఆజ్ఞావశవర్తి యగు.
శివమెత్తించు : సం. స. క్రి. పురికొల్పు; ఉద్రేకపఱచు.

## శీ

శీతకన్నువేయు : దే. స. క్రి. దయమాలు, ఉపేక్షించు.

శీతలించు : సం. అ. క్రి. 1. నెమ్మువాఱు.
2. జలుబుచేయు.
3. చావుకు ముందు కాళ్ళు చల్లబడు.

శీలించు : సం. స. క్రి. వాడుకపఱచు, పరిశీలించు.

## శు

శుద్ధిచేయు :
శుభ్రపఱచు: } మి. స. క్రి. స్వచ్ఛముసేయు.

శుశ్రూషించు : సం. స. క్రి. శుశ్రూషచేయు; విను.

శుష్కించు :
శుష్కీభవించు: } సం. అ. క్రి. ఇంకు, ఎండు, కృశించు.

## శూ

శూన్యమగు : సం. అ. క్రి. వట్టిదగు.

## శృ

శృంఖలించు : సం. స. క్రి. సంకెలవేయు.

శృంగారించు : సం. స. క్రి. అలంకరించు.

శృంగారిలు : దే. అ. క్రి. ఒప్పు. అను. 1 ఆ.

శృతికలయు : దే. అ. క్రి. జత కలియు.

శృతిపోయు : దే. అ. క్రి. రాగతాళములకు లయకలుపు.

## శే

శేఖరించు : సం. అ. క్రి. 1. గొప్పవడు.
2. ఉన్నతినందు.
ప్రే. శేఖరింపించు. రం. నా.
3. జరిపించు. మన్నా. వి.
4 సమస్యాపూరణముచేయు. రం.నా

శేషించు : సం. అ. క్రి. మిగులు.

## శో

శోకించు : సం. అ. క్రి. తపించు, వగచు.

శోచించు : సం. అ. క్రి. శోకించు.

శోధించు : సం. స. క్రి. శుద్ధిచేయు, పరిష్కరించు; వెదకు.

శోభించు : / శోభిల్లు : } సం. అ. క్రి. ప్రకాశించు.

శోషించు : / శోషిల్లు : } సం. అ. క్రి. ఇంకు, ఎండు, ప్రాణము శోషపడు.

## శ్ర

శ్రమంపడు : / శ్రమించు : / శ్రవంపడు : } సం. అ. క్రి. కష్టపడు; పరిశ్రమచేయు.

శ్రమపెట్టు : సం. స. క్రి. ఆయాసపెట్టు.

## శ్రా

శ్రావ్యమగు : సం. అ. క్రి. చెవులకింపగు.

## శ్రీ

శ్రీరంగనీతులుచెప్పు: మి. అ. క్రి. తా నాచరింపక యితరులకు నీతులు చెప్పు.

## శ్రు

శ్రుతపఱచు : మి. స. క్రి. తెలియఁజేయు.

## శ్లా

శ్లాఘించు : సం. స. క్రి. ప్రశంసించు.

## శ్లే

శ్లేషించు : సం. స. క్రి. రెండర్థములు వచ్చునట్లు చెప్పు.

## శ్వ

శ్వసించు : } సం. అ. క్రి. నిట్టూర్చు.
శ్వాసించు : }

## ష

షడరించు : సం. స. క్రి. వదలిపెట్టు.

"చరమవేళను మేను షడరించి మించి
విరజానదినిఁగూడి వేడుకలలర.
... ... ...
పరమవైకుంఠంబు భక్తిఁ బొందు.
ము. కాం. ప.

షడాయించు : అన్య. దే. స. క్రి. నూకులువెట్టు.
రూ. సడాయించు.
అ. క్రి. పండ్లు మొ॥ నవి క్రుళ్ళిపోవు.
(తెలం.)

షరతుకట్టు : అన్య. దే. అ. క్రి. పందెము వేయు.
షరతుపెట్టు : అన్య. దే. అ. క్రి. ఏదేని యొక నియమముపట్టు.
షరీకగు : అన్య దే. అ. క్రి. చేరు, కలియు, దురుద్దేశ్యముతో కలియు.
షరీకుచేయు : అన్య. దే. స. క్రి. చేర్చు.
షష్ఠాష్టకమగు : సం. అ క్రి. దెబ్బలాట యగు.

## షో

షోకుచేయు : అన్య. దే. అ. క్రి. డాబుసరిగా ముస్తాబుచేసికొను

## స

సంకటపడు : సం. అ. క్రి. ఇబ్బందిపడు, కష్టపడు.
సంకటపెట్టు : సం. స. క్రి. కష్టపెట్టు.
సంకరమగు : సం. అ. క్రి. కలిసిపోవు, కష్టమగు.
సంకలించు : సం. స. క్రి. ప్రోగుచేయు, ఉద్దేశించు.
సంకల్పించు : సం. స. క్రి. ఏదేని కార్యమును దీక్షతో నొనరించుటకు నిర్ణయించుకొను.
సంకుచించు : సం. అ. క్రి. సంకోచమునొందు.
సంకేతించు : సం. స. క్రి. పేరుపెట్టు; గుర్తు చెప్పు.
సంకొాతు : దే. అ. క్రి. శంఖ మూదు.
సంకోచించు : సం. అ. క్రి. 1. సంకోచమునందు.
2. అనుమానించు.
3. వెనుదీయు.
4. ముడుచుకొను.

సంక్రమించు : సం. స. క్రి. 1. ప్రవేశించు; దఖలుపడు.
2. చెందు (ఆస్తి)
3. వ్యాధులు మున్నగునవి తాకు.

సంక్షేపించు : సం. స. క్రి. సంక్షేపముచేయు; చంపు.

సంక్షోభించు : సం. అ. క్రి. కలతపడు.

సంగడించు : దే. స. క్రి. స్నేహముచేయు.

సంగతమగు : సం. అ. క్రి. సరిపడు, కూడు.

సంగతిగలుపు : సం. స. క్రి. జతగలుపు. (తెలం)

సంగతినిచ్చు : సం. అ. క్రి. రాజదర్శన మగు.

సంగతిబట్టు : సం. స. క్రి. స్నేహము చేపట్టు.

సంగతులుచెప్పు: సం. అ. క్రి. వార్తలు చెప్పు.

సంగమించు : సం. స. క్రి. సంభోగించు, కలియు.

సంగ్రహించు : సం. స. క్రి 1. చక్కగా గ్రహించు.
2. సంక్షేపించు.
3. సమకూర్చు.

సంఘటించు : సం. స. క్రి. ఏర్పాటుచేయు.

సంఘటిల్లు : సం. అ. క్రి. సంభవించు.

సంఘర్షించు : సం. స. క్రి. ఒరయు.

సంఘీభవించు : సం అ. క్రి. ఏకమగు.

సంచరించు : సం. అ. క్రి. తిరుగు; యథేచ్ఛముగా తిరుగు.

సంచలించు : సం. అ. క్రి, 1. మిక్కిలి చలించు.
2. ఊగులాడు.
రూ. (సంచలియించు.)

సంచకరిగట్టు ; దే. అ. క్రి. వస్తువు తనది యని యనిపించుకొనుటకు నామకార్థము కొంత సొమ్మునిచ్చు.

సంచగు : దే. అ. క్రి. ఏకమగు.
సంచికట్టుకట్టు : దే. స. క్రి. వైద్యముసేయు.
సంచిబిగించు : దే. అ. క్రి. వ్యయము చేయకుండు.
సంచిమొదలిచ్చు : దే. స. క్రి. పెట్టుబడిపెట్టు.
సంచివిప్పు : దే. స. క్రి. వ్యయముచేయు.
సంచుమీఱు : దే. అ. క్రి. అతిశయించు.

గీ. కొమిరె పొక్కిలిబంగారుకుండ యందు
రతియు శృంగారమును ధాన్యరాశి నించి
దంచ నిడినట్టి రోకలి సంచుమీఱి
రోమరాజి తనర్చు నారూఢిగాఁగ. హంస.2 ఆ.

సంచెఱుఁగు : దే. స. క్రి. రహస్య మెఱుఁగు; జాడ తెలియు.
సంజీవించు : సం. అ. క్రి. చచ్చిబ్రతుకు.
సంజెవడు : సంధ్యాకాలమగు.
సంతకుపంపు :
సంతకుపోవు : దే. స. క్రి. స్త్రీ గళితశీల యగు.
సంతచెప్పు : దే. అ. క్రి. వేదము సంతచెప్పు.
సంతనకట్టు : దే. అ. క్రి. సన్నద్ధ మగు.
సంతనకొట్టు : దే. అ. క్రి. ఆయత్తపడు; సంక్షోభవించు.
సంతనచేయు : దే. స. క్రి. ప్రోగుచేయు, సిద్ధముచేయు, సమకూర్చు.
సంతనపడు : దే. అ. క్రి. సమకూరు.
సంతనపఱచు : దే. స. క్రి. ప్రే. సమకూర్చుచు.
సంతపడు : దే. అ. క్రి. ఒద్దికపడు.
ప్రే. సంతపఱచు; సంతపెట్టు.
సంతరించు : దే. స. క్రి. సరిపఱచు, సేకరించు, రచించు, ధరించు, కలిగించు.
సంతసపడు :
సంతసించు : వై. అ. క్రి. సంతోషపడు.
సంతసిల్లు :

సంతాపించు :
సంతాపిల్లు : } సం. అ. క్రి. మిక్కిలి తపించు.

సంతోషించు :
సంతోషిల్లు :
సంతోసిల్లు : } సం. అ. క్రి. సంతసించు.

సందడించు : దే. స. క్రి సందడిచేయు; అతిశయించు, తొందర పడు.

సందడిల్లు :
సందడిగొను:
సందడిపడు : } దే. స. క్రి. ప్రే. సందడిగొలుపు.

సందడిసేయు : దే. అ. క్రి. గోలచేయు.

సందర్భించు : సం. అ. క్రి. సమయమగు.

సందరిసించు : వై. స. క్రి. సందర్శించు; చూచు.

సందర్శించు : సం. అ. క్రి. బాగుగాచూచు, తెలిసికొను.

సందిచ్చు : దే. స. క్రి. 1. అవకాశము నొసగు.
2. వెడల్పగు.
3. తనలోపమును వెలిపెట్టుకొను.

సందియపడు : దే. అ. క్రి. సందేహపడు.

సందుకొను : దే. అ. క్రి. వ్యాపించు; కూడు, పరిగ్రహించు.

సందుగొట్టు. దే. స. క్రి. బిడ్డలకు దోషము తగులు.

సందుచే(సే)కొను: దే. అ. క్రి. సందుతీసికొను.

సందుచేసికొను: దే. స. క్రి. ఆతలివానిలోపము నుపయోగించుకొను. (నె. జి.)

సందుదవులు : ద్వ. అ. క్రి. బిడ్డలకు సందుదోషము తగులు.

సందునీళ్ళుపోయు: దే. అ. క్రి. బాలెంతకు విధివిధానముగా స్నానము చేయించు.

సందువడలు : దే. అ. క్రి. 1. ఖాళీయిచ్చు.
2. అవకాశమిచ్చు.
3. సడలిచ్చు.
ఉదా: ప్రేమభావన సందువదలెను.

సందెల్లు : దే. అ. క్రి. 1. నెలవంకవచ్చు.
2. నెలవంక చూచు.
(గూ. సందుచూడు.)

సందేశించు : సం. స. క్రి. సందేశము నంపు.

సందేహించు : సం. అ. క్రి. సందేహపడు.

సంధానించు : సం. స. క్రి. కూర్చు.

సంధానపడు : సం. అ. క్రి. సమకూడు.
ప్రే. సంధానపఱచు; సంధానపెట్టు.

సంధించు : సం. స. క్రి. సంధిచేయు; కూడు,
వ్యాధిలో స్మృతిమాలు.

సంధిల్లు : సం. అ. క్రి. కూడు.

సంధ్యవార్చు : సం. అ. క్రి. సంధ్యావందనము చేయు.

సంపత్తిల్లు : సం. అ. క్రి. సమృద్ధమగు.

సంపాదించు : సం. స. క్రి. 1. గడించు. పత్రిక సంపాదించు.
2. వెలయిచ్చి కొనక వస్తువులను సేకరించు.

సంపు : దే. స. క్రి. చంపు (గూ)

సంపుటించు : సం. అ. క్రి. ముకుళించు, సంపుటమునఁబెట్టు,
సంపుటీకరించు.

సంపుటీకరించు : సం. స. క్రి. గ్రంథమును సంపుటముగాఁజేయు.

సం|ప్రతించు : సం. స. క్రి. 1. లెక్క మొదలైనవానిని సరిచూచు
2. సరిపోల్చు.
3. సమాలోచనముచేయు.

సంప్రతిష్ఠించు : సం. స. క్రి. ప్రతిష్ఠించు,
సంప్రాశించు : సం. స. క్రి. ప్రాశించు.
సంప్రోక్షించు : సం. స. క్రి. 1. సంప్రోక్షణముచేయు.
2. జారత్వముచేయు.
సంబాధపడు : సం. అ. క్రి. 1. పోసగు.
2. కొటకపడు.
3. జతపడు.
4. వియ్యమందు. (నీచార్థములో.)
సంబాధించు : సం. అ. క్రి. సంబంధపడు.
సంబరపడు : దే. అ. క్రి. సంభ్రమించు; సంతోషపడు,
అనుకూలపడు.
సంబళమిచ్చు : దే. స. క్రి. భోజన సామగ్రి యిచ్చు.
సంబళించు: } దే. స. క్రి. 1. తొలఁగఁబెట్టు.
సంబడించు : } 2. దివవెచ్చము పుచ్చుకొను.
సంబళించుకొను : దే. అ. క్రి. తేఱుకొను.
సంబాళించుకొను: దే. అ. క్రి. ఓదాఱు, తేఱుకొను.
సంబెరమిచ్చు : దే. అ. క్రి. జలాంజలికై జలము నిచ్చు.
హార. 3 ఆ.
సంబెరముచూపు: దే. అ. క్రి. జలము చూపు. కు. సం. 5 ఆ.
సంబోధించు : సం. స. క్రి. పిలుచు, పేరుపెట్టి పిలుచు.
సంబ్రపడు : దే. అ. క్రి. సంబరపడు, సంతోషపడు.
సంభజించు : } సం. స. క్రి. కొలుచు.
సంభజియించు: }
సంభరించు : } సం. స. క్రి. మోయు.
సంభరియించు: }
సంభవించు : } సం. అ. క్రి. జరుగు, కలుగు.
సంభవిల్లు : }

సంభావించు : సం. స. క్రి. చక్కఁగా తలఁచు, సమ్మానించు.
సంభాషించు : సం. అ. క్రి. 1. ఆదరముతో మాటాడు.
2. ఒండొరులతో మాటలాడుకొను.
3. చెప్పు.
సంభోగించు : సం. అ. క్రి. కలయు, రమించు, అనుభవించు.
సంభ్రమించు : సం. అ. క్రి. 1. వేగిరపడు.
2. తిరుగుడుపడు.
3. తత్తరపడు.
సంయమించు : సం. స. క్రి. నియమించు. (ఇంద్రియాదులను)
సంయోగించు: సం. స. క్రి. కూడు, కూర్చు.
సంరంభించు : సం. అ. క్రి. వేగిరపడు, ఆటోపించు.
సంరక్షించు : సం. స. క్రి. కాపాడు.
సంరోధించు ; సం. స. క్రి. అడ్డగించు.
సంవదించు : సం. స. క్రి. సరిపోలు.
సంవర్ధించు : సం. స. క్రి. పెంచు.
సంవాహించు : సం. స. క్రి. 1. సంవాహనము చేయు.
2. కాళ్ళు మొ॥నవి పిసుకు.
సంవిభాగించు : సం. స. క్రి. పంచు.
సంవీక్షించు : సం. స. క్రి. అభివీక్షించు.
సంశయించు : సం. స. క్రి. సందేహించు.
సంశ్రయించు : సం. స. క్రి. ఆశ్రయించు.
సంశ్లేషించు : సం. స. క్రి. కౌఁగిలించు.
అ. క్రి. సంధి పొందు. (పదము.)
సంసరించు : సం. అ. క్రి. పుట్టు, సంసృతి నొందు.
సంస్కరించు : సం. స. క్రి. 1. చక్కఁజేయు.
2. పరిష్కరించు.
3. సంస్కార మొనరించు.
4. తప్పులు దిద్దు.

సంస్తంభించు : సం. అ. క్రి. కదలకుండు.
సంస్తవించు : సం. స. క్రి. బాగుగా స్తుతించు.
సంస్తుతించు : సం. స. క్రి. మిక్కిలిగా పొగడు.
సంస్పృశించు : సం. స. క్రి. తాకు.
సంస్మరించు : సం. స. క్రి. స్మరించు.
సంహరించు : సం. స. క్రి. చంపు.
సకిలించు : దే. అ. క్రి. 1. గుఱ్ఱము హేషపెట్టు.
2. శేషించు.
3. బదులు చెప్పలేక నోటితో ధ్వనిచేయు.
సఖ్యపడు : మి. అ. క్రి. స్నేహముచేయు.
సగపెట్టు : దే. స. క్రి. 1. సర్దు.
2. వెదుకు.
3. పొందుపఱచు. (తెలం.)
సగిలించు : దే. అ. క్రి. సకిలించు.
సగిలిపాఱు : దే. స. క్రి. పేడ మొ॥వాని సారపునీరు చేలలో ప్రవహించు. (నె. జి.)
సగ్గు : దే. అ. క్రి. అడఁగు. (సగ్గుబియ్యము.)
సగ్గుడుమగ్గుడగు: దే. అ. క్రి. బాగుగా నలఁగు.
సచ్చు : దే. అ. క్రి. 1. చచ్చు.
2. శక్తి యుడుగు. (వ్యవ.)
సజాయించు : దే. స. క్రి అలంకరించు.
సజ్జించు : దే. స. క్రి. సిద్ధపఱచు, అలంకరించు.
సజ్జీకరించు : దే. స. క్రి. సిద్ధముచేయు.
సడపు : దే. స. క్రి. అపహరించు.
సడలించు : దే. స. క్రి. వదులుచేయు. గూ. సడల్చు.
సడలు : దే. అ. క్రి. ఊడు, జాఱు, వదులగు.
ప్రే. సడలుచు.

సడుపు(వు)డు : దే. అ. క్రి. సడలు.

సడించు : దే. స. క్రి. ఎసటిపోఁతలుగాదంచు.

సడీయించు : దే. స. క్రి. కుదించు, "సన్నబియ్యముగా
సడియించి కడిగి." చా. చ.

సడ్డగొను : దే. అ. క్రి. లెక్కఁగొను.

ద్వి. ఇవ్వేళ నాదు కట్టెనురను నిలిచి
కనిపించుకొని కడకలకును బోక
నను నొక్క చీరికైనను సడ్డగొనక
కనువాడిచినయట్లు గర్వించు, నిలుచు
నిను వసిష్ఠునిఁ జూచి నేడు తాళితిని.
క.వ.రా. అయో.

సడ్డచేయు : దే. స. క్రి. లక్ష్యపెట్టు.

సణఁగు : }
సణుగు : } దే. స. క్రి. 1. విడువకుండ జెప్పు.
2. గొణుగుకొను.

సతగొట్టివైచు : దే. స. క్రి. వజ్రాయుధము వైచు.
సతగొట్టి= వజ్రాయుధము.

ద్వి. వెసదంతిఁ బురికొల్పి విబుధ నాయకుఁడు
సతగొట్టివైచిన సమకుగాఁ గొనక.
క.వ.రా. యుద్ధ.

సతపోయు : దే. స. క్రి. వెంటబడి విసిగించు,
ఎక్కువగా యత్నించు.

సతమతమగు : దే. అ. క్రి. ప్రయాసపడు.

సతాయించు : అన్య. దే. స. క్రి. హింసించు, బాధించు.

సత్కరించు : }
సత్కారముచేయు: } సం. స. క్రి. సమ్మానము చేయు.

సత్కాటీయు : అన్య. దే. స. క్రి. దృష్టితీయు.
"బంగారపుతొట్లోను బాలుని తీసుకువచ్చిరి
తబుకుతో వరహాల్ త్రవ్విరి, సత్కాటీసిరి
బాలున కానల నీనల జల్లిరి." కు. రా.

సదమదమగు : దే. అ. క్రి. నలఁగు. గూ. సతమతమగు.

సదమదము సేయు : } దే. స. క్రి. నలఁపు, చంపు.
సదమదమొనరించు : }

సదరు : దే. అ. క్రి. సర్దు.
క. వచ్చి యిది యేమి చెలి యని
విచ్చలవిడి వీపుచఱచి వెఱవకు మని లో
నొచ్చిన భయమున సదరినఁ
గచ్చుగ నిట్లనియె గోపకన్యక సతికిన్.
హంస. 2 ఆ.

సదించు : దే. స. క్రి. రేకుగాఁగొట్టు.

సద్దడించు : దే. అ. క్రి. సందడించు, ధ్వనిచేయు.
ద్వి. ఎద్దు లావులు కోడె లేపార మిగుల
సద్దడింపుచు పరిజనములతోడ. కా. క.

సద్దిగట్టు: దే. స. క్రి. వెంబడి భోజనము నిచ్చి పంపు.

సద్దివడు : దే. అ. క్రి. చలిది యగు.

సద్దుమణుగు : దే. స. క్రి. 1. నిశ్శబ్దమగు.
2. పైకి పొంగక శమించు.

సనకటించు : దే. స. క్రి. వినికిడి చేయు. వి. రా. కల్యాణము.

సను : దే. అ. క్రి. చను, వెళ్లు.

సనుకొను : దే. స. క్రి. పూనుకొను.

సన్నగిలు(ల్లు) దే. అ. క్రి. 1. సన్నమగు.
2. దిగజాఱు.
3. కృశించు.

సన్నద్ధముచేయు: మి. స. క్రి. సిద్ధముచేయు.
సన్ననేత్రసేయు:
సన్ననూయవడఁకు: } దే. స. క్రి. మిక్కిలిగా చిక్కు.
సన్నప(వ)డు : దే. అ. క్రి. చిక్కిపోవు, పలుచఁబడు.
సన్నవాఱు : దే. అ. క్రి. పలుచఁబడు.
సన్నసేయు : దే. స. క్రి. సైగచేయు.
సన్నాయినొక్కులునొక్కు: దే. అ. క్రి. ఉండి ఉండి ఒడుపుగా వ్యవహారము చెడిపోవు మాటలాడు.
సన్నాయిపట్టు : దే. అ. క్రి. రాగము తీసి యేడ్చు.
సన్నాహముసేయు: సం. స. క్రి. యత్నించు.
సన్నిధియగు : సం. అ. క్రి. సన్నిధిసేయు; ప్రత్యక్షమగు.
సన్నుతించు : సం. స. క్రి. చక్కగా స్తోత్రముచేయు.
సన్మానించు : సం. స. క్రి. గౌరవించు, సమ్మానించు.
సన్న్యసించు : సం. అ. క్రి. 1. కామ్యకర్మములను విడచు.
2. ఆశ్రమ స్వీకారముచేయు.
సప్రాణించు : సం. స. క్రి. ప్రాణము కలుగునట్లు చేయు.
సమకట్టు : దే. స. క్రి. ప్రయత్నించు, చేయు.
సిద్ధపఱచు, సేకరించు, ఏర్పఱచు.
సమకుఱు : దే. అ. క్రి. సమకూఱు. (గూ)
సమకూడు :
సమకూఱు : } దే. అ. క్రి. లభించు; సిద్ధించు.
సమకొను : దే. అ. క్రి. లభించు, సిద్ధించు. ప్రే. సమకొలుపు.
సమపఱచు : దే. స. క్రి. సమానముచేయు.
సమపాళముచేయు: దే. స. క్రి. 1. సమానముగా కలుపు.
2. సమముగా పంచు. వి.
3. అనుభవయోగ్యముగా కలుపు.

సమయపడు : దే. అ. క్రి. సంకేతిత మగు.

సమయమువచ్చు: సం. స. క్రి. అవకాశము లభించు.

సమయించు : సం. స. క్రి. చంపు.

సమయు : దే. అ. క్రి. చచ్చు, నశించు. ప్రే. సమయించు.

సమర్తాడు : దే. అ. క్రి. ఋతుమతియగు.

సమర్థించు : సం. స. క్రి. 1. పట్టినది తగినట్లు నెఱవేర్చు.
2. బలపఱచు.
3. చక్కఁగా నిర్వహించు.

సమసించు : సం. అ. క్రి. 1. సమాసమగు. (వ్యాక.)
2. సరిపోవు.

సమసిపోవు : దే. అ. క్రి. కరగిపోవు, చనిపోవు.

సమాకర్షించు: సం. స. క్రి. మిక్కిలి ఆకర్షించు.

సమాధానపడు : సం. అ. క్రి. సమ్మతిపడు. ప్రే. సమాధానపఱచు.

సమాధానమగు: సం. అ. క్రి. 1. అంగీకారమగు.
2. రాజీపడు.
3. ఇష్టమగు.

సమాప్తించు : సం. స. క్రి. ముగించు, చంపు.

సమార్జించు : సం. స. క్రి. సంపాదించు.

సమాళించు . దే. స. క్రి. సంబాళించు, ఓదార్చు.

సమావిష్టపఱచు: సం. స. క్రి. సమావేశపఱచు.

సమావేశించు : సం. అ. క్రి. సమావేశమగు.

సమాశ్వాసించు : సం. స. క్రి. ఓదార్చు.

సమీకరించు : సం. స. క్రి. సమాకలనముచేయు.

సమీక్షించు : సం. స. క్రి. 1. బాగుగా చూచు.
2. పరిశీలించిఅభిప్రాయముప్రకటించు

సమీపించు : సం. అ. క్రి. చేరువయగు.

సముచ్చయించు: సం. స. క్రి. కూర్చు.

సముజాయించు: అన్య. దే. అ. క్రి. నచ్చజెప్పు.
ఉదా: ఈ ఫిర్యాదు ఏలాగున సముజాయింతును.
కు. రా.
సముతుపడు : దే. అ. క్రి. పట్టువడు.
సముదాయించు : దే. స. క్రి. ఓదార్చు.
భాగతము. శ్రీరంగకవి జలక్రీడలు.
సముద్ధూళించు : సం. అ. క్రి. 1. విభూతి పూసికొను.
2. గందవొడి చల్లుకొను.
సముద్భూషించు: సం. స. క్రి. హెచ్చుగా స్తుతించు.
సముద్వీక్షించు : సం. స. క్రి. లెస్సగా చూచు.
సముద్ఘోషించు : సం. స. క్రి. 1. ఆక్రోశించు.
2. గొంతెత్తిచెప్పు.
సమ్మతపడు : సం. అ. క్రి. సమ్మతించు.
సమ్మతించు :
సమ్మతిల్లు : } సం. అ. క్రి. అంగీకరించు.
సమ్మదపడు : సం. అ. క్రి. సంతోషించు.
సమ్మర్దించు : సం. స. క్రి. మెత్తగా కొట్టు.
సమ్మానించు : సం. స. క్రి. గౌరవించు.
సమ్మార్జించు : సం. స. క్రి. కడుగు.
సమ్ముఖమిచ్చు: సం. స. క్రి. దగ్గఱకు జేర్చు.
సమ్మెటపెట్టు : దే. స. క్రి. సమ్మెటవేయు.
సమ్మెటవేయు : దే. స. క్రి. 1. సమ్మెటతో గొట్టు.
2. బాధించు.
సమ్మోదించు : సం. అ. క్రి. మిక్కిలి సంతసించు.
సమ్మోహించు : సం. అ. క్రి. మరులుకొను.
సయించు : దే. అ. క్రి. అన్నాదులు హితమగు (రూ) సహించు
సయిచు : దే. అ. క్రి. క్షమించు; ఓర్చుకొను. (రూ. సైచు)

సయిరించు : దే. స. క్రి. క్షమించు, ఓర్చుకొను.
సయ్యమాడు : దే. అ. క్రి. పరాచికమాడు.
ఉ. చూచితె సహ్యజాతటిని శుభ్ర......జాహ్నవీ
ప్రాచరితంబు కేశవపదాశ్రయ మంబరకేశమూర్ధగ
మ్యోచిత మమ్మహావిభవ మొప్పనె నీకని సయ్యమాడలో
నాచ కపత్రపాతిశయ మద్భుతమై యతిదారుణంబుగన్.
వల్లభాభ్యుదయము. 1 ఆ.
సయ్యాటలాడు : దే. అ. క్రి. (పిల్లి పిల్లలతోనాడు) పరిహాసమాడు.
సయ్యాటించు : దే. స. క్రి. పరిహసించు.
సరదు : దే. స. క్రి. ఏర్పాటుగా నమర్చు.
సరబడించు : దే. అ. క్రి. మెత్తబడు.
సరభసిల్లు : సం. అ. క్రి. తొందరపాటు పొందు.
"పేరు విన్నప్పుడే భూతచయము
దిగులున సరభసిల్లి. హం౦స. 3 ఆ.
సరమగొను : దే. అ. క్రి. శ్రమగొను.
సరసమాడు : సం. స. క్రి. ప్రేమతో పరిహాసములాడు.
సరసు : దే. స. క్రి. సమభాగముగా పంచు.
సరాగములాడు : సం. స. క్రి. ప్రేమాలాపము లాడు.
సరించు : సం. అ. క్రి. పోవు
సరికట్టు : దే. అ. క్రి సరిదాకు; సరిచేయు.
సరికడచు : దే. స. క్రి. మీరు.
సరిగొను : దే. స. క్రి. చంపు, రూపుమాపు.
సరిచేయు : దే. స. క్రి. 1. బాగుచేయు.
2. నాశనముచేయు.
3. సమానముచేయు.
4. సర్దుపాటుచేయు.
రిచూచు : దే. స. క్రి. సంప్రతించు; పోల్చిచూచు.

సరితూగు : దే. అ. క్రి. 1. సమానమగు.
2. పంతమునకు వచ్చు. (తెలం.)
3. సాటికివచ్చు.

సరిదాకు : దే. అ. క్రి. దృష్టాంతమగు.

సరిపడు : దే. అ. క్రి. 1. అనుకూలమగు.
2. సమానమగు.
3. చాలు.

సరిపెట్టు : దే. స. క్రి. సరిచేయు, చాలించు, చంపు.

సరిపోలు : దే. అ. క్రి. సరిపడు.

సరిపోవు : దే. అ. క్రి. సమానమగు; సమాధానమగు.

సరిబేర్చు : దే. అ. క్రి. సమానముగ నతిశయిల్లు.

సరిజేసియగు : దే. అ. క్రి. అయిపోవు; నశించు, వ్యవహారము చెడు;

సరియగు : దే. అ. క్రి. నశించు.

సరియు : దే. స. క్రి. సమవిభాగము సేయు.

సరివచ్చు : దే. అ. క్రి. పోలు, సమానమగు.

సరిసరియనిబ్రదుకు: దే. అ. క్రి. ఆధివ్యాధుల వలన మంచముపట్టి చావ సిద్ధమై, చివర కెట్లో బ్రతుకు.

సరుకుగొను :
సరకు సేయు : } దే. స. క్రి. లక్ష్యపెట్టు.

సరుగు : దే. అ. క్రి. పెరుగు, వర్ధిల్లు.

సరుదు : దే. అ. క్రి. సరదు (డబ్బు సర్దాడు.)

సరుసుకొను : దే. అ. క్రి. పాలు పంచుకొను.
"రారోయి దైత్యవీరులార మీర లమరులతోడ
సరిగాగ నమృతంబు సరుసుకొందురుగాని: హే. స్వా.

సర్దు : దే. స. క్రి. సరిగా నమర్చు.

సర్దుకొను : దే. స. క్రి. 1. సవరించుకొను.
2. సర్దుబాటు చేసికొను.
సఱుమను : దే. అ. క్రి. స్రుక్కు.
సలించు : దే. అ. క్రి. చలించు.
సలగమాడు : దే. అ. క్రి. పశువులు అమేధ్యము తిను.
సలపరించు : దే. అ. క్రి. 1. కురుపు బాధించు.
2. ఒడలున జ్వరము మొదలిడు.
సలసలక్రాగు : దే. అ. క్రి. నీళ్ళు తెర్లుచు కాగు
సలసలమను : దే. అ. క్రి. 1 క్రాఁగు.
2. తెర్లు.
సలాముచేయు : అన్య. దే. స. క్రి. ఒంటిచేతితో ఫాలాభివాదనము
చేయు. సుకుమారీ పరిణయము.
సలికెపెట్టు : దే. స. క్రి 1. సలికతో సరిచేయు.
2. పాఱతో చెలుగు (తెలం.)
సలిక = చిన్నపాఱ.
సల్లపెట్టు : దే. స. క్రి. సడలునట్లు చేయు. శుక.
సల్లాపించు : సం. అ. క్రి. పరస్పరము సంభాషించు.
సళించు : దే. అ. క్రి. దుఃఖించు. నీలా. 2 ఆ.
సళుపరించు :
సళుపు : } దే. అ. క్రి. వ్రణము లోనగునవి పోటెత్తు.
సళ్ళపెట్టు : దే. స. క్రి. వదులుచేయు.
"శబరకాంతలగుట్టు సళ్ళఁబెట్టు" మ.చ.
సళ్ళు : దే. అ. క్రి. ఊఁగు, జాఱు, వదలు. రూ. సడలు.
సళ్ళుకొను : దే. అ. క్రి. సడలుకొను.
సవదరించు : దే. స. క్రి. 1. చక్కఁజేయు.
2. భరించు.
సీ. సవదరించుటయెట్లు జఠరగోళమునందు
నవమమాసావసానంబుదాఁక. కాశీ. 6 ఆ.

సవరచేయు : దే. స. క్రి. చక్కజేయు.

సవరణసేయు : } దే. స. క్రి. 1. వాహనాదుల నలంకరించు.
సవరణించు : } 2. తప్పుదిద్దు.

సవరపోవు : దే. అ. క్రి. పొలము చవుడెక్కు.

సవరించు : } దే. స. క్రి. 1. అలంకరించు.
సవరింతచేయు: } 2. చక్కఁబఱచు.
3. కూర్చు.
4. తాల్చు.
5. చేయు.
6. తప్పుదిద్దు.
7. ఛీత్కారము చేయు.

సవరిల్లు : దే. అ. క్రి. అందమగు: ఒప్పు.

సవరుచు : దే. స. క్రి. సవరించు; చిత్రించు.

సవరుచూపు : దే. అ. క్రి. అందముచూపు.

సవాలుచేయు : అన్య. దే. స. క్రి. ప్రశ్నించు.

సశిచేయు : దే. అ. క్రి. సాగుకు సిద్ధమగు.

సశిపోయు : దే. స. క్రి. నారుపోయు.

## సా

సాఁకించు : దే. స. క్రి. పెంచునట్లుచేయు.

సాఁకు : దే. స. క్రి. కాపాడు, పెంచు.

సాఁగదీయు : దే. స. క్రి. 1. దీర్ఘీకరించు.
2. బతిమాలు.
3. విమర్శించు.

సాఁగిలఁబడు : దే. స. క్రి. దండప్రణామము చేయు.

సాఁగు : దే. అ. క్రి. దీర్ఘమగు, దండాకారముగా నేలకు వ్రాలు.

సాకతముచేయు: దే. స. క్రి. ఊరడించు, అనుగ్రహించు.

సాకిరియగు : దే. అ. క్రి. సాక్ష్యము చెప్పు.

సాకుబెట్టు : దే. స. క్రి. నెపము పెట్టు.

సాక్షాత్కరించు. సం. అ. క్రి. ప్రత్యక్షమగు.

సాగఁదీయు : దే. స. క్రి. 1. లాగి పొడవుచేయు.
2. బ్రతిమాలు.
3. లేని విషయమును పెంచు.

సాగదోలు : దే. స. క్రి. క్రొత్తగా గిత్తలను వ్యవసాయము లోనికిఁ దెచ్చు.

సాగనంపు : దే. స. క్రి. ఆప్తులను కొంతదూరము పంపించు.

సాగవేయు : దే. స. క్రి. చేర వేయు.

సాగించు : దే. అ. క్రి. జరిగించు; సాగునట్లుచేయు.

సాగు : దే. అ. క్రి. 1. పోవు.
2. ప్రవర్తిల్లు.
3. యత్నించు.
4. జరగు.

సాగుచేయు : దే. స. క్రి. వ్యవసాయము చేయు.

సాగుదెంచు : దే. అ. క్రి. సాగు.

సాగుమానముచేయు: దే. అ. క్రి. సహగమనము చేయు.
"అనిలోనఁ దిక్కన్న హతమాయెనయ్యా
ఆ మహాత్ముని భార్య యతిపుణ్యకాంత
సాగుమానముచేసి జననాథ! కా. క.

సాటియగు : దే. అ. క్రి. సమానమగు.

సాదు : దే. స. క్రి. అర్పించు.

సాత్కరించు : సం. స. క్రి. తత్స్వరూప మొందించు.
(భస్మసాత్కరించు.)

సాతాళించు : దే. స. క్రి. ఉక్కలించి పోపుచేయు.

సాదమొందు : దే. అ. క్రి. నాశనమందు.
'కాశికా భూరివిషాదము సాదమందగన్.'
పాండు. 1. ఆ.

సాదించు : దే. స. క్రి. 1. నెఱవేర్చు.
2. సమకూర్చు.
3. దెప్పు.
4. పగదీర్చుకొను.
5. క్రొత్తగా వచ్చిన కోడలిని తమ యింటి ఆచారముల కలవడునట్లు చేయు.
(ఇది నిందారూపకముగానే యుండును.)
అ. క్రి. అన్నము వండు.

సాదు : దే. స. క్రి. పెంచు.

సానపట్టు : దే. స. క్రి. మెఱుఁగుదీర్చు, పదనుపెట్టు.

సానలుదేఱు : దే. అ. క్రి. 1. మెఱుఁగుఁదేఱు.
2. ఆరితేరు.

సాపడు . దే అ. క్రి. భోజనము చేయు. రూ. సావడు.

సాపించు : దే. స. క్రి. తిట్టు.

సాముచేయు : దే. అ క్రి. కజ్జ త్రిప్పు.

సామ్యముపెట్టు: దే. అ. క్రి. పోలిక పఱచు.
ఉదా: వానికి నాకును సామ్యము పెట్టుదువా?

సాయంపడు:
సాయపడు:
సాయముచేయు:
సాయముపడు: } దే. అ. క్రి. సాహాయ్యపడు.

సాయిదాపాయిదాగాపోవు: దే. అ. క్రి. అన్యోన్యము సహాయముగా నుండు.

సారించు : దే. స. క్రి. చాచు, సరిదీయు, నారి సారించు.

సారెవెట్టు : దే. స. క్రి. నూతన వధువును అత్తవారింటికి పంపునపుడు తినుబండారములు, వస్తువులు, చీరెలు మొ॥నవి పంపు.

సార్లాచేయు: అన్య. దే. స. క్రి. సరిచేయు.

సాల్పడు : దే. అ. క్రి. చిక్కుపడు.

సాల్వడు : దే. అ. క్రి. నిస్సారమగు. ఒరగు, చాలుగాపడు. ప్రే. సాల్వాఱచు.

సాళగించు : దే. అ. క్రి. మేళనమగు.

సాహిత్యమిచ్చు: సం. అ. క్రి. భోజన మిచ్చు.

## సి

సింగారించు : దే. స. క్రి. అలంకరించు.

సిగఁగోయు:
సిగఁదఱుగు: } దే. స. క్రి. జుట్టు గొఱిగించు.

సిగపట్లగోత్రమగు:
సిగపట్లుపట్టు : } దే. అ. క్రి. కలహించు.

సిగఱు :
సిగ్గిలు :
సిగ్గిల్లు :
సిగ్గుపడు:
సిగ్గువోవు: } దే. అ. క్రి. సిగ్గుచెడు.

సిడిచెట్టు : దే. అ. క్రి. సిడిమాను వేయు, పిల్లలు పోరుపెట్టు,
స. క్రి. సంకటపెట్టు. (నె. జి.)
సిద్ధపఱచు : సం. స. క్రి. తయారుచేయు.
సిద్ధమగు : సం. అ. క్రి. ఆయత్తమగు.
సిద్ధాంతీకరించు : సం. స. క్రి. సిద్ధాంతముచేయు.
సిద్ధించు : సం. అ. క్రి. ఈడేఱు, సమకూడు.
సిద్ధిపొందు : సం. స. క్రి. సాధించు.
అ. క్రి. మరణించు.
సిఫారసు చేయు : అన్య. దే. అ. క్రి. మాటసాయపడు.
సిబ్బితిపడు : దే. అ. క్రి. 1. కష్టపడు.
2. సిగ్గుపడు.
సిలుగుపెట్టు : దే. స. క్రి. కష్టపెట్టు.
సిలుగులఁబడు : దే. అ. క్రి. అపాయములోఁ జిక్కుకొను.
సిళ్లాడు : దే. అ. క్రి. ఉత్సవమాడు. వి. రా.
సిళ్ళుగుపెట్టు : దే. స. క్రి. కష్టపెట్టు.
సిఱ్ఱుచూపు : దే. స. క్రి. బెదరించు, పరాక్రమించు.
సివమెత్తు : దే. అ. క్రి. పూనకముపూను, ఆవేశము నందు.
సిస్తుచేయు : దే. స. క్రి. అలంకరించు; సరిచేయు, సాగుచేయు.

సీకొట్టు : దే. స. క్రి. తిరస్కరించు.
సీత్కరించు : దే. స. క్రి. చీదరించు, సీత్కారముచేయు.
సీదాయిచ్చు : దే. అ. క్రి. సాహిత్యమిచ్చు.
సీలువేయు : అన్య. దే. స. క్రి. ముద్ర లగించు.
(భమిడిపాటి అప్పకవి భామాకలాపము.
సీవరించు: } దే. స. క్రి. కోపముచే చీదరించు.
సీవరిసు : }

సుంకముపట్టు : దే. అ. క్రి. 1. దొరతనముచేయు.
2. పన్ను వసూలుచేయు.
స. క్రి. తక్కువపఱచు.

సుంకురాల్చు : దే. స. క్రి. పోగరడంగించు.
'సురవైరులనుబట్టి సుంకురాల్చితిని.'
క న. రా. సుం.

సుకుమారీకరించుకొను: సం. స. క్రి. కోమలము గావించుకొను.

సుఖించు : సం. అ. క్రి. సుఖపడు.

సుడిగొను : దే. స. క్రి. చుట్టుకొను. ప్రే. సుడిగొలుపు.

సుడిఁబడు : దే. అ. క్రి. సుడిపడు (గూ.)

సుడితిరుగు : దే. అ. క్రి. యోగ్యతకుమించు, అదృష్టము తిరుగు.

సుడిప(వ)డు : దే అ. క్రి. 1. ప్రవాహములో క్రింద నేర్పడిన గుండములవలన నీరు వలయముగా తిరుగు.
2. అనిలావర్తమగు.

సుడియుండుకొను: దే. అ. క్రి. అదృష్టముపట్టు.

సుడియు : దే. అ. క్రి. చుట్టి చుట్టి వీచు, చుట్టుకొను.

సుడివడు : దే. అ. క్రి. 1. చుట్టుకొను.
2. చలించు.
3. కష్టములో మునుఁగు.

సుడివోవు : దే. అ. క్రి. వ్యర్థమగు.

సుడిసుద్దములుచెప్పు: దే. అ. క్రి. అంగసాముద్రికమున సుడులకు సంబంధించిన సూక్తములు చెప్పు.
(చెంగల్వరాయని మొలుకల కథ)

సుఱుగు : దే. స. క్రి. వంచించు.

సుద్దగించు : దే. స. క్రి. బంగారువలోనగు వానిని సుత్తెతో మిట్ట పల్లములు లేకుండ సరిచేయు.

సుద్దిచేయు : దే. స. క్రి. శుద్ధిపఱచు.

సుద్దులాడు : దే. అ. క్రి. 1. నీతులు చెప్పు.
2. సోదె చెప్పు.

సుద్దులుచెప్పు : దే. అ. క్రి. సుద్దులు వెట్టు.

సుద్దులువెట్టు : దే. అ. క్రి. ముచ్చటలు చెప్పు. (తెలం.)

సునాయించు : దే. అ. క్రి. 1. గుడ్డలు మొదలైనవి సర్దుకొను.
2. వినిపించు.

సున్నగిల్లు : దే. అ. క్రి. శూన్యమగు.

సున్నచుట్టు : దే. స. క్రి. పనిని పూర్తిగ పాడువెట్టు.

సున్నముచేయు: దే. స. క్రి. మెత్తగా చేయు.

సున్నవెట్టు : దే. అ. క్రి. 1. ఎగగొట్టు.
2. వంచించు.

సుబ్బనచూఱలాడు: దే. స. క్రి. పెద్దగా కొల్లగొను.

సుబ్బు : దే. అ. క్రి. బయలువడు.
'వెలివిసరి యపుడ సుబ్బెడునది.' ప్రభా. 1. ఆ.

సుబ్బువుట్టు : దే. అ. క్రి. నింద పుట్టు.
ద్వి. దబ్బర యని దొరల్ తమ గానకుండ
సుబ్బువుట్టియు మళ్ళి జుడిగి చేరుచును.
క.వ.రా. యుద్ధ.

సుమాళించు : దే. అ. క్రి. పారవశ్యము నొందు.
ద్వి. మునినాథ! అన్నదమ్ములను మీచేత
ననిపించుకొని విహంగాధిరాజ్యంబు
పాలింపుచును వయోబల గర్వములను
కైలాసమున కేగి కాలానుగతిని
మాలోన మేము సుమాళించి.
క.వ.రా. కిష్కిం

సురభిళించు : సం. అ. క్రి. సువాసన వేయు.

సురభీకరించు : సం. స. క్రి. వాసన కలదానినిగాఁ జేయు.

సురాళించు : దే. స. క్రి. 1. దిగమ్రుఁగుచు.
2. త్రిప్పు.

ద్వి. ... ... ... పాళంబుచేతఁ
జుట్టి యింటికి నెత్తి సురలెల్ల మెచ్చఁ
జుట్టి సురాళించి సుంకు రాలంగ.
క. వ. రా. యుద్ధ.

సురుఁగు : దే. అ. క్రి. 1. అదృశ్యమగు.
2. పాఱు.
3. జాడగాఁబోవు.

సుఱసుఱలాడు: దే. అ. క్రి. సుఱసుఱ మండు. (కోపముతో.)

సుల్లాయిమాటను: దే. స. క్రి. దెప్పిపెట్టు.

సుహ్రుపఱచు : సం. స. క్రి. తృప్తిపఱచు.

సుసలాయించు: } అన్య. దే. స. క్రి. 1. పొసఁగించు.
సుసాయించు: } రూ. సొసాయించు.

సుస్తీచేయు: అన్య. దే. అ. క్రి. 1. అనారోగ్యము కలుగు.
2. బద్ధకించు.

# సూ

సూచించు : సం. స. క్రి. 1. జాడగా తెలియఁజేయు.
2. తెలియఁజేయు.

సూటించు : దే. స. క్రి. పోల్చు.

మ. సురకాంతల్ సరిరారు, యక్షసతులున్
సూటింపఁగా రారు. మొల్ల. సుం.

సూటిపడు : దే. అ. క్రి. సరిదాఁకు.

సూడించు : దే. అ. క్రి. పగగొను.

సూడుకొను: } దే. అ. క్రి. 1. పగగొను.
సూడుదీర్చు: } 2. పగదీర్చు.

సూడుపట్టు : దే. అ. క్రి. విరోధించు.

సూడువీగు : దే అ. క్రి. పగదీర్చు.

సూత్రపట్టు : మి. స. క్రి. 1. సూత్రముతో కొలిచి నిర్ణయించు.
2. దారముపట్టి వంకరలేక నిర్మించు.

సూత్రపడు : సం. అ. క్రి. జతపడు; అనుకూలించు.

సూత్రపఱచు : } సం. స. క్రి 1. వరుసగా కూర్చు.
సూత్రముపెట్టు: } 2. సూత్రములుగా వ్రాయు.

సూత్రించు : సం. స. క్రి. సూత్రపఱచు; అనుసంధానము చేయు.

సూత్రీకరించు : సం. స. క్రి. సూత్రప్రాయముగాఁజెప్పు.

సూయాణముగఁజేయు: దే. స. క్రి. శిరసావహించు.
సూయాణము = సూచీయానము.
సూదితోకుట్టుపనిచేసి దానిని పూర్వము
తలలో ధరించెడివారు.
(హెచ్. శేషయ్యంగారు, కర్ణాట
పండితులు, నిరూపించిన యర్థము)

సూరెగిల్లు : దే. అ. క్రి ప్రక్కకొదుగు.

సూక్ష్మించు : సం. స. క్రి. తక్కువచేయు.

## సృ

సృజించు : } సం. స. క్రి. సృష్టిచేయు.
సృష్టించు : }

# సె

సెగ్గించు . దే. స. క్రి. 1. రోయు.
2. అసహ్యించుకొను.

సెపియించు : దే. స. క్రి. శపియించు.

సెబాసను : అన్య. దే. అ. క్రి. 1. భళీయను.
2. పొగడు.

సెలకట్టనిచ్చు : దే. స. క్రి. సన్నద్ధ పడనిచ్చు.

సెలకట్టు : దే. అ. క్రి. 1. అమ్ములపొది కట్టు.
2. సన్నద్ధుఁడగు.

సెలగను : దే. అ. క్రి. (సెలగ+అను) ఒక్కొలెక్కను పూర్తి చేసి 'సెలగ'యని పలుకు (పుట్టికిసెలగ)

సెలగబాఱు : దే. అ. క్రి. చెట్టు సన్నని లేతకొమ్మలుపెట్టు.

సెలపోయు : దే. అ. క్రి. వ్రణము గండిపడు.

సెలయు : దే. అ. క్రి. విజృంభించు.

సెలవగు : దే. అ. క్రి. ఆజ్ఞయగు.

సెలవడు : దే. అ. క్రి. సెలవాఱు.

సెలవాఱు : దే. అ. క్రి. సెలవేయు.

సెలవిచ్చు : దే. స. క్రి. 1. ఆజ్ఞాపించు.
2. అనుమతించు.
అ. క్రి. 3. దయచేయు.

సెలవు : దే. స. క్రి. ఖండించు. రూ. సెలగు. ఉ.హరి.2ఆ.

సెలవేయు : దే. అ. క్రి. సెలపోయు.

సెలగు : దే. అ. క్రి. 1. మిక్కిలిగా నఱచు.
ఉదా: ఆమె మిక్కిలి సెలుగుచున్నది.
2. వాడు సెలిగిపోస్తున్నాడు.
3. ఎందు కట్లు సెలుగుతావు?

# సే

సేకరించు : దే. అ. క్రి. తెప్పిఱిల్లు.
స. క్రి. సంగ్రహించు.

సేదగొను . దే. అ. క్రి. 1. బడలు.
2. శ్రమ నొందు.

సేదదీఱు : దే. అ. క్రి. బడలిక వాయు.

సేదలువోవు : దే. అ. క్రి. శ్రమవోవు

సేవించు : సం. స. క్రి. కొలుచు.

సేసలచుకు: }
సేసలుపోయు: } దే. స. క్రి. వివాహానంతరము వధూవరులచే బియ్యము దోసిళ్ళతో పోయించు.

# సై

సైఁచు : దే. స. క్రి. ఓర్చుకొను.
అ. క్రి రుచించు.

సైరించు : దే. స. క్రి. సైరణసేయు.

# సొ

సొంపఱు : దే. అ. క్రి. అందము చెడిపోవు.

సొంపారు : దే. అ. క్రి. అందగించు.

సొంపిల్లు : దే. అ. క్రి సొంపగు. రూ. సొంపిలు.

సొక్కు : దే. అ. క్రి. 1. పారవశ్యము నొందు.
2. బడలు.
3. సొక్కు వక్కు తినుటచే వికారము నొందు.
రూ. చొక్కు.

సొగటాలాడు : దే. అ. క్రి. జూదమాడు.

సొగయించు. దే. స. క్రి. సొగయఁజేయు.

సొగయు : దే. అ. క్రి. చొక్కు; పరవశత్వము నొందు.

సొగియించు : దే. అ. క్రి. సుఖించు.

సొగియు : దే. అ. క్రి. ఇంపగు.

సొటసొటవోవు : దే. అ. క్రి. కృశించు.

సొట్టవోవు : దే. అ. క్రి. లోహపాత్రాదులు దెబ్బతగిలి నిమ్నమగు.

సొడ్డుకొట్టు : దే. అ. క్రి. ఒక కార్యము నితరులకంటె త్వరగా చేసి వారిని లేవిడీకొట్టు.

సొడ్డుపెట్టు : }
సొడ్డువేయు : } దే. అ. క్రి. సొడ్డుకొట్టు.

సొదపెట్టు : దే. అ. క్రి. విసువు కలుగునట్లు తన కథ చెప్పు.

సొదవెళ్ళఁబెట్టు: దే. అ. క్రి. తన కథ చెప్పుకొను.

సొదవేయు : దే. అ. క్రి. చుట్టుకొని మండు.

సొనపెట్టు : దే. అ. క్రి. అదేపనిగా ఒక విషయమును గూర్చి గొణుగు.

సొనాయించు : దే. స. క్రి. అణఁచు. సుకుమారీ పరిణయము.

సొమ్మఁగొను : }
సొమ్మవోవు : } దే. అ. క్రి. 1. మూర్ఛిల్లు,
సొమ్మసిల్లు : } 2. ఎక్కువగ బడలు.
సొమ్మసిలు : }

సొరకాయలుకోయు : దే. అ. క్రి. అబద్ధములు కల్పించి గొప్పగా చెప్పు.

సొరగు : దే. అ. క్రి. లీనమగు.

సొరవోయు : దే. అ. క్రి. మెలికలు తిరుగు.

సొరుగాఁకలగు : దే. అ. క్రి. చెడిపోవు, వాడిపోవు.

"అమ్మించు చేఁ బువ్వుల చెట్లు సొరుగాకు లగుచునుండె. నా. యా.

సొసుగు : దే. అ. క్రి మూర్ఛిల్లు.

సొలయు : దే. అ. క్రి. 1. మూర్ఛపోవు.

2. వైముఖ్యమునందు.

3. వైరస్యమునందు.

4 వెనుదీయు.

సొలు : దే. స. క్రి. వచించు శ్రీగిరి కురవంజి.

సొసైయించు : దే. స. క్రి. 1. మందలించు.

2. హెచ్చరించు.

3. ప్రసంగించు.

4. వ్యవహారము నతుకుపెట్టు.

## సో

సోంకు : }
సోఁకు : } దే. స. క్రి, తగులు, గ్రహమావేశించు.

సోఁకుడించు : దే. స. క్రి. గర్వమడచు.

సోఁకోర్చు : దే. అ. క్రి. ఒత్తిడికి ఆఁగు.

సోడుముట్టు : దే. అ. క్రి. కపాలమున కెక్కు, వ్యాపించు.

సోదాచేయు : అన్య. దే. అ. క్రి. శోధించు.

సోదించు ; వై. స. క్రి. శోధించు.

సోదెగొను : దే. అ. క్రి. శోధించు.

సోదెచెప్పు : దే. అ. క్రి. 1. రాగల మేలు కీడులను జెప్పు.

2. విసుగెత్తునట్లు మాట్లాడు.

సోబపడు : దే. అ. క్రి. క్షోభపడు.

సోమించు : దే. అ. క్రి. సరిపోలు, పరాక్రమించు.

విజృంభించు, వ్యాపించు.

సోమెక్కు : దే. అ. క్రి. 1. మదమెక్కు.
2. పారవశ్యముఁజెందు.

సోలించు : దే. స. క్రి. 1. వివశత్వము నొందించు.
2. పీడించు.

సోలు : దే. అ. క్రి. 1. వివశత్వమునొంది వ్రాలు.
2, ఓడు.

## స్ఖ

స్ఖలించు :
స్ఖలియించు: } సం. అ. క్రి. తొట్రుపాటుపడు, జారు.

## స్త

స్తంభించు : సం. అ. క్రి. మ్రాన్పడు.

స్తవము సేయు: సం. స. క్రి. పొగడు.

స్తుతించు : సం. స. క్రి. స్తోత్రము చేయు.

## స్థ

స్థగించు : సం. స. క్రి. పొదుగు.

స్థాపించు : సం. స. క్రి. స్థాపనము చేయు, నిలుపు.

స్థిరీకరించు : సం. స. క్రి. స్థిరము చేయు.

## స్న

స్నపనము చేయు:
స్నపించు : } సం. అ. క్రి. స్నానము చేయు.

స్నేహించు : సం. అ. క్రి. స్నేహము చేయు.

# స్ప

స్పందించు : సం. అ. క్రి. చలించు.
స్పర్థించు : సం. అ. క్రి. మత్సరపడు, పోటీపడు.
స్పష్టీకరించు : సం. స. క్రి. స్పష్టము చేయు.

# స్పృ

స్పృశించు : సం. స. క్రి. తాఁకు.

# స్ఫ

స్ఫాలించు : సం. స. క్రి. చఱచు.
స్ఫుటీకరించు : సం. స. క్రి. స్పష్టముచేయు.
స్ఫురించు : సం. అ. క్రి. 1. అదరు.
2. తోఁచు.
స్ఫూర్తికలుగు: సం. అ. క్రి. ఊహ కలుగు.
స్ఫోటించు : సం. అ. క్రి. పగిలి పైకెగురు.

# స్మ

స్మరించు : } సం. స. క్రి. 1. స్మరణముచేయు.
స్మరియించు : } 2. తలఁచు.

# స్ర

స్రగ్గు : దే. అ. క్రి. 1. అడఁగు.
2. నశించు. రూ. సగ్గు

స్రవించు : } సం. అ. క్రి. కాఱు, ఓడు.
స్రవియించు: }

స్రుక్కఁబడు : దే. అ. క్రి. దుఃఖించు.

స్రుక్కు : దే. అ. క్రి. 1. వెనుదీయు.
2. భయపడు.
3. ఉడుగు.
4. ముడుతపడు.
5. తగ్గు.
6. దుఃఖించు.
7. చింతించు.
8. మూర్ఛిల్లు.
9. సంకోచించు.
10. వాడు.
11. చుట్టుకొను.
12. చిక్కు.

స్రుగ్గు : దే. అ. క్రి. 1. కందు.
2. కములు.

చ. కఱచితి మెయ్యెడన్ విసము గ్రక్కితి
మీాతని యందు నెట్టి మా
కఱచినకాట్లకున్ శిశువు
కాయము తోలును స్రుగ్గదయ్యె. నృ. పు. 4 ఆ.

# స్వ

స్వతంత్రించు : సం. అ. క్రి. స్వేచ్ఛ వహించు.

స్వపించు : సం. అ. క్రి. నిదురపోవు.

స్వయంపాకముపంపు: సం. అ. క్రి. వేాయిన (సాహిత్యము)పంపు.

స్వయంపాకముచేయు: సం. అ. క్రి. లోన దురూహాలు చేయు.

స్వస్తిచెప్పు: సం. స. క్రి. 1. శుభములు పలుకు.
2. కార్యమును చేయ మాను.
3. ఉపగమించు.
4. పోగడు. (వర్తమానార్థము నందు)

స్వాగతించు : సం. స. క్రి. 1. స్వాగతము చెప్పు.
2. కుశలప్రశ్నలు వేయు.

స్వాపిలు : సం. అ. క్రి. నిదురబోవు.

స్వారీచేయు : అన్య. దే. అ. క్రి. గుఱ్ఱమెక్కి పరుగెత్తించు.

స్వాహాచేయు: } సం. స. క్రి. 1. మ్రింగు.
స్వాహాపట్టు: } 2. నాశనము చేయు.

స్వీకరించు : సం. స. క్రి. అంగీకరించు.

స్వేదించు : సం. అ. క్రి. చెమటపోయు.

## హ

హంకరించు : దే. అ. క్రి. అహంకరించు.

హఠముపట్టు : సం. అ. క్రి. పట్టుదలపట్టు.

హడావుడిచేయు: అన్య. దే. అ. క్రి. 1. తొందరచేయు.
2. కంగారుచేయు.

హతమారు : మి. అ. క్రి. నాశనమగు.

హతమార్చు : మి. స. క్రి. చంపు.

హత్తు : } దే. అ. క్రి. అంటుకొను.
హత్తుకొను: }

హత్యచేయు : సం. స. క్రి. చంపు.

హరించు : } సం. స. క్రి. 1. చంపు.
హరియించు : } 2. దొంగిలించు.
3. కరగిపోవు.
(హారతికర్పూరము మున్నగునవి)
4. ఇగిరిపోవు.

హారీమను : } సం. అ. క్రి. మరణించు.
హారీయను . }
హాఱవగు: దే. అ. క్రి. అందమగు.
హాఱసించు: } వై. అ. క్రి. హర్షించు.
హారుషించు: }
హార్షించు : సం. అ. క్రి. సంతోషించు.
హాల్లాచేయు : అన్య. దే. స. క్రి. లగ్గయెక్కు. రంగా. 2 ఆ.
హావణించు : దే. స. క్రి. 1. అలంకరించు.
2. తరించు.
3. చక్కఁబఱచు.
4. ఉంచు.
5. రచించు.
రఘునాథ నాయకాభ్యుదయము.
హావణిల్లు : దే అ. క్రి. 1. ప్రకాశించు.
2. విజృంభించు.
హావణుపఱచు : దే. స. క్రి. సమకూర్చు. పాం. మా.
హావులుపెట్టు : సం. స. క్రి. యజ్ఞములందు హావిర్భాగము లిచ్చు.
హాసించు : సం. అ. క్రి. నవ్వు.
హాళాహాళిచేయు: దే. అ. క్రి. 1. కలకలధ్వని చేయు.
2. సంభ్రమించు.
3. పరాక్రమించు.

## హో

హోజరు అగు : అన్య. దే. అ. క్రి. ఎదుటపడు.
హోజరుచేయించు: } అన్య. దే. స. క్రి. 1. పట్టి తెప్పించు. కు.రా.
హోజరుపెట్టు : } 2. వ్యక్తులను ఎదుటపెట్టు.
3. ఆయత్తపఱచు.
గంగా పార్వతీ సంవాదము.

హాజీలుపేయు: అన్య. దే. స. క్రి. 1. హాజరుపెట్టు.
2. ఆయత్తపఱచు.
గంగా పార్వతీ సంవాదము.

హారతిపట్టు : దే. స. క్రి. హారతియిచ్చు.
హాళిచేయు : దే. అ. క్రి. ఆసక్తినెఱపు.
హావళిచేయు : దే. స. క్రి. ఉపద్రవము కలిగించు.
హాసించు : సం. అ. క్రి. నవ్వు.
హాస్యమాడు : సం. స. క్రి. ఎగతాళిచేయు
హాస్యముపట్టు : సం. స. క్రి. నలుగురు కలిసి ఎగతాళిచేయు.

## హి

హింసించు : సం. స. క్రి. 1. చంపు.
2. బాధించు.
హితమగు : సం. అ. క్రి. మేలగు.
హితవగు : వై. అ. క్రి. 1. ఇంపగు.
2. మేలగు.
3. యోగ్యమగు.
4. రుచించు.
హితవులుచెప్పు: సం. అ. క్రి. బుద్ధులుచెప్పు.

## హు

హుంకరించు :
హుంకారించు : సం. అ. క్రి. హుమ్మని ధ్వనిచేయు.
హుళక్కిచేయు : అన్య దే. అ. క్రి. మాయమగు.
స. క్రి. మాయలుచేయు.
హుళుక్కియగు: అన్య. దే. అ. క్రి. 1. ఉత్తదగు.
2. వ్యర్థమగు.

హుషారిచ్చు : అన్య. దే. అ. క్రి. హెచ్చరిక పలుకు.
హుసివోవు : హిం. స. క్రి. చొచ్చుకొనిపోవు. శుక.
హూనము చేసికొను: దే. అ. క్రి. ఒళ్ళు నలుగఁగొట్టుకొను.
హూనహూనమగు: దే. అ. క్రి. ఒడలు నలగు.

## హె

హెచ్చరించు : } దే. స. క్రి. 1. హెచ్చరిక సేయు.
హెచ్చరికించు } 2. హుషారు చేయు.
రూ. ఎచ్చరించు.
హెచ్చరిల్లు : దే. అ. క్రి. హెచ్చరికపడు.
హెచ్చించు : దే. స. క్రి. ఎక్కువ చేయు.
హెచ్చిల్లు: దే. అ. క్రి. ఎక్కువగు.
హెచ్చు : దే. అ. క్రి. ఎచ్చు.
హెచ్చులాడు : దే. అ. క్రి. ప్రగల్భములాడు.

## హే

హేజీలుచేయు : అన్య. దే. అ. క్రి. విన్నవించు.
లీలావతీ కల్యాణము.
హేమాహేమీయగు: అన్య. దే. అ. క్రి. ఘనమగు.
హేమించు : సం. అ. క్రి. బంగారమగు.
హేరామిచేయు : దే. స. క్రి. 1. హింసించు.
2. ఉపద్రవపెట్టు.
హేరాళము సేయు: దే. స. క్రి. అధికముచేయు.
రూ. ఏరాళముచేయు.
హేళనము సేయు: దే. స. క్రి. వెక్కిరించు.
హేషించు : సం. అ. క్రి. గుఱ్ఱము సకిలించు.

# గ్రంథ సంకేత పట్టిక

| సంఖ్య | గ్రంథ సంకేతములు | గ్రంథ నామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 1. | అచలా. | అచలాత్మజాపరిణయం | ఆ. 3. | వేంకటాచార్యకవి. |
| 2. | అచ్చ. భా. | అచ్చ తెలుఁగు భారవి | ఆ. 5. | శ్రీరామకవి. |
| 3. | అచ్చ. రా. | అచ్చ తెనుఁగు రామాయణము | | |
| | | బాల. బాలకాండము | | |
| | | అయో. అయోధ్యాకాండము | | |
| | | అర. అరణ్యకాండము | కాం. 6 | |
| | | కిష్కిం. కిష్కింధాకాండ | | |
| | | సుం. సుందరాకాండము | | |
| | | యు. యుద్ధకాండము | | |
| 4. | అధ్యా. | అధ్యాత్మ రామాయణము | కాం. 7 | కోటమరాజు నాగయామాత్యుడు |
| | | ఉ. ఉత్తరకాండము | | |
| 5. | అని. | అనిరుద్ధచరిత్రము | ఆ 5 | కనుపర్తి అబ్బయామాత్యుడు |
| 6. | అను. | అనుభవసారము (పద్యము) | ఏకాశ్వాసము | పాల్కురికి సోమనాథుడు |
| 7. | అప్ప. | అప్పకవీయము | ఆ. 5 | కాకునూరి అప్పకవి |
| 8. | అ. మ. క. | అష్టమహిషీకల్యాణము (ద్విపద) | ఆ. 3 | తిరువేంగళనాథుడు |
| 9. | అహ. | అహల్యా సంక్రందనము | ఆ. 3 | సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు |

| సంఖ్య | గ్రంథ సంకేతములు | గ్రంథ నామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదులసంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 10. | ఆం. చం. | ఆంధ్ర చంద్రాలోకము | | అడిదము సూరకవి |
| 11. | ఆం. భా. | ఆంధ్ర భాషార్ణవము (నిఘంటువు) | కాం. 3 | నుదురుపాటి వేంకనార్యుడు |
| 12. | ఆం. శే. | ఆంధ్రనామ శేషము (నిఘంటువు) | | అడిదము సూరికవి |
| 13. | ఆం. సం. | ఆంధ్రనామ సంగ్రహము (నిఘంటువు)<br>దేవ. దేవవర్గు<br>మాన. మానవవర్గు<br>స్థా. స్థావరవర్గు<br>తి. తిర్యగ్వర్గు<br>నా. నానార్థవర్గు | వర్గులు. 5 | పైడిపాటి లక్ష్మణకవి |
| 14. | ఆం. పద. | ఆంధ్రపదాకరము | | |
| 15. | ఆము. | ఆముక్తమాల్యద | ఆ 6 | శ్రీకృష్ణదేవరాయలు |
| 16. | ఇందు. | ఇందుమతీపరిణయము | ఆ. 6 | కుమారధూర్జటి |
| 17. | ఇందు. రా. | ఇందుమతీపరిణయము | ఆ. 4 | తెనాలిరామభద్రకవి |
| 18. | ఉ. రా. | ఉత్తర రామాయణము | ఆ. 8 | కంకంటి పాపరాజు |
| 19. | ఉ. హరి. | ఉత్తర హరివంశము | ఆ. 5 | నాచన సోమనాథుడు |
| 20. | ఉ. హరిశ్చ. | ఉత్తర హరిశ్చంద్రోపాఖ్యానము | ఆ. 4 | తెక్కెళ్ళపాటి లింగన |
| 21. | కా. క. | కాటమరాజు కథ (ద్విపద) | | |

| సంఖ్య | గ్రంథ సంకేతములు | గ్రంథ నామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 22. | కకు. | కకుత్థ్సవిజయము | ఆ. 5. | మల్లె అనంత భూపాలుడు |
| 23. | కలు. శ. | కలునాయిశతకము | | డబ్బీరు నరసు |
| 24. | క. వ. రా. | కట్టావరదరాజు రామాయణము బాల. అయోధ్య. అర. కిష్కిం. సుం. యుద్ధ. | | కట్టావరదరాజు |
| 25. | కవిక. | కవికర్ణరసాయనము | ఆ. 6 | సంకుసాల నృసింహకవి |
| 26. | కవిచౌ. శ. | కవిచౌడప్పశతకము | | కవిచౌడప్ప |
| 27. | కవిజ. | కవిజనరంజనము | ఆ. 3 | అడిదము సూరకవి |
| 28. | కవిజనా. | కవిజనాశ్రయము సంజ్ఞా. సంజ్ఞాధికారము వృత్తా. వృత్తాధికారము జాతి. జాత్యధికారము దోషా. దోషాధికారము | అధికారములు 4. | వేములవాడ భీమకవి |
| 29. | కవిరా. | కవిరాజమనోరంజనము | ఆ. 5 | కనుపర్తి అబ్బయామాత్యుడు |
| 30. | కవిస. | కవిసర్పగారుడము | ఆ. 2 | కాచన బసవన్న |
| 31. | కళా. | కళాపూర్ణోదయము | ఆ. 8 | పింగళి సూరన |
| 32. | కార్తిక. | కార్తికమాహాత్మ్యము | | కుందుర్తి వేంకటాచలపతి |
| 33. | కావ్యా. | కావ్యాలంకారచూడామణి | ఉల్లాసములు 9 | విన్నకోట పెద్దన్న |

| సంఖ్య | గ్రంథ సంకేతములు | గ్రంథ నామములు | గ్రంథముల యందలి ఆశ్వాసముల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 34. | కాశీ. | కాశీఖండము | ఆ. 7 | శ్రీనాథుడు |
| 35. | కాళ. | కాళహస్తిమాహాత్మ్య | ఆ. 8 | ధూర్జటి |
| 36. | కాళ. శ. | కాళహస్తీశ్వర శతకము | | ధూర్జటి |
| 37. | కిరా. | కిరాతార్జునీయము | ఆ. 5 | గోపాలుని సింగయ |
| 38. | కుచేల. | కుచేలోపాఖ్యానము | ఆ. 3 | గట్టుప్రభువు |
| 39. | కువల. | కువలయాశ్వ చరిత్రము | ఆ. 5 | నవరము చిన నారాయణకవి |
| 40. | కు. సం. | కుమార సంభవము | ఆ. 12 | నన్నెచోడుడు |
| 41. | కృ. క. | కృష్ణకర్ణామృతము | ఆ. 3 | వెలగపూడి వెంగన |
| 42. | కృ. శకుం. | శకుంతలా పరిణయము | ఆ. 3 | కృష్ణకవి |
| 43. | కృష్ణ. | కృష్ణరాజవిజయము | ఆ. 4 | కుమార ధూర్జటి |
| 44. | కృష్ణ. శత. | కృష్ణశతకము | | నృసింహకవి |
| 45. | కృష్ణా. | కృష్ణాభ్యుదయము | ఆ. 5 | గోంతేటి సూరన్న |
| 46. | కేయూర. | కేయూరబాహు చరిత్రము | ఆ. 4 | మంచన |
| 47. | క్రీడా. | క్రీడాభిరామము | ఆ. 1 | వల్లభరాయకవి |
| 48. | గంధ. | గంధవహము | ఆ. 1 | మంచర్ల వాసుదేవకవి |
| 49. | గాధే. | గాధేయోపాఖ్యానము | | చిత్రకవి అనంతామాత్యుడు |
| 50. | గోపీ. రా. | గోపీనాథరామాయణ | | గోపీనాథవెంకటకవి |
| 51. | ఘటికా. | ఘటికాచలమాహాత్మ్య | ఆ. 3 | తెనాలిరామకృష్ణుడు |
| 52. | చంద్ర. | చంద్రభాను చరిత్రము | ఆ. 5 | తరిగొప్పులమల్లన్న |
| 53. | చంద్ర. వి. | చంద్రరేఖావిలాపము | ఆ. 3 | కూచిమంచి జగ్గకవి |
| 54. | చంద్రా. | చంద్రాంగద చరిత్రము | ఆ. 6 | పైడిమఱ్ఱి వేంకటపతి |

| సంఖ్య | గ్రంథ సంకేతములు | గ్రంథ నామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 55. | చంద్రి. | చంద్రికా పరిణయము | ఆ. 6 | శ్రీ సురభిమాధవ రాయప్రభువు |
| 56. | చం. రా. | చంపూ రామాయణము | ఆ. 8 | ఋగ్వేదకవి వేంకటాచలపతి |
| 57. | చమ. | చమత్కారమంజరి | ఆ. 3 | సింహాద్రి వేంకటాచార్యులు |
| 58. | చిత్రభా. | చిత్రభారతము | ఆ 8 | చరికొండ ధర్మన్న |
| 59. | చెన్న. | చెన్నబసవపురాణము | ఆ. 5 | అత్తనూరుపాపకవి |
| 60. | జాహ్నపీ. | జాహ్నవీ మాహాత్మ్య | ఆ. 4 | ఏనుగు లక్ష్మణకవి |
| 61. | జై. భా. | జైమినీ భారతము (అశ్వమేధపర్వము) | ఆ. 8 | పిల్లలమఱ్ఱి పినవీర భద్రుడు |
| 62. | తపతీ. | తపతీసంవరణో పాఖ్యానము | ఆ. 5 | అద్దంకి గంగాధరకవి |
| 63. | దశకు. | దశకుమార చరిత్రము | ఆ. 12 | కేతన |
| 64. | దశా. | దశావతార చరిత్రము | ఆ. 10 | ధరణిదేవుల రామయామాత్యుడు |
| 65. | దా. శ. | దాశరథిశతకము | | కంచెర్లగోపన్న |
| 66. | దిలీప, | దిలీపచరిత్రము | ఆ. 4 | కొటికలపూడి వేంకటకృష్ణకవి |
| 67. | ద్వా. | (సింహాసన) ద్వాత్రింశిక | ఆ. 12 | కొఱవిగోపరాజు |
| 68. | ద్వి.కో.భా. | ద్విపదభాగవతము | స్కం.12 | కోనేరునాథుడు |
| 69. | ద్వి. తి. సా. | ద్విపదసారంగధర చరిత్రము | ఆ. 2 | కూచిమంచి తిమ్మకవి |

| సంఖ్య | గ్రంథ సంకేతములు | గ్రంథ నామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదులసంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 70. | ద్వి. నల. | ద్విపద నలచరిత్రము | భా. 5 | చక్రపురి రాఘవాచార్యులు |
| 71. | ద్వి. పరమ. | ద్విపద పరమయోగి విలాసము | ఆ. 8 | తాళ్ళపాక తిరువేంగళనాథుడు |
| 72. | ద్వి. భార. | ద్విపద భారతము (విరాటపర్వము) | ఆ. 5 | తిమ్మన |
| 73. | ద్వి. శ.సా. | ద్విపద సారంగధర చరిత్రము | ఆ. 3 | భాణాల శంభుదాసుడు |
| 74. | ద్వి. భాగ. | ద్విపదభాగవతము (దశమస్కంధము) | స్కం. 1 | మాడికి సింగన్న |
| 75. | ద్వి. హరి. | ద్విపదహరిశ్చంద్ర శతకము | భా. 2 | గౌరన |
| 76. | ధనా. | ధనాభిరామము | ఆ. 3 | నూరన |
| 77. | ధర్మ. | ధర్మఖండము | ఆ. 9 | ఈదులపల్లి భవానీ శంకరుడు |
| 78. | ఆం. ధా. | ఆంధ్రధాతుమాల | | పరవస్తు చిన్నయసూరి |
| 79. | నరస. | నరసభూపాలీయము | ఆ. 5 | మూర్తికవి |
| 80. | నవ (నాథ) | నవనాథ చరిత్రము ద్వి. | భా. 5 | గౌరన |
| 81. | నా. పంచ. | పంచ తంత్రము | ఆ. 5 | నారాయణకవి |
| 82. | నార. | నారసింహపురాణము (ఉత్తర భాగము) | ఆ. 5 | హరిభట్టు |

| సంఖ్య | గ్రంథ సంకేతములు | గ్రంథ నామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 83. | నిరం. | నిరంకుశోపాఖ్యానము | ఆ. 4 | కందుకూరి రుద్రయ |
| 84. | నిర్వ. | నిర్వచనోత్తర రామాయణము | ఆ. 10 | తిక్కన సోమయాజి |
| 85. | నీతి. | నీతి సీసపద్య శతకము | | తాళ్ళపాక తిమ్మయ |
| 86. | నీలా. | నీలాసుందరీపరిణయము | ఆ. 3 | కూచిమంచి తిమ్మకవి |
| 87. | నృసిం | నృసింహపురాణము | ఆ. 5 | ఎఱ్ఱాప్రగడ |
| 88. | నైష. | శృంగార నైషధము | ఆ. 8 | శ్రీనాథుడు |
| 89. | పండితా. | పండితారాధ్య చరిత్రము (ద్విపద) | | పాలకురికి సోమనాథుడు |
| | | దీక్షా. దీక్షాప్రకరణము | ప్రకరణములు. 5 | |
| | | పురా. పురాతనప్రకరణము | | |
| | | వాద. వాదప్రకరణము | | |
| | | మహిమ. మహిమ ప్రకరణము | | |
| | | పర్వ. పర్వతప్రకరణము | | |
| 90. | పద్మ. | పద్మపురాణము (ఉత్తరఖండము) | ఆ. 10 | మడికి సింగన్న |
| 91. | పరమ | పరమయోగివిలాసము | ఆ. 5 | తిమ్మనృపాలుడు |
| 92. | పాంచా. | పాంచాలీ పరిణయము | ఆ. 5 | కాకమాని మూర్తికవి |
| 93. | పాండు. | పాండురంగ మాహాత్మ్యము | ఆ 5 | తెనాలి రామకృష్ణుడు |
| 94. | పారి. | పారిజాతాపహరణము | ఆ. 5 | నంది తిమ్మన |

| సంఖ్య | గ్రంథ సంకేతములు | గ్రంథ నామములు | గ్రంథములయందలి ఆశ్వాసాదులసంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 95. | పార్వ. | పార్వతీపరిణయము | ఆ. 6 | కోటి శ్రీరాయ రఘునాథ తొండమాన్ మహీపాలుఁడు |
| 96. | పి. శకుం. | శకుంతలాపరిణయము | ఆ. 4 | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు |
| 97. | వై. శకుం. | శకుంతలాపరిణయము | ఆ. 3 | పెద్దాడ నాగరాజు |
| 98. | ప్రబంధ. | ప్రబంధరాజ వేంకటే శ్వరవిలాసము | ఆ. 1 | గణవరపు వేంకటకవి |
| 99. | ప్రబోధ. | ప్రబోధ చంద్రోదయము | ఆ. 5 | నంది మల్లయ-ఘంట సింగయ |
| 100. | ప్రభా. | ప్రభావతీప్రద్యుమ్నము | ఆ. 5 | పింగళి సూరన |
| 101. | ప్రభు. (లిం) | ప్రభులింగలీల. ద్విపద (ఒక్కొక్క ఆశ్వాసమునకు అయిదైదు గతులు గలవు) | ఆ. 5 | పిడుపర్తి సోమయ |
| 102. | ప్ర. మణి. | ప్రబంధమణిభూషణము | | |
| 103. | బస. పు. | బసవపురాణము (ద్విపద) | ఆ. 7 | పాలకురికి సోమన |
| 104. | బహు. | బహుళాశ్వచరిత్రము | ఆ. 5 | దామరల వేంగళనాయకుఁడు |
| 105. | బిల్హ. | బిల్హణీయము | అ. 3 | పండిపెద్దకృష్ణస్వామి |
| 106. | బ్రహ్మో. | బ్రహ్మోత్తర ఖండము | ఆ. 5 | శ్రీధరమల్లె వేంకటరామకవి |
| 107. | బ్రాహ్మ. | బ్రాహ్మనిఘంటువు | | బ్రాహ్మనుదార |

| సంఖ్య | గ్రంథ సంకేతములు | గ్రంథ నామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదులసంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 108. | భర్తృ. | భర్తృహరి సుభాషితము | శతకములు 3 | ఏనుగు లక్ష్మణకవి |
| | | నీ. నీతిశతకము | | |
| | | శృ. శృంగారశతకము | | |
| | | వై. వైరాగ్యశతకము | | |
| 109. | భల్లా. | భల్లాణచరిత్రము | ఆ. 5 | వాలేశ్వరుడు |
| 110. | భాగ. | భాగవతము | స్కం. 12 | బమ్మెరపోతరాజు |
| 111. | భాను. | భానుమతీ పరిణయము | ఆ. 4 | రేంటూరి రంగరాజు |
| 112. | భార. | భారతము | పర్వములు 18 | కవిత్రయము (నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగడ.) |
| | | ఆది. ఆదిపర్వము ఆ.8 | | |
| | | సభా. పర్వము ఆ. 2 | | |
| | | ఆర. అరణ్యపర్వము ఆ. 7 | | |
| | | విరా. విరాటపర్వము ఆ. 3 | | |
| | | ఉద్యో. ఉద్యోగపర్వము ఆ. 4 | | |
| | | భీష్మ. భీష్మపర్వము ఆ 5. | | |
| | | ద్రో. ద్రోణపర్వము ఆ 5. | | |
| | | కర్ణ. కర్ణపర్వము ఆ 3. | | |
| | | శల్య. శల్యపర్వముఆ 2. | | |

| సంఖ్య | గ్రంథ సంకేతములు | గ్రంథ నామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| | | సౌ. సౌప్తికపర్వము ఆ. 2 | | |
| | | స్త్రీ. స్త్రీపర్వము ఆ. 2 | | |
| | | శాంతి. శాంతిపర్వము ఆ 6. | | |
| | | అను. అనుశాసనిక పర్వము ఆ5. | | |
| | | అశ్వ. అశ్వమేధ పర్వము ఆ 4. | | |
| | | ఆశ్ర. ఆశ్రమవాస పర్వము ఆ 2. | | |
| | | మౌ. మౌసలపర్వము. ఆ 1. | | |
| | | మహా. మహాప్రస్థానిక పర్వము. ఆ 1. | | |
| 113. | భా. రా. | భాస్కర రామాయణము (అచ్చతెనుఁగు రామాయణము కడ నున్నట్లు దీనికి కాండము లెఱుంగునది) | కాం. 6 | భాస్కరుడు లోనగువారు |
| 114. | భా. శ. | భాస్కరశతకము | | మారద వెంకయ్య |
| 115. | భీమ. | భీమేశ్వర పురాణము | ఆ. 6 | శ్రీనాథుడు |
| 116. | భేష. | భేషజకల్పము | ఆ. 4 | బహుపాద వెంకటాచార్యుడు |
| 117. | భోజరా. | భోజరాజీయము | ఆ. 7 | అనంతామాత్యుడు |

| సంఖ్య | గ్రంథ సంకేతములు | గ్రంథ నామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదులసంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 118. | భోజసుతా. | భోజసుతా పరిణయము | ఆ. 5 | కోటీశ్వరకవి |
| 119. | మనుచ. | మనుచరిత్రము | ఆ. 6 | |
| 120. | మల్ల. | మల్లభూపాలీయము | శతకములు 3 | ఎలకూచి బాలసరస్వతి |
| 121. | మల్లుపు. | మల్లుపురాణము (దేవమల్లచరిత్రము) | ఆ. 4 | నుదురుపాటి వేంకనార్యుడు |
| 122. | మల్హాణ. | మల్హాణ చరిత్ర | ఆ. 3 | ఎడపాటి ఎఱ్ఱన్న |
| 123. | మార్కం. | మార్కండేయ పురాణము | ఆ 8 | మారన |
| 124. | ముకుంద. | ముకుందవిలాసము | ఆ. 3 | కాణాచిపెద్దన్న |
| 125. | మృ. వి. | మృత్యుంజయవిలాసము | ఆ. 3 | గోగులపాటి కూర్మదాసుడు |
| 126. | మై. | మైరావణచరిత్రము | ఆ. 3 | మాడయకవి |
| 127. | మొ. రా. | మొల్ల రామాయణము | కాం. 6 | మొల్ల |
| 128. | యయా. | యయాతిచరిత్రము | ఆ. 5 | పొన్నగంటి తెలగనార్యుడు |
| 129. | రంగా. | రంగరాయచరిత్రము | ఆ. 3 | దిట్టకవి నారాయణకవి |
| 130. | రం. రా. | రంగనాథ రామాయణము | కాం. 6 | రంగనాథుఁడు |
| 131. | రం. రా. ఉ. | రంగనాథ రామాయణము ఉత్తర కాండము (ద్విపద) | కాం. 1 | కాచభూపతి విఠలరాజు |

| సంఖ్య | గ్రంథ సంకేతములు | గ్రంథ నామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 132. | రఘు. | రఘువంశము | ఆ. 10 | అవుడూరి కీచ్చయ్య |
| 133. | రఘునా. | రఘునాథాభ్యుదయము | | విజయరాఘవకవి |
| 134. | రత్న. | రత్నపరీక్ష | | భైరవకవి |
| 135. | రస. | రస మంజరి | గుచ్ఛములు 8 | సురతాని కోదండపతి |
| 136. | రసా. | రసాభరణము | ఆ. 4 | అనంతామాత్యుడు |
| 137. | రసిక. | రసికజనమనోభిరామము | ఆ. 7 | కూచిమంచితిమ్మకవి |
| 138. | రాఘవ. | రాఘవపాండవీయము | ఆ. 4 | పింగళి సూరన్న |
| 139. | రాజగో. | రాజగోపాల విలాసము | ఆ. 5 | కాళయ |
| 140. | రాజ. చ. | రాజశేఖర చరిత్రము | ఆ. 3 | మాదయగారిమల్లన |
| 141. | రాజ. వి. | రాజశేఖర విలాసము | ఆ. 3 | కూచిమంచితిమ్మకవి |
| 142. | రాధా. | రాధామాధవీయము | | చింతలపూడి ఎల్లనార్యుడు |
| 143. | రాధికా. | రాధికాసాంత్వనము | ఆ. 4 | ముద్దుపళని |
| 144. | రామ. | రామరాజీయము | ఆ. 1 | వెంకయ్య |
| 145. | రామలిం. | రామలింగేశ్వర శతకము | | అడిదము సూరన్న |
| 146. | రామా. | రామాభ్యుదయము | ఆ. 8 | అయ్యలరాజు రామభట్టు |
| 147. | రామే. | రామేశ్వర మాహాత్మ్యము | ఆ. 5 | ఏనుగు లక్ష్మణకవి |
| 148. | రా.వి. | రాజవాహన విజయము | ఆ. 5 | కాకమాని మూర్తికవి |
| 149. | రుక్మా. | రుక్మాంగద చరిత్రము | ఆ. 5 | ప్రౌఢకవి మల్లన |

| సంఖ్య | గ్రంథ సంకేతములు | గ్రంథ నామములు | గ్రంథముల యందలి ఆశ్వాసముల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 150. | రుక్మి. | రుక్మిణీ పరిణయము | ఆ. 5 | కూచిమంచి తిమ్మకవి |
| 151. | లక్షణ. | లక్షణసార సంగ్రహము | ఆ. 3 | చిత్రకవి పెద్దన్న |
| 152. | ల. వి. | లక్ష్మీవిలాసము | ఆ. 5 | రాయసము వేంకటపతి |
| 153. | వరాహ. | వరాహపురాణము | ఆ. 12 | నందిమల్లయ్య ఘంటసింగన |
| 154. | వసు. | వసుచరిత్రము | ఆ 6. | రామరాజ భూషణుడు |
| 155. | వా. రా. | వాసిష్ఠరామాయణము | ఆ. 5 | మడికి సింగన్న |
| 156. | వాల్మీ. | వాల్మీకి చరిత్రము | ఆ. 3. | రఘునాథ భూపాలుడు |
| 157. | విక్ర. | విక్రమార్క చరిత్రము | ఆ. 3 | జక్కన |
| 158. | విజ. వి. | విజయవిలాసము | ఆ. 3 | చేమకూర వేంకటకవి |
| 159. | విజ్ఞా. | విజ్ఞానేశ్వరీయము | కాం. 3 | కేతన |
| 160. | వి. న. | విజయనందన విలాసము | ఆ. 3. | మంగళగిరి ఆనందకవి |
| 161. | వి. పు. | విష్ణుపురాణము | ఆ. 8 | వెన్నెలకంటి సూరన |
| 162. | విష్ణుమా. | విష్ణుమాయా నాటకము | | చింతలపూడి ఎల్లనార్యుడు |
| 163. | వి. ప్ర. | విప్రనారాయణ చరిత్రము | ఆ. 5 | చెదలవాడ మల్లయ్య |
| 164. | వీధి. | వీధినాటకము | | శ్రీనాథుడు |
| 165. | వీర. | వీరభద్రవిజయము | ఆ. 4 | బమ్మెరపోతన |
| 166. | వేంక. | వేంకటేశాంధ్రము (నిఘంటువు) | వర్గులు. 5 | గణవరపు వేంకటకవి |

| సంఖ్య | గ్రంథ సంకేతములు | గ్రంథ నామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదులసంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 167. | వేం. పంచ. | పంచతంత్రము | ఆ. 5 | వేంకటనాథుడు |
| 168. | వేం. మా. | వేంకటాచల మాహాత్మ్యము | ఆ. 6 | తరిగొండ వెంకమ్మ |
| 169. | వేణు. | వేణుగోపాలశతకము | | |
| 170. | వేమన. | వేమన శతకము | భాగ. 3 | వేమనయోగి |
| 171. | వైజ. | వైజయంతీ విలాసము | ఆ. 4 | సారంగు తమ్మయ్య |
| 172. | శ. ర. | శబ్దరత్నాకరము (నిఘంటువు) | | బహుజనపల్లి సీతారామాచార్యులు |
| 173. | శశాం. | శశాంకవిజయము | ఆ. 5 | శేషము వేంకటపతి |
| 174. | శా. స. మ. | శాసనపద్యమంజరి | | |
| 175. | శివధ. | శివధర్మోత్తరము | ఆ. 8 | మల్లారెడ్డికవి |
| 176. | శివర. | శివరహస్యఖండము | ఆ. 10 | కోడూరి వేంకటాచలపతి |
| 177. | శివరా. | శివరాత్రి మాహాత్మ్యము | ఆ. 4 | శ్రీనాథుడు |
| 178. | శివ. సా. | శివతత్వసారము | | మల్లికార్జున పండితారాధ్యుడు |
| 179. | శుక. | శుకసప్తతి | ఆ. 4 | కదిరీపతినాయకుడు |
| 180. | శు. చ. | శుకచరిత్రము | ఆ. 5 | పరశురామ పంతులరామమూర్తి కవి |
| 181. | శృంగా. | శృంగార రసమంజరి | | సురతాని కోదండపతి |
| 182. | శేష. | శేషధర్మము | ఆ. 5 | తామరపల్లి తిమ్మయ్య |
| 183. | శ్రీరం. | శ్రీరంగ మాహాత్మ్యము | ఆ. 5 | భైరవకవి |

| సంఖ్య | గ్రంథ సంకేతములు | గ్రంథ నామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 184. | శ్రీరం. మ. | శ్రీరంగ మాహాత్మ్యము | ఆ. 10 | కట్టా వరద రాజేంద్రుడు |
| 185. | ష. చ. | షట్చక్రవర్తి చరిత్రము | ఆ. 8 | మల్లారెడ్డికవి |
| 186. | షోడ. | షోడశకుమారచరిత్రము | ఆ. 8 | వెన్నెలకంటి అన్నయ్య |
| 187. | సకల. స. | సకలనీతి సమ్మతము | | మడికిసింగన్న |
| 188. | సత్య. సాం. | సత్యభామా సాంత్వనము | | లింగనమఖి కామేశ్వరకవి |
| 189. | సమీర. | సమీరకుమార విజయము | ఆ. 7 | పుష్పగిరి తిమ్మన |
| 190. | సర్వ. సా. | సర్వలక్షణసార సంగ్రహము | | కూచిమంచితిమ్మకవి |
| 191. | సస్య. | సస్యానందము | | దోనయామాత్యుడు |
| 192. | సాం. ని. | సాంబనిఘంటువు | నకులు. 5 | కస్తూరి రంగకవి |
| 193. | సాంబో. | సాంబోపాఖ్యానము | ఆ. 5 | రంగప్పరాజు |
| 194. | సానందో. | సానందోపాఖ్యానము | ఆ. 5 | శివరామకవి |
| 195. | సారంగ. | సారంగధరచరిత్రము | ఆ. 3 | చేమకూర వేంకటకవి |
| 196. | సిం. నార | సింహాద్రి నారసింహ శతకము | | గోగులపాటి కూర్మదాసుడు |
| 197. | సీతారా. | సీతారామాంజనేయ సంవాదము | | పరుశురామపంతుల గురులింగమూర్తి |
| 198. | సీతావి. | సీతావిజయము (శతకంఠ రామాయణము) | ఆ. 4 | మర్దనకవి |

| సంఖ్య | గ్రంథ సంకేతములు | గ్రంథ నామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు |
|---|---|---|---|---|
| 199. | సీమం. | సీమంతినీ కళ్యాణము | ఆ. 5 | పెనుమళ్ళ సోమమంత్రి |
| 200. | సుద. | సుదక్షిణాపరిణయము | ఆ. 5 | తెనాలి అన్నయ్య |
| 201. | సుదంతా. | సుదంతాపరిణయము (వ్రాతప్రతి) | ఆ. 4 | అఘోరికవి |
| 202. | సురా. | సురాభాండేశ్వరము | ఆ. 4 | గట్టుప్రభువు |
| 203. | సు. శ. | సుమతిశతకము | | బద్దెనకవి |
| 204. | సేతు. | సేతుఖండము | ఆ. 6 | ఎక్కలంక వీరభద్రుడు |
| 205. | హంస. | హంసవింశతి | ఆ. 5 | అయ్యలరాజు నారాయణామాత్యుడు |
| 206. | హ. న. | హరిశ్చంద్రనలోపాఖ్యానము | ఆ. 5 | రామరాజభూషణుడు |
| 207. | హర. | హరవిలాసము | ఆ. 7 | శ్రీనాథుడు |
| 208. | హర. వి. | హరభక్తవిలాసము | | అత్తలూరి పాపకవి |
| 209. | హరి. | హరివంశము | | |
| | | పూ. పూర్వభాగము | ఆ. 6 | |
| | | ఉ. ఉత్తరభాగము | ఆ. 10. | |
| 210. | హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యాన | ఆ. 5 | శంకరకవి |
| 211. | హ. వరాహ. | వరాహపురాణము | ఆ. 5 | హరిభట్టు |